| | | ప్రతి 1-8 రూ. అ. |
|---|---|---|
| గ్రామ్యభాషాప్రయోగనిబంధనము, (పాత్రోచితభాషను గుఱించినది) | 4 కింకిణి | 0 12 |
| మోచాకుసుమామోదవిచారము | 5 కింకిణి | (అచ్చు) |
| ఆంధ్రవ్యాకరణ సర్వస్వవిమర్శనము | 6 కింకిణి | „ |
| విమర్శవినోదము, సంస్కృతాంధ్ర కావ్యనాటకాది విషయకము | | 0 12 |
| తిక్కన సోమయాజి విజయము 0-8-0 | పాతప్రతి | 0 4 |
| విసంధివివేకము | | 0 2 |
| భారతాభారతరూపకక్షమర్యాదలు, (నాట్యకళాచరిత్రము) | | 0 8 |
| ఆంధ్రగ్రంథవిమర్శన ప్రకారలేశము, తెలుఁగుపుస్తకముల నెట్లు విమర్శింపవలయుననుటను గూర్చినది | | 0 6 |
| గ్రామ్యాదేశనిరసనము, గ్రామ్యగ్రాంథికవాదమును గుఱించినది ఈవ్యాసములో శాస్త్రులవారు ఆంధ్రదేశమందలి అన్నిజిల్లాల గ్రామ్యములను వర్ణించియున్నారు. కడుపుబ్బ నవ్వించువిమర్శ | | 0 6 |
| స్త్రీపునర్వివాహగ్రంథము | | 1 0 |
| ఆంధ్రహితోపదేశంపువు, గద్యపద్యాత్మకము | | 1 4 |
| ఆంధ్రభాషాసర్వస్వార్థనియమకతిపయములు(విఘంటురచనావిధి) | | 0 4 |
| వేదము వేంకటరాయశాస్త్రులవారి జీవితచరిత్రసంగ్రహము 25 ప్రకరణములు, సులువైనశైలి, శాస్త్రులవారి హాస్యము, విమర్శలు, విద్యావినోదములు, సుఖదుఃఖములు, సమకాలికపండితవిమర్శలు మొదలైన యనేకవిశేషములుగలవు. కర్త- శాస్త్రి మనుమఁడు. శ్రీ డాక్టరు, సర్. కట్టమంచి రామలింగారెడ్డిగారి 'గురుపూజ' యను నుపన్యాసముతో నలంకృతము | | 1 8 |
| వ్రతకల్పవల్లి (ముఖ్యమైన అనువ్రతములు) | | 0 12 |

A HAND-BOOK OF CLASSICAL SAMSKRIT LITERATURE for College Students, by Sri U. Venkata Krishna Rao, M. A, WITH QUESTIONS. Rs. 2-0

శ్రీ

# రఘువంశము.

మహాకవి కాళిదాస ప్రణీతము.

మల్లినాథ వ్యాఖ్యతోను

వేదము - వేంకటరాయశాస్త్రిగారి

తెనుఁగు ప్రతిపదార్థ తాత్పర్యాదులతోను

ముద్రితము.

వేదము వేంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్స్

4, మల్లికేశ్వరస్వామిగుడి సందు, లింగిసెట్టివీథి,

జి. టి. మదరాస్.

శ్రీ

# రఘువంశము

## ఉపోద్ఘాతము.

### కవిప్రశంస.

కవికులగురు వగు శ్రీమత్కాళిదాసుని కబ్బంపురసాయనంబు విద్వత్సార్వభౌమ
మ్మల్లినాథసూరి వ్యాఖ్యానానుపానముచే నమృతీభూతమై యాస్వాదింపఁబడుచుంట
విదితముగదా. అట్టి యామహాకవిజీవితమును గుఱించిన విషయములు ఇప్పటికిని
ముగా తెలియవు. ఈమహాపురుషుఁడు క్రీస్తుశక పూర్వప్రథమశతాబ్దమున శ్రీవిక్ర
మమహారాజసభాలంకారంబై యున్నట్లు ఇప్పటికి చరిత్రోద్ధారకుల కడపటి యభి
యముగా నున్నది. తత్సాధనభూతము లయినవిషయముల వివరణమును గ్రంథవిస్తర
చేత కాళిదాసీయ ప్రబంధాంతరముద్రణావసరమునకై మిగతపెట్టుకొని యిట
వంశముఁనుగూర్చియే కొన్ని లఘువిషయములను ప్రస్తావింపం దలకొంటిని.

### వ్యాఖ్యాతృప్రశంస.

ఈమహాకావ్యమునకు టీకాకారులు 1. మల్లినాథ, 2. హేమాద్రి, 3. చారిత్ర
4. దక్షిణావర్త, 5. నాథ, 6. సుమతివిజయ, 7. వల్లభ, 8. ధర్మమేరు, 9.
గణి, 10. విజయానందసూరిచరణసేవక, 11 దినకరమిశ్ర ప్రభృతులు పలువురు
అందు మల్లినాథసూరి కడపటివాఁడు. ఇతఁడు క్రీ. శ. 14. వ శతాబ్దమువాఁడు.
పంచకమునకు ఈతనివ్యాఖ్యచే తత్పూర్వులవ్యాఖ్యలు మూలఁబడినవి. ఈయన ఇత
వ్యాఖ్యలకును తనవ్యాఖ్యకును గల భేదమును 'ఇహాన్వయముఖేనైవ' 'భారతీ కాళి
స్య' అను శ్లోకములచేత నేతద్గ్రంథవ్యాఖ్యావతారికయందు తెలియఁబఱచినాఁడు.
లి 'వాణీం కాణభుజీమ్' శ్లోకముచేతను, పదవాక్య ప్రమాణేత్యాది గద్యముచేతను,
మన సర్వవిద్యాపారగుఁ డని విశదపడుచున్నది.

మహామహోపాధ్యాయ పండిత తారానాథ తర్కవాచస్పతి నిజవిరచిత బృహ
ధానమందు కొన్నియర్థములకు నిఘంట్వాది ప్రమాణములు అలవడనప్పుడు మల్లినాథ
వ్యాఖ్యను ప్రమాణముగా నుదాహరించుకొని యున్నాఁడు. మదరాసు హైకోర్టు
తులుగానుండిన చతుశ్శాస్త్రపారీణులు శ్రీమద్గజ్జము అప్పన్నశాస్త్రులవారును

వారితమ్ములును మాఘకావ్యమును శిష్యులకు చెప్పుచు నొకచో రెండుశ్లోకములకు మల్లి
థవ్యాఖ్య ప్రాంతపుస్తకములో దొరకనందున పిమ్మట తారతమ్యమును పరికించు కు
వాలంబున తామే వ్యాఖ్య రచించి శిష్యులకు బోధించి రనియు, అనంతరము మల్లినాథట
దొరకఁగా దానిముందఱ తమటీకను కరము మందముగా నెఱింగి చింపివైచి రనియ
ప్రతీతి కలదు.

## ఆక్షేపములకు సమాధానములు.

అట్టి యామహనీయుని సంజీవినీవ్యాఖ్యను రఘువంశవిమర్శమను నాధునిక
ములో తత్కర్తగారు రసజ్ఞతాహీనునిఁగాను, సమంజసముగా వ్యాఖ్య ప్ర
పఠాణవిద్యాది పరిచయము లేమింజేసి నైపుణి చాలనివానినిగాను, పెక్కువిధమ
మిక్కుటముగా నపకర్షించి యున్నారు. అయ్యపకర్షణము సమంజసము గాదని వ
ప్రాయ మగుటంబట్టి అందులకు యథామతి సమాధానములం దెలిపెద.

I. విమర్శకులు 'వాగర్థావివ' యనుకావ్యాది మంగళశ్లోకము శుష్కసై
చితముగాను ఉత్తమకావ్యానర్హముగాను మహాకవ్యనర్హముగాను ఉన్నదనియు, ఒ
జేసి అది కాళిదాసీయము కా దనియు, ప్రక్షిప్తముగా నుండనోపు ననియు, దానిని
కాళిదాస గ్రంథాదిగా కైకొనుట మల్లినాథుని పొరఁబా టనియు, ఆక్షేపించినారు.

ఈశ్లోకముంగూర్చి ప్రాచీనమహావిద్వాంసులు ఒకకొందఱు ఏమేమి యభిప్రాయ
పడిరో ఇదే కననగు.—

(1) శ్రీమయ్యదప్పయదీక్షితులవారి చిత్రమీమాంసయందు—

"తత్ర పూర్ణాయాం ధర్మస్యానుగామితా యథా—'వాగర్థావివ...'
ఔత్పత్తికస్తు శబ్దార్థయోః సంబన్ధ ఇతి వాగర్థయో ర్నిత్యసంబన్ధిత్వం ప్రసిద్ధమ్;
ఉమామహేశ్వరయో ర ప్యనయో ర్న పృథగ్భావః చన్ద్రచన్ద్రికయో రి వేతి శ త్ప్రసి
ద్ధమ్; తథాచ, నిత్యసంబన్ధిత్వరూపోఽత్ర సాధారణో ధర్మోఽనుగామితయా నిర్దిష్టః
య ద్య ప్యుమామహేశ్వరయో ర్వాగర్థవ న్నిత్యసంబన్ధిత్వవర్ణనేన తయో ర్నిరతిశయ
పరస్పర ప్రేమశాలిత్వం మహామహిమత్వ మి త్యాది వ్యజ్యతే తథాఽపి.—"

(2) రసగంగాధరమందు—

"యత్తు చిత్రమీమాంసాయాం 'వాగర్థా వివ సంపృక్తౌ' వి త్యత్ర రసధ్వనిః నిర
శయ ప్రేమశాలితా వ్యఞ్జనాత్ తద్ధ్వనిమార్గానాకలన నిబన్ధనమ్; పార్వతీపరమేశ్వ
విషయక కవిరతౌ ప్రధానే నిరతిశయప్రేమ్ణో గుణీభావాత్; న హి గుణీభూతస్య
రత్యాదే రసధ్వనివ్యవహారహేతుత్వం యుక్తమ్..."

(3) హేమచంద్రుఁడు తనకావ్యానుశాసనమునకుం దానే రచించిన వివేఖ్యటీకయందు కవనశిక్షా ప్రకరణములో—

"పురాతన వృత్తేషు పదపరావృత్త్యభ్యాసో యథా: 'వాగర్థా విన...'

వాగర్థావివ సంయుక్తౌ వాగర్థ ప్రతిపత్తయే
జగతో జనకౌ వన్దే శర్వాణీ శశిశేఖరౌ.

ఏవం మహాకావ్యార్థచర్వణ పరకృతకావ్యపాఠాద్యాః శిక్షా అభ్యూహ్యాః."

(4) భోజరాజకృత సరస్వతీకంఠాభరణమందు—

"యత్ర సంపూర్ణవాక్యత్వ మర్థవ్యక్తిం వదన్తి తామ్.
థా:— 'వాగర్థా విన...'
అత్ర వాక్యపరిపూర్ణతయాఽర్థ సమర్థకత్వా దర్థవ్యక్తిః."
(అర్థవ్యక్తి యనునది భోజోక్తకావ్యగుణము లేనింటిలో నొకటి.)

(5) వెండియు సరస్వతీకంఠాభరణమందు—

"సమాసేఽపి ఇతరేతరయోగా దనుభయాశ్రితః సముచ్చయభేదో యథా— 'వాగర్థా విన....'

అత్ర 'వాగర్థా విన' ఇతి పరవల్లిఙ్గతా, 'సంపృక్తౌ పితరౌ' ఇతి అత్ర యోఽయం 'పుమాన్ స్త్రియా' 'పితా మాత్రా' ఇతి చ ఏకశేషః, తేనైష విశేషలక్షణ యోగాత్ వక్రోక్తిత్వే సతి అలంకారతాం లభతే ఇతి న ధవఖదిరాదిషు అతిప్రసఙ్గః ఇతి అయమపి సముచ్చయభేదః.

(6) ప్రసిద్ధ సమస్యలలో—

'వాగర్థావివ సంపృక్తౌ శతకోటి ప్రవిస్తరం
తురాసాహం పురోధాయ నేము స్సర్వే సురాః శివౌ.'

(7) శ్రీరామకృష్ణగోపాలభాండారకారపండితునికి G. N. R. అనువారిచే అంకితము సేయఁబడిన బొంబాయిముద్రణ రఘువంశములో ప్రకృతశ్లోకముమీఁదివ్యాఖ్యలో నడుమనడుమ చారిత్రవర్ధన - సుమతి విజయ - విజయానందసూరిచరణసేవకుల వ్యాఖ్యలనుండి టీకాభాగములు ఉదాహరింపఁబడి యున్నవి.

పైవిస్తరమువలన ఈశ్లోకము కడుం బ్రాచీన మనియు, దీనిని రాజమాషనిభవంత శ్లోకశత్రు చ్ఛాందస ప్రణీత 'భోజనం దేహి రాజేన్ద్ర ఘృతసూపసమన్వితమ్' వంటి దానినిగాఁ గాక, కాళిదాసీయ 'మాహిషం చ శరచ్చన్ద్ర చన్ద్రికాధవళం దధి' వంటి

దానినిగానే ఈయిండియాదేశమందలి రసిక విద్వ ద్విమర్శ కాలంకారికశిరోమణులు గణించి రసియు విశద మగుచున్నది.

(8) ఇది యెల్ల నిటుండ ఈ శ్లోకమందలి యుపమార్థము కాళిదాసునకు ఎంత ప్రియముగా నుండెనో, దీనిని కుమారసంభవ షష్ఠసర్గలో 79 - వ శ్లోకములో గూడ ప్రయోగించుకొనుటవలననే ఎఱుంగవచ్చును

'త మర్థ మివ భారత్యా సుతయా యోక్తు మర్హసి
అశోచ్యా హి పితుః కన్యా సద్భర్త్రే ప్రతిపాదితా.'

(9) ఇందుపై మల్లినాథవ్యాఖ్య.—"తమితి.—తం శమ్భుం, భారత్యా వాచా, అర్థ మభిధేయ, మివ, సుతయా సుతా త్రా, యోక్తుం సంఘటయితు మర్హసి, అత్ర వాగర్థయో రుపమానత్వ సామర్థ్య చ్ఛివయో ర్నిత్యయోగో వివక్షిత ఇ త్యుక్తం 'వాగర్థా వివ సంపృక్తౌ' ఇ త్యత్రాపి,..."

ఇందుపైచారిత్రవర్ధన టీకాభాగము.—'అర్థ మివ-ఏతేన వాగర్థయోః యథా నిత్యః సంబన్ధః తథా అనయో రప్యర్ధనారీశ్వరత్వేవ భవిష్య తీతి సూచ్యతే.'

(10) ప్రకృత రఘువంశమంగళశ్లోకార్థమున కుపబృంహకముగా మల్లినాథసూరి యుదాహరించిన వాయుపురాణ సంహితా వచనముయొక్క యర్థమునే విజయానంద సూరిచరణసేవకుఁడు తన రఘువంశవ్యాఖ్యలో

'శివా శబ్దమయీ ప్రోక్తా, శమ్భు శ్చార్థమయః స్మృతః,
అతః శబ్దార్థ నిష్పత్తి సిద్ధయే తౌ నతౌ మయా.'

అని యనువదించినాఁడు.

(11) సుమతివిజయ విజయగణి విజయానందసూరిచరణసేవకులు తమ రఘువంశవ్యాఖ్యలలో—"న న్వన్యేషు గణేశాది దేవేషు సత్సు ఉమామహేశ్వరయో ర్నమస్కారం కథం కృతవాం స్తత్రాహ.—

'ఈశ్వరాజ్ జ్ఞాన మన్విచ్ఛేత్ ముక్తి మిచ్ఛేజ్ జనార్దనాత్
ఆరోగ్యం భాస్కరా దిచ్ఛే ద్ధనమిచ్ఛే ద్ధుతాశనాత్ ఇతి.'"

అని వ్రాసియున్నారు.

(12) ఉక్త వాయుసంహితా వచనలోహము మహాకవి ప్రతిభాన స్పర్శవేధి సోఁకి నంతట సువర్ణీభూత మగుచు నింతం బళికించినయెడల గ్రంథ మెల్ల నొకయెత్తును ఈశ్లోక మొక్కటియ యొకయెత్తునుంగా సహృదయులకు తోఁచకమానదు. సంహితా వచన మందు పార్వతీపరమేశ్వరులు శబ్దార్థ స్వరూపులుగా చెప్పఁబడియున్నారు; ఈ శ్లోక మందు వానివలె కూడియున్నట్లు చెప్పఁబడియున్నారు. ఈ యౌపమ్యముచేత తత్తత్స్వ

రూపతామాత్రకథనమువలన తెలియనట్టిది పార్వతీపరమేశ్వరులయొక్క నిరతిశయాన్యోన్య ప్రేమాతిశయము తెలియనగుచున్నది. ఉపమ లింగవ్యత్యయ దూషితంబుగాకుండుటకై శబ్దశబ్దము వాక్ఛబ్దముగా మాఱినది.

సంహితావచనములోలేని జగత్పితృత్వముచే భక్తానుగ్రహమును కవీప్సితసిద్ధియు సూచితము లయినవి. అన్యోన్యవిమనస్కు లయిన తల్లిదండ్రులు పుత్త్రుని మనోరథమును నెఱవేర్చుట సందిగ్ధమును అన్యోన్యానురక్తులు నెఱవేర్చుట యసందిగ్ధమును గావున మహాకవి అన్యోన్య నిరతిశయ ప్రేమవిశిష్టులనుగా స్మరించినాఁడు. ఇతని నాలుకయందు కాళికాదేవి వ్రాసిన బీజాక్షరద్వయమునా నొప్పు నీ యివాక్షరద్వయముచే కవిలోకమెల్ల ఇతనియొక్కని సామ్మని యంగీకరించిన యుపమాలంకారను. ఇందుం బొందుపడి యింత కవనోత్కర్షను దీనికొడఁగూర్చినది.

ఇది యుత్తరరామచరిత నాందికి

'ఇదం కవిభ్యః పూర్వేభ్యో నమోవాకం ప్రశాస్మహే
విన్దేమహి చ తాం వాచ మమృతా మాత్మనః కలామ్.'

అను శ్లోకమునకు రాకపోయినదా! ఉ. రా. లో భవభూతి 'విశిష్యతే' అంటగదా,

## II. కావ్య నామ చర్చ.

ఈకావ్యమునకు రఘువంశ మని పేరిడినందులకు ఉపపత్తిగా పూర్వోక్తవిమర్శ గ్రంథమందు ఇంద్రవిజయవిశ్వజిద్యాగముల వలని యుత్కర్ష చెప్పఁబడినది. ఇందలి యింద్రవిజయోక్తి ఔపచారిక మని సవనాశ్వమును మరల్చుకొనలేమిచేతనే తెలియనగుచున్నది. ఈగౌణజయముచే నితఁడు ఇంద్రునెక్కి స్వారిచేసిన కకుత్థ్సునికన్న నధికుఁడా? ఇంద్రజేతను రావణుని రూపుమాపిన శ్రీరామునికన్న గొప్పవాఁడా? విశ్వజిద్యాగము విష్ణుదేవునింగూడ మించునా? ఇట గొప్పతనము కారణముగా నగపడదు.

ద్వితీయసర్గలోని

'తతః సమానీయ సమానితార్థీ హస్తౌ స్వహస్తార్జిత వీరశబ్దః
వంశస్య కర్తార మనన్తకీర్తిం సుదక్షిణాయాం తనయం యయాచే.'

అనుశ్లోకమునకు వ్యాఖ్యయందు మల్లినాథసూరి 'వంశస్య కర్తారం ప్రవర్తయితారమ్, అత ఏవ రఘుకుల మితి ప్రసిద్ధమ్' అని వ్రాసిన వంశకర్తృత్వ కారణమే సమంజసముగా నున్నది. రఘుకుల మని ప్రసిద్ధియేగాని రామకులమని ప్రసిద్ధి లేదు గదా.

III. 'సోఽహమాజన్మ శుద్ధానామ్' అని ప్రథమసర్గ పంచమశ్లోకములో 'ఆజన్మశుద్ధానామ్, అనఁగా 'నిషేకాది సర్వసంస్కార సంపన్నానామ్' అను మల్లినాథ సూరి వివరణము త్రేతాయుగమందు ఆసంస్కారములు సర్వసాధారణముగా అనుష్ఠితము

లగుటచేత విశేషాధాయకములు కానందున సమంజసము గాదనియు కామధేనువుకూఁతు పాలచే జనించుటవలనఁ గలిగిన శుద్ధి యిట వివక్షిత మనియుం విమర్శకుల యభిప్రాయము. ఇదియే సాధుమతమేని రఘువునకు అసంస్కారములు అక్కఱలేదా? చేయలేదా? 'రఘూణామ్' అను బహువచనముచేత అతనికి ఆపాలవలనం గలిగిన శుద్ధి విశేషము తద్వం శ్యులకెల్లఁ గలదని యభిప్రాయమేని వారికెల్ల అసంస్కారములను మానినారా? చేసి నట్లే రఘువంశములో చెప్పఁబడియున్నది. కవి ఆజన్మ శుద్ధ్యాది గుణములు తన్ను ప్రేరిం పఁగా తా నీకావ్యమును రచించినట్లు చెప్పుకొని యున్నాఁడుగదా; ఈపాలశుద్ధి శ్రీరా మజననకారణభూతమయి ఆద్యపురుషానుప్రవేశ దుర్వహ మయిన పయశ్చరు శుద్ధికన్న ఎక్కుడా? వంశములో రామునినుండి ఆ చరుశుద్ధి, అంతవఱకు ఈ పాలశుద్ధి యని వ్యవ స్థితియా? ఈపాటిశుద్ధి సూర్యునివలన నుత్పన్న మయినందునఁ గలుగదాయెనా? ఈవిష యము లెల్ల పరికింపఁగా మల్లినాథప్రోక్త శుద్ధియే కవిహృదయముగాఁ గానిపించుచు న్నది. తత్పూర్వవ్యాఖ్యాతలమతమును అదియే.

'ఆజన్మ శుద్ధానామ్ గర్భాధాన మారభ్య స్మృత్యుక్త సంస్కారైః పరిహృత బీజాదిదోషాణామ్' అని చారిత్రవర్ధనుఁడు.

మఱియు ఈనిషేకాదిజనితశుద్ధికి విమర్శకులు చేసిన యాక్షేపమునకు నిమిత్తముగా ఈ సంస్కారసంపన్నత త్రేతాయుగమందు సర్వసాధారణ మగుటయు అందులకు నిమిత్తముగా ఆయుగమందు త్రైవర్ణికుల కెల్లరకు స్మార్తకర్మశ్రద్ధ మెండుగా నుండుటయుం వ్రాసినారు. ఈయాక్షేపప్రకారమే సాధువేని ఆయుగమందు ఉక్తకర్మయందు మాత్ర మేగాక సకలయోగ్యతలయందును శ్రద్ధ అట్లే యుండును గావున ఇందలి కడమవిశేష ణములందును ప్రాయికముగా త్రేతాయుగ సామాన్యచరిత్రము నతిక్రమించిన విశేషమే మియు నుండదు. ఒక్క రఘుమహారాజునకుమాత్రము అన్వయించునట్లుగా 'యథావిధి హుతాగ్నీనామ్' అన్నమాటకు విశ్వజిద్యాగముచేసి సర్వస్వదక్షిణ యిచ్చినవారు అని వ్రాయుట సరిగాదు; ఏలయన వ్రాసినవిశేషము ఆవంశమువారికెల్ల అన్వయింపవలయును; కానిచో ఆబహువచనములేల? వంశముచెప్పెద నననేల? వంశమును చెప్పనేల? రఘు విజయముమాత్రమే వ్రాసి మానరాదా? 'యథాపరాధదణ్డానామ్'— ఉక్తయుక్తిచే ఆకాలపురాజులకెల్ల ఈయోగ్యత యుండునని తలంపవలయును; పయిగా ఈయోగ్యత రాజమాత్రునికెల్ల నుండవలసినట్టి దిగదా, అది లేనివాఁ డొకరాజా! 'శైశవేఽభ్యస్తవిద్యా నామ్' 'యౌవనే విషయైషిణామ్'— వీనియం దేమి విశేషము?

ఈ యన్నివిశేషణములచేతను లోపములలేమియుం సకలసద్గుణానన్యసాధారణ ప్రభావ సద్భావంబును ముఖ్యముగా వివక్షితము లని గ్రహించుట యుక్తము.

**IV.** షష్ఠసర్గలో 'శృఙ్గారరసస్య పరాం కాష్ఠా మధిరూఢః కవిః' అని విమర్శకులు వ్రాసినారు. ఇందలి 12-వ శ్లోకము పైవ్యాఖ్యలో మల్లినాథసూరి 'శృఙ్గారాభాసశ్చాయ మేక త్రైవ ప్రతిపాదనాత్' అని వివరించినాఁడు.

**V.** ఈసర్గలో పేర్కొనఁబడిన మగధావంతీ హైహయ శూరసేన రాష్ట్రములు కాళిదాసుకాలములో నుండిన వనియు అట్లున్నను చతుర్థసర్గలో దిగ్విజయములో వానిని చెప్పమికి కారణము విచారణీయ మనియు, విమర్శకులు వ్రాసినారు. ఈరెండుసర్గలలోను ప్రసక్తమైనట్టివి ఆ దిగ్విజయ స్వయంవరకాలములరాష్ట్రములు గాని కవికాలపు రాష్ట్రములు గావు. కావున ఆకాలములవానినిగా కవిచెప్పినట్టివి ఆకాలములం దుండెనా లేదా అని పరీక్షింపవలసినదేగాని తనకాలపువానిని చెప్పలేదేమని పరీక్షింపం బ్రసక్తి లేదు. ఒక కాలపువారిని మఱియొక కాలపు వారినిగా చెప్పుట కవియందు లోపముగాని గుణముగాదు.

మఱియు ఆనాలుగురాష్ట్రములను నాలవసర్గలో పేర్కొనమికి ఒకకారణముగా విమర్శకులు అవి ఆసర్గలో రఘువు పోయినదిగా చెప్పఁబడిన మార్గమున లేమిని ప్రదర్శించినారు; మఱియొకకారణముగా, కొందఱను రఘువు పరాక్రమముచే జయించె ననియు, కొందఱను అజుఁడు సౌభాగ్యపరాక్రమములు రెంటిచేతను జయించె ననియు, వర్ణించుటకై కవి అవకాశమును కల్పించుకొన్నాఁ డని తెలిపినారు.

రఘువు ఆరాష్ట్రములను దిగ్విజయములో తాఁకెనా లేదా? తాఁకెనేని చెప్పిన దారి అసమగ్రమా? తాఁకలేదేని విశ్వజిత్తు సేయుటకు విశ్వజయ మెక్కడిది? కావున దారిలో లే వనుకారణము హృదయంగమముగా నుండలేదు. మఱియు కొందఱను రఘువు జయించినట్లును, కొందఱను అజుఁడు జయించినట్లును, చెప్పుటయందు స్వారస్యమేమి? అపౌనరుక్త్యము కొఱకా? అటులయిన కళింగపాండ్యులవలన ఆయపౌనరుక్త్యము భగ్నమయినది. పితృజితులనే జయించుట సుతునికి ఉత్కర్షాధాయకముగాదా? ఆయుత్కర్షయు ఆకళింగపాండ్యులవలననే భగ్నమయినది. అందుకై కొందఱ నైనను పితృజితులను జయించినట్లు చెప్పం దలంపా? అదియును సరిపడదు. ఏలన - ఈయజజితులు తత్పూర్వము రఘుజితులే యని సప్తమసర్గలో కవి చెప్పినాఁడు.

'ఇతి స్వసు ర్భోజకులప్రదీపః సంపాద్య పాణిగ్రహణం స రాజా
మహీపతీనాం పృథగర్హణార్థం సమాదిదే శాధికృతా నధిశ్రీః. 29

లిఙ్గై ర్ముదః సంవృతవిక్రియా స్తే హ్రదాః ప్రసన్నా ఇవ గూఢనక్రాః
వైదర్భ మామన్త్ర్య యయు స్తదీయాం ప్రత్యర్ప్య పూజా ముపదాచ్ఛలేన. 30

స రాజలోకః కృతపూర్వసంవి దారమ్భసిద్ధౌ సమయోపలభ్యమ్
ఆదాస్యమానః ప్రమదామిషం త దావృత్య పన్థాన మజస్య తస్థౌ.' 31

ప్రమన్యవః ప్రాగపి కోసలేన్ద్రే ప్రత్యేక మాత్తస్వతయా బభూవుః
అతో నృపా శ్చక్షమిరే సమేతాః స్త్రీరత్నలాభం న తదాత్మజస్య. 34

ఇందులకు G. R. N. పండితుల యాంగ్లేయానువాదము.

29. At last that excessively prosperous king, The light of the Bhoja family, having thus completed the marriage of his sister, gave orders to his officers for separate reception of the other kings.

30. Those kings who had suppressed all outward feeling of dissatisfaction under the garb of joy, like pleasant (*i.e.* clear) lakes with alligators lurking in them, bade good bye to the lord of the Vidarbhas, and went away, having repaid the (same kind of) honour under the pretext of marriage presents

31. That multitude of kings, who had previously formed a plot for the accomplishment of their object, and who were thus bent on snatching away that bait of a young damsel obtainable at the time (of his departure) stood obstructing the way of Aja.

34. Every one of them had already become irritated against the lord of the Kosalas (*i.e.*Raghu) on account of having been deprived of his wealth (by Raghu), and hence the kings who were assembled there for conspiracy could not endure the acquisiton of that jewel-of-a woman by his son.

కావున ప్రముఖులయిన యీరాజులం బేర్కొనుట ప్రధానముగా స్వయంవరో త్కర్షాధానార్థము. ఏతజ్జయముచే అజుని జయకీర్తియు ప్రస్తుతోచితమే.

రఘువు పరాక్రమముచేతను అజుఁడు పరాక్రమసౌభాగ్యములు రెంటిచేతను జయించె ననుటలో రఘువునకు ఈరాజులపాటిసౌభాగ్యము లేదాయె నని భావమా? నందినీ వరప్రసాదజాతునికి అట్టిలోపము ఉండునా ? మఱి వీరు రఘువునకు సుహృత్తులై యుందు రనియు, దానంజేసి ఆతఁడు వీరిని జయింపలేదనియు నభిప్రాయమేని అందులకు ఈరాజులు సప్తమసర్గలో అజునిజాయను హరించుటకై అతనితో పోరుట విరుద్ధముగా నున్నది.పోరినవారు వీరుగాక అన్యులందుమేని ప్రముఖులయిన వీరినిమాని అనామధేయులను జయించినమాత్రాన అజునికే ముత్కర్ష? వీరిలోనే కొందఱు రఘుమిత్త్రులు ఇతరులు తర్జితులు అని భేదమా? అగుఁగాక. మగధుఁడు మేనమామయో, మేనబావయో; అతఁడు మిత్త్రుఁ డనియు, అతఁడు ఆవైరులతో చేరలే దనియు, భోజుఁడు ఈవివాహసంబంధ

మున కనుకూలముగా మిత్త్రుఁడే అనుకొందము. అంగరాజు 'నరేన్ద్రకన్యాస్త మవాప్య' (IV-33) అన్నందున రఘువునకు మామగారనియేని 'పారస్త్యాన్' (I - 31) అనుటచే జితుఁడనియే సూచిత మగుఁగాక. కళింగపాండ్యజయము స్పష్టోక్తమేగదా. మఱి శూర సేనావంతీహైహయరాజులు మిగిలియున్నారు. వారును 'శుద్ధపార్ష్ణిః' (IV-26) ['ఉద్ధృతపృష్ఠశత్రుః' అని వ్యాఖ్య] అనువచనముచేత జితు లని యెన్నుదము. అతని దేశమునకు పూర్వోత్తరదిక్కులందు వెంబడివియు ఇంచుమించుగా వెంబడివియు వీరిరాష్ట్రములే గదా; కావున అతని పార్ష్ణిగ్రాహులు వీరే. మఱి కళింగపాండ్యులను దిగ్విజయమందేని స్వయంవరమందేనియు నొక్కటమాత్రమే పేర్కొనరాదా యనిన, ఉత్కలము మొదలు హూణదేశమువఱకు ఏరాజులును ఇంతగొప్పవారు లేనందున దిగ్విజయ వర్ణనయందు వారిని పేర్కొనమి రాత్రి మేజువాణిలో దీపములార్పుట వంటిదిగా నుండును. మిక్కిలి గొప్పరాజులు గనుకనే స్వయంపరమందును వారిని పేర్కొని వర్ణించుట అవశ్యముగా నున్నది. కావున ఇటుమాటు పేర్కొనుట.

VI. 'త్రస్తేన తార్క్ష్యాత్కిల కాళియేన మణిం విసృష్టం యమునౌకసా యః
వక్షఃస్థలవ్యాపిరుచం దధానః సకౌస్తుభం హ్రేపయతీవ కృష్ణమ్.'

అనుశ్లోకములో ఔచిత్యమును మఱచినవాఁడై కాళిదాసుఁడు స్వయంవరములోని మథురానాథుని సుషేణుని త్రేతాయుగమువానిని, ద్వాపరాంతమున నవతరింపఁబోవు శ్రీకృష్ణులవారితో సునంద పోల్చి వర్ణించినట్లు రచించినాఁ డని విమర్శకులు ఆక్షేపించినారు. ఈశ్లోకములోని కృష్ణశబ్దమునకు వైకుంఠవాసి యగు విష్ణుమూర్తియర్థముగాని ద్వారకావాసి యగు శ్రీకృష్ణులవారు అర్థముగారు. అట్లే మల్లినాథసూరియు 'కృష్ణమ్' అనుపదమునకు 'విష్ణుమ్' అని యర్థము వ్రాసినాఁడు. ఇందులకు సంవాదాంతరముం గనవచ్చును.

'కార్ష్ణేన పత్త్రిణా శత్రుః స భిన్నహృదయః పతన్
ఆనినాయ భువః కమ్పం జహా రాశ్రమవాసినామ్'

ఇందులకు మల్లినాథవ్యాఖ్య.—"స శత్రుః లవణః, కార్ష్ణేన వైష్ణవేన, పత్త్రిణా బాణేన, - ఉక్తం చ రామాయణే 'ఏవ మేష ప్రజనితో విష్ణో స్తేజోమయః శరః ఇతి [రామేణ హి ప్రజతోఽస్య వైష్ణవః శరో దత్తః-హేమాద్రిః] 'విష్ణు ర్నారాయణః కృష్ణః' ఇత్యమరః...."

ఇందులకు G. N. R. పండితుల యాంగ్లానువాదము.

'The fall of the enemy whose heart was split by the arrow presided over by Vishnu, shook the ground, while it put an end to the trembling of the hermits.'

VII. మఱియు—ఔచిత్యమును మఱచినవాఁడై కవి స్వయంవరములోని రాజులలో మథురానాయకు నొకనింగా వర్ణించినాఁడుగదా, అప్పటికి మథురయేలేదు, పిమ్మట ఎప్పుడో ఇందుమతిమనుమఁడు శత్రుఘ్నుఁడు మథురను నిర్మించినాఁడు.—అనియును విమర్శకుల యాక్షేపము.

మథురను శత్రుఘ్నుఁడు బాగుచేసినవాఁడేగాని, లేని పట్టణమును తాను క్రొత్తగా కట్టినవాఁడు గాఁడు. కంకంటిపాపరాజుగారి యుత్తరరామాయణము 7-వ యాశ్వాసమునం గనుఁడు. ఇందు లవణుఁడు అడవినుండి మధుపురిని (అనఁగా మథురను) చొత్తెంచుచున్నప్పుడు పురద్వారము వెలుపల శత్రుఘ్నుఁడు అడ్డగించి మడియించినట్లును, ఆ మధుపురిని ఇంద్రాదులవరముచేత శత్రుఘ్నుఁడు మధురాకృతిం జేసినాఁడనియు నున్నది.

(కం. పా. ఉ. రా. 7 - ఆ.)

"శత్రుఘ్నుండు లవణాసురుని సంహరించి తత్పురంబు నేలుట.

... ... ... ... ...

మ. అలశత్రుఘ్నుఁడు శక్రముఖ్యులకు సాష్టాంగంబు లర్పించి యం
జలి గావించి మహాత్ములార భవదంచత్పాదము ల్గొల్వఁగాఁ
గలిగెం జాలదె? యైన నిమ్మధునిప్రోల్ గన్గొన్నఁ దొల్లింటికం
టె లసత్సంపదమీఱఁ జేయఁ దమిపుట్టెన్ గల్గనిం డట్టులన్.

మ. అనినన్ నీవు దలంచినట్టు లతిరమ్యం బై ధరాస్వర్గమో
యన నింపొందెడు నిప్పురం బనుచు వా రంతర్ధిఁ జెందన్ ముదం
బున శత్రుఘ్నుఁడు శత్రుసంహరణ మాప్రొద్దే రఘుస్వామికిన్
వినిపింపం దగువారిఁ బంచి హితమన్త్రిశ్రేష్ఠులే తెంచినన్.

ఆ. వారినాదరించి వచ్చినసేనల । గలయ విజయసూచకంబు లయిన
పటహగోముఖాది బహుళవాద్యంబులు । ఘోరు కలుఁగ మధునిపురము సొచ్చె.

... ... ... ... ...

వ. అప్పుడు.

తే. రంగదుత్తుంగతరగోపురములు గలిగి । కలితగృహావర్గ విపణిమార్గములు గలిగి
వికచ కల్హారహారి దీర్ఘికలు గలిగి । పొలిచె శత్రుఘ్నువలన నప్పురవరంబు."

ఇందులకు మూల మయిన సంస్కృతము ఉత్తరకాండ, 71-వ సర్గ.

"హతే తు లవణే దేవా స్సేన్ద్రా స్సాగ్ని పురోగమాః
ఊచు శ్చ మధురాం వాణీం శత్రుఘ్నం శత్రుతాపనమ్.
దిష్ట్యా త్వం విజయీ వత్స దిష్ట్యా లవణరాక్షసః

హతాః పురుషశార్దూల వరం వరయ రాఘవ.
వరదాః స్మ మహాబాహో సర్వ ఏవ సమాగతాః
విజయాకాఙ్క్షిణ స్తుభ్య మమోఘం దర్శనం హి నః.
దేవానాం భాషితం శ్రుత్వా శూరో మూర్ధ్ని కృతాఞ్జలిః
ప్రత్యువాచ మహాబాహుః శత్రుఘ్నః ప్రయతాత్మవాన్.
'ఇయం మధుపురీ రమ్యా మధురా దేవనిర్మితా
నివేశం ప్రాప్ను యా చ్ఛీఘ్ర మేష మేఽస్తు వరః పరః.'
తం దేవాః ప్రీతమనసో బాఢ మి త్యేవ రాఘవం
'భవిష్యతి పురీ రమ్యా శూరసేనా న సంశయః.'
తే తథో క్త్వా మహాత్మానో దివ మారురుహు స్తదా
శత్రుఘ్నోఽపి మహాతేజా స్తాం సేనాం సముపానయత్.
సా సేనా శీఘ్ర మాగచ్ఛ చ్ఛ్రుత్వా శత్రుఘ్నశాసనం
నివేశనం చ శత్రుఘ్నః శ్రావణేన సమారభత్.
సా పురీ దివ్యసంకాశా వర్షే ద్వాదశమే శుభా
నివిష్టా శూరసేనానాం విషయ శ్చాకుతోభయః.
... ... ... ... ...
య చ్చ తేన పురా శుభ్రం లవణేన కృతం మహత్
శోభ యామాస శత్రుఘ్నో నానావర్ణైన త ద్గృహమ్."

కృతయుగములో జరిగిన దమయంతీస్వయంవరమునకు మధురాధీశుఁడు వచ్చినట్లు శ్రీహర్షుఁడును నైషధమందు 11-వ సర్గలో వర్ణించినాఁడు.

"ప్రత్యర్థిపార్థివ పయోనిధి మాథమన్థ
పృథ్వీధరః పృథు రయం మధురాధినాథః,
అశ్మశ్రుజాత మనుయాతి న శర్వరీశః
శ్యామాఙ్కకర్బురవపు ర్వదనాబ్జ మస్య. 103.
గోవర్ధనాచల కలాపిచయ ప్రచార
నిర్వాసితాహిని ఘనే సురభిప్రసూనే
తస్మి న్న నేన సహ నిర్విశ నిర్విశఙ్కం
బృన్దావనే వనవిహారకుతూహలాని." 107.

మఱియు, శత్రుఘ్నుఁ డేలినమధుర కృతయుగమునుండియుం గలదు. ఎట్లనఁగా, ల‌వణపిత మధుదైత్యుఁడు కృతయుగమువాఁడు.

ఉత్తరకాండ 61-వ సర్గలో చూడుఁడు.—

" పూర్వం కృతయుగే రామ దైతేయ స్సుమహాబలః
లోలా పుత్త్రోఽభవ జ్జ్యేష్ఠః మధుర్నామ మహాసురః. ...
ఏవం మధు ర్వరం లబ్ధ్వా దేవా త్సుమహ దద్భుతం
భవనం చాసురశ్రేష్ఠః కారాయామాస సుప్రభమ్.
తస్యపత్నీ మహాభాగా ప్రియా కుమ్భీన సీతి యా ...
తస్యాః పుత్త్రో మహావీర్యో లవణో నామ దారుణః."

తిక్కన నిర్వచనోత్తర రామాయణములో మధునిపై రావణుఁడు దండెత్తు ఘట్టములో

'క. చని మధురాపురి ముట్టిన । ...'

అని వ్రాసియున్నాఁడు...'

పై ప్రమాణములంబట్టి చూడఁగా రఘువంశము 15-వ సర్గలో

'ఉపకూలం స కాళిన్ద్యాః పురీం పౌరుషభూషణః
నిర్మమే నిర్మమోఽర్థేషు మధురాం మధురాకృతిః.' 28.

అను శ్లోకమున మధురను మధురాకృతినిగాఁ గావించె ననియు అనఁగా బాగుచేసి యలంకరించె ననియు అర్థముగా 'మధురాకృతిమ్' అని కవి రచించియుండఁబోలు ననియు, ఆ ద్వితీయ అన్యుల ప్రమాదముచే ప్రథమగా మాఱియుండనోపు ననియు నూహించుట సమంజసము.

ఉక్తస్వయంవరముల యప్పటికి మధుర లేదనుటకంటె—అకాలములలో ఆపట్టణము మధునిదో వానిసుతుఁడు లవణునిదో అయియుండఁగా, దాన నివసించుచు దానిని ఏలుచు ఆరాజుండెను ఈరాజుండెను, అని వర్ణించుట ఎట్లు ?—అని యాక్షేపించుట మేలు. అందులకు 6-వ సర్గలో 'కళిన్దకన్యాం మధురాం గతాఽపి' అనుచో 'యద్వా సాఽన్యా' (ఆ మథుర వేఱు) అని మల్లినాథసూరి వ్రాసిన సమాధానమే శ్రేష్ఠముగా అగపడుచున్నది.

మఱియు 'మన్ది వాశి మథి చతి చ ఙ్క్యఙ్కిభ్య ఉరచ్' అనెడి యుణాది సూత్రమువలన నిష్పన్న మయినట్టిది థకారనుధ్యము మధురాశబ్దము 'మధుం రాతీతి మధురా' అని ధకారమధ్య మొకటి కల దనియు, 'యద్వాసాఽన్యా' అను వ్యాఖ్య కనుగుణముగా స్వయంవరములయందలి రాజులనగరము మధుర యనియు,శత్రుఘ్నపురి మధుర యనియు, గ్రహించుట యుక్తమని కొంద ఱాధునికుల మతము.

**VIII.** స్వయంవరసర్గలో కాళిదాసు అజునిఁగాక మగధ - అఙ్గ - అవన్తి - మాహిష్మతీ-ఉత్తరకోసల-మహేన్ద్ర-పాండ్య లనెడి యేడుగురురాజులను పేర్కొని వర్ణించినాఁడు. అందులకు ముందు ఏడుశ్లోకములచే (13-19) పేర్లు చెప్పక, 'కశ్చిత్' 'కశ్చిత్' అని రాజుల శృంగారచేష్టలను వర్ణించినాఁడు. దీనింబట్టి విమర్శకులు ఆయేడుగురచేష్టలనే

యీయేడుశ్లోకములయందును వరుస తప్పక కవి వర్ణించినాఁడని యొక చమత్కారమును ఊహించినారు. అట్టి సంబంధము ఏమియు లే దని మల్లినాథసూరి యభిప్రాయముగా తోఁచుచున్నది.

ఇటస్వయంవరమునకు వచ్చినవారు ఎనమండుగురేనా?

'తాసు శ్రియా రాజపరమ్పరాసు ప్రభావిశేషోదయదుర్నిరీక్ష్యః
సహస్రధాఽఽత్మా వ్యరుచ ద్విభక్తః పయోముచాం పఙ్క్తిషు విద్యు తేవ. 5

'సహస్రధా' 'పరమ్పరాసు' అనుటచే పెక్కువందలమంది. ఎనిమిదవవానికి అజునికిమాత్రము శృంగారచేష్టలను వర్ణింపమికి కారణమేమి? ఈ యేడుగురకేగాని స్వయంవరమందలి కడమరాజులకు శృంగారచేష్టలు లేవా? కథితనామావృతుల చేష్టలను మాత్రమే వర్ణింపవలసిన దని నియమము కలదా? ఇంతకన్న మల్లినాథాదులవలెనే అకథిత నాములకు కశ్చిచ్ఛ్లోకములును కథితనాములకు సవిశేషవర్ణనలును అని గ్రహించుట యుక్తము. మఱి, విమర్శకులు కశ్చిచ్ఛ్లోకములయందు చూపినట్టి యీ (యేడుగురు రాజుల) సూచనలు ఏపాటి సమర్థకములో విచారింప వలయును.

ఈసూచనలు ఆయారాజుయొక్క రాజధానినో దేశమునో తెలుపునట్టివి గాని వేఱువిషయమును తెలుపునవిగా లేవు. ఆచేష్టలచేత ఆయారాజు తాను ఫలానివాఁ డని ఇందుమతికి తెలుపుకొన్నాఁడా? రా జని ఆమెకు తెలిసియే యున్నది. ఏయూరిరాజో (తెలియనీకుండ) తెలుపుకొన్నమాత్రాన ఆమె వరించునా? 'తెలియనీకుండ' అననేల యనఁగా ఈసూచనల యభిప్రాయము గ్రంథమునెల్ల పలుమాఱు పూర్వాపరపరామర్శ పూర్వకముగా పరీక్షించిన మహాపండితు లగు వ్యాఖ్యాతల కెవ్వరికిని గోచరించినట్టిది కాదు. ఆబాలిక కెట్లు తెలియును! ముందుగా—ఈ చేష్టలన్నియు రాజవిశేషణసూచనము లని ఒక హెచ్చరికయు, అందును రాజధానీ రాష్ట్ర రాజవృత్తాంతాన్యతమ సూచకములే యని మఱియొక హెచ్చరికయు, ఈ యీచేష్టయందు ఈ యీయది సూచకము అని మూఁడవ హెచ్చరికయు వలసియున్నవి.

13-వ శ్లో.— కశ్చిత్కరాభ్యామ్.—ఇందు అరవిందము సూచకమఁట. దానిచే కుసుమపురము తెలియునఁట. తెలియుటయే కలదేని కుసుమపురముకన్న పద్మపురమేని పద్మావతియేని తెలియు ననుట మేలు. పద్మపురము భవభూతియొక్క యభిజనము. కుండినపురీ రాజామాత్యకుమారుఁడు పద్మావతీపురీరాజామాత్యకుమారిని వివాహ మాడుటయే మాలతీమాధ వేతివృత్తము. మఱియు అనంతరశ్లోకమందు విమర్శకులు చూపిన సూచనాప్రకారమునే ఇటను అవలంబింతుమేని,—ఇందలి రజస్సుచేత 33-వ శ్లోకమందలి వాజిరజోవ్యాప్తి ఎవనిసేనదిగా కాళిదాసువర్ణించెనో ఆయతఁడు అవంతినాథుఁడు సూచితుఁ డగును.

14-వ శ్లో.— విస్రస్త మంసాత్'—ఇందు ప్రాలంబోత్కర్షణము సూచకమఁట, దానిచేత సూత్రహీనహారములుగా నుత్ప్రేక్షింపఁబడిన శత్రుస్త్రీబాష్పములకు కారణభూతునిఁగా ఏరాజును సునంద వర్ణించెడినో ఆరాజు అంగరాజు సూచితుఁడఁట. ఇందుమతినిగూర్చి యీసూచన వాగ్రూపముగా మాఱినచో ఈతీరున నుండును. 'ఓ బాలికా, నే నెవరనో వినుము! నేను ఏరాజును ఇఁకను సునంద శత్రుస్త్రీల స్తనములమీఁద అశ్రుబిందువులనే సూత్రములులేని హారములనుగా రచించినవానినిగావర్ణించునో ఆరాజను అనఁగా అంగరాజనుజుమా! కావున నన్ను వరింపుము.' ఏదే నొకరాజసూచన తప్పదేని ప్రాలంబముచే ఇంతకన్న సులువుగా మౌక్తికాకరములయిన తామ్రపర్ణీ దక్షిణాంబుధుల నాథుఁడు పాండ్యుఁడు సూచితుఁ డగును.

15-వ శ్లో.— 'ఆకుఞ్చితాగ్రాఙ్గుళినా'— ఇందు సూచకము 'విలిలేఖ' యఁట. 'ఎవనిని తరిమెనఁబెట్టఁబడిన సూర్యునివలె నున్నాఁడని సునంద వర్ణించునో ఆయవంతిరాజను నేను జుమా' అనుట సూచితమఁట. ఇంతకన్న హైమపీఠమును లిఖించుచున్న నేను సూర్యుని తరిమెనంబెట్టిన త్వష్టను జుమా యనుసూచన సూటి; ఈ సూచనయందు కర్తృత్వకర్మత్వములును వివక్షితములు.

16-వ శ్లో.— నివేశ్య వామమ్'— ఈశ్లోకముచేత అరసికత సూచితమఁట, అరసికుఁ డనఁగా మాహిష్మతీనాథుఁడని స్పష్టమఁట. ఇది ఇందుమతింగూర్చిన వాగ్రూపమున 'ఓయిందుమతీ నేను అరసికచక్రవర్తిని, (మహిషుఁడను), మాహిష్మతీనాథుఁడను, కావున నన్ను మాని నీవు అన్యుని వరింపవు అని నాకెఱుక సుమా;'—అని పరిణమించును. ఈతని వరింపమికి కారణముగా 44-వ శ్లోకమునం జెప్పఁబడిన భిన్నరుచిత్వము ఈఅరసికతను విరోధించును. మఱియు ఇందలి హారముచే పాండ్యుఁడును అంగరాజును సూచితు లగుదురనియుం జెప్పవచ్చును.

17-వ శ్లో.—'విలాసినీ'—ఇందు సూచకము కేతకపత్త్రము. దానిచే బృందావనోద్యానావరోధస్తనచందనపాండురయమునలనాథుఁడు సూచితుఁడఁట. బృందావనములోఁ దప్ప మఱెక్కడను కేతకము లేదా? కేతకముచేత సహజశ్వేత గంగ యేల సూచిత గాదు? మఱి బృందావనమే చాలును, యమునయేని చాలును, రెంటిని సూచించుట యేల ?

18-వ శ్లో.— 'కుశేశయాతామ్ర'—ఇందు రేఖాశబ్దము సూచకమఁట. సూచితుఁడు మహేంద్రనాథుఁడఁట. సంబంధము తద్వర్ణనాపర శ్లోకములలో నొకట రేఖాశబ్ద ముండుటయే. ఈసూచన యిందుమతింగూర్చి వాగ్రూపమున నిట్లగు —'ఓయిందుమతీ, దవ్వుచేత నీ కగపడకున్నను నాచేతిలో రేఖ లున్నవి. సునందా శ్లోకములో ఎవనివర్ణనయందు రేఖాశబ్ద ముండునో ఆరాజను నేను. ఆరాజు మహేంద్రనాథుఁడు, కాన నేను ఆమహేంద్రనాథుఁడను.'

19 - వ శ్లో.—'కశ్చిద్యథాభాగమ్'—ఇందు వస్త్రశబ్దము సూచకమఁట. సూచితుఁడు పాండ్యుఁడఁట. సంబాధము పాండ్యవర్ణనల ' రత్నశబ్దము ఉండుట యఁట.

ప్రయోగవశమున ఒకశ్లోకమునందుపడిన శబ్దమేని తత్పర్యాయమేని మఱియొకటం బడుట ఇట్టిసూచక మగునేని, ఉక్తశ్లోకములలోనే సూచనాసాంకర్యములు మెండుగాఁ గలుగును. ఈసూచనలు ఇందుమతికై రాజు లుద్దేశించినచో ఇన్నిటిని ఏకకాలమందు ఆమె యెట్లు పరికించును? ఒకరివెంట నొకరు చేసి రనుచో అందుకైన యొడంబడిక యెప్పుడు చేసికొనిరి? ఇట్లు వీరు మూఁగసంజ్ఞలు చేసి బాధపడ నేల? సునంద తమ్ము నందఱను వర్ణింపనే వర్ణించునుగదా. మఱియు తా నరసికుఁ డని యొకరాజు సూచించుకొనునా? ఇవి రాజులు ఇందుమతికై యుద్దేశించినవి గా వనియు, కవి యుద్దేశించిన వనియు, తలంపుద మన్న, ఆపక్షమందును వీనివలన ఏప్రయోజనమును లేదు. కావున ఈజంటింపు కవిది గాదు. ఈకశ్చిచ్ఛ్లోకముల వరుస యేమాత్రము మాఱినను ఈజంటింపు చెడును. రాజసప్తకోత్కర్ష వర్ణనలలోని అనామనిర్దేశ శ్లోకములు ఎవరివర్ణనలలోనివి మఱియెవరి వర్ణనలోఁ బడినను ఈజంటింపు చెడును సంబంధమును ఉద్దేశించినకవి దానిని ఇట్లు గాలిలోని దీపముగా నుంచునా. ?

IX. మఱియు నామగ్రహణపూర్వకముగాఁ జేయఁబడిన యాయేడుగురు రాజుల ప్రభావవర్ణనములలో ఒక్కొక్కనికిని 'నాసౌనకామ్యః' (30) ఏవమాది విధమున ఉత్కర్ష నే కవిచెప్పియుండఁగా ఆయేడ్గురురాజులనే గుఱించినట్టి దయిన యీశృంగారచేష్టాశ్లోకములయొక్క వ్యాఖ్యలో మల్లినాథసూరి ఆయారాజులకు అపకర్ష నే తెలిపినాఁడని ఆయనపై విమర్శకులు ఆక్షేపముచెసియున్నారు. ఆయాక్షేపము విమర్శక కల్పితమయిన జంటింపుతోడిదేగాన నిరాక్షేపమే.

X. మఱియొకయాక్షేపము.— ఈశృంగారచేష్టాశ్లోకములలో మల్లినాథసూరి తెలిపిన యిందుమత్యభిప్రాయములు సరిగావఁట. గ్రంథవిస్తరనివారణార్థము, దిక్ప్రదర్శనముగా, ఆయాక్షేపమును ఒకశ్లోకమున మాత్రము చర్చించెద.

13 - వ శ్లో.— అరవిందభ్రామణముచేత నీవు నన్నిట్లు త్రిప్తఁ దగును అని రాజాభిప్రాయ మనియు, ఈరాజు హస్తపూర్ణకుఁడుగాన నవలక్షణకుఁ డని యిందు మత్యభిప్రాయ మనియు, మల్లినాథవ్యాఖ్య. ఇందుమతికి శృంగారచేష్టయందు స్మృత్యుక్తనింద్యాచారభావనమును చెప్పుటచేత సూరి ఆమెకు శుష్కతాపసీత్వము నారోపించినాఁడనియు, విమర్శకభావము.

సదాచారమనఁగా మంచినడువడి, దురాచారమనఁగా చెడ్డనడువడి. ఇవి శ్రుతిస్మృత్యుక్తము లయినమాత్రాన అన్నియు సామాన్యులకు తెలియనివే అని తలంపఁగూడదు. సత్కుటుంబములలో ఈకలికాలమందు సయితము పెద్దలు పిన్నలకు సదాచారమును

14-వ శ్లో.— విస్రస్త మంసాత్'—ఇందు ప్రాలంబోత్కర్షణము సూచకమఁట, దానిచేత సూత్రహీనహారములుగా నుత్ప్రేక్షింపఁబడిన శత్రుస్త్రీబాష్పములకు కారణభూతునిఁగా ఏరాజును సునంద వర్ణించెడినో ఆరాజు అంగరాజు సూచితుఁడఁట. ఇందుమతినిగూర్చి యీసూచన వాగ్రూపముగా మాఱినచో ఈతీరున నుండును. 'ఓ బాలికా, నే నెవరనో వినుము ! నేను ఏరాజును ఇఁకను సునంద శత్రుస్త్రీల స్తనములమీఁద అశ్రుబిందువులనే సూత్రములులేని హారములనుగా రచించినవానినిగావర్ణించునో ఆరాజను అనఁగా అంగరాజనుజుమా! కావున నన్ను వరింపుము.' ఏదే నొకరాజసూచన తప్పదేని ప్రాలంబముచే ఇంతకన్న సులువుగా మౌక్తికాకరములయిన తామ్రపర్ణీ దక్షిణాంబుధుల నాథుఁడు పాండ్యుఁడు సూచితుఁ డగును.

15 - వ శ్లో.— 'ఆకుఞ్చితాగ్రాఙ్గులినా'— ఇందు సూచకము 'విలిలేఖ' యఁట. 'ఎవనిని తరిమెనఁబెట్టఁబడిన సూర్యునివలె నున్నాఁడని సునంద వర్ణించునో అయవంతిరాజను నేను జుమా' అనుట సూచితమఁట. ఇంతకన్న హైమపీఠమును లిఖించుచున్న నేను సూర్యుని తరిమెనంబెట్టిన త్వష్టను జుమా యనుసూచన సూటి; ఈ సూచనయందు కర్తృత్వకర్మత్వములును వివక్షితములు.

16 - వ శ్లో.— నివేశ్య వామమ్'— ఈశ్లోకముచేత అరసికత సూచితమఁట, అరసికుఁ డనఁగా మాహిష్మతీనాథుఁడని స్పష్టమఁట. ఇది ఇందుమతింగూర్చిన వాగ్రూపమున 'ఓయిందుమతీ నేను అరసికచక్రవర్తిని, (మహిషుఁడను), మాహిష్మతీనాథుఁడను, కావున నన్ను మాని నీవు అన్యుని వరింపవు అని నాకెఱుక సుమా;'—అని పరిణమించును. ఈతని వరింపమికి కారణముగా 44-వ శ్లోకమునం జెప్పఁబడిన భిన్నరుచిత్వము ఈరసికతను విరోధించును. మఱియు ఇందలి హారముచే పాండ్యుఁడును అంగరాజును సూచితు లగుదు రనియుం జెప్పవచ్చును.

17 - వ శ్లో.—'విలాసినీ'—ఇందు సూచకము కేతకపత్త్రము. దానిచే బృందావనోద్యానావరోధస్తనచందనపాండురయమునలనాథుఁడు సూచితుఁడఁట. బృందావనములోఁ దప్ప మఱెక్కడను కేతకము లేదా? కేతకముచేత సహజశ్వేత గంగ యేల సూచిత గాదు? మఱి బృందావనమే చాలును, యమునయేని చాలును, రెంటిని సూచించుట యేల ?

18 - వ శ్లో.— 'కుశేశయాతామ్ర'—ఇందు రేఖాశబ్దము సూచకమఁట. సూచితుఁడు మహేంద్రనాథుఁడఁట. సంబంధము తద్వర్ణనాపర శ్లోకములలో నొకట రేఖాశబ్ద ముండుటయే. ఈసూచన యిందుమతింగూర్చి వాగ్రూపమున నిట్లగు —'ఓయిందుమతీ, దర్పుచేత నీ కగపడకున్నను నాచేతిలో రేఖ లున్నవి. సునందా శ్లోకములో ఎవనివర్ణనయందు రేఖాశబ్ద ముండునో ఆరాజను నేను. ఆరాజు మహేంద్రనాథుఁడు, కాన నేను ఆమహేంద్రనాథుఁడను.'

19 - వ శ్లో.—'కశ్చిద్యథాభాగమ్'—ఇందు వజ్రశబ్దము సూచకమఁట. సూచితుఁడు పాండ్యుఁడఁట. సంబాధము పాండ్యవర్ణనలో రత్నశబ్దము ఉండుట యఁట.

ప్రయోగవశమున ఒకశ్లోకమునందుబడిన శబ్దమేని తత్పర్యాయమేని మఱియొకటం బడుట ఇట్టిసూచక మగునేని, ఉక్తశ్లోకములలోనే సూచనాసాంకర్యములు మెండుగాఁ గలుగును. ఈసూచనలు ఇందుమతికై రాజు లుద్దేశించినచో ఇన్నిటిని ఏకకాలమందు ఆమె యెట్లు పరికించును? ఒకరివెంట నొకరు చేసి రనుచో అందుకైన యొడంబడిక యెప్పుడు చేసికొనిరి? ఇట్లు వీరు మూఁగసంజ్ఞలు చేసి బాధపడ నేల? సునంద తమ్ము నందఱను వర్ణింపనే వర్ణించునుగదా. మఱియు తా నరసికుఁ డని యొకరాజు సూచించుకొనునా? ఇవి రాజులు ఇందుమతికై యుద్దేశించినవి గావనియు, కవి యుద్దేశించిన వనియు, తలంపుదమన్న, ఆపక్షమందును వీనివలన ఏప్రయోజనమును లేదు. కావున ఈజంటింపు కవిది గాదు. ఈకశ్చిచ్ఛ్లోకముల వరుస యేమాత్రము మాఱినను ఈజంటింపు చెడును. రాజసప్తకోత్కర్ష వర్ణనలలోని అనామనిర్దేశ శ్లోకములు ఎవరివర్ణనలోనివి మఱియొవరి వర్ణనలోఁ బడినను ఈజంటింపు చెడును సంబంధమును ఉద్దేశించినకవి దానిని ఇట్లు గాలిలోని దీపముగా నుంచునా. ?

IX. మఱియు నామగ్రహణపూర్వకముగాఁ జేయఁబడిన యాయేడుగురు రాజుల ప్రభావవర్ణనములలో ఒక్కొక్కనికిని 'నాసౌనకామ్యః' (30) ఏవమాది విధమున ఉత్కర్ష నే కవిచెప్పియుండఁగా ఆయేడ్గురురాజులనే గుఱించినట్టి దయిన యీశృంగారచేష్టా శ్లోకములయొక్క వ్యాఖ్యలో మల్లినాథసూరి ఆయారాజులకు అపకర్ష నే తెలిపినాఁడని ఆయనపై విమర్శకులు ఆక్షేపముచేసియున్నారు. ఆయాక్షేపము విమర్శక కల్పితమయిన జంటింపుతోడిదేగాన నిరాక్షేపమే.

X. మఱియొకయాక్షేపము.—ఈశృంగారచేష్టాశ్లోకములలో మల్లినాథసూరి తెలిపిన యిందుమత్యభిప్రాయములు సరిగావఁట. గ్రంథవిస్తరనివారణార్థము, దిక్ప్రదర్శనముగా, ఆయాక్షేపమును ఒకశ్లోకమున మాత్రము చర్చించెద.

13 - వ శ్లో.— అరవిందభ్రామణముచేత నీవు నన్నిట్లు త్రిప్పఁ దగును అని రాజాభిప్రాయ మనియు, ఈరాజు హస్తపూర్ణకుఁడుగాన నవలక్షణకుఁ డని యిందుమత్యభిప్రాయ మనియు, మల్లినాథవ్యాఖ్య. ఇందుమతికి శృంగారచేష్టయందు స్మృత్యుక్తనింద్యాచారభావనమును చెప్పుటచేత సూరి ఆమెకు శుష్కతాపసీత్వము నారోపించినాఁడనియు, విమర్శకభావము.

సదాచారమనఁగా మంచినడువడి, దురాచారమనఁగా చెడ్డనడువడి. ఇవి శ్రుతిస్మృత్యుక్తము లయినమాత్రాన అన్నియు సామాన్యులకు తెలియనివే అని తలంపఁగూడదు. సత్కుటుంబములలో ఈకలికాలమందు సయితము పెద్దలు పిన్నలకు సదాచారమును

నేర్పుచునే యుందురు, దురాచారమును నివారించుచునే యుందురు. త్రేతయందు జనులు సదాచార తత్పరులేగావున అప్పటి సామాన్యకుటుంబముల పిన్నలకు తజ్జ్ఞానము వెన్నతోడఁ బెట్టినదే. ఇఁక మహారాజ కుటుంబముల పిన్నల మాట చెప్పవలయునా. రాజకుటుంబములయందు యువతులకు సద్విద్యాభ్యాసము సయితము ఎప్పుడును ప్రసిద్ధమే. కావున హస్తఘూర్ణనాదికములు దురాచారము లని యెఱుంగుటకై ఇందుమతికి శుష్కతాపసీత్వము అనావశ్యకము. శుష్కతాపసియు శృంగారచేష్టయందలిశృంగారభావమును గ్రహింపనేరదే మోగాని పద్మము ప్రత్యక్షముగా నుండఁగా తద్ఘూర్ణనమును నింద్యమయిన హస్తఘూర్ణనముగా భావించు ననుటకు యుక్తిచాలదు. మఱి యిది యిందుమతి యొక్క భ్రమయునుం గాదు. 'ఒల్లనిమగనికి ఈలకూరలో ఉప్పుతక్కువ' అన్న సామెత ప్రకారము సాదృశ్యమునుబట్టి శృంగారచేష్ట యందు నింద్యాచారత్వము నారోపించుటయే జాణతనము. ఇదే యిందలి చమత్కారము. ఇట్లే కడమ యాఱుశ్లోకములయందును నెఱుంగ వచ్చును. మఱియు నీయిందు మత్యభిప్రాయములు 'వైదికశిరోమణి' యని విమర్శక పరిహసితుఁ డయిన 'మల్లినాథభట్టుఁడు' కల్పించినట్టివి గావు. ఇవి అతనికి మున్నే లౌకికశిరోమణియు బోపదేవపండితుని గురువును దేవగిరి యాదవరాజులగు మహాదేవ రామరాజుల మంత్రియు నగు హేమాద్రిపండితుఁడు తన రఘువంశవ్యాఖ్యానములోఁ జెప్పినట్టివే.

ఈ యేడుచేష్టలును గాంభీర్యహీనులయిన యకథితనాములవేగాని, ఉత్తమగుణ భూషితులయిన కథితనాములవి గావనియు, ఇవి యపలక్షణము లని సునందకు సయితము ఎఱుకయే యనియు, అందువలననే సునంద ఈచేష్టలవారిని మాని అన్యులనే వర్ణించినదనియు గ్రహించుట యొప్పును.

---

చతుర్థ సర్గయందలి దిగ్విజయువర్ణనముంగూర్చి యించుక:—

ఈవర్ణనను ఇంతకన్న ప్రాచీన మయిన బృహత్కథలో వత్సరాజ దిగ్విజయ వర్ణనముతోపోల్చి చూచిన అనేక సంవాదములు అగపడును. వానిం గనిన, కాళిదాసుని జ్ఞానమునకైన యానందమునకు కొలఁది సరిగా నేర్పడును. బృహత్కథ నందామాత్య వరరుచివలన విని కాణభూతి చెప్పఁగా గుణాఢ్య పండితుఁడు రచించిన దగుటచే రఘువంశమునకన్న ప్రాచీనము. దాని సంస్కృతానువాద మైన కథాసరిత్సాగరము

'యథా మూలం తథై వేదం న మనాగ ప్యతిక్రమః
గ్రన్థవిస్తరసంక్షేపమాత్రం భాషా చ భిద్యతే.'

అని అనువాదకుఁడు వ్రాసి యుండుటంబట్టి మూలమును సంక్షేపతచేతం దక్క నతిక్రమింపదు కావున అందుండి యాదిగ్విజయ వర్ణనము నుద్ధరించెద —

కౌశాంబీపతి యగు వత్సరాజునకు మగధరాజు పాష్ణిగ్రాహుఁడు.

> 'తతః స వత్సరాజ్యం చ ప్రాప్య పిత్రా సమర్పితం
> కౌశామ్బ్యామవస్థితః సమ్యక్ఛశాస సోదయనః ప్రజాః.' ల. 2, త. 3
>
> 'పరిపన్థీ చ తత్రైకః ప్రద్యోతో మగధేశ్వరః
> పాష్ణిగ్రాహః సహి సదా పశ్చాత్కోపం కరోతి నః.' ల. 3, త. 1.
>
> 'యుక్త్యా లావాణకం యామః సహ దేవ్యా నృపేణ చ,
> పర్యన్తో మగధాసన్నవర్తీ హి విషయోఽస్తి సః.' ల. 3, త. 2.

---

తస్మా ద్యథావ త్సమ్మాన్య సిద్ధయే మన్త్రిమణ్డలం
కురు దిగ్విజయం దేవ లబ్ధుం ధర్మోత్తరాం శ్రియమ్. ...
య స్త్వేష బ్రహ్మదత్తాఖ్యో వారాణస్యాం మహీపతిః
నిత్యం వైరీ స తే తస్మా ద్విజయస్వ తమగ్రతః. ...
వత్సరాజోఽపి తం ప్రాప్తం ప్రదత్తోపాయనం నృపం
ప్రీత్యా సమ్మానయామాస శూరా హి ప్రణతిప్రియాః. ...
ఇత్థం తస్మి ఞ్జితే ప్రాచీం శమయ న్నమయ న్నృపాన్
ఉన్మూలయం శ్చ కఠినా న్నృపా న్వాయు రివ ద్రుమాన్.
ప్రాప చ ప్రబలః ప్రాచ్యం చలద్వీచివిఘూర్ణితం
గఙ్గావజయవిత్రాసవేపమాన మి వామ్బుధిమ్.
తస్య వేలాతటా న్తే చ జయ స్తమ్భం చకార సః
పాతాలాభయయాచ్ఞార్థం నాగరాజ మి వోద్గతమ్.
అవనమ్య కరే దత్తే కలిఙ్గై రగ్రగై స్తతః
ఆరురోహ మహేన్ద్రాద్రిం యశ స్తస్య యశస్వినః.
మహేన్ద్రాభిభవా ద్భీతై ర్విన్ధ్యకూటై రివాగతైః
గజై ర్జిత్వాటవీం రాజ్ఞాం స యయౌ దక్షిణాం దిశమ్.
తత్ర చక్రే స నిస్సారపాణ్డురా నపగర్జితాన్
పర్వతాశ్రయిణః శత్రూ న్శరత్కాల ఇ వామ్బుదాన్.
ఉల్లఙ్ఘ్యమానా కావేరీ తేన సమ్మర్దకారిణా

చోళకేశ్వరకీర్తిశ్చ కాలుష్యం యయతుః సమమ్,
న పరం మురళానాం స సేహే మూర్ధసు నోన్నతిం
కర్ణై రాహన్యమానేషు యాపత్కాన్తారుచే ష్వపి.
యత్తస్య సప్తధా భిన్నం షపు ర్గోదావరీపయః
మాతఙ్గా స్తన్మద వ్యాజాత్ సప్త ధై వాముచన్నివ.
అథో త్తీర్య స వత్సేశో రేవా ముజ్జయినీ మగాత్
ప్రవివేశ చ తామ్ చణ్డమహాసేన పురస్కృతః.
విశ్రమ్య చ నిశాః కాశ్చిత్ప్రీతో వత్సేశ్వర స్తతః
అన్వితః శ్వాశురైః సైన్యైః ప్రయయౌ పశ్చిమాం దిశమ్.
తస్య ఖడ్గలతా నూనం ప్రతాపానల ధూమికా
యచ్చక్రే లాటనారీణా ముదశ్రు కలుషా దృశః.
అసౌ మథితు మమ్భోధిం మా మా మున్మూలయిష్యతి
ఇ తీవ తద్గజాఘాత వనోఽవేపత మన్దరః.
తతః కుబేర తిలకా మలకాసఙ్గశంసినీం
కైలాసహాస సుభగా మాశా మభిససార సః.
సిన్ధు రాజం వశీకృత్య హరిసైన్యై రనుద్రుతః
క్షపయామాస స మ్లేచ్ఛా న్రాఘవో రాక్షసా నివ.
తురుష్కతురగ వ్రాతాః క్షుబ్ధ స్యాబ్ధే రి వోర్మయః
తద్గజేన్ద్రఘటావేలావనేషు దళశో యయుః.
గృహీతారికరః శ్రీమాన్ పాపస్య పురుషోత్తమః
రాహో రివ స చిచ్ఛేద పారసీకపతేః శిరః.
హూణావనికృత స్తస్య ముఖరీకృతదిఙ్ముఖా
కీర్తి ర్ద్వితీయాగఙ్గేవ విచచార హిమాచలే.
నద న్తి ష్వస్య సేనాసు భయ స్తిమితవిద్విషః
ప్రతీపః శుశ్రువే నాదః శైలరన్ధ్రేషు కేవలమ్.
అపచ్ఛత్త్రేణ శిరసా కామరూపేశ్వరోఽర్పితం
నమ న్విచ్ఛాయతాం భేజే యత్తదా న తదద్భుతమ్.
తద్గతై రన్వితో నాగైః సమ్రాడ్ వివవృతేఽథ సః
అద్రిభి ర్జఙ్గమైః శైలైః కరీకృత్యార్పితై రివ.

ఏవః విజిత్య వత్సేశో వసుధాం సపరిచ్ఛదః
పద్మావతీపితుః ప్రాప పురం మగధభూభృతః. ...
తతో మగధ భూభృతా సనగరేణ తే నార్చితః
సమగ్రజన మానసై రనుగతోఽనురాగాగతైః
నిగీర్ణవసుధాతలో బలభరేణ లావాణకం
జగామ విషయం నిజం స కిల వత్సరాజో జయీ. ల. 3 త. 5.

---

మదీయాంధ్ర కథాసరిత్సాగరములో ఇందుల కనువాదము:—

కనుక కార్యసిద్ధికై మంత్రిమండలమును యథావిధిగా సమ్మానించి, దేవా, ధర్మోత్తరమైనసిరిని పొందుటకై దిగ్విజయము చేయుము: ... కాశీరాజు బ్రహ్మదత్తుఁడు నీకు ఎప్పుడును శత్రువు కనుక వానిని ముందుగా జయింపుము. ... అంతట మంచిదినము రాఁగా జయశకునము కాఁగా వత్సరాజు దాడి వెడలి ముందుగా బ్రహ్మదత్తునిమీఁదికి పోయెను. ... అతఁడు వచ్చి ప్రణతుఁడు కాఁగానే వత్సరాజు అతనిని ప్రీతితో సమ్మానించెను; శూరులు నమస్కారప్రియులు గదా. ... ఈప్రకారము అతఁడు జితుఁడు కాఁగానే వత్సరాజు తూర్పును శమింపఁజేయుచు వాయువు చెట్లనుంబోలె మెత్తనిరాజులను వంచుచు కఠినులను పెకలించుచు ప్రబలుఁడై వంగదేశాపజయభయముచే వణంకుచున్న ట్లున్న తూర్పుసముద్రమునకు పోయి దానియొడ్డున పాతాళమున కభయము యాచింపవచ్చిన నాగరాజో యన నొప్పు జయస్తంభమును నాటెను. కాళింగులు ఎదురు వోయి ప్రణమిల్లి కప్పము కట్టఁగా అతనికీర్తి మహేంద్రాద్రి నెక్కినదాయెను. మహేంద్రపరాభవముచేత భయపడి ప్రణమిల్లవచ్చిన వింధ్యశిఖరములో యన రాజులయేనుఁగులు వెంటరా వత్సరాజు అడవిని జయించి దక్షిణదిక్కునకు తిరిగెను. అచ్చట పర్వతాశ్రితు లయినశత్రువులను శరత్కాలము మేఘమునుంబోలె నిస్సారపాండురులనుగాను అపగర్జితులనుగాను చేసెను. సమ్మర్దముతో అతఁడు దాఁటుటచేత కావేరియు చోళరాజుయొక్క కీర్తియు ఏకకాలమందే కలుషములైనవి. అతఁడు మురళదేశస్థుల తలయౌన్నత్యమునుమాత్రమే గాక చేతులతో వక్షస్సును బాదుకొనుచున్న వారి కాంతల కుచౌన్నత్యమును కూడ సహింపఁడాయెను. ఏడుపాయలుగా చీలిన గోదావరి జలమును త్రాగినందుననే కాంబోలు అతనియేనుఁగులు ఆజలమును మద

వ్యాజముచేత ఏడు వోట్లనుండి కార్చినవి. ... పిమ్మట వత్సరాజు రేవానదిని
దాఁటి ఉజ్జయినికి పోఁగా చండమహాసేనుఁడు అతని కెదురువచ్చి తీసికొనిపోయెను...
అచట కొన్నాళ్లు విశ్రమించి వత్సరాజు ప్రీతుఁడయి మామగార్లను సైన్యములును వెంట
రా పడమటిదిక్కునకై దాడి వెడలెను. అతనికత్తి వాస్తవముగా ప్రతాపాగ్నియొక్క
పొగ, కాదేని ఏల యట్లు లాటస్త్రీలనేత్రములను బాష్పపూర్ణములను జేయును?
ఇతఁడు సముద్రమును త్రచ్చుటకై తన్ను పెకలించును అనుభయమునం బోలె మంద
రము ఆతని యేనుంగులతాఁకున కంపిల్లుచుండెను.

పిమ్మట వత్సరాజు కుబేరతిలకయు అలకాసంగశంసినియు కైలాసహాస
సుభగయు నగు నుత్తరదిశను అభిసరించెను. రాఘవుఁడుం బోలె వత్సరాజు సింధు
రాజును వశీకరించి హరిసైన్యములు వెంట రా రాక్షసులనుం బోలె మ్లేచ్ఛులను
నాశము చేసెను. తురుష్కుల గుఱ్ఱపుసమూహములు కలఁగినసముద్రంపుఁదరం
గములువోలె అతనిగజేంద్రసంఘము లనెడు చెలియలికట్టయడవులలో చీలి పోయినవి.
శ్రీమంతుఁ డయిన యాపురుషోత్తముఁడు గృహీతారికరుఁడై రాహువుంబోని పారసీక
రాజుతలను ఖండించి వేసెను. హూణహానికరుఁ డైనయతనికీర్తి దిక్కుల [illegible]
మోఁగించి ఆపరగంగయో యని హిమాచలమందు వ్యాపించెను. భయస్తిమితశత్రు
డైనయతనిసేనల సింహనాదములకు ప్రతినాదము కేవలము గిరిగహ్వరములయందు
ఉద్ఘోషించుచుండెను. అప్పుడు కామరూపేశ్వరుఁడు కూడ ఛత్రశూన్య
మయినశిరస్సుతో నతనికి నమస్కరించి విచ్ఛాయత్వమును పొందుట ఆశ్చర్యము
గాదు. కామరూపేశ్వరుఁడు వత్సరాజున కిచ్చినయేనుఁగులం జూడఁగ
జంగమాద్రులను కరికరించి శైలములు ఇచ్చినవా యనునట్లుండెను.
అట్టియానాగములను కొని యతఁడు మరలి పోయెను.

ఈప్రకారము వత్సరాజు ససైన్యుఁడయి విజయము చేసి మగధ రాజయినపద్మా
వతీజనకుని నగరము చేరెను... జేతయయినవత్సరాజు తన్ను పౌరులందఱితోను మగధరాజు
గౌరవింపఁగా అనురాగాగతము లైనసమస్తజనచిత్తములచేతను అనుగతుఁడై నేల యీని
నయట్లు లెక్కలేని సేనలు వెంటఁగొలుచుచు రాఁగా తన లావాణకమునకు పోయెను.

వేదము వేంకటరాయశాస్త్రి

ఇత్యత్రోక్తం కేదారేణ -

'అనన్తరోదీరితలక్ష్మభాజః పాదా యదీయా ఉపజాతయ స్తాః'     ఇతి.

---

తస్యాః ఖుర న్యాస పవిత్ర పాంసు<br>
మపాంసులానాం ధురి కీర్తనీయా<br>
మార్గం మనుష్యేశ్వర ధర్మపత్నీ<br>
శ్రుతేరి వార్థం స్మృతి రన్వగచ్ఛత్.                2

టీక.—అపాంసులానాం = పతివ్రతలయొక్క, ధురి=ముందఱను, కీర్తనీయా= పొగడఁదగినదైన, మను...త్నీ - మనుష్యేశ్వర=దిలీపమహారాజుయొక్క - ధర్మపత్నీ= సహధర్మచారిణి సుదక్షిణాదేవి, తస్యాః=ఆనందినీ ధేనువుయొక్క, ఖుర...సుం—ఖుర= గొరిజలయొక్క - న్యాస=ఉంచుటలచేత - పవిత్ర = పరిశుద్ధమయిన - పాంసుం = ధూళికలిగినట్టి, మార్గం - దారిని, స్మృతిః = మన్వాదిధర్మశాస్త్రము, శ్రుతేః = వేదముయొక్క, అర్థ మివ=అర్థమునుంబోలె, అన్వగచ్ఛత్ = అనుసరించిపోయెను.

తా.—పతివ్రతలలోః సరేణ్యురాలుగా కొనియాడఁదగినట్టి ఆదిలీపమహారాజు యొక్క ధర్మపత్నియైన సుదక్షిణాదేవి సంపూర్ణ ధేనువుయొక్క గొరిజల త్రొక్కుడువలన పవిత్రిత మయినట్టిధూళిగలదైనదారిని మన్వాదిస్మృతి వేదార్థము ననుసరించువిధమున ననుసరించెను.

వ్యా.—తస్యా ఇతి.— పాంసవో దోషా అసాం స న్తీతి పాంసులాః స్వైరిణ్యః *'స్వైరిణీ పాంసు లే' త్యమరః * 'సిధ్మాదిభ్యశ్చే' తి లచ్ప్రత్యయః - తా న భవ న్తీ త్యపాంసులాః - తాసాం, ధురి అగ్రే, కీర్తనీయా పరిగణనీయా, మనుష్యేశ్వర ధర్మపత్నీ దిలీప ధర్మపత్నీ సుదక్షిణా, ఖురన్యాసైః - పవిత్రపాంసుం, తస్యాం ధేనోః, మార్గం స్మృతిః మన్వాదివాక్యం, శ్రుతే ర్వేదవాక్యస్య - అర్థ మభిధేయమివ, అన్వగచ్ఛత్ అనుసృతవతీ; యథా స్మృతిః శ్రుతిక్షుణ్ణ మే వార్థ మనుసరతి - తథా సాఽపి గోఖుర క్షుణ్ణ మేవ మార్గ మనుససా రే త్యర్థః; * ధర్మపత్నీ త్యత్ర అశ్వఘాసాదివత్ తాదర్థ్యే షష్ఠీసమాసః- ప్రకృతివికార భావాభావాత్.

పాంసులపదవ్యాం వృత్త్యా అపాంసు లేతి విరోధాలంకారో ధ్వన్యతే,

---

నివర్త్య రాజా దయితాం దయాళు<br>
స్తాం సౌరభేయీం సురభి ర్యశోభిః

పయోధరీభూతచతుస్సముద్రాం
జుగోప గోరూపధరామివోర్వీమ్. 3

టీక.—దయాళుః = కృపాళువును, యశోభిః = కీర్తులచేత, సురభిః = మనోహరుఁడును, (అయిన), రాజా = దిలీపమహారాజు, దయితాం=భార్యను, నివర్త్య=వెనుకకు మరలించి, సౌరభేయీం = కామధేనువునకు కూఁతు రయిన, తామ్=ఆనందినీధేనువును, పయో...ద్రాం - పయోధరీభూత = స్తనములుగాసంపన్నములయిన - చతుః= నాలుగు - సముద్రాం=సాగరములుఁగలదయి, గోరూపధరాం-గోరూప=ఆవురూపమును-ధరాం = తాల్చినట్టి, ఉర్వీ మివ = భూమినింబోలె, జుగోప = కాపాడెను.

తా.—కరుణాళువును కీర్తిమనోహరుండు ను అయిన యారాజు దయితయైన ప్రియను వెనుకకు మరలించి అనంతరము ఆకామధేనుపుత్త్రిని, నాలుగు సముద్రములను నాలుగుచన్నులుఁగా పరిణమించిన భూదేవియా యీగోవు, అనునట్లుగా అత్యంతభక్తిశ్రద్ధలతో కాపాడుచుండెను.

వ్యా.—నివర్త్యేతి.—దయాళుః - కారుణికః * 'స్యా ద్దయాళుః కారుణిక' ఇ త్యమరః * 'స్పృహి గృహి' త్యాదినా ఆళుచ్ప్రత్యయః, యశోభిః, సురభిః మనోజ్ఞః * 'సురభిః స్యాన్మనోజ్ఞేఽపి' తి శాశ్వతః, రాజా, దయితాం, నివర్త్య, సౌరభేయీం కామధేనుసుతాం - తాం నన్దినీం, ధర న్తీతి ధరాః * పచా ద్యచ్ - పయసాం ధరాః పయోధరాః స్తనాః * 'స్త్రీస్తనాబ్దౌ పయోధరా వి' త్యమరః - అపయోధరాః పయోధరాః సంపద్యమానా భూతాః పయోధరీభూతాః * 'అభూతతద్భావే చ్విః' * 'కుగతిప్రాదయః' ఇతి సమాసః - పయోధరీభూతా శ్చత్వారః సముద్రాః యస్యా స్తామ్ * 'అనేక మన్యపదార్థే' ఇ త్యనేకపదగ్రహణసామర్థ్యాత్ త్రిపదో బహువ్రీహిః, గోరూపస్య ధరామ్, ఉర్వీం వసుధా మివ * 'వసు ధోర్వీ వసుంధ రే' త్యమరః, జుగోప రరక్ష - భూరక్షణప్రయత్నే నేవ రర క్షేతి భావః * 'గుపూ రక్షణే' ఇతి ధాతోః కర్తరి లిట్.

---

వ్రతాయ తే నానుచరేణ ధేనో ర్న్యషేధి శేషోఽప్యనుయాయివర్గః
న చాన్యత స్తస్య శరీరరక్షా; స్వవీర్యగుప్తా హి మనోః ప్రసూతిః. 4

టీక.—వ్రతాయ=గోసేవావ్రతమునకొఱకు, ధేనోః = ఆవునకు, అనుచరేణ = సాపరియైన, తేన = ఆ రాజుచేత, శేషోఽపి = మిగిలినటువంటి, అనుయాయి వర్గః= అనుయాయి = అనుచరులయొక్క - వర్గః=సమూహము, న్యషేధి = నివారింపఁబడెను, తస్య = ఆతనియొక్క, శరీరరక్షా చ - శరీర = దేహముయొక్క - రక్షా చ=కాపుదల,

అన్యతః = మఱియొకనివలన, న = లేదు, హి = ఏకారణమువలన నదిగా, మనోః = మనువుయొక్క, ప్రసూతిః = సంతతి, స్వ...ప్తా - స్వ = తనదైన - వీర్య = పరాక్రమముచేత - గుప్తా = కాపాడఁబడినది.

తా.—వ్రతార్థమై ఆవుతో కాపరిగా చనుచున్న యారాజు తనకడనున్న మిగతబంటుగమిని కూడ తనతో రానీక వెనుకకు మరలించెను. మఱి యాతని శరీరమునకు ఒరునిచేత రక్షణ లేదు. ఏల యన, మనువంశ్యులు నిజపరాక్రమముచేతనే తమ్ము కాచుకొనువారు.

వ్యా.—వ్రతాయేతి.—వ్రతాయ ధేనోరనుచరేణ - న తు జీవనాయేతి భావః, తేన దిలీపేన, శేషోఽప్యవశిష్టోఽపి, అనుయాయివర్గః అనుచరసంఘః, న్యషేధి నివర్తితః, శేషత్వం సుదక్షిణాపేక్షయా; కథం తర్హ్యాత్మరక్షణ మిత్యత ఆహ-న చేతి - తస్య దిలీపస్య, శరీరరక్షా చ, అన్యతః పురుషాన్తరాత్, న చ; హి యస్మాత్ మనోః, ప్రసూయత ఇతి ప్రసూతిః సంతతిః, స్వ వీర్య గుప్తా స్వ పరాక్రమేణ రక్షితా - న హి స్వపరాక్రమనిర్వాహకస్య పరాపేక్షేతి భావః.

---

ఆస్వాదవద్భిః కబళై స్తృణానాం
కణ్డూయనై ర్దంశ నివారణై శ్చ
అవ్యాహతైః స్వైరగతై శ్చ తస్యాః
సమ్రాట్ సమారాధన తత్పరోఽభూత్. 5

టీక.—సమ్రాట్ = ఆమండలేశ్వరుఁడు, ఆస్వాదవద్భిః = రసవంతములయిన, తృణానాం = పచ్చగడ్డిపోచలయొక్క, కబళైః = గ్రాసములచేతను, కణ్డూయనైః = గోఁకుటలచేతను, దంశ...శ్చ - దంశ = అడవియీఁగలయొక్క - నివారణై శ్చ = తోలుటలచేతను, అవ్యాహతైః = అడ్డగింపఁబడనివైన, స్వైర గతైశ్చ = స్వేచ్ఛాసంచారములచేతను, తస్యాః = ఆధేనువుయొక్క, స...రః - సమారాధన = సేవయందు-తత్పరః = ఆసక్తుఁడు, అభూత్ = ఆయెను.

తా.—మండలాధిపతియైన యారాజు ఆనందినీధేనువునకు రసవంతములయిన పచ్చగడ్డి గ్రాసములు పెట్టుచును, గోఁకుచును, అడవియీఁగలను నివారించుచును, ఇటునటు తోలక పోయినదారినే పోనిచ్చుచును, ఆసక్తితో సేవసేయుచుండెను.

వ్యా.—ఆస్వాదవద్భి రితి.—సమ్రాట్ మణ్డలేశ్వరః-

'యే నేష్టం రాజసూయేన మణ్డల స్యేశ్వర శ్చ యః
శాస్తి య శ్చాజ్ఞయా రాజ్ఞః స సమ్రాట్' ఇత్యమరః, స రాజా,

ఆస్వాదవద్భిః,రసవద్భిః, తృణానాం, కబళైః గ్రాసైః, కణ్డూయనైః, దంశానాం వనమక్షికాణాం,* నివారణైశ్చ 'దంశ స్తు వనమక్షికే' త్యమరః,అవ్యాహతైరప్రతిహతైః, స్వైరగతైః స్వచ్ఛన్దగమనైశ్చ 'తస్యాః, ధేన్వాః, సమారాధనతత్పరః శుశ్రూషాసక్తః, అభూత్-త దేవ పరం ప్రధానం యస్య స తత్పరః * 'తత్పరే ప్రసితాసక్తా' విత్యమరః.

---

స్థితః స్థితా ముచ్చలితః ప్రయాతాం
నిషేదుషీ మాసనబన్ధధీరః
జలాభిలాషీ జల మాదదానాం
ఛాయేవ తాం భూపతి రన్వగచ్ఛత్. 6

టీక.—భూపతిః = దిలీపమహారాజు, తాం = ఆనందినీధేనువును, స్థితాం = నిలుచున్నదానిని, స్థితఃసన్ = నిలుచున్నవాఁడై, ప్రయాతాం = చన్నదానిని, ఉచ్చలితః సన్ = చన్నవాఁడై, నిషేదుషీం = కూర్చున్నదానిని, ఆసన...సన్ - ఆసన= పద్మాసనముయొక్క - బన్ధ = కట్టుటయందు - ధీరః సన్= స్థిరుఁడై, జలం = నీటిని, ఆదదానాం = పుచ్చుకొనుచున్న దానిని, జలా...సన్ - జల=నీటిని-అభిలాషీ సన్= కోరువాఁడై, ఛాయేవ = నీడవలె, అన్వగచ్ఛత్ = వెంబడించెను.

తా.—మఱియు, నారాజు ఆయావును అది నిలుచున్నప్పుడు తాను నిలుచుండుచు, నడచునప్పుడు కూడ నడచుచు, కూర్చున్నప్పుడు కూర్చుండి, నీళ్లుత్రాగుచున్నప్పుడు నీళ్లుత్రాగుచు, ఈప్రకారము నీడవలె అనుసరించియుండెను.

వ్యా.—స్థిత ఇతి.—భూపతిః దిలీపః, తాం గాం, స్థితాం సతీం, స్థితః సన్ స్థితి రూర్ధ్వావస్థానం,ప్రయాతాం ప్రస్థితాం సతీం,ఉచ్చలితఃప్రస్థితః సన్, నిషేదుషీం నిషణ్ణాం సతీమ్-ఉపవిష్టామిత్యర్థః*'భాషాయాం సద వస శ్రువ' ఇతి క్వసుప్రత్యయః *'ఉగిత శ్చే' తి జీప్, ఆసనస్య-బన్ధే ఉపవేశనే-ధీరః స్థిరః - ఉపవిష్టః స న్నిత్యర్థః, జలమ్ ఆదదానాం పిబన్తీం సతీం, జలాభిలాషీ సన్ పిబ న్నిత్యర్థః, ఇత్థం, ఛాయేవ, అన్వగచ్ఛత్, అనుసృతవాన్.

---

సన్న్యస్తచిహ్న మపి రాజ్యలక్ష్మీం తేజోవిశేషానుమితాం దధానః
ఆసీ దనావిష్కృతదానరాజి ర న్తర్మదావస్థ ఇవ ద్విపేన్ద్రః. 7

టీక.—సన్న్య...హ్న-సన్న్యస్త = వదలఁబడిన - చిహ్నమ్ అపి = ఛత్త్రచామరాదిరాజచిహ్నములు కలదయ్యును, తేజో...తాం - తేజోవిశేష = కాంతివిశేషము చేత - అనుమితాం = ఊహింపఁబడినట్టి, రాజ్యలక్ష్మీం = రాజ్యలక్ష్మిని, దధానః =

తాల్చియున్నయారాజు, అనా...జిః - అనావిష్కృత = వెలువరింపఁబడని - దాన = మదముయొక్క - రాజిః = రేఖగలదై, అన్త...స్థః - అన్తః = లోపల నున్న - మద = మదముయొక్క - అవస్థః = దశగలిగిన, ద్విపేన్ద్ర ఇవ = గజశ్రేష్ఠము వలె, ఆసీత్ = ఉండెను.

తా.—ఏనుఁగు, బయిటికి మదరేఖలు ఏర్పడకున్నను, మదమెక్కియున్న దని దాని తేజోవిశేషముచేత తెలియునట్లె, ఆరాజు, గొడుగు వింజామరలు మొదలయిన రాజచిహ్నములను వదలినను, తేజోవిశేషముచేత మహారాజని తోఁచుచుండెను.

వ్యా.—సన్న్యస్తేతి.—సన్న్యస్తాని పరిహృతాని - చిహ్నాని ఛత్త్రచామరాదీని - యస్యా స్తాం తథాభూతా మపి, తేజోవిశేషేణ ప్రభాతిశయేన - అనుమితాం సర్వథా రాజై వాయం భవే దిత్యభ్యూహితాం, రాజ్యలక్ష్మీం, దధానః, స రాజా, అనావిష్కృత దాన రాజిః బహి రప్రకటిత మద రేఖః, అన్త ర్మదావస్థా యస్య స తథాభూతః, ద్విపేన్ద్ర ఇవ, ఆసీత్ అభూత్.

---

లతాప్రతానోద్గ్రథితైః స కేశై
రధిజ్యధన్వా విచచార దావమ్
రక్షాపదేశా న్మునిహోమధేనో
ర్వన్యా న్వినేష్య న్నివ దుష్టసత్త్వాన్. 8

టీక.—లతా ...తైః - లతా = తీఁగలయొక్క - ప్రతాన = వంకరతంతువులచేత - ఉద్గ్రథితైః = ఎత్తికట్టుకొనఁబడిన - కేశైః = తలవెండ్రుకలతో, సః = ఆరాజు, అధిజ్యధన్వా సన్ - అధిజ్య = ఎక్కువెట్టఁబడిన - ధన్వా సన్ = విల్లుగలవాఁడై, ముని...నోః - ముని = వసిష్ఠులవారియొక్క - హోమ = వేలిమిసిమిత్తమయినటువంటి - ధేనోః = ఆవుయొక్క, రక్షాపదేశాత్ - రక్షా = కాపుయొక్క - అపదేశాత్ = మిషవలన, వన్యాన్ = వనమందలి-దుష్టసత్త్వాన్ = చెడ్డ జంతువులను, వినేష్య న్నివ = శిక్షించెడువాఁడువోలె, దావం = అడవిలో, విచచార = తిరిగెను.

తా.—ఆరాజు సన్నపాటి వంకరతీఁగలతో సిగను ఎగఁగట్టుకొని వి ల్లెక్కువెట్టుకొని, వసిష్ఠులవారి హోమధేనువును కాచెడుమిషచేత అడవిలోని దుష్టజంతువులను శిక్షింపనున్నవాఁడుంబోలె అడవిలో తిరుగుచుండెను.

వ్యా.—లతేతి.—లతానాం వల్లీనాం * 'వల్లీ తు వ్రతతి ర్లతా' ఇత్యమరః - తాసాం - ప్రతానైః కుటిలతన్తుభిః - ఉత్ ఉన్నమయ్య గ్రథితాః బద్ధాః-తైః కేశైః

స్తై రుపలక్షితః *'ఇత్థంభూతలక్షణ' ఇతి తృతీయా, స రాజా, అధిజ్య మారోపితమౌర్వీకం - ధను ర్యస్య సో௨ధిజ్యధన్వా సన్ * 'ధనుష శ్చ' త్యనాదేశః, మునిహోమధేనోః, రక్షాపదేశాత్ సంరక్షణవ్యాజాత్, వన్యాన్ వనే భవాన్, దుష్టసత్త్వాన్ దుష్టజన్తూన్ * 'ద్రవ్యాసుత్వ్యవసాయేషు సత్త్వ మస్త్రీ తు జన్తు ష్వి' త్యమరః, వనే ష్వన్ శిక్షయ న్నివ, దావం వనం - విచచార * 'వనే చ వనవహ్నౌ చ దవో దావ ఇ హేమచన్ద్ర' ఇతి యాదవః - వనే సంచచా రే త్యర్థః * 'దేశ కాలాధ్వ గన్తవ్యాః కర్మసంజ్ఞా హ్యకర్మణా మి' తి దావస్య కర్మత్వమ్.

---

విసృష్టపార్శ్వానుచరస్య తస్య
పార్శ్వద్రుమాః పాశభృతా సమస్య
ఉదీరయామాసు రి వోన్మదానా
మాలోకశబ్దం వయసాం విరావైః. ॥

టీక.—విసృష్ట...స్య - విసృష్ట = విడువఁబడిన - పార్శ్వ = ప్రక్కలయం దుండెడు, అనుచరస్య = జనులుకలవాఁడును, పాశభృతా = వరుణునితో, సమస్య = తుల్యుఁడును, (అయిన), తస్య = ఆదిలీపమహారాజుయొక్క, పార్శ్వద్రుమాః - పార్శ్వ = ప్రక్కలయందలి - ద్రుమాః = చెట్లు, ఉన్మదానాం = మదమెక్కిన, వయసాం = పక్షులయొక్క, విరావైః = ధ్వనులచేత, ఆలోకశబ్దం = చూపుటను తెలుపునట్టిశబ్దమును, ఉదీరయామాసు రివ = పలికినవో యనునట్లుండెను.

తా.—పార్శ్వానుచరులను వదలివచ్చిన యాదిలీపమహారాజునకు వరుణతుల్యునికి అడవిలోపార్శ్వవృక్షములుపక్షులరొదచేత ఆయావిశేషములను 'చూడుఁడు-చూడుఁడు' అని యాయనుచరులకు మాఱుగా తామే హెచ్చరిక పలికినవో యనునట్లుండినవి.

వ్యా.—విసృష్టేత్యాదిభిః షడ్భిః శ్లోకై స్తస్య మహామహిమతయా ద్రుమాదయోఽపి రాజోపచారం చక్రు రి త్యాహ-విసృష్టేతి.—విసృష్టాః-పార్శ్వానుచరాః పార్శ్వవర్తినో జనాః - యేన తస్య, పాశభృతా వరుణేన - సమస్య తుల్యస్య - అనేన అనుభావః సూచితః, తస్య రాజ్ఞః, పార్శ్వద్రుమాః, ఉన్మదానా ముత్కటమదానాం, వయసాం ఖగానాం * 'ఖగ బాల్యాదినో ర్వయః' ఇత్యమరః, విరావైః, ఆలోకశబ్దం ఆలోకస్య వాచకం - ఆలోక యేతిశబ్ద మి త్యర్థః, ఉదీరయామాసు రివ అవద న్ని వే త్యుత్ప్రేక్షా.

---

మరుత్ప్రయుక్తాశ్చ మరుత్సఖాభం
త మర్చ్య మారా దభివర్తమానం

అవాకిరన్ బాలలతాః ప్రసూనై
రాచారలాజై రివ పౌరకన్యాః. 10

టీక.—(కిం)చ=మఱియు,మరుత్ ... క్తాః-మరుత్ = గాలిచేత-ప్రయుక్తాః=ప్రేరింపఁబడిన,బాలలతాః=లేఁతతీఁగెలు,ఆరాత్=సమీపమున,అభివర్తమానం=వచ్చుచున్నట్టియు,మరుత్సఖాభం - మరుత్సఖ = అగ్నివలె-ఆభమ్=ప్రకాశించుచున్నట్టియు, అర్చ్యం=పూజ్యుఁడయినట్టియు, తం = ఆదిలీపమహారాజును, ప్రసూనైః=పువ్వులతో, పౌరకన్యాః - పౌర=పట్టణమందలి - కన్యాః=కన్నెలు, ఆచారలాజై రివ - ఆచార=ఆచారార్థమయిన - లాజైరివ = పేలాలతోనుంబోలె, అవాకిరన్ = చల్లినవి.

తా.—లేఁతతీఁగెలు-తమచెంతకు, గాలిచెలికాఁడయిన యగ్నివలె వెలుఁగుచు, పూజ్యుఁడయిన యామహారాజు వచ్చినప్పుడు,గాలియొక్క ప్రేరణచేత అయసప్పై,పౌరకన్యలు ఆచారముప్రకారము పేలాలు చల్లినట్లుగా, - తాము పువ్వులను చల్లినవి.

వ్యా— మరు దితి.—మరు త్ప్రయుక్తాః వాయునా ప్రేరితాః, బాలలతాః, ఆరాత్ సమీపే, అభివర్తమానమ్ * 'ఆరా ద్దూర సమీపయో' రి త్యమరః, మరుతః వాయోః సఖా మరుత్సఖః అగ్నిః - స ఇవ ఆభా దీప్తి మరుత్సఖాభః * 'ఆత శ్చోప సర్గే' ఇతి కప్రత్యయః-తమ్, అర్చ్యం పూజ్యం, తం దిలీపం, ప్రసూనైః పుష్పైః, పౌర కన్యాః పౌర్యశ్చ తాః కన్యాశ్చ పౌరకన్యాః,ఆచారార్థైః లాజైః ఆచారలాజై రివ, అవాకిరన్ తస్యోపరి విక్షిప్తవత్య ఇత్యర్థః సఖాహిసఖాయ మాగత ముపచర తీతిభావః.

---

ధనుర్భృతో ఽప్యస్య దయార్ద్రభావ
మాఖ్యాత మన్తఃకరణై ర్విశఙ్కైః
విలోకయన్త్యో వపు రాపు రక్ష్ణాం
ప్రకామవిస్తారఫలం హరిణ్యః. 11

టీక.—ధనుర్భృతో ఽపి - ధనుః = వింటిని - భృతో ఽపి=తాల్చియున్నవాఁడైనను, అస్య=ఈమహారాజుయొక్క, దయార్ద్రభావం - దయా = కరుణారసముచేత-ఆర్ద్ర = తడిసిన - భావం = హృదయము కలిగినదిగా, విశఙ్కైః = భయములేనివయిన, అన్తఃకరణైః = మనస్సులచేత, ఆఖ్యాతం = చెప్పఁబడిన, వపుః=శరీరమును, విలోకయన్త్యః = చూచుచు, హరిణ్యః = పెంటిజింకలు, అక్ష్ణాం = కన్నులయొక్క, ప్ర...లం—ప్రకామ = అత్యంతమయిన - విస్తార = విశాలతయొక్క - ఫలం= ప్రయోజనమును, ఆపుః = పొందినవి.

తా.—ఆరాజు చేతిలో విల్లు ఉన్నను,తమకు భయము కలుగనందున,ఆతని యం

త్వకరణము దయారసార్ద్రమని తలంచుకొని యడవిలోని పెంటిజింకలు, ఆతని మేనిని తనివితీఱ చూచుచు తమకు అంతలేని పెద్దకన్నులున్నందునకు ఫలమును అనుభవించినవి.

వ్యా.—ధనుర్భృత ఇతి.—ధనుర్భృతోఽప్యస్య రాజ్ఞః - వితేన భయసంభావనా దర్శితా, తథాఽపి వికశైః సిగ్ధైః,అన్తఃకరణైః కర్తృభిః, దయయా కృపారసేన- ఆర్ద్రః సిక్తః - భావోఽభిప్రాయో యస్య తత్ దయార్ద్రభావం-తత్, ఆఖ్యాతం దయార్ద్రభావ మేత దిత్యాఖ్యాత మి త్యర్థః * 'భావః సత్తా స్వభా వాభిప్రాయ చేష్టాత్మజన్మ స్వి' త్యమరః- తథావిధం, వపుః, విలోకయన్త్యః హరిణ్యః, అక్ష్ణాం, ప్రకామవిస్తార స్యాత్యన్తవిశాలతాయాః - ఫలం హేతుకృతం * 'సస్యే హేతుకృతే ఫల మి'త్యమరః, ఆపుః*'విమలం కలుషీభవ చ్చ చేతః కథయ త్యేవ హితైషిణం రిపుం వా' ఇతిన్యాయేన స్వాన్తఃకరణవృత్తిప్రామాణ్యాదేవ విస్రబ్ధం దదృశు రి త్యర్థః.

---

స కీచకై ర్మారుతపూర్ణ రన్ధ్రైః కూజద్భి రాపాదితవంశకృత్యం
శుశ్రావ కుఞ్జేషు యశః స్వ ముచ్చై రుద్గీయమానం వనదేవతాభిః. 12

టీక.—సః = ఆదిలీపమహారాజు, మా...న్ధ్రైః-మారుత=గాలిచేత - పూర్ణ= నింపఁబడిన, రన్ధ్రైః = పగుళ్లుకలవి గనుకనే, కూజద్భిః=ధ్వనించుచున్న, కీచకైః = బొంగువెదుళ్లచేత, ఉచ్చైః = గట్టిగా, ఆ...త్యం యథాతథా—ఆపాదిత = సమకూర్పఁబడిన - వంశ = పిల్లనగ్రోవియొక్క-కృత్యం యథా తథా = కార్యముకలుగునట్లుగా, కుఞ్జేషు = పొదరిండ్లయందు, వనదేవతాభిః = వనదేవతలచేత, ఉద్గీయమానం = పై స్థాయిలో పాడఁబడుచున్న, స్వం = తనదయిన, యశః = కీర్తిని, శుశ్రావ = వినెను.

తా.—ఆమహారాజు బొంగువెదుళ్ల పగుళ్లగుండ గాలి ప్రసరించుటచేత కలిగిన మ్రోతయే పిల్లనగ్రోవి యూఁదుటగా నుపయోగపడుచుండఁగా పొదరిండ్లలో వనదేవతలు గాంధారగ్రామంబున తనకీర్తినే పాడుచుండఁగా వినెను.

వ్యా.—స ఇతి.—స దిలీపః, మారుతేన వాయునా - పూర్ణాని పూరితాని-రన్ధ్రాణి యేషాం తై స్తథోక్తైః, అత ఏవ కూజద్భిః స్వనద్భిః - కీచకైః వేణువిశేషైః *'వేణవః కీచకాస్తే స్యు ర్యే స్వనన్త్యనిలోద్ధతా'ఇత్యమరః, ఉచ్చైః, ఆపాదితం సంపాదితం-వంశః సుషిరవాద్యవిశేషః * 'వంశాదికం తు సుషిరమి' త్యమరః - వంశస్య-కృత్యం కార్యం యస్మిన్ కర్మణి త ద్యథా భవతి తథా, కుఞ్జేషు లతాగృహేషు * 'నికుఞ్జకుఞ్జౌ వా క్లీబే లతాదిపిహితోదరే' ఇత్యమరః, వనదేవతాభిః, ఉద్గీయమానమ్ ఉచ్చై ర్గీయమానం, స్వం స్వకీయం; యశః కీర్తిం, శుశ్రావ శ్రుతవాన్.

---

పృక్తస్తుషారైర్గిరినిర్ఝరాణా మనోకహాకమ్పితపుష్పగన్ధీ
తమాతపక్లాన్త మనాతపత్ర మాచారపూతం పవనః సిషేవే. 13

టీక.—గిరినిర్ఝరాణాం = సెలయేళ్లయొక్క, తుషారైః = తుంపురులచేత, పృక్తః = తడుపఁబడినదియు, అనో...న్ధీ—అనోకహ = చెట్లయొక్క-ఆకమ్పిత = కొంచెము కదలింపఁబడిన - పుష్ప = పువ్వులయొక్క - గన్ధీ= తావిగలదియు, (అయిన), పవనః = గాలి, అనాతపత్రం = గొడుగులేనివాఁడై, ఆతపక్లాన్తమ్ - ఆతప = ఎండచేత - క్లాన్తం = బడలినవాఁడును, ఆచారపూతమ్ - ఆచార = మంచినడవడిచేత-పూతం = పవిత్రుఁడును, (అయిన), తం = ఆదిలీపమహారాజును, సిషేవే = సేవించెను.

తా.—సదాచారముచేత పవిత్రుఁడయిన యాదిలీపమహారాజు వ్రతనియమముచే గొడుగు దాల్పనందున ఎండకు బడలినప్పుడు, గాలి సెలయేళ్ల తుంపురుల చలువతోను చెట్లలో కొంచెము కదల్పఁబడిన పువ్వుల తావిలోను ఆయనను సేదదేర్చుచుండెను.

వ్యా.—పృక్త ఇతి—గిరిషు నిర్ఝరాణాం శైల నదీప్రవాహాణాం * 'ప్రవాహో నిర్ఝరో ఝరః' ఇత్యమరః, తుషారైః శీకరైః * 'తుషారౌ హిమశీకరౌ' ఇతి శాశ్వతః, పృక్తః సంపృక్తః, అనోకహానాం వృక్షాణామ్ - ఆకమ్పితాని ఈషత్కమ్పితాని - యాని పుష్పాణి తేషాం యో గన్ధః సోఽస్యాస్తీతి తథోక్తః-ఈషత్కమ్పిత పుష్పగన్ధవాన్, ఏవం శీత మన్ద సురభిః - పవనః వాయుః, అనాతపత్రం వ్రతార్థం పరిహృతచ్ఛత్రమ్, అత ఏవ, ఆతప క్లాన్తమ్-ఆతపేన సూర్యతేజసా-క్లాన్తం ఖిన్నమ్ ఆచార పూతమ్ ఆచార శుద్ధం, తం దిలీపం, సిషేవే; ఆచారపూతత్వాత్ స రాజా జగత్పవన స్యాపి పవనస్య సేవ్య ఆసీ దితి భావః.

---

శశామ వృష్ట్యాఽపి వినా దవాగ్ని రాసీ ద్విశేషా ఫలపుష్పవృద్ధిః,
ఊనం న సత్త్వేష్వధికో బబాధే తస్మి న్వనం గోప్తరి గాహమానే. 14

టీక.—గోప్తరి = రక్షకుఁడయిన, తస్మిన్ = ఆదిలీపమహారాజు, వనం=అడవిని, గాహమానే సతి = చొచ్చుచుండఁగా, వృష్ట్యా వినా అపి = వాన లేకయే, దవాగ్నిః = కార్చిచ్చు, శశామ = చల్లారెను; ఫల...ద్ధిః — ఫల = పండ్లయొక్కయు - పుష్ప=పువ్వులయొక్కయు - వృద్ధిః= పెంపు, విశేషా= హెచ్చుచేయఁబడినది, ఆసీత్ = ఆయెను, సత్త్వేషు = జంతువులలోపల, అధికః = ఎక్కువది, ఊనం=తక్కువదానిని, న బబాధే = బాధింపదాయెను.

తా.—రక్షకుఁడయిన యామహారాజు అడవిలో అడుగుపెట్టఁగానే, వానలేక

యే కార్చిచ్చు చల్లారినది చెట్లయొక్క పూంతయు కాపును అధిక మయినవి, పులి మొదలయిన ప్రబలజంతువులు లేడి మొదలయిన దుర్బలజంతువులను హింసించుట మానినవి.

వ్యా.—శశా మేతి.— గోప్తరి రక్షకే, తస్మిన్ రాజ్ఞి, వనం, గాహమానే ప్రవిశతి సతి, వృష్ట్యా వినాఽపి, దవాగ్నిః, శశామ శాన్తిం ప్రాప, ఫలానాం పుష్పాణాం చ వృద్ధిః, విశిష్యత ఇతి విశేషా అతిశయితా ఆసీత్ * కర్మార్థే ఘఞ్ప్రత్యయః, సత్త్వేషు జన్తుషు మధ్యే * 'యతశ్చ నిర్ధారణ మి' తి సప్తమీ, అధికః ప్రబలో వ్యాఘ్రాదిః, ఊనం దుర్బలం హరిణాదికం, న బబాధే న పీడయతి స్మ.

---

సంచారపూతాని దిగన్తరాణి కృత్వా దినాన్తే నిలయాయ గన్తుం
ప్రచక్రమే పల్లవరాగతామ్రా ప్రభా పతఙ్గస్య మునేశ్చ ధేనుః 15

టీక.—పల్లవ...మ్రా—పల్లవ = చిగురుటాకులయొక్క, రాగ = ఎఱుపువలె, తామ్రా = ఎఱ్ఱనైన, పతఙ్గస్య = సూర్యునియొక్క, ప్రభా = కాంతియు, మునేః = వసిష్ఠులవారియొక్క, ధేను శ్చ = ఆవును, దిగన్తరాణి- దిక్ = దిక్కులయొక్క-అన్తరాణి = ఎడములను, సం...ని - సంచార = తిరుగుటచేత- పూతాని = పవిత్రములనుగా, కృత్వా = చేసి, దినాన్తే = సాయంకాలమందు, నిలయాయ = క్రుంకుటకు - ఇంటికిని, గన్తుం = పోవుటకు, ప్రచక్రమే = ఆరంభించెను.

తా.—ఇంతలో సాయంకాల మాయెను. అంతట, చిగురుటాకులవలె ఎఱుపయినట్టివి, తాము సంచరించుటచే దిక్కులయవకాశములను పవిత్రీకరించినట్టివి,సూర్యునికాంతియు మునీంద్రునియావును, కాంతి క్రుంకుటకును, ఆవు ఇంటికేగుటకును తొడంగినవి.

వ్యా.—సంచా రేతి.—పల్లవస్య రాగో వర్ణః పల్లవరాగః * 'రాగోఽనురాగే మాత్సర్యే క్లేశాదౌ లోహితాదిష్వి' తి శాశ్వతః-స ఇవ-తామ్రా పల్లవరాగతామ్రా పతఙ్గస్య సూర్యస్య, ప్రభా కాన్తిః * 'పతఙ్గః పక్షిసూర్యయో' రితి శాశ్వతః, మునేః ధేనుశ్చ,దిగన్తరాణి దిశా మవకాశాన్ * అన్తర మవకాశావధి పరిధానాన్తర్ధిభేద తాదర్థ్యే' ఇ త్యమరః, సంచారేణ - పూతాని శుద్ధాని, కృత్వా, దినాన్తే సాయంకాలే,నిలయాయ అస్తమయాయ - ధేనుపక్షే ఆలయాయ చ, గన్తుం ప్రచక్రమే.

---

తాం దేవతాపిత్రతిథిక్రియార్థా మన్వగ్యయౌ మధ్యమలోకపాలః
బభౌ చ సా తేన సతాం మతేన శ్రద్ధేవ సాక్షాద్విధి నోపపన్నా. 16

టీక.—మధ్య...లః.—మధ్యలోక = భూలోకమును - పాలః = ఏలుచున్న దిలీపమహారాజు, దేవతా...ర్థాం— దేవతా = వేల్పులయొక్కయు-పితృ = పితరుల

యొక్కయు - అతిథి = అభ్యాగతులయొక్కయు - క్రియా = కార్యములే - అర్థాం = ప్రయోజనముగాఁగలిగిన, తామ్ = ఆయావును, అన్వక్ = అనుసరించి, యయౌ = చనియెను, సతాం = సాధువులచేత, మతేన = గౌరవింపఁబడుచున్నట్టి, తేన = ఆరాజు తోడ, ఉపపన్నా = కూడుకొన్నదై, సా చ = ఆయావును, సతాం = సాధువులకు, మతేన = సమ్మతమయిన, విధినా = అనుష్ఠానముతో, ఉపపన్నా = కూడుకొన్నదై, సాక్షాత్ = ప్రత్యక్షముగానున్న, శ్రద్ధేవ = ఆస్తిక్యబుద్ధివలె, బభౌ=ప్రకాశించెను.

. తా.—భూలోకపాలకుఁ డయిన యాదిలీపమహారాజు దేవతాపితృతిథులకొఱకు యాగ శ్రాద్ధ సంతర్పణములను క్షీరాదికములచే నెఱవేర్చునదైన యానందినీధేనువు వెంబడి నేఁగెను. సాధువులచే గౌరవింపఁబడుచున్న యారాజుతో కూడుకొన్న యాధేనువు పెద్దలకు సమ్మత మైన యనుష్ఠానముతో కూడుకొన్నయాస్తిక్యబుద్ధివలె ప్రకాశించుచుండెను.

వ్యా.—తా మితి.—మధ్యమలోకపాలః భూపాలో దిలీపః దేవతా పి తృతిథీనాం క్రియాః యాగ శ్రాద్ధ దానాని-తా ఏవ అర్థః ప్రయోజనం యస్యాస్తాం ధేనుమ్,అన్వక్ అనుపదం, యయౌ; సతాం మతేన సద్భిః సమ్మాన్యమానేన * 'గతిబుద్ధి' త్యాదినా వర్తమానే క్తః * 'క్తస్య చ వర్తమాన' ఇతి షష్ఠీ - తేన రాజ్ఞా, ఉపపన్నా యుక్తా, సా ధేనుః, సతాం మతేన, అనుష్ఠానేన, ఉపపన్నా, శ్రద్ధా ఆస్తిక్యబుద్ధి గివ బభౌ.

---

స పల్వలోత్తీర్ణవరాహ యూథా
న్యావాస వృక్షోన్ముఖ బర్హిణాని
యయౌ మృగాధ్యాసితశాద్వలాని
శ్యామాయమానాని వనాని పశ్యన్. 17

టీక.—సః = ఆదిలీపమహారాజు, పల్వ...ని - పల్వల = పడియల నుండి - ఉత్తీర్ణ = వెలువడిన - వరాహ = పందులయొక్క - యూథాని = మందలుఁగలిగినట్టి యు, ఆవాస...ని - ఆవాస = ఉనికిపట్టులయిన - వృక్ష = చెట్లకు - ఉన్ముఖ = అభిముఖములయిన - బర్హిణాని = నెమళ్లు కలిగి నట్టియు, మృగా...ని - మృగ = జింకల చేత - అధ్యాసిత = అధివసింపఁబడిన - శాద్వలాని = పచ్చిక బయళ్లు కలిగినట్టియు, శ్యామాయమానాని = నల్ల నగు చున్నట్టియు, వనాని = అడవులను, పశ్యన్=చూచుచు, యయౌ = వెళ్లెను.

తా.—ఆసమయమందు, అడవులలో పందుల మందలు పడియలనుండి వెలువడినవి, నెమళ్లు తమ నివాసవృక్షములమీఁదికి ఎగసి వచ్చుచుండినవి, పచ్చికమైదానములలో జింకలు కదుపులుగట్టుచుండినవి; ఆ పందులచేతను నెమళ్లచేతను కృష్ణసారముల చేతను అడవులు నల్లఁబడుచుండినవి; ఆ వినోదముల నెల్లఁ గాంచుచు నారాజు వెళ్లెను.

వ్యా.— స ఇతి.— స రాజా, పల్వలేభ్యః అల్పజలాశయేభ్యః - ఉత్తీర్ణాని నిర్గతాని - వరాహాణాం - యూథాని కులాని - యేషు తాని, బర్హాణ్యేషాం సన్తీతి బర్హిణాః మయూరాః * 'మయూరో బర్హిణో బర్హీ' త్యమరః * 'ఫలబర్హాభ్యామినజ్వక్తవ్య' ఇతి మత్వర్థీయ ఇనచ్ప్రత్యయః, ఆవాసవృక్షోన్ముఖాః బర్హిణాః యేషు తాని, శాదాః బాలతృణాని ఏషు సన్తీతి శాద్వలాః శష్పశ్యామా దేశాః * 'శాద్వలః శాదహరిత' ఇత్యమరః * 'శాదః కర్దమశష్పయో రి' తి విశ్వః * 'నడశాదాడ్డ్వల జి' తి డ్వలచ్ప్రత్యయః - మృగై - రధ్యాసితా అధిష్ఠితాః - శాద్వలా యేషు తాని, శ్యామాయమానాని వరాహ బర్హిణాధిక్య మహిమ్నా శ్యామాని భవన్తి * భృశాదిత్వాత్ క్యఙ్ప్రత్యయః - తాని, వనాని పశ్యన్, యయౌ.

---

ఆపీనభారోద్వహనప్రయత్నాద్గృష్టి, ర్గురుత్వా ద్వపుషో నరేన్ద్రః[18]
ఉభా వలఞ్చక్రతు రఞ్చితాభ్యాం తపోవనావృత్తిపథం గతాభ్యామ్.

టీక.—గృష్టిః=ఒక యీఁత యీనయిన నందినియు, నరేన్ద్రశ్చ = దిలీపమహారాజును, ఉభౌ = ఇరువురును, ఆపీన...త్ - ఆపీన = పొదుగుయొక్క - భార - బరువుయొక్క - ఉద్వహన = మోఁతయందు - ప్రయత్నాత్ = ప్రయాసవలనను, వపుషః = దేహముయొక్క, గురుత్వాత్ చ = గౌరవమువలనను, అఞ్చితాభ్యాం = సొంపయిన, గతాభ్యాం = నడకలచేత, తపో...థం - తపోవన = ఆశ్రమమునకు - ఆవృత్తి పథం = అడవినుండి మరలి వచ్చెడు త్రోవను, అలంచక్రతుః = భూషించిరి.

తా.—ఒంటి యీఁతదైన యీనందినియు, ఆజానుబాహువయిన యీ దిలీపుఁడును, ఇరువురును, (ఆవు) బరువయిన పొదుగును మోచు ప్రయత్నమువలనను, (రాజు) దేహగౌరవమువలనను, అందము లయిన తమ నడకలచేత, అడవినుండి తపోవనమునకు మరలివచ్చునట్టి దారిని శోభింపఁజేసిరి.

వ్యా.—ఆపీనేతి —గృష్టిః సకృత్ప్రసూతా గౌః * 'గృష్టిః సకృత్ప్రసూతా గౌః' ఇతి హలాయుధః, నరేన్ద్రశ్చ, ఉభౌ, యథాక్రమమ్, ఆపీన మూధః * 'ఊధస్తు క్లీబ మాపీనమ్' ఇత్యమరః - ఆపీనస్య భారోద్వహనే - ప్రయత్నాత్ ప్రయాసాత్, వపుషో, గురుత్వా దాధిక్యా చ్చ, అఞ్చితాభ్యాం చారుభ్యాం, గతాభ్యాం గమనాభ్యాం, తపోవనా దావృత్తేః పన్థాస్తం తపోవనావృత్తిపథం * 'ఋక్పూరబ్ధూః' రి' త్యాదినా సమాసాన్తోఽప్రత్యయః, అలంచక్రతు ర్భూషితవన్తౌ.

---

వసిష్ఠధేనో రనుయాయినం త మావర్తమానం వనితా వనాన్తాత్
పపౌ నిమేషాలసపక్ష్మపఙ్క్తి రుపోషితాభ్యా మివ లోచనాభ్యామ్.19

టీక.—వసిష్ఠధేనోః. - వసిష్ఠ = వసిష్ఠులవారి యొక్క - ధేనోః = ఆవుసకు, అనుయాయినం = అనుచరుఁడై, వనాన్తాత్ = అడవిప్రదేశమునుండి, ఆవర్తమానం= మరలి వచ్చుచున్నట్టి, తం = ఆదిలీప మహారాజు, వనితా = అత్యంతానురక్త యైన సుదక్షిణాదేవి, నిమేషా... క్తిః సతీ - నిమేష=ఱెప్పపాటులవేశ - అలస = హీనమ యిన-పక్ష్మ = ఱెప్పవెండ్రుకలయొక్క - పఙ్క్తిః సతీ = వరుసగలదియై, లోచనాభ్యాం = కన్నులచేత, ఉపోషితాభ్యా మివ = ఉపవాసముచేసిన వానిచేతనుం బోలె, పపౌ = త్రాగెను.

తా.—నందిసితో అడవినుండి వచ్చుచున్న దిలీపమహారాజును మిక్కిలి యను రక్తురాలయిన సుదక్షిణాదేవి, తనకన్నులు - ఉపవాసము చేసినవారు పెనుదప్పిచేత ఆదరబాదరగా మిక్కుటముగా నీళ్లుత్రాగెడు విధంబున - అతనిం ద్రాగివైచుచున్నవా యనునట్లు, ఱెప్పవాల్పక తమితో చూచినది.

వ్యా.—వసి ష్ఠేతి.—వసిష్ఠధేనోః నన్దిన్యాః, అనుయాయిన మనుచరం, వనాన్తాత్, ఆవర్తమానం ప్రత్యాగచ్ఛన్తం, తం దిలీపం, వనితా జనితాత్యన్తానురాగా సుదక్షిణా*'వనితా జనితాత్యర్థానురాగాయాం చ యోషితి' త్యమరః, నిమేషేణ- అలసా మన్దా-పక్ష్మణాం పఙ్క్తి ర్యస్యా స్సా-నిమేషరహితా స తీ త్యర్థః, లోచనాభ్యామ్, ఉపోషితాభ్యా మివ - ఉపవాసో భోజననివృత్తిః - తం కృతవద్భ్యా మివ*వసతేః కర్తరి క్తః, పపౌ; యథా ఉపోషితో ఽతితృష్ణయా జలాదిక మధికం పిబతి త ద్వ దతి తృష్ణయా సా సుదక్షిణా దిలీప మధికం వ్యలోకయ ది త్యర్థః.

---

పురస్కృతా వర్త్మని పార్థివేన
ప్రత్యుద్గతా పార్థివధర్మపత్న్యా
తదన్తరే సా విరరాజ ధేను
ర్దినక్షపామధ్యగ తేవ సంధ్యా. 20

టీక.—వర్త్మని = దారిలో, పార్థివేన = రాజుచేత, పురస్కృతా = ముందు ఉంచుకొనఁబడినదియు, పార్థివ... త్న్యా-పార్థివ=రాజుయొక్క, ధర్మపత్న్యా= సహధర్మచారిణి యైన సుదక్షిణాదేవిచేత, ప్రత్యుద్గతా = ఎదుర్కొనఁబడినదియు, అయిన, సా ధేనుః = ఆ యావు, తదన్తరే - తత్ = ఆసుదక్షిణా దిలీపుల యొక్క- అన్తరే = మధ్యలో, దిన... తా - దిన=పగటికిని - క్షపా = రాత్రికిని - మధ్య=నడిమి కాలమును-గతా=పొందిన, సంధ్యేవ = సంధ్యాకాలము వలె, విరరాజ=ప్రకాశించెను.

తా.—దారిలో వెంట వచ్చుచున్న రాజునకును,ఎదురుగా వచ్చుచున్న సుదక్షి

ణాదేవికిని, నడుమ, ఆనందినీ ధేనువు, పగటికిని రాత్రికిని నడుమను సంధ్యవలె ప్రకాశించు చుండెను.

వ్యా.—పురస్కృ తేతి.—వర్త్మని మార్గే, పార్థివేన పృథివ్యా ఈశ్వరేణ దిలీ పేన * 'త స్యేశ్వర' ఇ త్యణ్ప్రత్యయః, పురస్కృతా అగ్రతః కృతా, ధర్మస్య పత్నీ ధర్మపత్నీ ధర్మార్థాప త్నీ త్యర్థః * అశ్వఘాసాదివ త్తాదర్థ్యే షష్ఠీసమాసః - తయా. పార్థివస్య ధర్మపత్న్యా చ.ప్రత్యుద్గతా అభిముఖీకృతా, సా ధేనుః - తదన్తరే-తయో ర్దమ్పత్యో - ర్మధ్యే, దినక్షపయో ర్దినరాత్ర్యోః - మధ్యగతా, సంధ్యేవ, విరరాజ; పూర్వార్థే నైవ తదన్తరవర్తిత్వే సిద్ధేపునః 'తదన్తర'ఇతి గ్రహణ ము భయోప మేయోప మానయోః క్రమావస్థానమాత్ర సాదృశ్య వివక్షార్థ మితి మన్తవ్యమ్.

---

ప్రదక్షిణీకృత్య పయస్వినీం తాం
సుదక్షిణా సాక్షతపాత్రహస్తా
ప్రణమ్య చానర్చ విశాల మస్యాః
శృఙ్గాన్తరం ద్వార మి వార్థసిద్ధేః. 21

టీక.—సాక్షతపాత్రహస్తా = సాక్షతపాత్ర=అక్షతలగిన్నెతోడి - హస్తా = చేయికలదైన, సుదక్షిణా = సుదక్షిణాదేవి, పయస్వినీం = మిక్కుటముగా పాలు కలదైన, తాం = ఆనందినీధేనువును, ప్రదక్షిణీకృత్య = వలగొని, ప్రణమ్య చ = నమ స్కరించియు, అస్యాః = ఈయావుయొక్క, విశాలం = వెడల్పయిన, శృఙ్గాన్తరం- శృఙ్గ = కొమ్ములయొక్క-అన్తరం=నడిమియెడమును, అర్థసిద్ధేః= కార్యసిద్ధియొక్క- ద్వార మివ = వచ్చెడు దారినింబోలె, ఆనర్చ = పూజించెను.

తా.—అక్షతలగిన్నెను చేతఁబెట్టుకొని సుదక్షిణాదేవి నిండుగా పాలుగల యా నందినీధేనువునకు ప్రదక్షిణ నమస్కారములుచేసి, దానికొమ్ములనడిమి విశాలప్రదేశమును తన కార్యసిద్ధి వచ్చెడుమార్గము నో యనునట్లుగా పూజించెను.

వ్యా.—ప్రదక్షిణేకృత్యేతి.—అక్షతానాం పాత్రే ణసహ వర్తత ఇతి సాక్ష తపాత్రః - తాదృశో హస్తో యస్యాః సా, సుదక్షిణా, పయస్వినీం ప్రభూతక్షీరాం, తాం ధేనుం, ప్రదక్షిణీకృత్య, ప్రణమ్య చ, అస్యాః ధేనోః, విశాలం శృఙ్గాన్త రం శృఙ్గమధ్యమ్, అర్థసిద్ధేః కార్యసిద్ధేః, ద్వారం ప్రవేశమార్గమివ, ఆనర్చ అర్చ యామాస * 'అర్చ పూజాయామ్' * అర్చతేః భ్వాదికా ల్లిట్ * 'లిటిధాతో రి' త్యాదినా ద్విత్వం * 'తస్మా న్నుడ్' ఇత్యాదినా నుడాగమః.

---

తద్రక్ష కల్యాణపరమ్పరాణాం
భోక్తార మూర్జస్వల మాత్మదేహం
మహీతలస్పర్శనమాత్రభిన్న
మృద్ధం హి రాజ్యం పద మైన్ద్ర మాహుః. 50

టీక.—తత్ = ఆకారణమువలన, కల్యాణ...ణాం—కల్యాణ = మంగళముల యొక్క - పరమ్పరాణాం = వరుసలను, భోక్తారం = అనుభవించునదై, ఊర్జస్వలమ్= బలముకలదైన, ఆత్మదేహమ్ - ఆత్మ = నీయొక్క - దేహం = ఒడలిని, రక్ష = కాపాడుకొనుము; ఋద్ధం = సమృద్ధమయిన, రాజ్యం = దొరతనమును, మహీ...న్నం—మహీతల = భూప్రదేశముయొక్క - స్పర్శనమాత్ర = తాకుడుచేతమాత్రమే, భిన్నమ్ = వేఱయిన, ఐన్ద్రం = ఇంద్రునిదైన, పదం = స్థానమునుగా, ఆహుః = చెప్పుదురు.

తా.—కావున,శుభపరంపరలను అనుభవించునదైన నీబలిష్ఠదేహమును కాపాడుకొమ్ము. ఈయావు నుపేక్షించిన దోషము నిన్ను స్వర్గమునకుఁ బాపు నని వెఱతువేని, వినుము; సకల సంపదలతో నిండిన భూమిరాజ్యము ఇంద్రపదవియే యనియు, ఇది భూలోకమం దుండుటయే దీనికిని దానికిని గల భేద మనియు పెద్దలు చెప్పుదురు.

వ్యా.—త దితి.—తత్ తస్మాత్ కారణాత్,కల్యాణపరమ్పరాణాం భోక్తారం * కర్మణి షష్ఠీ, ఊర్జో బల మస్యా స్తీ త్యూర్జస్వలం * 'జ్యోత్స్నా తమి స్రే' త్యాదినా వలచ్ప్రత్యయాన్తో నిపాతః, ఆత్మదేహం రక్ష; నను గా ముపేక్ష్య ఆత్మదేహరక్షణే స్వర్గహానిః స్యా ది త్య త్రాహ; మహీత లేతి - ఋద్ధం సమృద్ధం రాజ్యం మహీతలస్పర్శనమాత్రేణ భూతలసంబన్ధమాత్రేణ - భిన్నమ్, ఐన్ద్రమ్ ఇన్ద్ర సంబన్ధి - పదం స్థానమ్, ఆహుః - స్వర్గా న్న భిద్యత ఇత్యర్థః.

---

ఏతావ దుక్త్వా విరతే మృగేన్ద్రే
ప్రతిస్వనే నాస్య గుహాగతేన
శిలోచ్చయోఽపి క్షితిపాల ముచ్చైః
ప్రీత్యా త మే వార్థ మభాష తేవ. 51

టీక.—మృగేన్ద్రే = సింహము, ఏతావత్ = ఇంతమాత్రము, ఉక్త్వా=చెప్పి, విరతే సతి = ఊరకయుండఁగా, గుహాగతేన - గుహా = గుహలనుండి - ఆగతేన = వచ్చిన, అస్య = ఈసింహముయొక్క, ప్రతిస్వనేన = మాఱుమ్రోఁతచేత, శిలోచ్చ

యో౽పి = పర్వతముసయితము, ప్రీత్యా=ప్రేమచేత, క్షితిపాలం=రాజునకు, త మర్థ మేవ = ఆయభిప్రాయమునే, ఉచ్చైః = బిగ్గరగా, అభాష తేవ=చెప్పెనో యన్న ట్లుండెను.

తా.—ఇంతమాత్రము పలికి సింహము విరమింపఁగానే,గుహనుండి వచ్చిన ప్రతిధ్వనిచేత హిమవంతుఁడు సయితము ప్రేమతో రాజునుగూర్చి ఆయుపదేశమునే బిగ్గరగా బలికెనో యనున ట్లుండెను.

వ్యా.—ఏతావ దితి.—మృగేన్ద్రే సింహే,ఏతావ దుక్త్వా విరతే,గుహాగతేన, అస్య సింహస్య ప్రతిస్వనేన, శైలో౽పి ప్రీత్యా క్షితిపాలం త మే వార్థ ముచ్చైః అభాష తే వే త్యుత్ప్రేక్షా * భాషి ఠి త్యయం బ్రూఞ్ ధాతోః సమానార్థకత్వా ద్ద్వికర్మకః - బ్రూఞ్ ధాతు స్తు ద్వికర్మకేషు పఠితః; తదుక్తం-

'దు హ్యా చ్ప చ్ద ణ్డ్రుధి ప్రచ్ఛి చిఞ్ బ్రూఞ్ శాసు జి మ థ్మ్ముషాం
కర్మయుక్ స్యా దకథితం తథా స్యా న్నీహృకృష్వహామ్.' ఇతి.

---

నిశమ్య దేవానుచరస్య వాచం
మనుష్యదేవః పున ర ప్యువాచ
ధేన్వా తదధ్యాసితకాతరాక్ష్యా
నిరీక్ష్యమాణః సుతరాం దయాళుః. 52

టీక.—దేవానుచరస్య - దేవ = పరమేశ్వరునికి - అనుచరస్య = కింకరుఁడైన సింహముయొక్క, వాచం = మాటను, నిశమ్య = విని, మనుష్యదేవః - మనుష్య = నరులకు-దేవః= దొరయయిన దిలీపమహారాజు, త.ద...క్ష్యా—తత్ = ఆసింహముచేత నయిన - అధ్యాసిత = ఆక్రమణముచేత - కాతర = వెఱపుగల - అక్ష్యా = కన్నులు గలదైన, ధేన్వా=ఆవుచేత, నిరీక్ష్యమాణః=చూడఁబడుచున్న వాఁడుగనుకనే, సుతరాం-మిక్కిలి, దయాళుఃసన్ = కనికరించువాఁడై, పున రపి=మరల, ఉవాచ = పలికెను.

తా.—శివకింకరుఁడైన సింహము ఇట్లుపలుకఁగా విని దిలీపమహారాజు ఆసింహము ఆక్రమించినందున భయాతురములయిన కన్నులతో తన్నుచూచుచున్నయావుపై మిక్కిలి కనికరముగలవాఁడై వెండియు నిట్లు వచించెను.

వ్యా.— నిశ మ్యేతి.—దే వానుచరస్య ఈశ్వర కిఙ్కరస్య సింహస్య, వాచం నిశమ్య. మనుష్యదేవో రాజా పున రప్యువాచ; కిం భూతః సన్ - తేన సింహేన యదధ్యాసితం ఆక్రమణం*'నపుంసకేభావే క్తః' తేన, కాతరే అక్షిణీ యస్యా స్తయా*'బహుప్రీహౌ సక్థ్యక్ష్ణోః స్వాఙ్గాత్ షచ్'*'షిద్గౌరాదిభ్య శ్చ' తి జీష్-కిం వావవ్య తీతి

ఖితమేవస్థిత మే త్యర్థః, థేన్స్వా, నిరీక్ష్యమాణః, అత ఏవ సుతరాం దయాళుః సక్-సుతరా మి త్యత్ర * 'ద్వివచనవిభజ్యే' త్యాదినా సుశబ్దాత్ తరప్ * 'కిమెత్తిజవ్య యె' త్యాదినా ఆమ్ప్రత్యయః * 'తద్ధిత శ్చాసర్వవిభక్తి రి' త్యవ్యయసంజ్ఞా ?

---

క్షతాత్ కిల త్రాయత ఇ త్యుదగ్రః
క్షత్త్రస్య శబ్దో భువనేషు రూఢః;
రాజ్యేన కిం తద్విపరీతవృత్తేః ?
ప్రాణై రుపక్రోశమలీమసై ర్వా ? 53

టీక.—ఉదగ్రః = ఉత్కృష్టమయిన, క్షత్త్రస్య = క్షత్త్రజాతి యొక్క, శబ్దః = వాచకము, క్షతాత్ = నాశమునుండి, త్రాయతే = కాపాడుచున్నది, ఇతి= ఇట్లనువ్యుత్పత్తిచేత, భువనేషు = లోకములయందు, రూఢః కిల = ప్రసిద్ధి కెక్కినది గదా, తద్విపరీతవృత్తేః - తత్ = అక్షత్త్రశబ్దమునకు - విపరీత = విరుద్ధమయిన - వృత్తేః = వర్తనముగలవానికి, రాజ్యేన కిం = రాజ్య మేల? ఉప...సైః—ఉపక్రోశ= దూఱుచేత - మలీమసైః=మలినములయిన, ప్రాణై ర్వా కిమ్=ప్రాణములు గాని ఏల.

తా.—క్షత్త్రజాతికి ఉత్కృష్టమయిన క్షత్త్రనామము 'నాశమునుండి రక్షించునది'అనువ్యుత్పత్తిచేత లోకములలో ప్రసిద్ధమై యున్నది. ఆనామమునకు విరుద్ధ మయిన వర్తనగలవానికి రాజ్యమేల, నిందచే మలినము లయిన ప్రాణములు నేల?

వ్యా —కిమువా చే త్య త్రాహ-క్షతాదితి.—'క్షణు హింసాయా మి'తి ధాతోః*సంపదాదిత్వాత్ క్విపి *'గమాదీనా మితి వక్తవ్యా దనునాసికలోపే తుగాగమే నతి క్షదితి రూపం సిద్ధం-క్షతో నాశాత్ త్రాయత ఇతి క్షత్త్రః*సు బితి యోగవిభాగా త్కప్రత్యయే-తా మేతాం వ్యుత్పత్తిం కవి రర్థతో ఽనుక్రామతి క్షతా దిత్యాదినా, ఉదగ్రః ఉన్నతః, క్షత్త్రస్య క్షత్త్రవణాస్య, శబ్దో వాచకః క్షత్త్ర శబ్ద ఇ త్యర్థః - సోయం క్షతాత్ త్రాయత ఇతి వ్యుత్పత్త్యా, భువనేషు, రూఢః కిల ప్రసిద్ధః ఖలు - నాశ్వకర్ణాది వ ల్కేవలరూఢః, కింతు పఙ్కజాదివ ద్యోగరూఢ ఇ త్యర్థః; అతః కి మి త్యత ఆహ - తస్య క్షత్త్రశబ్దస్య - విపరీత వృత్తేః విరుద్ధ వ్యాపారస్య - క్షతాత్ త్రాణ మకుర్వతః పుంసః, రాజ్యేన కిం - ఉపక్రోశమలీమసైః నిన్దామలినైః *'ఉపక్రోశో జుగుప్సా చ కుత్సా నిన్దా చ గర్హణే' ఇ త్యమరః*'జ్యోత్స్నాతమిస్రే' త్యాదినా మలీమసశబ్దో నిపాతితః - తైః - ప్రాణై ర్వా కిం - నిన్దితస్య సర్వం వ్యర్థ మి త్యర్థః. ఏతేన ఏకాతపత్త్ర మిత్యాది శ్లోకద్వయోక్తం దత్తోత్తర మితి వేదితవ్యమ్.

---

కథం ను శక్యోఽనునయో మహర్షే
ర్విశ్రాణనా దన్యపయస్వినీనామ్?
ఇమా మనూనాం సురభే రవేహి;
రుద్రౌజసా తు ప్రహృతం త్వయాఽస్యామ్. 54

టీ — మహర్షేః=వసిష్ఠమహామునియొక్క, అనునయో ను = కోపమును తీర్చుటయైనను, అన్య...నామ్ - అన్య = ఇతరములైన - పయస్వినీనాం = పాఁడియావుల యొక్క - విశ్రాణనాత్ = ఇచ్చుటవలన, కథం = ఎట్లు, శక్యః = సాధ్యము; ఇమాం= ఈ ధేనువును, సురభేః = కామధేనువుకంటె, అనూనామ్ = తక్కువకానిదానినిగా అవేహి = ఎఱుఁగుము, అస్యాం = ఈయావునందు, త్వయా = నీచేత, ప్రహృతంతు= దెబ్బయన్ననో, రుద్రౌజసా - రుద్ర = ఈశ్వరునియొక్క - ఓజసా = శక్తిచేత.

తా — ఇతరము లయినపాఁడియావులను ఇచ్చి మహామునిని సమాధానపెట్టుటయైనను ఎట్లు సాధ్యపడును? ఈ ధేనువు కామధేనువునకంటె తక్కువది కాదని యెఱుంగుము; మఱి యీ ధేనువును నీవు కొట్టుట ఎట్లు గలిగిన దనిన, అది ఈశ్వరునిమహిమచేఁ గలిగినదిగాని నీశక్తిచేతఁగాదు.

వ్యా. — అథైకధేనో రి త్యస్యోత్తర మాహ-కథమితి. — అనునయః క్రోధాపనయః - నుకారో వాకారార్థః - మహర్షే రనునయో వా, అన్యాసాం - పయస్వినీనాం దోగ్ధ్రీణాం గవాం, విశ్రాణనా ద్దానాత్ * 'విశ్రాణనం వితరణం స్పర్శనం ప్రతిపాదన' మిత్యమరః, కథం శక్యః న శక్య ఇ త్యర్థః; అత్ర హేతు మాహ-ఇమాం గాం, సురభేః కామధేనోః * 'పఞ్చమీ విభక్తే' ఇతి పఞ్చమీ, అనూనా మన్యూనా, మవేహి. తర్హి కథం పరిభవోఽస్యా ఇ త్యత్రాహ - రుద్రేతి—అస్యాం గవి, త్వయా కర్త్రా ప్రహృతం తు ప్రహార స్తు * 'నపుంసకే భావే క్తః', రుద్రౌజసా ఈశ్వర సామర్థ్యేన, న తు త వే త్యర్థః * 'సప్తమ్యధికరణే చే' తి సప్తమీ.

---

సేయం స్వదేహార్పణనిష్క్రయేణ
న్యాయ్యా మయా మోచయితుం భవత్తః,
న పారణా స్యా ద్విహతా తవైవం,
భవే దలుప్తశ్చ మునేః క్రియార్థః. 55

టీక — సేయం = అట్టియీయావు, మయా = నాచేత, స్వదేహా...ణ — స్వ = నాదైన - దేహ = ఒడలియొక్క - అర్పణ = ఇచ్చుటయనెడి - నిష్క్రయ

యేణ = వెలచేత, భవత్తః = నీవలననుండి, మోచయితుం=విడిపించుటకు, న్యాయ్యా = తగినది; ఏవం ఇట్లగునేని, తవ = నీయొక్క, పారణా = భోజనము, విహతా = పాడఁగొట్టఁబడినది, న స్యాత్ = కాదు, మునేః = వసిష్ఠులవారియొక్క, క్రియార్థశ్చ - క్రియా = హోమాదికర్మ యనెడి-అర్థశ్చ=ప్రయోజనమును, అలుప్తః= లోపింపనిది. భవేత్ = అగును.

తా.—కావున నాయొడలిని వెలగా నిచ్చి అట్టిమహిమగలదైన యీయావును నీ వలననుండి విడిపించుటయే తగును.అట్లు జరిగించుటచేత నీభోజనమునకు హాని యుండదు, మహర్షియొక్క హోమకార్యమును లోపింపదు.

వ్యా.—తర్హి కిం చికీర్షిత మత ఆహ - సేయ మితి.—సేయం గౌః, మయా, నిష్క్రీయతే ప్రత్యాహ్రియతే అనేన పరిగృహీత మితి నిష్క్రయః ప్రతిచికీర్షకం *'ఏ ర జ'త్యచ్ప్రత్యయః - స్వదేహార్పణ మేవ నిష్క్రయః - తేన, భవత్తః త్వత్తః *పఞ్చమ్యా స్తసిల్, మోచయితుం, న్యాయ్యా న్యాయా దనపేతా - యుక్తేత్యర్థః * 'ధర్మపథ్యర్థ' త్యాదినా యత్ప్రత్యయః; ఏవం సతి,తవ,పారణా భోజనం,విహతా న స్యాత్,మునేః, క్రియా హోమాదిః-సై వార్థః ప్రయోజనం, న చాలుప్తో భవేత్, స్వప్రాణాత్యయే నాపి స్వామిగురుధనం సంరక్ష్య మితి భావః.

---

భవా న పీదం పరవా నవైతి
మహా౯ హి యత్న స్తవ దేవదారౌ,
స్థాతుం నియోక్తు ర్న హి శక్య మగ్రే
వినాశ్య రక్ష్యం స్వయ మక్షతేన. 56

టీక.—పరవా౯ = నాథవంతుఁడవయిన, భవా నపి = నీవును, ఇదమ్=ఈనా చెప్పఁబోవునర్థమును, అవైతి = ఎఱుఁగుదువు; హి = ఎందువలననఁగా, తవ = నీకు, దేవదారౌ = దేవదారువృక్షము విషయమున, మహా౯ = గొప్ప, యత్నః = ప్రయత్నము,(కలదు); రక్ష్యం=కావఁదగినవస్తువును, వినాశ్య=నాశమునొందించి, స్వయం = తాను, అక్షతేన = గాయపడనివానికి, నియోక్తుః = స్వామియొక్క, అగ్రే = ఎదుర, స్థాతుం = నిలుచుటకు, శక్యం న హి=సాధ్యము కాదు గదా.

తా.—నీవును ఒక ప్రభువును కొలుచుచున్నవాఁడవు గాన, నాచెప్పఁబోవు విషయము నీకుచు తెలిసినదే. నీకును ఈ దేవదారువృక్షమును రక్షించువిషయమున గొప్ప ప్రయత్నము కలదు గదా; కావ వలసినదానిని పాలియఁజేసి తాను గాయపడనిబంటు స్వామి యెదుట యెట్లు నిలువఁగలఁడు? కావున నాప్రాణ మయినను ఇచ్చి నాస్వామి దైన యీధేనువును కాచుటయే న్యాయ్యము.

వ్యా.—అత్ర భవా నేవ ప్రమాణ మి త్యాహ - భవా నితి.—పరవాన్ = స్వామిపరతన్త్రః, భవా నపి, ఇదం వక్ష్యమాణమ్, అవైతి వేత్తి * 'శేషే ప్రథమ' ఇతి ప్రథమపురుషః - భవతా అనుభూయత ఏ వే త్యర్థః కథ మి త్య త్రాహ - హి = యస్మాత్కారణాత్ * 'హి హేతా వవధారణ' ఇ త్యమరః,తవ, దేవవారా విషయే, మహాన్ అధికః - యత్నః - మహతా ప్రయత్నేన రక్ష్యత ఇ త్యర్థః; ఇదంశబ్దోక్త మర్థం దర్శయతి - స్థాతు మితి.—రక్ష్యం వస్తు, వినాశ్య నాశం గమయిత్వా, స్వయం, మక్షతేన అవ్రణేన-నియుక్తే నేతి శేషః, నియోక్తుః స్వామినః అగ్రేస్థాతుం న శక్యం; సర్వథా రక్ష్యం వస్తు ధేనురూప మవినాశ్య మే వేతి భావః.

---

> కి మ ప్యహింస్య స్తవ చే న్మతోఽహం
> యశశ్శరీరే భవ మే దయాళుః;
> ఏకాన్త విధ్వంసిషు మద్విధానాం
> పిణ్డే ష్వనాస్థా ఖలు భౌతికేషు. 57

టీక.—కిమపి = అట్లుగాక, అహం = నేను, తవ = నీకు, అహింస్యః = చంపఁదగనివాఁడనుగా, మత శ్చేత్ = తోఁచితినేని, తర్హి = అపక్షమందు, మే = నాయొక్క, యశశ్శరీరే - యశః = కీర్తియనెడు-శరీరే-దేహమందు, దయాళుః= దయగొనువాఁడవు, భవ = కమ్ము, మద్విధానాం = మావంటివారికి (వివేకులకు), ఏకా...షు - ఏకాన్త = తప్పకుండ - విధ్వంసిషు = నశించునవైన, భౌతికేషు = (పృథివ్యాది) భూతవికారము లయిన, పిణ్డేషు = దేహములయందు, అనాస్థా ఖలు = అన పేక్ష గదా.

తా.—నన్ను చంపఁగూడ దని తలంతువేని, ఈశరీరమును పుచ్చుకొని శాశ్వత మయిన నా యశశ్శరీరమును కాపాడుము; మముబోంట్లకు తప్పక నశించునదైన పాంచ భౌతికశరీరమందు అపేక్ష యుండదు గదా.

వ్యా.—సర్వథా చైత దపరిహార్య మే వే త్యాహ - కి మితి.—కిమపి కింవా, అహం తవ, అహింస్యః అవధ్యో, మత శ్చేత్, తర్హి, మే, యశః ఏవశరీరం తస్మిన్, దయాళు, ర్భవ; నను ముఖ్య ముపేక్ష్య అముఖ్యశరీరే కోఽభినివేశ ఇ త్య త్రాహ - ఏకా న్తేతి - మ ద్విధానాం మాదృశానామ్ వివేకినాం,ఏకాన్తవిధ్వంసిషు అవశ్యవినాశిషు, భౌతికేషు పృథివ్యాదిభూతవికారేషు,పిణ్డేషు శరీరేషు, అనాస్థా అనపేక్షా-ఖలు * 'ఆస్థా త్వాలమ్బ నాస్థాన య త్నా పేక్షాసు కథ్యత' ఇతి విశ్వః.

---

సంబన్ధ మాభాషణపూర్వ మాహుః,
ర్వృత్తః స నౌ సంగతయో ర్వనాన్తే;
త ద్భూతనాథానుగ, నార్హసి త్వం
సంబన్ధినో మే ప్రణయం విహన్తుమ్ 58

టీక.—సంబన్ధం = స్నేహమును, ఆభా...ర్వమ్ - ఆభాషణ = సంభాషణమే-పూర్వం = కారణముగాఁగలదానినిగా, ఆహుః = చెప్పుదురు; సః = ఆసంబంధము, వనాన్తే = అడవిప్రదేశములో, సంగతయోః = కలసినట్టి, నౌ = మనకు ఇద్దఱకును, వృత్తః = జరిగినది ; తత్ = కావున, భూ...గ—భూతనాథ = శివునియొక్క-అనుగ = కింకరుఁడా, సంబన్ధినః=స్నేహితుఁడనయిన, మే = నాయొక్క, ప్రణయం= ప్రార్థనను, విహన్తుం = భంగపఱుచుటకు, నార్హసి = తగవు.

తా —మాటలాడుటయే స్నేహమునకు కారణ మందురు; అట్టిస్నేహము మనకు ఈయడవిలో కలిగినది: కనుక ఓయి ఈశ్వరకింకరుఁడా, నీవు స్నేహితుఁడ నయిన నా ప్రార్థనను భంగపఱుచుట యుక్తముకాదు.

వ్యా—సౌహార్దా దనుసరణీయోఽస్మీ త్యాహ - సంబన్ధ మితి.—సంబన్ధం సఖ్యమ్, ఆభాషణ మాలాపః - పూర్వం కారణం - యస్య తమ్ - ఆహుః * 'స్యా దాభాషణ మాలాప' ఇ త్యమరః, సః తాదృక్సంబన్ధః, వనాన్తే, సంగతయోః, నౌ ఆవయోః, వృత్తః జాతః, తత్ తతః, హే భూతనాథానుగ శివానుచర - ఏతేన తస్య మహత్త్వం సూచయతి, అత ఏవ, సంబన్ధినః మిత్రస్య, మే, ప్రణయం యాచ్ఞాం * 'ప్రణయః స్యాత్ పరిచయే యాచ్ఞాయాం సౌహృదేఽపిచే'తియాదవః*'ప్రణయా స్త్వమీ విస్రమ్భ యాచ్ఞా ప్రేమాణ' ఇ త్యమర శ్చ, విహన్తుం నార్హసి.

---

త థేతి గాం ముక్తవతే దిలీపః
సద్యః ప్రతిష్టమ్భ విముక్త బాహుః,
సన్న్యస్తశస్త్రోహరయే స్వదేహ
ముపానయ త్పిణ్డ మి వామిషస్య. 59

టీక.—త థేతి = అట్లేకానిమ్మని, గాం = ఆవును, ముక్తవతే = వదలిన, హరయే = సింహమునకొఱకు, సద్యః = తత్క్షణమే, ప్రతి...హుః - ప్రతిష్టమ్భ = నిర్బంధమునుండి - విముక్త = విడువఁబడిన - బాహుః = భుజముగలవాఁడై, దిలీపః= దిలీపమహారాజు, సన్న్యస్తశస్త్రః సన్ - సన్న్యస్త = విడువఁబడిన - శస్త్రః సన్ =

ఆయుధములు గలవాఁడై, స్వ దేహం = తనదైన శరీరమును, ఆమిషస్య = మాంసము యొక్క, పిణ్డ మివ = కబళమునుం బోలె, ఉపానయత్ = సమర్పించెను.

తా.—అందులకు సమ్మతించి సింహము నందినిని విడిచెను. తత్క్షణమే దిలీపమహారాజునకు బాహువు స్తంభనము తీఱి స్వాధీనమాయెను. అంత నాతఁడు ఆయుధములను వదలిపెట్టి మాంసపుముద్దవలె తనదేహమును సింహమునకు అర్పించెను.

వ్యా.—తథేతి.—తథేతి గాం ముక్తవతే త్యక్తవతే, హరయే సింహాయ *'కపౌ సింహే చ సౌవర్ణేఽవర్ణే ఽప్ష్టౌ హరిం విదు' రితి శాశ్వతః, సద్యః తత్క్షణే - ప్రతిష్టమ్భాత్ నిర్బన్ధాత్ - విముక్త బాహుః ముక్త హస్తః, దిలీపః, సన్న్యస్తశస్త్రః - త్యక్తాయుధః సన్, స్వదేహం, ఆమిషస్య మాంసస్య * 'పలలం క్రవ్య మామిష మి,' త్యమరః, పిణ్డం కబళ మివ, ఉపానయత్ సమర్పితవాన్: ఏతేన నిర్మమత్వ ముక్తమ్.

---

తస్మిన్ క్షణే పాలయితుః ప్రజానా
ముత్పశ్యతః సింహనిపాత ముగ్రమ్,
అవాఙ్ముఖ స్యోపరి పుష్పవృష్టిః
పపాత విద్యాధరహ స్తముక్తా. 60

టీక.—తస్మిన్ క్షణే=ఆ నిముసమున, ఉగ్రం = ఘోరమైన, సింహనిపాతం- సింహ = సింహముయొక్క - నిపాతం = పాటును, ఉత్పశ్యతః = ఎదురుచూచుచు, అవాఙ్ముఖస్య = అధోముఖుఁడయిన, ప్రజానాం = జనులయొక్క, పాలయితుః = ఏలికయైనదిలీపమహారాజుయొక్క, ఉపరి=మీఁదను, విద్యా...క్తా - విద్యాధర=విద్యాధరులయొక్క - హస్త=చేతులచేత - ముక్తా=కురియఁబడిన పుష్ప వృష్టిః - పుష్ప= పువ్వులయొక్క - వృష్టిః = వాన, పపాత = పడెను.

తా.—ఆక్షణమున అధోముఖుఁడై తనమీఁద ఘోరముగా సింహము పడు నని యెదురుచూచుచున్న దిలీపమహారాజుమీఁద ఆకాశమునుండి విద్యాధరులు పూలవాన గురిసిరి.

వ్యా.—తస్మిన్నితి.—తస్మిన్ క్షణే, ఉగ్రం సింహనిపాతమ్, ఉత్పశ్యతః ఉత్ప్రేక్షమాణస్య తర్కయత ఇత్యర్థః, అవాఙ్ముఖస్య అధోముఖస్య ప్రజానాం పాలయితుః రాజ్ఞః, ఉపరి ఉపరిష్టాత్ * 'ఉప ర్యుపరిష్టా ది' తి నిపాతః, విద్యాధరాణాం దేవతావిశేషాణాం - హస్తైః - ముక్తా, పుష్పవృష్టిః, పపాత అపతత్.

ఉత్తిష్ఠ వత్సే త్యమృతాయమానం
వచో నిశ మ్యోత్థిత ముత్థితః సన్,

దదర్శ రాజా జననీ మివ స్వాం,
గా మగ్రతః, ప్రస్రవిణీం న సింహమ్. 61

టీక.—రాజా = దిలీపమహారాజు, హేవత్స = ఓయి అబ్బాయీ, ఉత్తిష్ఠ = లే, ఇతి = ఇట్లని, ఉత్థితం = పుట్టినదై, అమృతాయమానం=అమృతమువలె నాచరించుచున్న, వచః = వాక్కును, నిశమ్య = విని, ఉత్థితః సః = లేచినవాఁడై, అగ్రతః = ఎదుట, ప్రస్రవిణీం = పాలుచేఁపియున్న, గాం = ఆవును, స్వాం = తనదయిన, జననీ మివ = తల్లినింబోలె, దదర్శ = చూచెను, సింహం తు = సింగమునో, న దదర్శ= చూడ లేదు.

తా.—ఆసమయమందు దిలీపమహారాజునకు 'అబ్బాయీ లేరా' అని అమృతప్రాయ మైనవాక్కు వినఁబడెను. అతఁడు దానిని విని లేచి చూడఁగా తనమ్రోలను తల్లివలె పాలుచేఁపుచు నందినీధేనువు అగపడెను, సింహము అగపడలేదు.

వ్యా.—ఉత్తిష్ఠేతి.—.రాజా దిలీపః, అమృతవ దాచర తీతి అమృతాయమానం * 'ఉపమానా దాచారే క్యచ్' తత శ్శానచ్, ఉత్థిత ముత్పన్నం, హే వత్స ఉత్తిష్ఠేతి వచో, నిశమ్య శ్రుత్వా, ఉత్థితః సః, అగ్రతః అగ్రే, ప్రస్రవః క్షీరస్రావోఽస్యా అ స్తీతి ప్రస్రవిణీ - తాం, గాం, స్వాం జననీ మివ దదర్శ, సింహం తు న దదర్శ.

---

తం విస్మితం ధేను రువాచ "సాధో,
మాయాం మ యోద్భావ్య పరీక్షితోఽసి;
ఋషిప్రభావా న్మయి నాఽన్తకోఽపి
ప్రభుః ప్రహర్తుం; కిము తాన్యహింస్రాః. 62

టీక.—విస్మితం = ఆశ్చర్యపడిన, తం = ఆదిలీపమహారాజుతో, ధేనుః= నందిని, ఉవాచ = పలికెను, హే సాధో = ఓయి సత్పురుషుఁడా, మయా = నాచేత, మాయాం = మాయను, ఉద్భావ్య = కల్పించి, పరీక్షితః = పరీక్షింపఁబడినవాఁడవు, అసి = అయితివి; ఋషిప్రభావాత్ - ఋషి = వసిష్ఠులవారి - ప్రభావాత్ = మహిమవలన, అన్తకోఽపి = యముఁడును, మయి = నామీఁద, ప్రహర్తుం = దెబ్బవేయుటకు, ప్రభుః = సమర్థుఁడు, న = కాఁడు, అన్యహింస్రాః - అన్య = కడమ - హింస్రాః = ఘాతుకములు, కి ముత = బొత్తిగా, న ప్రభవః = సమర్థములు గావు.

తా.—అందులకు ఆశ్చర్యపడుచున్న దిలీపమహారాజుతో నందినీధేనువు ఇట్లు పలికెను; 'ఓయి సాధూ నిన్ను పరీక్షించుటకై నేను ఈమాయను గల్పించితిని; వసిష్ఠుల

వారి ప్రభావముచేత నన్ను యముఁడు సయితము చెనకలేఁడు. తక్కిన ఘాతుకములమాట చెప్పవలయునా?

వ్యా.—త మితి.—విస్మితమ్ ఆశ్చర్యగతం * కర్తరి క్తః, తం దిలీపం, ధేను రువాచ - కి మి త్యత్రాహ—హే సాధో, మయా, మాయామ్, ఉద్భావ్య కల్పయిత్వా, పరీక్షితోఽసి; ఋషిప్రభావాత్, అన్తకోఽపి మయి ప్రహర్తుం, న ప్రభుః న సమర్థః, అన్యే - హింస్రాః ఘాతుకాః * 'శరారు ఘాతుకో హింస్ర' ఇ త్యమరః * 'నమికమ్పి' త్యాదినా రప్రత్యయః, కిముత సుష్ఠు న ప్రభవ ఇతి యోజ్యం * 'బలవత్ సుష్ఠు కిముత స్వ త్యతీవ చ నిర్భరే' ఇ త్యమరః.

---

"భక్త్యా గురౌ మ య్యనుకమ్పయా చ
ప్రీతాఽస్మి తే పుత్త్ర; వరం వృణీష్వ;
న కేవలానాం పయసాం ప్రసూతి
మవేహి మాం కామదుఘాం ప్రసన్నామ్." 63

టీక.—హే పుత్త్ర = ఓనాకుమారుఁడా, గురౌ = వసిష్ఠులవారియందు, భక్త్యా = భక్తిచేతను, మయి = నాయందు, అనుకమ్పయా చ = కనికరముచేతను, తే = నీయందు, ప్రీతా = సంతుష్టురాలను, అస్మి = అయితిని; వరం = కోరికను, వృణీష్వ = కోరుము. తథా హి = అదే సరి, మాం = నన్ను, పయసాం కేవలానాం = పాలకు మాత్రమే, ప్రసూతిం = కారణమునుగా, న అవేహి = తలంపకుము, కిం తు = మఱియేమనిన, ప్రసన్నాం=అనుగ్రహించితినేని, కామదుఘాం - కామ = కోరినయర్థములను - దుఘాం = పిదుకుదానినిగా, (అవేహి = తెలిసికొనుము.)

తా.—ఓరి పుత్త్రుఁడా! నీగురుభక్తికిని, నాయందలి నీకనికరమునకును నిన్ను మెచ్చుకొంటిని, వర మడుగుము, ఇచ్చెదను. నన్ను పాలుమాత్రము పిదికెడు గోమాత్రమునుగా తలంపకుము, అనుగ్రహించితినేని కోరినవరములు పిదుకుదు నని యెఱుంగుము.

వ్యా.—భ క్త్యేతి.—హే పుత్త్ర, గురౌ భక్త్యా, మయి అనుకమ్పయా చ, తే తుభ్యం - ప్రీతాస్మి * 'క్రియాగ్రహణ మపి కర్తవ్య మి' తి చతుర్థీ, వరం దేవేభ్యో వరణీయ మర్థం * 'దేవా ద్వృతే వరః శ్రేష్ఠే త్రిషు క్లీబం మనాక్ప్రియ ఇ' త్యమరః, వృణీష్వ = స్వీకురు, తథాహి - మాం కేవలానాం పయసాం, ప్రసూతిం కారణం, నావేహి న విద్ధి, కిం తు - ప్రసన్నాం మాం, కామాన్ దోగ్ధీతి కామదుఘా - తామ్, అవేహి విద్ధి.

---

బడిన - ఔత్సుక్యం=ఉత్కంఠగలవానిని, ప్రజా...ర్థం-ప్రజార్థ=సంతానార్థమైన-(లోకహితార్థమైన చం) - వ్రత = గోసేవానియముచేత-(కళాదాననియమముచేత చం.) - కర్శిత=కృశింపఁజేయఁబడిన-అఙ్గం = శరీరముగలవానిని, నవోదయం-నవ= నూతనమయిన - ఉదయం = అభ్యుదయము - (పొడుపు చం.) - గలవానిని, తం= ఆదిలీపమహారాజును, ప్రజాః= ప్రజలు, తృప్తిం=తనివి, అనాప్నువద్భిః = పొందని, నేత్రైః = కన్నులతో, ఓషధీనాం = లతలయొక్క, నాథ మివ = ప్రభువయిన చంద్రునివలె, పపుః = త్రాగిరి.

తా — దేశాంతరగతుఁడయినందున అప్పటివఱకును కనఁబడనివాఁడయి, యప్పుడు, చూచుటకు ఆసగొలుపుచు, సంతతికొఱకైన గోసేవావ్రతముచేత దేహము కృశించి యుండఁగా, క్రొత్తమేలును పొంది వచ్చినవానిని ఆదిలీపమహారాజును, ప్రజలు-కళాక్షయముచేత కంటికి కగపడకయుండినవాఁడై, విదియనాఁడు, చూడ నాసగొలుపుచు, లోకహితార్థము దేవతలకు కళలను త్రాగ నొసంగునియమముచేతఁ కృశించినవాఁడై, క్రొత్తగా నుదయించిన చంద్రునింబోలె, - తనివి తీఱని కన్నులతో పానముచేసిరి.

వ్యా.—త మితి.—అదర్శనేన ప్రవాసనిమిత్తేన, ఆహితౌత్సుక్యం జనితదర్శనోత్కణ్ఠం, ప్రజార్థేన సంతానార్థేన - వ్రతేన నియమేన - కర్శితమ్ అఙ్గం యస్య తం, నవోదయం నవాభ్యుదయం. తం దిలీపం, ప్రజాః. తృప్తిమ్ అనాప్నువద్భి రతిగృధ్నుభిః, నేత్రైః, ఓషధీనాం నాథం చన్ద్ర మివ, పపుః అత్యాశయా దదృశు రి త్యర్థః; చన్ద్రపక్షే - అదర్శనం కళాక్షయనిమిత్తం, ప్రజార్థేన లోకహితార్థేన, వ్రతం దేవతాభ్యః కళాదాననియమః* 'తం చ సోమం పపు ర్దేవాః పర్యాయే ణానుపూర్వశః' ఇతి వ్యాసః - ఉదయః ఆవిర్భావః, అన్యత్ సమానమ్.

---

పురన్దరశ్రీః పుర ముత్పతాకం ప్రవిశ్య పౌరై రభినన్ద్యమానః
భుజే భుజఙ్గేన్ద్రసమానసారే భూయః స భూమే ర్ధుర మాససఞ్జ. 74

టీక.—పురన్దరశ్రీః - పురన్దర = దేవేంద్రునియొక్క, శ్రీః = ఐశ్వర్యమువంటిదైయైశ్వర్యముగల, సః = ఆదిలీపమహారాజు, పౌరైః=పురజనులచేత, అభినన్ద్యమానః= సంతోషపెట్టఁబడినవాఁడై, ఉత్పతాకమ్ - ఉత్ = ఎత్తఁబడిన-పతాకం=ధ్వజములు గలదైన, పురం=నగరమును, ప్రవిశ్య=చొచ్చి, భుజ...రే - భుజఙ్గేన్ద్ర=ఆదిశేషునితో-సమాన = తుల్యమయిన - సారే = బలముగల, భుజే = బాహువునందు, భూయః = మరల, భూమేః = భూమియొక్క, ధురం = భారమును, ఆససఞ్జ = మోపెను.

తా.—దేవేంద్రైశ్వర్యముగల దిలీపమహారాజు పురజనులు కొనియాడుచుండఁగా,

ఎత్తఁబడినజెండాలు నెలుఁగుచుండ, నగరము ప్రవేశించి శేషాహితో తుల్యబలమయిన తన బాహువునందు వెండియు రాజ్యభారమును వహించెను.

వ్యా.—పురన్దర రేతి.—పురం పురీ మసురాణాం దారయ తీతి పురన్దరః శక్రః * 'పురుహూతః పురన్దర' ఇత్యమరః * 'పూ స్సర్వయో ర్దారిసహో' రితి ఖచ్ * 'వాచంయమ పురన్దరా చే' తి ముమాగమనిపాతః - తస్య శ్రీ రివ శ్రీ ర్యస్య స నృపః, పౌరై రభినన్ద్యమానః,ఉత్పతాక ముచ్ఛ్రితధ్వజం,* 'పతాకా వైజయన్తీ స్యాత్ కేతనం ధ్వజ మస్త్రియా మి' త్యమరః, పురం ప్రవిశ్య, భుజగేన్ద్రేణ - సమానసారే తుల్యబలే * 'సారో బలే స్థిరాంశే చ న్యాయ్యే క్లీబం వరే త్రి ష్వి' త్యమరః,భుజే, భూయః, భూమేః, ధురమ్, ఆససజ్జ అర్పితవాన్.

---

అథ నయనసముత్థం జ్యోతి రత్రే రివ ద్యౌః,
సురసరి దివ తేజోవహ్ని నిష్ఠ్యూత మైశం,
నరపతికులభూత్యైగర్భ మాధత్త రాజ్ఞీ
గురుభి రభినివిష్టం లోకపాలానుభావైః. 75

టీక.—అథ = అటుతర్వాత, ద్యౌః = ఆకాశము, అత్రేః = అత్రిమహాముని యొక్క, నయనసముత్థం - నయన = కన్నులవలన-సముత్థం = పుట్టిన, జ్యోతి రివ = చంద్రునివలెను, సురసరిత్ = వేల్పుటేఱు, వహ్నినిష్ఠ్యూతం - వహ్ని = అగ్నిచే - నిష్ఠ్యూతమ్ = ఉంపఁబడిన - ఐశం = పరమేశ్వరసంబంధియైన, తేజ ఇవ = కుమార స్వామినిబోలెను, రాజ్ఞీ = సుదక్షిణాదేవి, నర...త్యై - నరపతి = దిలీపమహారాజు యొక్క - కుల = వంశముయొక్క - భూత్యై = ఐశ్వర్యముకొఱకు, గురుభిః=గొప్ప వైన - లోక...వైః - లోకపాల = దిక్పాలకులయొక్క - అనుభావైః = తేజస్సుల చేత, అభినివిష్టం = ప్రవేశింపఁబడిన, గర్భమ్ = గర్భమును, అధత్త = ధరించెను.

తా.—అటుతర్వాత,సుదక్షిణాదేవి-అత్రినేత్రజాతజ్యోతి యైనచంద్రుని గర్భ ముగా దివి ధరించినట్లును, అగ్నివైచిన శివతేజ మయినస్కందుని గర్భముగా మందాకిని ధరించినట్లును,-దిలీపమహారాజుయొక్క-వంశమునకు ఐశ్వర్యము గలుగునట్లుగా, ఇంద్రా ద్యష్టదిక్పాలకులయొక్క-యంశలుఁగలయట్టిగర్భమునుధరించినదాయెను.—చంద్రునివంటి కాంతిమంతుని స్కందునివంటిపరాక్రమశాలిని ఇంద్రాదులవంటి యైశ్వర్యసంపన్నుని కుమారునిం గను నని భా.

వ్యా.—అ థేతి.—అథ, ద్యౌః సురవర్త్మ * 'ద్యౌః స్వర్గ సురవర్త్మనో' రితి విశ్వః, అత్రే ర్మహర్షే ర్నయనాభ్యాం - సముత్థ ముత్పన్నం * 'అత శ్చోపసర్గ'

ఇతి క్తప్రత్యయః - త, జ్జ్యోతి' రివ చన్ద్ర మివ * 'ఋక్షేశః స్యా దత్రినేత్రప్రసూత' ఇతి హలాయుధః - చన్ద్ర స్యాత్రినేత్రోద్భూతత్వ ముక్తం హరివంశే -

'నేత్రాభ్యాం పరిసుస్రావ దశధా ద్యోతయ న్దిశః,
తం గర్భం దశధా హృష్టా దిశో దేవ్యో దధు స్తతః.'

ఇత్యాదికం తత్ర ద్రష్టవ్యం; సురసత్ గఙ్గా వహ్నినా నిష్ఠ్యూతం క్షిప్తం*'నుత్త ను న్నాస్త నిష్ఠ్యూత విద్ధ క్షి ప్తేరితా స్సమా' ఇ త్యమరః, ఐశం తేజః స్కన్ద మివ-అత్ర రామాయణమ్ -

''తే గత్వా పర్వతం రామ కేవలం ధాతుమణ్డితమ్
అగ్నిం సంయోజయామాసుః పుత్త్రార్థం సర్వదేవతాః.
'దేవకార్య మిదం దేవ సమాధత్స్వ హుతాశన,
శైలపుత్త్ర్యా మహాతేజో గఙ్గాయాం తేజ ఉత్సృజ.'
దేవతానాం ప్రతిజ్ఞాయ గఙ్గా మభ్యేత్య పావకః,
'గర్భ న్ధారయ వై దేవి దేవతానా మిదం ప్రియమ్.'
ఇ త్యేత ద్వచనం శ్రుత్వా దివ్యం రూప మధారయత్.
స తస్యా మహిమాం (?) దృష్ట్వా సమన్తా దవకీర్యత,
సమన్తత స్తదా దేవీ మభ్యషిఞ్చత పావకః,
సర్వస్రోతాంసి పూర్ణాని గఙ్గాయాం రఘునన్దన.'' ఇత్యాది.

రాజ్ఞీ సుదక్షిణా, నరపతే ర్దిలీపస్య, కులభూత్యై సంతతిలక్షణాయై, గురుభి ర్మహద్భిః, లోకపాలానాం - మనుభావైః తేజోభిః, అభినివిష్ట మనుప్రవిష్టం, గర్భమ్,ఆధత్త దధా వి త్యర్థః; అత్ర మనుః*'అష్టానాం లోకపాలానాం వపు ర్ధారయతే నృపః' ఇతి; అత్ర ఆధత్తే త్యనేన స్త్రీకర్తృకం ధారణ ముచ్యతే-తథా మన్త్రే చ దృశ్యతే-

'య థేయం పృథివీ మహీ తిష్ఠన్తీ గర్భమాదధే
ఏవం త్వం గర్భ మాధత్స్వ దశమే మాసి సూతవే.' ఇతి.

మాలినీవృత్త మేతత్ * 'ననమయయయుతేయం మాలినీ భోగిలోకైః.'

# ర ఘు వం శే

## తృ తీ య స్స ర్గః.

అ థేప్సితం భర్తురుపస్థితోదయం
సఖీజనోద్వీక్షణ కౌముదీముఖం
నిదాన మిక్ష్వాకు కులస్య సంతతేః
సుదక్షిణా దౌర్హృదలక్షణం దధౌ. 1

టీక.—అథ – గర్భముదాల్చినపిమ్మట, సుదక్షిణా = సుదక్షిణాదేవి, ఉపస్థితోదయం - ఉపస్థిత = ప్రాప్తమయిన - ఉదయం = ఫలముగలదియు, భర్తుః = పతియైనదిలీపమహారాజునకు, ఈప్సితమ్ = ఇష్టమును, సఖీ...ఖం...సఖీ = చెలికత్తెలయిన - జన = జనులయొక్క - ఉద్వీక్షణ = చూపులకు - కౌముదీ = వెన్నెలయొక్క - ముఖం = ప్రారంభమును, ఇక్ష్వాకు కులస్య - ఇక్ష్వాకు = ఇక్ష్వాకుమహారాజుయొక్క - కులస్య = వంశముయొక్క - సంతతేః = తెంపులేమికి, నిదానం=మూలకారణమును, (ఐనటువంటి), దౌర్హృదలక్షణం - దౌర్హృద = గర్భముయొక్క - లక్షణం = చిహ్నమును, దధౌ = ధరించెను.

తా.—తర్వాత సుదక్షిణాదేవి భర్తయొక్క వాంఛితము తీఱునట్లుగాను, సఖీజనులకనులకు వెన్నెలవలె ఆహ్లాదకరముగాను, ఇక్ష్వాకువంశము తెంపులేక కొనసాగుటకు మూలకారణ మయిన గర్భచిహ్నమును దాల్చెను.

వ్యా.—రాజ్ఞీ గర్భ మాధత్తే త్యుక్తం - సంప్రతి గర్భలక్షణాని వర్ణయితుం ప్రస్తౌతి - అ థేతి.—అథ గర్భధారణానన్తరం, సుదక్షిణా, ఉపస్థితోదయం ప్రాప్తఫలం, భర్తు, రీప్సితం మనోరథం * 'నపుంసకే భావే క్తః,' సఖీజనస్య-ఉద్వీక్షణానాం దృష్టీనాం - కౌముదీముఖం చన్ద్రికాప్రాదుర్భావం - యద్వా కౌముదీ నామ దీపోత్సవః - తదుక్తం భవిష్యోత్తరపురాణే*'కౌ మోదన్తే జనా యస్మాత్ తేనాసౌ కౌముదీ మ తే' తి - తస్యాః - ముఖం ప్రారమ్భః - అత్ర కేచిత్ 'కౌముదీమహామి' తి - అపరే 'కౌముదీసుఖ మి' తి చ పఠన్తి,ఇక్ష్వాకుకులస్య, సంతతేః అవిచ్ఛేదస్య, నిదానం మూలకారణం * 'నిదానం త్వాదికారణ మి' త్యమరః, ఏవంవిధం దౌర్హృదలక్షణం గర్భచిహ్నం వక్ష్యమాణం - దధౌ - గర్భస్థిత శిశు హృదయేన స్వహృదయేన చ ద్విహృదయా గర్భిణీ - యథాఽఽహ వాహటః -

'మాతృజన్యస్య హృదయం మాతు శ్చ హృదయేన యత్
సంబద్ధం తేన గర్భిణ్యా నేష్టం శ్రద్ధావమాననమ్.'          ఇతి,

తత్సంబన్ధిత్వా ద్గర్భో దౌహృద మి త్యుచ్యతే - సాచ - తద్యోగా ద్దౌహృది నీతి. తదు క్తం సంగ్రహే - 'ద్విహృదయాం నారీం దౌహృదినీ మాచక్షత'. ఇతి.

అత్ర దౌహృదలక్షణస్య ఈప్సితత్వేన కౌముదీముఖత్వేన చ నిరూపణా ద్రూపకాలంకారః. అస్మి న్ సర్గే వంశస్థవృత్తం - 'జతౌ తు వంశస్థ ముదీరితం జరా వి' తి లక్షణాత్.

---

శరీరసాదా దసమగ్రభూషణా ముఖేన సాఽలక్ష్యత లోధ్రపాణ్డునా
తనుప్రకాశేన విచేయతారకా ప్రభాతకల్పా శశి నేవ శర్వరీ.    2

టీక.—శరీరసాదాత్ - శరీర=ఒడలియొక్క - సాదాత్ = కార్శ్యమువలన, అసమగ్రభూషణా - అసమగ్ర = పరిమితములయిన - భూషణా = నగలుగలదై, లోధ్రపాణ్డునా - లోధ్ర = లొద్దుగుపువ్వువలె - పాణ్డునా = తెల్లనయిన,ముఖేన = ముఖముతో, (ఉపలక్షితా=కూడుకొన్న), సా - ఆసుదక్షిణాదేవి, విచేయతారకా = విచేయ = వెదకఁదగినట్టి - తారకా = నక్షత్రములుగలదియు, తను...న—తను=కొంచెపాటి - ప్రకాశేన = వెల్గుగలవాఁడైన, శశినా = చంద్రునితో, (ఉపలక్షితా = కూడికొన్నదియు), ప్రభాతకల్పా = ఇంచుకతక్కువగా తెల్లవాఱినదియు, (అయిన), శర్వరీవ - రాత్రివలె, అలక్ష్యత = అగపడెను.

తా.—గర్భధారణముచేత ఒడలు కృశించినందున కొంచెముగానే నగలు ధరించి లొద్దుగుపువ్వువర్ణముగా పాలిపోయిన నెమ్మొగములో ఆసుదక్షిణాదేవి తెల్లవాఱియు తెల్లవాఱని సమయమున ఒక కొన్ని నక్షత్రములతోను ఇంచుక కాంతిగల చంద్రునితోను కూడుకొన్న రాత్రివలె నొప్పారుచుండెను.

వ్యా.—సంప్రతి క్షామతాఖ్యం గర్భలక్షణం వర్ణయతి - శరీ రేతి...శరీరస్య - సాదాత్ కార్శ్యాత్, అసమగ్రభూషణా పరిమితభూషణా, లోధ్రపుష్పవత్ పాణ్డునా, ముఖేన - ఉపలక్షితా, సా సుదక్షిణా, విచేయాః మృగ్యాః - తారకాః - యస్యాః సా తథోక్తా - విరళనక్షత్రే త్యర్థః, తనుప్రకాశేన అల్పకాన్తినా, శశినోపలక్షితా, ఈష దూనం ప్రభాతం ప్రభాతకల్పా,శర్వ రీవ,అలక్ష్యత; శరీరసాదాది గర్భలక్షణే వాగ్భటః -

'క్షామతా గరిమా కుక్షేః మూర్ఛా ఛర్ది రరోచకం
జృమ్భా ప్రసేకః సదనం రోమరాజ్యాః ప్రకాశనమ్.'          ఇతి.

---

తదాననం మృత్సురభి క్షితీశ్వరో రహ
స్యుపాఘ్రాయ న తృప్తి మాయయౌ
కరీవ సిక్తం పృషతైః పయోముచాం
శుచివ్యపాయే వనరాజి పల్వలమ్. 3

టీక.—క్షితీశ్వరః = దిలీపమహారాజు, రహసి = ఏకాంతమందు, మృత్సురభి-మృత్ = మట్టిచేత - సురభి = తావిగలదైన, తదాననం - తత్ = ఆసుదక్షిణాదేవి యొక్క - ఆననం = ముఖమును, ఉపాఘ్రాయ = మూర్కొన్నవాఁడై, శుచి వ్యపాయే - శుచి = వేసవియొక్క - వ్యపాయే = పోకయందు, పయోముచాం = మబ్బులయొక్క, పృషతైః = చినుకులచేత, సిక్తం = తడుపఁబడిన,వన... లం—వన=అడవియొక్క, రాజి = చాలుయొక్క - పల్వలం=పడియను, ఉపాఘ్రాయ=మూర్కొని (మూర్కొన్న), కరీవ = ఏనుఁగువలె, తృప్తిం = తనివిని, నాయయౌ = పొందఁడాయెను.

తా —వేసవి ముగియఁగానే అడవిచాలులో తొలి తొలి వానచినుకులచే తడిసి మట్టివాసన లేచిన పడియను మూర్కొని యేనుఁగు ఎట్లు తనివి చెందదో,అట్లే, వేవిళ్లచే తినునట్టి మట్టిచే పరిమళించుచున్న యాసుదక్షిణాదేవి ముఖమును ఏకాంతములో మూర్కొని దిలీపమహారాజు తనివి చెందఁడాయెను.

వ్యా.—తదానన మితి.... క్షితీశ్వరో దిలీపః, రహసి, మృత్సురభి మృదా సుగన్ధి, తస్యాః సుదక్షిణాయాః - ఆననం ముఖం, ఉపాఘ్రాయ, తృప్తిం, నాయయౌ; కథ మివ-శుచివ్యపాయే గ్రీష్మావసానే* 'శుచిః శుద్ధేఽనుపహతే శృఙ్గారాషాఢయోః సితే। గ్రీష్మే హుతవహేఽపి స్యా ది' తి విశ్వః,పయోముచాం మేఘానాం,పృషతైః బిన్దుభిః * 'పృషన్తి బిన్దు పృషతా వి' త్యమరః, సిక్తం ఉక్షితం, వనరాజేః - పల్వల మల్పసరః,ఉపాఘ్రాయ కరీవ—అత్ర కరి వనరాజి పల్వలానాం కాన్త కామినీ వదన సమాధి రనుసంధేయః, గర్భిణీనాం మృద్భక్షణం లోకప్రసిద్ధ మేవ, ఏతేన దోహదాఖ్యం గర్భలక్షణం సూచ్యతే.

---

దివం మరుత్వా నివ భోక్ష్యతే భువం
దిగన్త విశ్రాన్తరథో హి తత్సుతః;
అతోఽభిలాషే ప్రథమం తథావిధే
మనో బబన్ధాన్యరసా విలఙ్ఘ్య సా. 4

టీక.—హి = ఏకారణమువలన, దిగ...థః—దిక్ = దెసలయొక్క - అన్త= కడలయందు - విశ్రాన్త = వ్యాపించిన - రథః = తేరుగలయట్టి, తత్సుతః - తత్= అసుదక్షిణాదేవియొక్క - సుతః=పుత్త్రుఁడు, మరుత్వాన్ = ఇంద్రుఁడు, దివ మివ= స్వర్గమునుంబోలె, భువం = భూమిని, భోక్ష్యతే = అనుభవింపఁగలఁడో, అతః = ఆ కారణమువలన, ప్రథమం = మొదట, సా = ఆదేవి, తథావిధే = అట్టిప్రకారముగల- అనఁగా మృద్రూపమయిన, అభిలాషే=భోగ్యవస్తువునందు, అన్యరసాన్-అన్య=కడమ- రసాన్ = భోగ్యవస్తువులను, విలఙ్ఘ్య = అతిక్రమించి, మనః = మనస్సును, బబన్ధ = కట్టెను.

తా.—సుదక్షిణాదేవి తాను కనఁగల కుమారుఁడు ఇంద్రుఁడు స్వర్గమును బోలె భూలోకము నెల్ల నేలు ననుటకు సూచనగా ప్రథమమందే వేఱుభోజ్యములను వదలినదై మట్టిని తినుటకు ఆసక్తి వహించెను.

వ్యా.—దౌహృదహేతుకే మృద్భక్షణే హేత్వన్తర ముత్ప్రేక్షతే - దివ మితి.—హి యస్మాత్ కారణాత్, దిగన్తవిశ్రాన్తరథః చక్రవర్తీ, తస్యాః సుతః తత్సు తః, మరుత్వా నిన్ద్రః * 'ఇన్ద్రో మరుత్వాన్ మఘవా' త్యమరః, దివం స్వర్గ మివ, భువం భోక్ష్యతే * 'భుజోఽనవనే' ఇ త్యాత్మనేపదమ్, అతః, ప్రథమం, సా సుదక్షి ణా, తథావిధే భూవికారే మృద్రూపే, అభిలష్యత ఇ త్యభిలాషో భోగ్యవస్తు తస్మిన్ * 'కర్మణి ఘఞ్', రస్యన్తే స్వాద్యన్తే ఇతి రసాః భోగ్యార్థాః - అన్యే చ తే రసా శ్చ తాన్, విలఙ్ఘ్య విహాయ, మనః, బబన్ధ దధా వి' త్యర్థః; దౌహృదహేతు కస్య మృద్భక్షణస్య పుత్త్రభోగసూచనార్థత్వ ముత్ప్రేక్షితమ్.

---

'న మే హ్రియా శంసతి కిఞ్చి దీప్సితమ్;
స్పృహావతీ వస్తుషు కేషు మాగధీ ?'
ఇతి స్మ పృచ్ఛ త్యనువేల మాదృతః
ప్రియాసఖీ రుత్తరకోసలేశ్వరః. 5

టీక.— మాగధీ = సుదక్షిణ, హ్రియా = సిగ్గుచేత, కించిత్ = ఏమియు, ఈప్సితం = కోరికను, మే = నాతో, న శంసతి = చెప్పదు ; కేషు వస్తుషు = ఏవ స్తువులమీఁద, స్పృహావతీ = కోరికగలది, ఇతి = ఇట్లని, అనువేలం = ప్రతినిముసమం దును, ఆదృతః = ఆదరించినవాఁడై, ఉత్తరకోసలేశ్వరః= దిలీపమహారాజు, ప్రియాస ఖీః - ప్రియా = కాంతయయిన సుదక్షిణాదేవియొక్క - సఖీః = చెలికత్తెలను, పృచ్ఛతి స్మ = అడిగెను.

తా.—'మీచెలి తనకేది కావలయునో సిగ్గుచే నాతో ఏమియు చెప్పకున్నది. దేవికి దేనిమీఁద మనస్సున్నదో మీరు చెప్పుఁడు, తెప్పించెదను.' అని మాటి మాటికి ఆదర పూర్వకముగా దిలీపమహారాజు సుదక్షిణాదేవియొక్క చెలికత్తెలను అడుగుచుండెను.

వ్యా. నేతి.—మగధస్య రాజ్ఞోఽపత్యం స్త్రీ మాగధీ సుదక్షిణా * 'ద్వ్యఞ్మగధకళిఙ్గ శూరమసా దణ్' ఇత్యణ్, హ్రియా లజ్జయా, కిఞ్చిత్ కిమపి, ఈప్సిత మభీష్టం, మే మహ్యం, న శంసతి నాచష్టే; కేషు వస్తుషు స్పృహావతీ, ఇతి, అనువేల మనుక్షణ, మాదృతః ఆదృతవాక్ * కర్తరి క్తః * 'ఆదృతౌ సాదరార్చితా వి' త్యమరః, క్రియాయాః - 'ప్రేయసాః - సఖీః సహచరీః, ఉత్తరకోసలేశ్వరో దిలీపః - పృచ్ఛతిస్మ పప్రచ్ఛ * 'లట్స్మే' ఇతి భూతే లట్; సఖీనాం విస్రమ్భ భూమిత్వా దితి భావః.

---

ఉపేత్య సా దోహదదుఃఖశీలతాం
యదేవ వవ్రే త దపశ్య దాహృతమ్;
న హీ ష్ట మస్య త్రిదివేఽపి భూపతే
రభూ దనాసాద్య మధిజ్యధన్వనః. 6

టీక.— సా = ఆసుదక్షిణాదేవి, దోహ...తాం - దోహద = వేవిళ్లచేత - దుఃఖశీలతాం = వగపుస్వభావము కలిగియుండుటను, ఉపేత్య = పొంది, యత్ =ఏవస్తువును, వవ్రే = కోరెనో, తత్ = ఆవస్తువును, ఆహృతం = తేఁబడినదానివిగా, అపశ్యదేవ = తప్పకుండచూచెను. హి = ఏకారణమువలన, అధిజ్యధన్వనః - అధిజ్య= ఎక్కువెట్టఁబడిన ధన్వనః = విల్లుకల్గినట్టి, అస్య = ఈ, భూపతేః = దిలీపమహారాజునకు, ఇష్టం = కోరఁబడినవస్తువు, త్రిదివే అపి = స్వర్గమందుసయితము, అనాసాద్యం = పొంద శక్యము కానిది, నాభూత్ = లేదాయెను.

తా.—సుదక్షిణాదేవి వేవిళ్లవలని వగపు స్వభావముచేత దేనిని కోరినను ఆరాజు తప్పక యిచ్చెను. అది యెట్లన, దేవేంద్రుఁడయినను ఆయనతో పోరజాలిచి ఆయన కోరిన వస్తువును ఆయన కిచ్చి ధన్యుఁ డగును; కావున ఆమెకు దొరకని దేదియు లేదాయెను.

వ్యా.— ఉపేత్యేతి.—సా సుదక్షిణా, దోహదం గర్భిణీమనోరథః * 'దోహదం దోహలం శ్రద్ధా లాలస శ్చ సమం మత మి'తి హలాయుధః - దోహదేన - దుఃఖశీలతాం దుఃఖస్వభావతాం, ఉపేత్య ప్రాప్య, య ద్వస్తు, వవ్రే ఆచకాఙ్క్షే, త ద్వస్తు, ఆహృత మానీతం - భర్త్రేతి శేషః, అపశ్య దేవ అలభ తే త్యర్థః ; కుతః -

హి యస్మాత్ కారణాత్, అస్య భూపతేః, ఇష్టం వస్తు, త్రిదివే స్వర్గేఽపి,అనాసాద్య మప్రాప్యం, నాభూత్; కిం యాచనయా? నే త్యాహ-అధిజ్యధన్వన ఇతి.—న హి వీరపత్నీనా మలభ్యం కిఞ్చి ద స్తీతి భావః:—అత్ర బాహటః*'పాదశ్లోషా విదాహ శ్చ శ్రద్ధా చ వివిధాత్మి కే'తి; ఏతచ్చ పత్నీమనోరథపూరణమ్ అకరణే దృష్టదోషసంభవాత్ - న తు రాజ్ఞః స్త్రీలౌల్యాత్ ; త దుక్తం -

'దేయ మ ప్యహితం తస్యై హితోపహిత మల్పకం,
శ్రద్ధావిఘాతా ద్గర్భస్య వికృతి శ్చ్యుతి రేవ వా.'

అన్య చ్చ, 'దోహద స్యాప్రదానేన గర్భో దోష మవాప్నుయాత్' ఇతి.

---

క్రమేణ ని స్తీర్య్య చ దోహదవ్యథాం
ప్రచీయమానావయవా రరాజ సా
పురాణపత్త్రాపగమా దన న్తరం
ల తేవ సన్నద్ధమనోజ్ఞపల్లవా. 7

టీక.—సా=ఆసుదక్షిణాదేవి, క్రమేణ=కాలక్రమమున, దోహదవ్యథాం చ-దోహద=వేవిళ్ల చేతనైన - వ్యథాం చ=వగపును గూడ, నిస్తీర్య=దాటి, ప్రచీ...వా సతీ - ప్రచీయమాన = పుష్టి చెందుచున్న - అవయవా సతీ = అంగములు గలదై, పురా...త్ - పురాణ = ప్రాంతమైన - పత్త్ర = ఆకులయొక్క - అపగమాత్ = పోకకు, అనన్తరం = తర్వాత, సన్నద్ధ...వా - సన్నద్ధ = పుట్టిన - మనోజ్ఞ = సొంపులైన - పల్లవా = చిగురుటాకులు గలిగిన, ల తేవ = తీగవలె, రరాజ = ప్రకాశించెను.

తా.—సుదక్షిణాదేవి కొన్నాళ్లకు, వేవిళ్లబాధ తీఱి, అవయవములు పుష్టిం జెందుచు, పండుటాకులు రాలి చిగిర్చిన తీఁగవలె ప్రకాశించినది.

వ్యా.—క్రమే ణేతి.—సా సుదక్షిణా, క్రమేణ, దోహదవ్యథాం చ,ని స్తీర్య్య, ప్రచీయమానావయవా పుష్యమాణావయవా సతీ, పురాణపత్త్రాపగమా దన న్తరం, సన్నద్ధాః సంజాతాః-ప్రత్యగ్రత్వా న్మనోజ్ఞాః పల్లవాః యస్యాః సా, ల తేవ రరాజ,

---

దినేషు గచ్ఛత్సు నితా న్త పీవరం
తదీయ మానీలముఖం స్తనద్వయమ్
తిరశ్చకార భ్రమరాభిలీనయోః
సుజాతయోః పఙ్కజకోశయోః శ్రియమ్. 8

టీక.—దినేషు = దినములు, గచ్ఛత్సు సత్సు = కడవఁగా, నితాన్తపీవరం - నితాన్త=మిక్కిలి - పీవరం = బలిసినట్టియు, ఆనీలముఖం - ఆనీల = అంతటను నల్లనయిన - ముఖం = మొనలుగలయట్టియు, తదీయం = ఆమెదయిన, స్తనద్వయం = స్తన=చన్నులయొక్క - ద్వయం=దోయి, భ్రమ...యోః—భ్రమర = తేంట్లచేత - అభిలీనయోః=పొదువుకొనఁబడిన, సుజాతయోః=అందములయిన పఙ్క...యోః—పఙ్కజ = తామరలయొక్క - కోశయోః = మొగ్గలయొక్క, శ్రియం = సొంపును, తిరశ్చకార=ధిక్కరించెను.

తా.—పిమ్మట దినములు గడచినకొలఁదియు సుదక్షిణాదేవియొక్క చనుదోయి మిక్కిలి పుష్టి చెందినది; మొనలు అంతటను నల్లనయినవి; అట్టి యాచనుఁగవతుమ్మెదలు పై నెలకొన్న యందంపుఁ దామరమొగ్గల జంటవలె శోభిల్లుచుండినది.

వ్యా.—లక్షణాన్తరం వర్ణయతి - దినే ష్వితి.—దినేషు దోహదదినేషు, గచ్ఛత్సు సత్సు, నితాన్తపీవర మతిస్థూలమ్, ఆ సమన్తా - న్నీలే - ముఖే-చూచుకే - యస్య తత్, తదీయం సుదక్షిణాసంబన్ధి, స్తనద్వయం, భ్రమరై - రభిలీనయోః అభివ్యాప్తయోః, సుజాతయోః, సున్దరయోః, పఙ్కజకోశయోః కమల కుట్మలయోః శ్రియం, తిరశ్చకార;అత్ర బాహటః*'అష్టేమ్పతా స్తనా పీనా సున్దరా కృష్ణచూచుకావి'తి.

---

నిధానగర్భా మివ సాగరామ్బరాం,
శమీ మి వాభ్యన్తరలీనపావకామ్,
నదీ మి వాన్తస్సలిలాం సరస్వతీం
నృపః ససత్త్వాం మహిషీ మమన్యత. 9

టీక.—నృపః = రాజు, ససత్త్వాం = గర్భిణియయిన, మహిషీం = పట్టపుదేవిని, నిధానగర్భాం - నిధాన = నిక్షేపము - గర్భాం = కడుపులోఁగల, సాగరామ్బరా మివ = భూమినిం బోలె, అభ్య...కామ్ - అభ్యన్తర = లోపల - లీన = అణఁగియున్న - పావకాం = అగ్నిగలయట్టి, శమీ మివ = జమ్మిచెట్టునుం బోలెను, అన్తస్సలిలామ్ - అన్తః = (భూమి) లోపల - సలిలాం=నీరుగలయట్టి, సరస్వతీం = సరస్వతి యనెడి, నదీమివ = ఏటినింబోలెను, అమన్యత = తలఁచెను.

తా.—దిలీపమహారాజు గర్భిణి యయిన సుదక్షిణాదేవిని, రత్ననిధి కడుపులోఁగల భూమినింబోలెను, లోపల అగ్నిగల జమ్మిచెట్టునుంబోలెను, అంతర్వాహిని యగు సరస్వతీనదినిం బోలెను, తలంచెను.—ఆమెగర్భములో నున్నశిశువు సర్వశ్రేష్ఠుఁడును, తేజస్వియు, పవిత్రుఁడును, అగు నని తలంచెను, అని భా.

వ్యా.—నిధా నేతి.—నృపః, దిలీపః, ససత్త్వామ్ ఆపన్నసత్త్వాం - గర్భిణీ మి త్యర్థః, మహిషీం కృతాభిషేకాం * 'కృతాభిషేకా మహిషీ' త్యమరః. నిధానం గర్భో యస్యా స్తాం నిధానగర్భాం, సాగరః - అమ్బరం వస్త్రం - యస్యా స్తాం - సాగరామ్బరాం - సముద్రవసనా మి త్యర్థః * 'అమ్బరం వ్యోమ్ని వాస సీ, త్యమరః, భువ మివ, అభ్యన్తరే లీనః పావకో యస్యా స్తాం, శమీ మివ - శమీతరో వహ్ని ర స్తీ త్యత్ర లిఙ్గం * శ్రు. 'శమీగర్భా దగ్నిం మన్థ తీ' తి, అన్తస్సలిలా మన్తర్గతజలాం, సరస్వతీం నదీ మివ, అమన్యత; ఏతేన - గర్భస్థితశిశోః సార్వభౌమత్వం తేజస్విత్వం పవిత్రత్వం చ వివక్షితమ్.

---

ప్రియానురాగస్య మనస్సమున్నతే
భుజార్జితానాం చ దిగన్తసంపదామ్
యథాక్రమం పుంసవనాదికాః క్రియా
ధృతే శ్చ ధీరః సదృశీ ర్వ్యధత్త సః. 10

టీక.—ధీరః = విద్వాంసుఁడయిన, సః = ఆదిలీపమహారాజు, ప్రియా... స్య— ప్రియా = కాంతయందలి = అనురాగస్య=ప్రేమకును, మనస్సమున్న తేః = ఔదార్యమునకును, భుజార్జితానాం - భుజ = బాహుబలముచేత - అర్జితానాం= సంపాదింపఁబడిన, దిగన్తసంపదాం చ-దిక్=దెసలయొక్క-అన్త = తుదలయందలి - సంపదాం చ=సిరులకు ను, ధృతే శ్చ = (పుత్త్రుఁడు గల్గు నను) సంతోషమునకు ను, సదృశీః=అనురూపములయినట్టి, పుంసవనాదికాః-పుంసవన = పుంసవనము-ఆదికాః= మొదలయిన, క్రియాః = శుభకర్మలను, యథాక్రమం=వరుసగా, వ్యధత్త = చేసెను.

తా.—విద్వాంసుఁడయిన యా దిలీపమహారాజు కాంతమీఁది ప్రేమకును, ఔదార్యమునకును, బాహు పరాక్రమముచే దిగంతమునుండిఁ గొనివచ్చి తెచ్చిన సిరులకును, పుత్త్రుఁడు జనించు నను సంతోషమునకును, అనుగుణమయిన విభవాదికముతో క్రమముగా పుంసవనాదికర్మలను జరిపించెను.

వ్యా.—ప్రియేతి.—ధీరః స దిలీపః, ప్రియాయాం ప్రేయస్యాం - అనురాగస్య, మనస్సమున్నతే రౌదార్యస్య' భుజేన భుజబలేన - అర్జితానాం సంపాదితానాం - న తు వాణిజ్యాదినా, దిగన్తేషు సంపదాం, ధృతే శ్చ పుత్త్రో మే భవిష్య తీతి సంతోషస్య చ * 'ధృతి ర్యోగాన్తరే ధైర్యే ధారణాకారతుష్టి ష్వి'తి విశ్వః, సదృశీః అనురూపాః, పుమాన్ సూయతే అనే నేతి పుంసవనం - తదాది ర్యాసాం తాః, క్రియాః, యథాక్రమం క్రమ మనతిక్రమ్య, వ్యధత్త కృతవాన్; ఆది

శబ్దేన అనవలోభన సీమన్తోన్నయనే గృహ్యేతే; అత్ర మాసి ద్వితీయే తృతీయే వా పుంసవనం - యదాహ *'పుంసో నక్షత్రేణ చన్ద్రమా యుక్తః స్యా'దితి పారస్కరః, * 'చతుర్థే మా స్యనవలోభన మి'త్యాశ్వలాయనః, * 'షష్ఠేఽష్టమే వా సీమన్తోన్నయన మి'తి యాజ్ఞవల్క్యః.

---

సురేన్ద్రమాత్రాశ్రితగర్భగౌరవాత్
ప్రయత్నముక్తాసనయా గృహాగతః
తయోపచారాఞ్జలిఖిన్నహస్తయా
ననన్ద పారిప్లవనేత్రయా నృపః. 11

టీక.—గృహాగతః - గృహ = ఇంటికి-ఆగతః = వచ్చినట్టి, నృపః = దిలీప మహారాజు, సురేన్ద్ర...త్ - సురేన్ద్ర = దిక్పాలకులయొక్క-మాత్రా=అంశలచేత - ఆశ్రిత = ప్రవేశింపఁబడిన - గౌరవాత్=బరువువలన, ప్రయ...యా - ప్రయత్న= శ్రమచేత - ముక్త = వదలఁబడిన - ఆసనయా=పీఠముగలదియు, ఉప...యా-ఉప చార = పూజార్థ మయిన - అఞ్జలి = చేమోడ్పుచేయుటయందు-ఖిన్న = అలసిన - హస్తయా = చేతులుగలదియు, పారి...యా - పారిప్లవ = చంచలములయిన-నేత్ర యా = కన్నులు గలదియు, (అయిన), తయా = ఆ సుదక్షిణాదేవి చేత, ననన్ద = సంతోషించెను.

తా.—దిలీపమహారాజు తాను సుదక్షిణాదేవి యింటికి వచ్చుచో, ఆమె ఇంద్రాది దిక్పాలుర యంశములు గర్భములో చొచ్చియున్న బరువుచేత ఆసనమునుండి లేచునప్పుడు ఆయాస మొందుటయు, గౌరవార్థము అంజలిచేయునప్పుడు చేతులు అలఁతచెందుటయు, నేత్రములు చంచలించుటయుం, గాంచి, యీ బడలికచిన్నెలచేత, తనూజుఁడుగలుగును గదా యని సంతోషించెను.

వ్యా.—సురేన్ద్రేతి.—గృహాగతః - గృహం ప్రత్యాగతః, నృపో దిలీపః, సురేన్ద్రాణాం లోకపాలానాం-మాత్రాభి రంశైః - ఆశ్రితస్య అనుప్రవిష్టస్య - గర్భస్య గౌరవాత్, ప్రయత్నేన - ముక్తాసనయా ఆసనాదుత్థిత యే త్యర్థః, ఉపచార స్యాఞ్జలా అఞ్జలి కరణే - ఖిన్నహస్తయా, పారిప్లవనేత్రయా చఞ్చలాక్ష్యా * 'చఞ్చలం తరలం చైవ పారిప్లవ పరిప్లవే' ఇత్యమరః,సుదక్షిణయా, ననన్ద సంతోషితవాన్; సురేన్ద్రమాత్రాశ్రి తేత్యత్ర మనుః *'అష్టాభిశ్చ సురేన్ద్రాణాంమాత్రాభిర్నిర్మితో నృప' ఇతి.

---

కుమారభృత్యాకుశలై రనుష్ఠితే
భిషగ్భి రాప్తై రథ గర్భభర్మణి

పతిః ప్రతీతః ప్రసవోన్ముఖీం ప్రియాం
దదర్శ కాలే దివ మభ్రితా మివ. 12

టీక.—అథ = అటుతర్వాత, కుమార...లైః - కుమారభృత్యా = బాలచికిత్స యందు - కుశలైః = నేర్పరులును - ఆప్తైః = హితులును, (అయిన), భిషగ్భిః=వైద్యులచేత, గర్భభర్మణి - గర్భ = గర్భముయొక్క - భర్మణి = పోషణము, అనుష్ఠితే సతి = చేయఁబడఁగా, కాలే = పదియవనెలలో-వేసవి తుదను అనియు, ప్రసవోన్ముఖీం - ప్రసవ = కానుపునకు - ఉన్ముఖీం=అభిముఖురాలయిన, ప్రియాం=దయితను, అభ్రితాం = మేఘములుగలదైన, దివ మివ=నింగినింబోలె, పతిః = పెనిమిటి, ప్రతీతః సన్ = సంతసించినవాఁడై, దదర్శ = కాంచెను.

తా.—అటుతర్వాత మహారాజు గర్భరక్షణమందు నేర్పరులైన యాప్తవైద్యులచేత గర్భమును కాపాడించుచుండెను ; పదియవనెలయు వచ్చెను; అంతట కాన్పునకు సిద్ధముగానున్న భార్యను, ఆమహారాజు, వేసవి ముగియుందు మబ్బునిండి వర్షింప నున్న నింగినింబోలె సంతుష్టితో చూచుచుండెను.

వ్యా.—కుమారేతి.—అథ, కుమారభృత్యా - బాలచికిత్సా * 'సంజ్ఞాయాం సమజ నిష దే'త్యాదినా క్యప్- తస్యాం- కుశలైః, ఆప్తైః హితైః, భిషగ్భిః వైద్యైః, గర్భస్య - భర్మణి భరణే పోషణే * క్లీబే హేమ్ని భృతౌ భర్మే'తి శాశ్వతః * భృతే ర్మనిన్ ప్రత్యయః, అనుష్ఠితే కృతే సతి, కాలే దశమే మాసి - అన్యత్ర గ్రీష్మావసానే, ప్రసవస్య గర్భమోచనస్య - ఉన్ముఖీ మాసన్నప్రసవా మి త్యర్థః*'స్యా దుత్పాదే ఫలే పుష్పే ప్రసవో గర్భమోచన'ఇ త్యమరః, ప్రియాం సుదక్షిణామ్, అభ్రాణ్యస్యాః సంజాతా నీ త్యభ్రితాం * 'త దస్య సంజాతం - తారకాదిభ్య ఇత జి' తి ఇతచ్, దివ మివ, పతిః భర్తా, ప్రతీత స్తుష్ట స్సన్*'ఖ్యాతే హృష్టే ప్రతీతః స్యా' ది'త్యమరః, దదర్శ; గర్భకర్మ ణీతి పాఠే గర్భాధానప్రతీతా వౌచిత్యభఙ్గః.

---

గ్రహై స్తతః పఞ్చభి రుచ్చసంస్థితై
రసూర్యగైః సూచితభాగ్యసంపదమ్
అసూతపుత్త్రం సమయే శచీసమా
త్రిసాధనా శక్తి రి వార్థ మక్షయమ్. 13

టీక.—తతః = తర్వాత, శచీసమా - శచీ = ఇంద్రాణితో - సమా = సమానురాలయిన, సా = ఆసుదక్షిణాదేవి, సమయే = పదియవనెలలో, ఉచ్చసంస్థితైః - ఉచ్చ = ఉచ్చస్థానములయందు - సంస్థితైః = ఉన్నవై, అసూర్యగైః = సూర్యుని

తోఁజేరనివైన, పఞ్చభిః = అయిదు, గ్రహైః = గ్రహములచేత, సూచి...దం. సూచిత = తెలుపఁబడిన - భాగ్యసంపదం=భాగ్యాతిశయముగల, పుత్త్రం=తనయుని, త్రిసాధనా - త్రి = (ప్రభావ మంత్రోత్సాహములనెడి) మూఁడు-సాధనా=ఉత్పాదకములుఁగల, శక్తిః = శక్తి, అక్షయం=తఱుఁగని, అర్థ మివ = అర్థమునుం బోలె, అసూత = కనెను.

తా.—తరువాత అయిదుగ్రహములు సూర్యునితోఁ జేరక తమతమ యుచ్చస్థానములందు ఉన్నవై జాతకుఁడు మహాభాగ్య సంపన్నుఁ డగు నని సూచించుచున్న లగ్నమునందు, ఇంద్రాణీ సమానురాలు సుదక్షిణాదేవి-ప్రాభవమంత్రోత్సాహము లనెడు మూఁడు సాధనములు గలదైనశక్తి ఎట్లు తగ్గనియర్థమును కలిగించునో అట్లు-పుత్త్రునిం గనియెను.

వ్యా.—గ్రహై రితి.— తతః,ఇన్ద్రాణ్యా సమా * 'పులోమజా శచీన్ద్రాణీ' త్యమరః, సా సుదక్షిణా, సమయే ప్రసూతికాలే సతి-దశమే మాసీ త్యర్థః*'దశమే మాసి సూతవ' ఇతి శ్రుతేః, ఉచ్చసంస్థితైః తుఙ్గస్థానగైః,అసూర్యగైః అనస్తమితైః, యైః కైశ్చి ద్యథాసంభవం, పఞ్చభి ర్గ్రహైః, సూచితా భాగ్యసంప ద్యస్య తం, పుత్త్రం,త్రీణి ప్రభావమన్త్రోత్సాహాత్మకాని - సాధనా న్యుత్పాదకాని - యస్యాః సా త్రిసాధనా, శక్తిః * 'శక్తయ స్తిస్రః ప్రభా వోత్సాహ మన్త్రజా ఇ' త్యమరః, అక్షయ మర్థ మివ,అసూత*షూఙ్ ప్రాణిగర్భ విమోచన ఇత్యాది షూపపద్యతే-అస్మా ద్ధాతోః కర్తరి లఙ్ ; అ త్రేద మనుసంధేయమ్ -

'అజవృషభమృగాఙ్గనాకుళీరా ఝషవణిజౌ చ దివాకరాది తుఙ్గా
దశ శిఖి మనుయు క్తి థీన్ద్రియాంశై స్త్రినవక వింశతిభి స్తద స్తనీచాః.' ఇతి,

సూర్యాదీనాం సప్తానాం గ్రహాణాం మేషవృషభాదిరాశయః శ్లోకోక్తక్రమవిశిష్టాః ఉచ్చస్థానాని,స్వ స్వోత్తుఙ్గాపేక్షయా సప్తమస్థానాని యాని తాని నీచాని;తత్రోచ్చే ష్వపి దశమాదయో రాశిత్రింశాంశాః యథాక్రమ ముచ్చేషు పరమోచ్చాః నీచేష్వపి పరమనీచాః ఇతి జాతకశ్లోకార్థః; అత్రాంశ స్త్రింశో భాగః-యథాహ నారదః. * 'త్రింశద్భాగాత్మకం లగ్న' మితి.సూర్యస్య ప్రత్యాసత్తి హి గ్రహాణా మస్తమయో నామేత దుక్తం లఘుమానసే*'రవిణాస్తమయో యోగో వియోగ స్తూదయో భవేది'తి, తే చ స్వోచ్చస్థాః ఫల స్తీతి నాస్తగా నాపి నీచగాః ; తదుక్తం రాజమృగాఙ్కే -

'స్వోచ్చే పూర్ణం స్వర్క్ష గేఽర్ధం సుహృద్భే పాదం ద్విడ్భేఽల్పం శుభం ఖేచరేన్ద్రః.
నీచస్థాయీ చాస్తగో వా న కిఞ్చి త్పాదన్యానం స్వత్రికోణే దదాతి'. ఇతి.

త దిద మాహ కవిః 'ఉచ్చసంస్థితై - రసూర్యగై రి'తి చ - ఏవం సతి యస్య జన్మకాలే పఞ్చ గ్రహాః స్వోచ్చస్థాః స దేవతుల్యో భవతి - త దుక్తం కృష్ణీయే -

'సుఖినః ప్రకృష్టకార్యా రాజప్రతిరూపకాశ్చ రాజానః
ఏక ద్వి త్రి చతుర్భి ర్జాయన్తే తతః పరం దివ్యాః.' ఇతి.
త దిద మాహ పఞ్చభి రితి.

---

దిశః ప్రసేదు, ర్మరుతో వవుః సుఖాః,
ప్రదక్షిణార్చి ర్హవి రగ్ని రాదదే,
బభూవ సర్వం శుభశంసి తత్క్షణం,
భవో హి లోకాభ్యుదయాయ తాదృశామ్ 14

టీక.—తత్క్షణం = ఆపుత్త్రజననక్షణమందు, దిశః = దిక్కులు, ప్రసేదుః = నిర్మలములు లయినవి; మరుతః = వాయువులు, సుఖాః = హాయి సేయునవిగా, వవుః= వీచినవి; అగ్నిః = హుతభుజుఁడు, ప్రదక్షిణార్చిః సన్ - ప్రదక్షిణ = ప్రదక్షిణముగా తిరుగునట్టి - అర్చిః సన్ = జ్వాలలుగలవాఁడై, హవిః = ఆహుతిని, ఆదదే = గ్రహించెను; ఇత్థం = ఈప్రకారముగా, సర్వం=సమస్తము, శుభశంసి - శుభ=మంగళమును, శంసి=తెలుపునది, బభూవ = ఆయెను; తథా హి = అది సరియే గదా, తాదృశాం = అట్టివారియొక్క, భవః=పుట్టువు లోకా...య - లోక=జగములయొక్క = అభ్యుదయాయ = మేలుకొఱకు, (భవతి = అగును).

తా.—ఆసుతుఁడుజనించిన తత్క్షణమే దిక్కులునిర్మలము లయినవి. గాలి హాయి యగునట్లుగా వీచినది. అగ్ని ప్రదక్షిణజ్వాలలతో ఆహుతిని స్వీకరించినది. ఈవిధముగా సమస్తమును మంగళసూచకముగా నుండెను. ఏలయన అట్టిమహాపురుషుల జననమువలన లోకములకు మేలు గలుగును గదా.

వ్యా.—దిశ ఇతి.—తత్క్షణం - తస్మిన్ క్షణే *అత్యన్తసంయోగే ద్వితీయా, దిశః, ప్రసేదుః ప్రసన్నా బభూవుః, మరుతో వాతాః, సుఖాః మనోహరాః, వవుః వాన్తి స్మ *'వా గతి గన్ధనయోః'-లిట్, అగ్నిః, ప్రదక్షిణార్చిః సన్, హవి రాజ్యాదికమ్ ఆదదే స్వీచకార, ఇత్థం, సర్వం, శుభశంసి శుభసూచకం, బభూవ; తథా హి - తాదృశాం రఘుప్రకారాణాం, భవో జన్మ, లోకాభ్యుదయాయ, భవ తీతి శేషః; అతో దేవా అపి సంతుష్టా ఇ త్యర్థః.

---

అరిష్టశయ్యాం పరితో విసారిణా
సుజన్మన స్తస్య నిజేన తేజసా

నిశీథదీపాః సహసా హతత్విషో
బభూవు రాలేఖ్యసమర్పితా ఇవ. 15

టీక.—అరిష్ట...తః - అరిష్ట = పురుటింటి యందలి, శయ్యాం పరితః= పడక యంతటను, విసారిణా = పర్వుచుండెడు, సుజన్మనః = మంచిపుట్టకగల, తస్య = ఆశిశువుయొక్క, నిజేన = తనదైన, తేజసా = కాంతిచేత, సహసా = తటాలున, హతత్విషః - హత = కొట్టఁబడిన - త్విషః= కాంతులుగలవై, నిశీథదీపాః - నిశీథ = నడికిరేయియందలి - దీపాః = దివ్వెలు, ఆలేఖ్య...వ - ఆలేఖ్య = చిత్తరువునందు - సమర్పితా ఇవ = ఉంపఁబడినవి వోలె, బభూవుః = అయినవి.

తా.—జననమయిన వెంటనే పురుటి పానుపు చుట్టును అంతటను పర్విన యా పుణ్యాజన్ముని దేహతేజము ముందర నడిరాతిరి దీపములు తటాలున వెల్వెలఁబొటి చిత్తరువులో వ్రాసినవానివలె నయినవి.

వ్యా.—అరి ష్టేతి.—అరిష్టం సూతికాగృహం*'అరిష్టం సూతికాగృహ మి' త్యమరః - తస్మిన్ యా శయ్యా - తాం, పరితః సర్వతః * 'అభితః పరితః సమయా నికషా హా ప్రతి యోగేఽపి' -తి ద్వితీయా, విసారిణా వ్యాపినా, సుజన్మనః తస్య శిశోః, నిజేన నైసర్గికేణ, తేజసా, సహసా, హతత్విషః, నిశీథదీపాః అర్ధరాత్రదీపాః * అర్ధరాత్ర నిశీథౌ ద్వౌ వి' త్యమరః, ఆలేఖ్యే చిత్రే-సమర్పితా ఇవ, బభూవుః- నిశీథశబ్దో దీపానాం ప్రభాధిక్యసంభావ నార్థః.

---

జనాయ శుద్ధాన్తచరాయ శంసతే
కుమారజన్మామృతసమ్మితాక్షరమ్
అదేయ మాసీత్ త్రయ మేవ భూపతేః
శశిప్రభం ఛత్త్ర ముభే చ చామరే. 16

టీక.—భూపతేః = దిలీపమహారాజునకు, అమృ... రమ్ - అమృత = అమృతములో - సమ్మిత = సమానములయిన - అక్షరం = వర్ణములుగలదైన, కుమారజన్మ - కుమార = పుత్త్రునియొక్క - జన్మ = పుట్టువును, శంసతే = చెప్పుచున్న, శుద్ధా...య - శుద్ధాన్త = అంతఃపురమందు - చరాయ = తిరుగునట్టి,జనాయ=జనమునకొఱకు, శశిప్రభం - శశి = చంద్రునియొక్క-ప్రభం = కాంతివంటి కాంతిగల, ఛత్త్రం = గొడుగును, ఉభే = రెండైన, చామరే చమరీచోపులును, త్రయ మేవ=మూఁడే, అదేయం = ఈఁ గూడనిది, ఆసీత్ = అయెను.

తా —కొడుకు పుట్టె నని అమృతసమానవర్ణముల శుభవార్తను తనకు చెప్పుచున్నట్టి యంతఃపురచరులకు దిలీపమహారాజు తన చేతి కందినదాని నెల్ల బహుమతి చేసెను. అట్లిచ్చుటలో తప్పినట్టివి మూఁడే; చంద్రునిప్రభవంటి ప్రభగల దైన వెల్లగొడుగును, రెండు వీచోపులును; ఇవి రాజ చిహ్నములయినందున ఈఁదగినవి కావాయెను—అంత యవ్వారిగా నొసంగె నని భా.

వ్యా.—జనా యేతి.—భూపతే ర్దిలీపస్య, అమృతసమ్మితాక్షరమ్,అమృతసమానాక్షరం * 'సరూప సమ సమ్మితా ' ఇ త్యావ దణ్డీ, కుమారజన్మ పుత్రోత్పత్తిం, శంసతే కథయతే, శుద్ధాన్తచరాయ అన్తఃపురచారిణే, జనాయ, త్రయ మేవ,అదేయ మాసీత్; కిం తత్ త్రయం - శశిప్రభం ఛత్త్రమ్, ఉభే చామరే చ ; ఛత్త్రాదీనాం రాజ్ఞః ప్రధానాఙ్గత్వా దితి భావః.

---

నివాతపద్మస్తిమితేన చక్షుషా
నృపస్య కాన్తం పిబతః సుతాననమ్
మహోదధేః పూర ఇ వేన్దుదర్శనా
ద్గురుః ప్రహర్షః ప్రబభూవ నాత్మని. 17

టీక.—నివాత...న - నివాత = గాలిలేనిచోటి - పద్మ = తామరవలె- స్తిమితేన = నిశ్చలమయిన, చక్షుషా = కంటిలో, కాన్తం=మనోహరమయిన, సుతాననం- సుత = పుత్త్రునియొక్క - ఆననం = ముఖమును, పిబతః=త్రాగుచున్న - అనఁగా - మిక్కుటపుఁ దమితో చూచుచున్న, నృపస్య=దిలీపమహారాజునకు, గురుః=మిక్కుటమయిన, ప్రహర్షః = సంతోషము, ఇన్దుదర్శనాత్ - ఇన్దు = చంద్రునియొక్క - దర్శనాత్ = చూచుటవలన, మహోదధేః = మహాసముద్రమునకు, గురుః = అధికమయిన, పూరఇవ = వెల్లివలె, ఆత్మని = దేహమందు, న ప్రబభూవ = ఇముడదాయెను.

తా.—దిలీపమహారాజునకు మనోహర మయిన పుత్త్రముఖమును జెప్పవాల్పక గాలిలేనిచోటి తమ్మివలె నిశ్చలమయిన కంటితో చూచుకొన్నప్పుడు-చంద్రుని చూచుకొన్నప్పుడు మహాసముద్రునికి ఏరీతిగా తనవెల్లి తనయందు ఇముడక పోటువారుచునో-ఆరీతిగా సంతోషము తనయం దిముడక బయటికి వ్యాపించెను.

వ్యా.—నివా తేతి —నివాతో వాతరహితప్రదేశః * నివాతా వాశ్రయావాతా వి' త్యమరః - తత్ర - య త్పద్మం - తద్వత్ - స్తిమితేన నిష్పన్దేన నిశ్చలే నేతి యావత్, చక్షుషా, కాన్తం మనోహరం * 'కాన్తం మనోహరం రుచ్య మి'

త్యమరః, సుతాననం, పిబతః తృష్ణయా పశ్యతః. నృపస్య దిలీపస్య, గురు రుత్కటః, ప్రహర్షః కర్తా, ఇష్టదర్శనాత్, గురుః, మహోదధేః, పూరో జలౌఘః, ఇవ, ఆత్మని శరీరే, న ప్రబభూవ స్థాతుం న శశాక - అన్త ర్న మాతి స్మేతి యావత్ - న వ్యాల్పాధారే అధికం నీయత ఇతి భావః - య ద్వా ఆత్మని స్వస్మిన్విషయే, న ప్రబభూవ ఆత్మానం నియన్తుం న శశాక, కిం తు బహి ర్నిర్జగా మే త్యర్థః.

---

స జాతకర్మ ణ్యఖిలే తపస్వినా
తపోవనా దేత్య పురోధసా కృతే
దిలీపసూను ర్మణి రాకరోద్భవః
ప్రయుక్తసంస్కార ఇ వాధికం బభౌ. 18

టీక.—సః దిలీపసూనుః = ఆ దిలీపకుమారుఁడు, తపస్వినా = తపస్సుగలవాఁడైన, పురోధసా = పురోహితునిచేత - అనఁగా - వసిష్ఠులవారిచేత, తపోవనాత్ = ఆశ్రమమునుండి, ఏత్య = వచ్చి ( * కర్త్రన్తకవాక్యాంగముగా ఇట్టి కర్త్రర్థకరూపప్రయోగము ఆంధ్రభాషామర్యాద గాదు), అఖిలే = సకలమయిన, జాతకర్మణి = జాతకర్మయను సంస్కారమును, కృతే సతి = చేయఁబడఁగా, ప్రయు...రః—ప్రయుక్త = కావింపఁబడిన - సంస్కారః = సానఁబట్టుటగలిగిన, ఆకరోద్భవః - ఆకర = గని యందు - ఉద్భవః = పుట్టుకగలయట్టి, మణి రివ = రత్నమువలె, అధికం = మిక్కిలి, బభౌ = ప్రకాశించెను.

తా.—ఆకుమారునికి కులపురోహితులు వసిష్ఠులవారు ఆశ్రమమునుండివచ్చి జాతకర్మమును సమగ్రముగా కావించిరి. అంతట - గనిలో పుట్టినమణికి సానఁబట్టుటచేత తేజు హెచ్చినరీతిగా పురోహితులవారి తపోమహిమచేత వీర్యవత్తరం బయిన యాసంస్కారమువలన జాతకునికి తేజ మతిశయించెను.

వ్యా.—స ఇతి.—స దిలీపసూనుః, తపస్వినా పురోధసా వసిష్ఠేన-తపస్విత్వా దనుష్ఠితం కర్మ సవీర్యం స్యా దితి భావః, తపోవనాత్, ఏత్య ఆగత్య, అఖిలే, జాతకర్మణి జాతస్య కర్తవ్యే సంస్కారవిశేషే, కృతే సతి, ప్రయుక్తః సంస్కారః శాణోల్లేఖనాది ర్యస్య స తథోక్తః, ఆకరోద్భవః ఖనిప్రభవః * 'ఖనిః స్త్రియామాకరః స్యా' ది త్య' మరః, మణి రివ, అధికం బభౌ; వసిష్ఠమన్త్రప్రభావాత్ తేజిష్ఠోఽభూ దిత్యర్థః, అత్ర మనుః * 'ప్రాజాభివర్ధనాత్ పుంసో జాతకర్మ విధీయత' ఇతి.

---

సుఖశ్రవా మఙ్గళతూర్యనిస్వనాః
ప్రమోదనృత్తైః సహ వారయోషితామ్

న కేవలం సద్మని మాగధీపతేః
పథి వ్యజృమ్భన్త దివౌకసా మపి. 19

టీక —సుఖశ్రవాః - సుఖ = సుఖకర మయిన - శ్రవాః = వినఁబడుటకలవి; మఙ్గళ...నాః—మఙ్గళ = శుభార్థములయిన, తూర్య = వాద్యములయొక్క - నిస్వనాః = ధ్వనులు, వారయోషితాం = భోగపుఁజానలయొక్క, ప్రమో...హ— ప్రమోద = సంతోషముతోడి - నృత్తైః సహ = ఆటలతోఁగూడ, మాగధీపతేః = దిలీపమహారాజుయొక్క, సద్మని కేవలం న = ఇంటను మాత్రమే గాక, దివౌకసాం= వేల్పులయొక్క, పథి అపి=దారిలో (ఆకాశములో) సయితము, వ్యజృమ్భన్త=పర్విననవి.

తా.—వీనులవిందు లయిన మంగళ వాద్యముల మ్రోఁతలు సంతోషముతోడి వేశ్యా నృత్తములతోఁగూడ దిలీపమహారాజుయొక్క మందిరములో ఎట్లు విస్తరిల్లినవో అట్లే ఆకాశమందును అప్సరోనృత్తములతోడి దేవదుందుభుల మ్రోఁతలును విస్తరిల్లినవి.

వ్యా.—సుఖేతి.— సుఖః-శ్రవః శ్రవణం - యేషాం తే సుఖశ్రవాః శ్రుతి సుఖా ఇ త్యర్థః, మఙ్గళతూర్యనిస్వనాః మఙ్గళవాద్యధ్వనయః, వారయోషితాం వేశ్యా నాం * 'వారస్త్రీ గణికా వేశ్యే' త్యమరః, ప్రమోదనృత్తైః సహ, మాగధీపతే ర్దిలీపస్య, సద్మని కేవలం గృహ ఏవ, న వ్యజృమ్భన్త. కింతు,ద్యౌః ఓకః యేషాం తేదివౌకసో దేవాః * పృషోదరాదిత్వాత్ సాధుః - తేషాం, పథి ఆకాశేఽపి, వ్యజృమ్భన్త; తస్య దేవాంశత్వా ద్దేవోపకారిత్వా చ్చ, దేవదున్దుభయో వినేదు రితి భావః.

---

న సంయత స్తస్య బభూవ రక్షితు
ర్విసర్జయే ద్యం సుతజన్మహర్షితః,
ఋణాభిధానాత్ స్వయ మేవ కేవలం
తదా పితౄణాం ముముచే స బన్ధనాత్. 20

టీక.— సుత...స్సన్ - సుత = కొమరునియొక్క - జన్మ = పుట్టుక చెత - హర్షితః సన్ = సంతోషపెట్టఁబడినవాఁడై, యం = ఎవనినేని, విసర్జయేత్ = విడిపింపవలయు నన్న, రక్షితుః = (చక్కఁగా) పరిపాలించువాఁ డయిన, తస్య = ఆ దిలీపమహారాజునకు, సంయతః = బద్ధుఁడే, న బభూవ = లేఁడాయెను; కింతు = మఱి య్యే మన్నిన్న తదా = ఆకాలమందు, సః = ఆరాజు, పితౄణాం = పితరులయొక్క, ఋణాభిధానాత్ - ఋణ = ఋణమనెడి-అభిధానాత్ = పేరుగల, బన్ధనాత్ = ఖయిదునుండి, స్వయ మేవ కేవలమ్ = తానొకఁడు మాత్రమే, ముముచే = విడుదల యాయెను.

తా.—అభ్యుదయసమయములయందు ఖైదీలను విడుదలసేయుట ప్రభువుల సదాచారము. ఆమహారాజు దేశమందు ఆసనిధర్మపరిపాలనమూలముగా ఖైదీ యెక్కడను లేనందున ఆపుత్త్రజన్మసంతోషసమయమున విడుదల సేయుటకు ఆయనకు ఎవ్వరును దొరకరయిరి. మఱి తానుమాత్త్రము పితౄణ మను పేరి ఖయిదునుండి విడుదలం బడసినాఁడు.

వ్యా.—నేతి.—రక్షితుః సమ్యక్పాలనశీలస్య, అత ఏవ చోరాద్యభావాత్, సంయతో బద్ధః, స బభూవ నాస్తి స్మ; కిం తేనేత్యత ఆహ - విసర్జయే దితి— సుతజన్మహర్షితః సన్ సుతజన్మనా సంతోషితః సన్, యం బద్ధం, విసర్జయేత్ విమోచయేత్; కిం తు తదా, స రాజా, పితౄణాం, ఋణాభిధానాత్ బన్ధనాత్ కేవలమ్ ఏకం యథా తథా - స్వయ మేక ఏవే త్యర్థః* 'కేవలం కృత్స్న ఏక శ్చ కేవల శ్చావధారణ' ఇతి శాశ్వతః, ముముచే * ముచేః కర్మకర్తరి లిట్ - స్వయమేవ ముక్త ఇ త్యర్థః; అస్మిన్నర్థే * 'ఏష వా అనృణో యః పుత్త్రీ'తి శ్రుతిః ప్రమాణమ్.

---

శ్రుతస్య యాయా దయ మన్త మర్భకః,
స్తథా పరేషాం యుధి చే, తి పార్థివః
అవేక్ష్య ధాతో ర్గమనార్థ మర్థవి
చ్చకార నామ్నా రఘు మాత్మసంభవమ్ 21

టీక.—అర్థవిత్ = శబ్దార్థముల నెఱింగినవాఁడయిన, పార్థివః = రాజు, అయమ్ అర్భకః = ఈశిశువు, శ్రుతస్య = శాస్త్రముయొక్క, అన్తం = తుదను, యాయాత్ = పొందఁజాలును, తథా = అట్లే, యుధి = పోరియందు, పరేషాం చ = పగతురయొక్కయు, అన్తం = తుదిని, యాయాత్ = పొందనేర్చును, ఇతి = అను హేతువువలన, ధాతోః = లఘిధాతువుయొక్క, గమనార్థం = గమనరూపార్థమును, అవేక్ష్య= పరికించి, ఆత్మసంభవం = పుత్త్రుని, నామ్నా = పేరిచేత, రఘుం = రఘువునుగా, చకార = చేసెను.

తా.—శబ్దార్థజ్ఞానము కలవాఁడయిన యా దిలీపమహారాజు ఆకుమారుఁడు శాస్త్రముల యంతమునకు పోఁగుటకును - అనఁగా - సకల శాస్త్ర పారగుఁ డగుటకును, అట్లే యుద్ధమందు శత్త్రువులయంతమున కేఁగుటకును - అనఁగా - శత్త్రువుల నెల్ల రూపుమాపుటకును, సమర్థుఁ డగును అను హేతువువలన, పోఁగుట యనునర్థము గలదైన లఘిధాతువునుండి నిష్పన్నమయిన రఘుశబ్దమును ఆకుమారునికి పేరుగా నిడెను.

వ్యా.—శ్రుత స్యేతి —అర్థవి చ్ఛబ్దార్థజ్ఞః, పార్థివో దిలీపః; అయ మర్భక

కః, శ్రుతస్య శాస్త్రస్య, అన్తం పారం, యాయాత్, తథా - యుధి సంగ్రామే, పరేషాం శత్రూణాం చ, అన్తం పారం, యాయాత్ యాతుం శక్నుయా దిత్యర్థః * 'శకి లిఙ్చే' తి శక్యార్థే లిఙ్, ఇతి హేతోః, ధాతోః*'అమి రఘి లఘి గత్యర్థా' ఇతి లఘిధాతోః, గమనార్థం గమనాఖ్య మర్థమ్, అర్థవిత్త్వా - దవేక్ష్య ఆలోచ్య, ఆత్మసంభవం పుత్త్రం, నామ్నా, రఘుం, చకార, * 'లఙ్ఘి బంహ్యోర్నలోప శ్చే' త్యుప్రత్యయే*' వాల మూల ల ఘ్వల మఙ్గులీనాం వా లో రత్వ మాపద్యత' ఇతి వైకల్పికే రేఫాదేశే రఘు రితి సిద్ధమ్. అత్ర శఙ్ఖః * 'ఆశౌచే తు వ్యతిక్రాన్తే నామకర్మ విధీయత' ఇతి.

---

పితుః ప్రయత్నాత్ స సమగ్ర సంపదః
శుభైః శరీరావయవై ర్దినే దినే
పుపోష వృద్ధిం హరిదశ్వదీధితే
రను ప్రవేశా దివ బాలచన్ద్రమాః 22

టీక.—సః = ఆరఘుమహారాజు, సమగ్రసంపదః - సమగ్ర = నిండారిన - సంపదః=సిరిగల, పితుః=తండ్రియొక్క, ప్రయత్నాత్ = జతనము వలన, శుభైః = సొంపుగలవయిన, శరీ...వైః - శరీర = దేహముయొక్క-అవయవైః=అంగములతో, హరి...తేః - హరిదశ్వ=సూర్యునియొక్క - దీధితేః = కిరణములయొక్క,అను ప్రవేశాత్ = చొచ్చుటవలన, బాల చన్ద్రమా ఇవ = లేత చంద్రుని వలె, దినే దినే = నానాటికి, వృద్ధిం = పెంపును, పుపోష = పోషించెను.

తా.—సకల సంపత్సంపూర్ణుం డయిన యా తండ్రియొక్క ప్రయత్నముల చేత అందమయిన యవయవములతో ఆశిశువు - సూర్యుని కిరణములు చొచ్చుటవలన ప్రతిదిన ప్రవర్ధమానుం డగునట్టి లేత జాబిల్లివలె - ఎదుగు చుండెను.

వ్యా.—పితు రితి.—స రఘుః, సమగ్రసంపదః పితుః ప్రయత్నాత్, శుభై ర్మనోహరైః, శరీరావయవైః, హరిదశ్వదీధితేః సూర్యరశ్మేః*'సప్తాశ్వ హరిద శ్వోష్ణ రశ్మయ' ఇతి * 'భానుః కరో మరీచిః స్త్రీపుంసయో ర్దీధితిః స్త్రియా' మి'తి చ అమరః - జాతా వేకవచనమ్, అనుప్రవేశాత్, బాలచన్ద్రమా ఇవ,దినే దినే ప్రతిదినం * 'నిత్యవీప్సయో' రి'తి ద్విర్వచనం, వృద్ధిం పుపోష. అత్ర సంహితావచనమ్ -

'సలిలమయే శశిని రవే ర్దీధితయో మూర్ఛితా స్తమో నైశమ్
క్షపయన్తి దర్పణోదర నిహితా ఇవ మన్దిర స్యాన్తః.' ఇతి.

---

ఉమావృషాఙ్కౌ శరజన్మనా యథా,
యథా జయన్తేన శచీపురన్దరౌ,
తథా నృపః సా చ సుతేన మాగధీ
ననన్దతు స్తత్సదృశేన తత్సమౌ 23

టీక.—ఉమా వృషాఙ్కౌ - ఉమా = పార్వతియు - వృషాఙ్కౌ = (ఎద్దు చిహ్నముగాఁ గలవాఁడయిన) శివుఁడును, శరజన్మనా = (బెల్లుమాలియగు) కుమారస్వామిచేత, యథా=ఎట్లో, శచీ పురన్దరౌ = శచీదేవియు దేవేంద్రుఁడును,జయన్తేన= జయంతునిచేత, యథా = ఎట్లో, తథా = అట్లు, తత్సమౌ - తత్ = ఆ పార్వతీపరమేశ్వరులతోను శచీపురందరులతోను - సమౌ = తుల్యులయిన, సా మాగధీ చ=ఆ సుదక్షిణాదేవియు, నృపశ్చ = దిలీపమహారాజును, తత్సదృశేన-తత్ = ఆకుమారజయంతులతో - సదృశేన = తుల్యుఁడైన, సుతేన = తనయునిచేత, ననన్దతుః = సంతోషించిరి.

తా.—పార్వతీ పరమేశ్వరులు కుమారస్వామిని చూచుకొనియు,శచీదేవేంద్రులు జయంతుని చూచికొనియు, ఎట్లు సంతోషించిరో, అట్లే ఆవేల్పుతల్లిదండ్రులకు సమానులయిన సుదక్షిణాదిలీపులు ఆదేవకుమారులకు సమానుఁడైన తమకుమారుని చూచుకొని సంతోషించిరి.

వ్యా.—ఉమావృషాఙ్కౌ— పార్వతీవృషభధ్వజౌ,శరజన్మనా కుమారేణ *'కార్తికేయో మహాసేనః శరజన్మా షడాననః' ఇత్యమరః,యథా ననన్దతుః, శచీపురన్దరౌ, జయన్తేన జయన్తాఖ్యేన సుతేన * 'జయన్తః పాకశాసని రి'త్యమరః, యథా ననన్దతుః, తథా, తత్సమౌ - తాభ్యామ్ ఉమావృషాఙ్కాభ్యాం శచీపురన్దరాభ్యాం చ సమౌ, సా మాగధీ, నృపశ్చ, తత్సదృశేన తాభ్యాం కుమారజయన్తాభ్యాం సదృశేన సుతేన, ననన్దతుః; మాగధీ వ్యాఖ్యాతా.

---

రథాఙ్గనామ్నో రివ భావబన్ధనం
బభూవ యత్ప్రేమ పరస్పరాశ్రయమ్.
విభక్త మప్యేకసుతేన తత్ తయోః
పరస్పర స్యోపరి పర్యచీయత. 24

టీక.—రథాఙ్గనామ్నో రివ = జక్కవపక్షులవంటివారలై, తయోః = ఆసుదక్షిణా దిలీపులకు, భావబన్ధనం - భావ=హృదయములు-బన్ధనం=ఆకర్షించునదియు, పరస్పరా

శ్రయం - పరస్పర = అన్యోన్యము - ఆశ్రయం=విషయముగాఁగలదియు (అయినట్టి), యత్ ప్రేమ = ఏస్నేహము, బభూవ = ఉండెనో, తత్ = ఆ ప్రేమ, ఏకసుతేన - ఏక = ఒక్కఁడయిన - సుతేన = తనయునిచేత, విభక్తమపి = పంచుకొనఁబడ్డదయినను, పరస్పరస్య = ఒండొరులయొక్క - ఉపరి = మీఁద, పర్యచీయత= పెరిఁగెను.

తా.—సుదక్షిణాదేవికిని దిలీపమహారాజునకును ఒకరిహృదయమును ఒకరిమీఁదికి లాగుచున్నట్టి యన్యోన్యప్రేమ యుండెను. ఆ ప్రేమను ఇపుడు వారి యేకపుత్త్రుఁడు తాను పంచుకొన్నప్పటికిని వారికి పరస్పరమును తఱుఁగలేదు,మఱి పెరిఁగినది.

వ్యా.—రథాఙ్గేతి.—రథాఙ్గనామ్నీ చ రథాఙ్గనామా చ రథాఙ్గనామానౌ చక్రవాకౌ * 'పుమాన్ స్త్రియే' త్యేకశేషః - తయో రివ, తయో ర్దమ్పత్యోః, భావబన్ధనం హృదయాకర్షకం, పరస్పరాశ్రయమ్ అన్యోన్యవిషయకం, యత్ప్రేమ బభూవ, త దేకేన కేవలేన - తాభ్యా మన్యత మేన వా *'ఏకే ముఖ్యాన్యకేవలా' ఇ త్యమరః -

'ఏకోఽన్యార్థే ప్రధానే చ ప్రథమే కేవలే తథా
సాధారణే సమానేఽల్పే సంఖ్యాయాం చ ప్రయుజ్యతే.' ఇతి శశ్వః-

సుతేన, విభక్తమపి కృతవిభాగమపి, పరస్పరస్య ఉపరి, పర్యచీయత పవృధే*కర్మణికర్తరి లఙ్ ; అకృత్రిమత్వాత్ స్వయ మే వోపాచీయ తే త్యర్థః; యదేకాధారం వస్తు త దాధారద్వయే విభజ్యమానం సత్ హీయతే - అత్ర తయో రేక విషయం ప్రేమ సంక్రాన్తి - ద్వితీయవిషయలాభేఽపి నాహీయత - తత్ ప్రత్యుత ఉపచిత మే వాభూ దితి భావః

---

ఉవాచ ధాత్ర్యా ప్రథమోదితాని య
ద్వ్యయకా తదీయా మవలమ్బ్య చాఙ్గులిమ్
అభూ చ్చ నమ్రః ప్రణిపాతశిక్షయా
పితు ర్ముదం తేన తతాన సోఽర్భకః. 25

టీక.—సః అర్భకః = ఆశిశువు, ధాత్ర్యా = దాదిచేత, ప్రథమోదితాని = ప్రథమ = తొలుత - ఉదితాని = చెప్పఁబడిన మాటలను, ఉవాచ = పలికెను ; తదీయామ్ = ఆదాదిదైన, అఙ్గులిం = వ్రేలిని, అవలమ్బ్య = పట్టుకొని, యయౌ చ = నడువను నడిచెను; ప్రణిపాత శిక్షయా - ప్రణిపాత = నమస్కారముయొక్క=శిక్షయా= నేర్పుటచేత, నమ్రః చ=ప్రణమిల్లిన వాఁడును, అభూత్ =ఆయెను,ఇతి యత్= ఈ చెప్పినది యేదో, తేన = దానిచేత, పితుః = తండ్రికి, ముదం = సంతోషమును, తతాన = విస్తరించెను.

తా.—ఆకుమారుఁడు సాది మొదట నేర్చినమాటలను పలుకుటయును, దాని వ్రేలిని పట్టుకొని తనకడకు నడుచుటయును, నమస్కరింప నేర్పిన ప్రకారము నమస్కరించుటయును, గాంచి తండ్రి పరమానందంబుం జెందెను.

వ్యా.—ఉవా చేతి — సోఽర్భకః శిశుః * 'పోతః పాకోఽర్భకో డిమ్భః పృథుకః శాబకః శిశు రి' త్యమరః, ధాత్ర్యా ఉపమాత్రా * 'ధాత్రీ జన స్యామలకీ వసుమ త్యుపమాతృ ష్వి' త్యమరః, ప్రశమమ్ - ఉదితాని ఉపదిష్టాని, ఉవాచ, తదీయామ్ అఙ్గుళి మవలమ్బ్య యయౌ చ, ప్రణిపాతస్య శిక్షయా ఉపదేశేన నమ్రోఽభుందితి చ యత్ - తేన పితుః ముదం తతాన.

---

త మఙ్క మారోప్య శరీరయోగజైః
సుఖై ర్నిషిఞ్చన్త మి వామృతం త్వచి
ఉపాన్తసమ్మీలితలోచనో నృప
శ్చిరాత్ సుతస్పర్శరసజ్ఞతాం యయౌ. 26

టీక.—శరీరయోగజైః - శరీర = దేహముయొక్క - యోగ = కూడికచేత - జైః = పుట్టిన, సుఖైః = సుఖములచేత, త్వచి = త్వగింద్రియమందు, అమృతం = అమృతమును, నిషిఞ్చన్త మివ స్థితం = పోయుచున్నట్లు ఉన్నట్టి, తం = ఆకుమారుని, అఙ్కం = తొడను, ఆరోప్య = ఎక్కించుకొని, నృపః = రాజు, ఉపా... సన్ - ఉపాన్త = కొనల దగ్గఱ - సమ్మీలిత = మూయఁబడిన - లోచనః సన్ = కన్నులుగలవాఁడై, చిరాత్ = దీర్ఘకాలమునకు, సు...తాం - సుత = తనయుని యొక్క - స్పర్శ = తాఁకుటయందలి - రసజ్ఞతాం=రసమును ఎఱిఁగిన వాని తనమును, యయౌ = పొందెను.

తా.—ఆకుమారుని తొడపై కూర్చుండబెట్టుకొని ఆ నెమ్మేని తాఁకుడుచేతఁ గలిగిన సౌఖ్యము తనత్వగింద్రియమందు అమృతము గురిసినట్లు కాఁగా, ఆయానందముచేత అర్ధనిమీలిత నేత్రుఁడై యా మహారాజు బహుకాలమునకు (లేక లేక) సుతస్పర్శ సుఖమంన నిట్టిది గదా యని యనుభవపూర్వకముగా నెఱింగినవాఁ డాయెను.

వ్యా.—త మితి.—శరీరయోగజైః సుఖైః, త్వచి త్వగిన్ద్రియే, అమృతం,నిషిఞ్చన్తం వర్షన్త మివ స్థితం తం పుత్త్రమ్, అఙ్క మారోప్య, ఆనన్దావిర్భావాత్, ఉపాన్తయోః ప్రాన్తయోః సమ్మీలితలోచనః సన్, నృపః, చిరాత్, సుతస్పర్శరసజ్ఞతాం, యయౌ.

---

అమం_స్త చానేన పరార్థ్యజన్మనా
స్థితే రభేత్తా స్థితిమ_న్త మన్వయమ్
స్వమూర్తి భేదేన గుణాగ్ర్య వర్తినా
పతిః ప్రజానా మివ సర్గ మాత్మనః. 27

టీక.—స్థితేః=మర్యాదకు, అభేత్తా = కాపరియైన, సః = ఆదిలీపమహారాజు, పరార్థ్యజన్మనా - పరార్థ్య = శ్రేష్ఠమయిన - జన్మనా = పుట్టుకకలవాఁడును, గుణా...నా—గుణ = విద్యావినయాది గుణములయందు-అగ్ర్యవ_ర్తినా = అగ్రేసరుఁడును, స్వ...న—స్వ = తనయొక్క, మూ_ర్తిభేదేన = మాఱురూపమును, (అయిన), అనేన = ఈకుమారునిచేత, అన్వయం = (తన) వంశమును, ప్రజానాం = జనులకు, పతిః = ప్రభువయినబ్రహ్మ, గుణాగ్ర్యవర్తినా - గుణ = సత్త్వాది గుణములయందు-అగ్ర్యవర్తినా = మొదలవ_ర్తించువాఁడును, స్వమూర్తిభేదేన - స్వ = తనయొక్క-మూర్తిభేదేన = అవతారవిశేషమును, (అయిన) విష్ణుదేవుని చేత, ఆత్మనః=తనయొక్క, సర్గ మివ=సృష్టిసింబోలె, స్థితిమ_న్తం = నిలుకడగల్గినదానినిగా, అమం_స్త=తలంచెను.

తా.—బ్రహ్మ - ఉత్కృష్టజన్మము కలవాఁడును, సత్త్వగుణాతిశయముచేత ఉ_త్తముఁడును, తన యవతారవిశేషమును, అయిన విష్ణుదేవుని చేత తనసృష్టికి నిలుకడ కలిగిన దని యెట్లు తలంచెనో, అట్లే, మర్యాదారక్షకుఁ డైన యాదిలీపమహారాజు - ఉత్కృష్టజన్మము కలవాఁడును, విద్యావినయాదిగుణములచేత ఉ_త్తముఁడును, తనమాఱురూపమును, అయిన యాకుమారునిచేత తనవంశమునకు నిలుకడ కలిగిన దని తలంచెను.

వ్యా.—అమం స్తేతి.—స్థితే రభేత్తా మర్యాదా పాలకః, స నృపః,పరార్థ్యజన్మనా ఉత్కృష్ట జన్మనా, అనేన రఘుణా, అన్వయం వంశం, ప్రజానాం పతిః బ్రహ్మా, గుణాః సత్త్వాదయః - తే ష్వగ్రే వర్తతే వ్యాప్రియత ఇతి గుణాగ్ర్యవర్తీ-తేన, స్వస్య మూర్తి భేదేన అవతారవిశేషేణ విష్ణునా,ఆత్మనః - సర్గం సృష్టి మివ, స్థితిమన్తం ప్రతిష్ఠావన్తమ్, అమం_స్త మన్యతే స్మ * మన్యతే రనుదాత్తత్వా దిట్ప్రతిషేధః; అ త్రోపమానోపమేయయో రితరేతరవిశేషణాని ఇతరేతరయోజ్యాని - తత్ర రఘుపక్షే గుణాః విద్యావినయాదయః -

'గుణః ప్రధానే రూపాదౌ మౌర్వ్యాం సూదే వృకోదరే
స్తమ్భే సత్త్వాది సంధ్యాది విద్యాది హరిదాది షు.' ఇతి విశ్వః,
శేషం సుగమమ్.

---

స వృత్తచౌల శ్చలకాకపక్షకై
రమాత్యపుత్రైః సవయోభి రన్వితః
లిపే ర్యథావ ద్గ్రహణేన వాఙ్మయం
నదీముఖే నేవ సముద్ర మావిశత్. 28

టీక.—వృత్తచౌలః - వృత్త = జరిగిన - చౌలః = చూడాకర్మగల, సః = ఆరఘువు, చల ..కైః - చల = కదలుచున్న - కాకపక్షకైః = జుల్పాలుగలవారును, సవయోభిః= (సరి యీడు గల) స్నేహితులును, (అయిన), అమాత్య పుత్రైః=మంత్రి కుమారులతోడ, అన్వితః సన్ = కూడినవాఁడై, లిపేః = వ్రాఁతయొక్క,యథా... ణేన - యథావత్ = సరిగా - గ్రహణేన = నేర్చుకొనుటచేత, వాఙ్మయం=శబ్దజాలమును, నదీముఖేన - నదీ = ఏటియొక్క - ముఖేన = ద్వారముచేత, సముద్ర మివ= సముద్రమునుంబోలె, ఆవిశత్ = ప్రవేశించెను.

తా.—చూడాకర్మ మైన తర్వాత, ఆకుమారుఁడు, జుల్పా లెగయుచున్న తన యీడు చెలికాండ్రగు మంత్రిపుత్రులతోఁ గలసి - ఏదేని మొసలి లోనగునది ఏటి గుండ మహాసముద్రమునందుఁ జొచ్చునట్లు-ఏఁబదివర్ణములుగా నున్న వ్రాఁతను ముందుగా యథావిధిగా నేర్చుకొని దానిమూలముగా శబ్దప్రపంచము నెల్ల సాధించెను.

వ్యా.—స ఇతి.—

'చూడా కార్యా ద్విజాతీనాం సర్వేషా మేవ ధర్మతః
ప్రథమేఽబ్దే తృతీయే వా కర్తవ్యా శ్రుతిచోదనాత్.'

ఇతి మనుస్మరణాత్ తృతీయే వర్షే - వృత్తచౌలో నిష్పన్నచూడాకర్మా సన్-లడయో రభేదః, స రఘుః, 'ప్రాప్తే తు పఞ్చమే వర్షే విద్యారమ్భంచ కారయే ది'తి వచనాత్ పఞ్చమే వర్షే,చలకాకపక్షకై శ్చలశిఖణ్డకైః*'బాలానాం తు శిఖా ప్రోక్తా కాకపక్షః శిఖణ్డక' ఇతి హలాయుధః, సవయోభిః స్నిగ్ధైః, * 'స్నిగ్ధో వయస్య స్సవయా' ఇ త్యమరః, అమాత్యపుత్రై, రన్విత స్సన్,లిపేః పఞ్చాశద్వర్ణాత్మికాయాః, యథావద్గ్రహణేన సమ్యగ్బోధనే నోపాయభూతేన, వాఙ్మయం శబ్దజాతం, నద్యాః ముఖం ద్వారం * 'ముఖం తు వదనే ముఖ్యే ద్వారే తారాభ్యుపాయ యో రి' తి యాదవః - తేన,కశ్చి న్మకరాదిః,సముద్ర మివ,ఆవిశత్ ప్రవిష్టః జ్ఞాతవా ని త్యర్థః.

---

అథోపనీతం విధివ ద్విపశ్చితో
వినిన్యు రేనం గురవో గురుప్రియమ్;

అవన్ధ్యయత్నా శ్చ బభూవు రత్ర తే;
క్రియా హి వస్తూపహితా ప్రసీదతి. 29

టీక.—అథ = తరువాత, విధివత్ = శాస్త్రముప్రకారము, ఉపనీతం = ఉపనయనముచే సంస్కరింపఁబడినవాఁడును, గురుప్రియం = గురువులు ప్రియులు గాఁగలవాఁడును, (అయిన), ఏనం = ఈకుమారుని, విపశ్చితః = విద్వాంసులయిన, గురవః = ఒజ్జలు, వినిన్యుః = శిక్షించిరి; తే = వారు, అత్ర = ఈతనివిషయమున, అ...శ్చ—అవన్ధ్య = రిక్తకాని - యత్నా శ్చ = పూనికగలవారు ను, బభూవుః= అయిరి; తథా హి = అటులేగదా, క్రియా = శిక్ష, వస్తూపహితాసతీ - వస్తు=పాత్ర మునందు, ఉపహితా సతీ = ప్రయోగింపఁబడినదై, ప్రసీదతి = ఫలించును.

తా.—తర్వాత దిలీపమహారాజు కుమారునికి యథావిధిగా ఉపనయనసంస్కారముఁ గావించెను. అంతట విద్వాంసులయిన గురువులు వటువునకు విద్యలు గఱపిరి. వటువును వారియెడల ప్రీతిగలవాఁడై నేర్చుకొనెను. ఆబాలునియెడల వారిప్రయత్నములు వృథ కాలేదు. ఏలన—పాత్రమందు వినియోగింపఁబడిన క్రియ ఫలించును గదా.

వ్యా.—అ థేతి.—

'గర్భాష్టమే ప్రకుర్వీత బ్రాహ్మణ స్యోపనాయనమ్,
గర్భా దేకాదశే రాజ్ఞో, గర్భా చ్చ ద్వాదశే విశః.' ఇతి.

మనుస్మరణాత్, అథ గర్భైకాదశేఽబ్దే విధివ దుపనీతం, గురవః ప్రియాః యస్య తం గురుప్రియం ప్రియగురు మి త్యర్థః*'వా ప్రియ స్యే'తి ప్రియశబ్దస్య పరనిపాతః- గురుప్రియ, మేనం రఘుం, విపశ్చితః విద్వాంసః గురవః, వినిన్యుః శిక్షితవన్తః; తే గురవః, అ త్రాస్మిన్ రఘౌ, అవన్ధ్యయత్నా శ్చ బభూవుః; తథా హి - క్రియా శిక్షా * 'క్రియా తు నిష్కృతౌ శిక్షా చికిత్సోపాయకర్మ స్వి'తి యాదవః, వస్తుని పాత్రభూతే-ఉపహితా ప్రయుక్తా సతీ, ప్రసీదతి ఫలతి; 'క్రియా హి ద్రవ్యం వినయతి నాద్రవ్య మి' త్యుక్తం కౌటిల్యేన.

---

ధియః సమగ్రైః సగుణై రుదారధీః
క్రమా చ్చతస్ర శ్చతు రర్ణవోపమాః
తతార విద్యాః పవనాతిపాతిభి
ర్దిశో హరిద్భి ర్హరితా మి వేశ్వరః. 30

టీక.—ఉదారధీః - ఉదార = గొప్పదయిన - ధీః = బుద్ధిగల, సః = ఆరఘువు, సమగ్రైః = సకలములును, పవనాతిపాతిభిః - పవన = గాలిని - అతిపాతిభిః=

దాఁటునవియు, (అయిన), ధియః = బుద్ధియొక్క, గుణైః = శుశ్రూషాదిగుణములచే, చతు...మాః—చతుః = నాలుగైన - అర్ణవ = సముద్రములే-ఉపమాః - సాటిగాఁ గల్గినట్టి, చతస్రః = నాలుగు-విద్యాః = ఆన్వీక్షిక్యాదివిద్యలను, హరితాం = దిక్కులకు, ఈశ్వరః = దొరయైనసూర్యుఁడు, పవనాతిపాతిభిః = పవన = గాలిని - అతిపాతిభిః = దాఁటునవైన, హరిద్భిః = గుఱ్ఱములచేత, చతస్రః=నాలుగు - దిశ ఇవ= దిక్కులయం బోలె, క్రమాత్ = వరుసగా, తతార = దాఁటెను.

తా.—దిక్పతియైన సూర్యుఁడు నాలుగు సముద్రములవంటివైన నాలుగుదిక్కులను గాలికన్న వడిగలవైన తనగుఱ్ఱములచేత నెట్లుదాఁటునో, ఆప్రకారమే, మిక్కిలిబుద్ధిమంతుఁడయిన యాకుమారుఁడు శుశ్రూషాదులగుబుద్ధిగుణములను వాతాధిక వేగములను అశ్వికుని వినియోగించి నాల్గు సముద్రములవంటివైన నాల్గు విద్యలను ఆన్వీక్షిక్యాదులను దాఁటెను.

వ్యా.—ధియ ఇతి.—అత్ర కామన్దకః -

'శుశ్రూషా శ్రవణం చైవ గ్రహణం ధారణం తథా
ఊహోఽపోహోఽర్థవిజ్ఞానం తత్త్వజ్ఞానం చ ధీగుణాః.' ఇతి -
'ఆన్వీక్షికీ త్రయీ వార్తా దణ్డనీతి శ్చ శాశ్వతీ
ఏతా విద్యా శ్చతస్ర స్తు లోకసంస్థితిహేతవః.' ఇతి చ,

ఉదారధీః, స రఘుః, సమగ్రైః, ధియో గుణైః, చత్వారః అర్ణవా ఉపమా యాసాం తాః చతురర్ణవోపమాః * తద్ధితార్థేత్యాదినా ఉత్తరపదసమాసః, చతస్రో విద్యాః, హరితాం దిశామ్ ఈశ్వరః సూర్యః, పవనాతిపాతిభిః, హరిద్భి ర్నిజాశ్వైః*'హరిత్ కకుభి వర్ణే చ తృణ వాజి విశేషయోః' ఇత్యుభయత్రాపి విశ్వః, చతస్రో దిశ ఇవ క్రమాత్ తతార; చతురర్ణవోపమత్వం దిశా మపి ద్రష్టవ్యమ్.

---

త్వచం చ మేధ్యాం పరిధాయ రౌరవీ
మశిక్ష తాస్త్రం పితు రేవ మన్త్రవత్;
న కేవలం తద్గురు రేకపార్థివః
క్షితా వభూ దేకధనుర్ధరోఽపి సః. 31

టీక.—మేధ్యాం=పవిత్రమును,రౌరవీం=నల్లచారలదుప్పిదియగు,(అయిన), త్వచం చ = అజినమును, పరిధాయ = తాల్చి, మన్త్రవత్ = మంత్రములతోఁగూడిన, అస్త్రం = ఆగ్నేయాద్యస్త్రమును, పితు రేవ = తండ్రివలననే, అశిక్షత = నేర్చెను ; తద్గురుః - తత్ = ఆరఘువుయొక్క - గురుః = తండ్రి (దిలీపమహారాజు),ఏకక...

కేవలం న - ఏక = అద్వితీయుఁడయిన - పార్థివః కేవలం న=పుడమిఱేఁడు మాత్రమే గాక, క్షితౌ = భూమియందు, సః = ఆయన, ఏకధనుర్ధరోఽపి-ఏక = అద్వితీయుఁడైన - ధనుర్ధరోఽపి = విలుకాఁడు సయితము, అభూత్ = అయెను.

తా.— మఱియు ఆ కుమారుఁడు పవిత్రమయిన నల్లచాఱల దుప్పి చర్మమును కప్పుకొని యాగ్నేయాద్యస్త్రములను వాని వాని మంత్రములతోఁగూడ తండ్రివలననే నేర్చెను. అది యెట్లన - అదిలీపుఁడు రాజత్వమందేగాక ధనుర్విద్యయందును అద్వితీయుఁడై యుండెను-

వ్యా.—త్వచ మితి.—

'కార్ష్ణ రౌరవ బాస్తాని చర్మాణి బ్రహ్మచారిణః
వసీర న్నానుపూర్వ్యేణ శాణ క్షౌ మావికాని చ.'

ఇతి మనుస్మరణాత్ - మేధ్యాం శుద్ధాం, రౌరవీం రురుసంబన్ధినీం*'రురు ర్మహాకృష్ణసార' ఇతి యాదవః, త్వచం చ, పరిధాయ వసిత్వా, మన్త్రవత్ సమన్త్రకమ్, అస్త్ర మాగ్నేయాదికం, పితు రేవో పాధ్యాయాత్ - అశిక్షత అభ్యస్తవాన్*'అఖ్యాతో పయోగ' ఇత్యపాదానత్వమ్; పితు రే వే త్యవధారణ ముప పాద యతి - నేతి.— తద్గురుః, ఏకః అద్వితీయః, పార్థివః కేవలం పృథివీశ్వర ఏవ, నాభూత్, కిం తు, క్షితౌ సః ఏకధనుర్ధరోఽ ప్యభూత్ -

---

మహోక్షతాం వత్సతరః స్పృశ న్నివ
ద్విపేన్ద్రభావం కలభః శ్రయ న్నివ
రఘుః క్రమా ద్యౌవనభిన్నశైశవః
పుపోష గామ్భీర్యమనోహరం వపుః. 32

టీక.—రఘుః = రఘువు, క్రమాత్ = కాలక్రమమున, యౌవన...వః సన్- యౌవన = జవ్వనముచేత - భిన్న = పోఁగొట్టఁబడిన - శైశవః సన్=బాల్యముగలవాఁడై, మహోక్షతాం = పెఱయెద్దుతనమును, స్పృశన్ = అందుచున్న, వత్సతర ఇవ= కోడెవలెను, ద్విపేన్ద్రభావం = మహాగజత్వమును, శ్రయన్ = పొందుచున్న, కలభ ఇవ = ఏనుఁగుగున్నవలెను, గామ్భీ...రం—గామ్భీర్య = చాపల్యములేమిచేత - మనోహరం = అందమయిన, వపుః = దేహమును, పుపోష = పోషించెను.

తా.—పిమ్మట, కోడె పెఱయెద్దు అగునప్పటికిని, గున్నటేనుఁగు పెఱయేనుఁగు అగునప్పటికిని, ఎట్లో అట్లే, రఘువు క్రమముగా బాల్యము తీఱి యౌవనము వచ్చునప్పటికి దేహము చపలత తీఱి మనోహరముగా ఎదుగఁగా, శోభిల్లుచుండెను.

వ్యా.—మహోక్షతా మితి.—రఘుః, క్రమాత్, యావనేన - భిన్న శైశవః- నిరస్త శిశుభావః సన్, మహాన్ ఉక్షా మహోక్షః మహావృషభః * అచతురాదిసూత్రేణ నిపాతసా దకారాన్తత్వం - తస్య భావ స్తత్తా-తాం, స్పృశన్ గచ్ఛన్,వత్స తరో దమ్య ఇవ * 'దమ్య వత్సతరౌ సమా వి'త్యమరః,ద్విపేన్ద్ర భావం మహాగజత్వం శ్రయన్ భజన్, కలభః కరిపోత ఇవ, గామ్భీర్యేణ అచాపలేన - మనోహరం వపుః పుపోష.

---

అథాస్య గోదానవిధే రనన్తరం
వివాహదీక్షాం నిరవర్తయ ద్గురుః;
నరేన్ద్రకన్యా స్త మవాప్య సత్పతిం
తమోనుదం దక్షసుతా ఇ వాభభుః. 33

టీక.—గురుః = తండ్రి, అస్య = యీకుమారునికి, గోదానవిధేః - గోదాన= కేశాంతముయొక్క - విధేః = నిర్వర్తించుటకు, అనన్తరం=తరువాత, వివాహదీక్షాం- వివాహ = పెండ్లియొక్క - దీక్షాం = నియమమును, నిరవర్తయత్ = జరిపెను; అథ = అంతట, నరేన్ద్రకన్యాః = రాజకుమారికలు, తమోనుదం=చీకటిందొలఁగించు వాఁడయిన, తం = ఆరఘువును, దక్షసుతాః = దక్షప్రజాపతికొమారితలైన రోహిణ్యాదితారలు, తమోనుద మివ=చంద్రునింబోలె,సత్పతిం=మంచిమగనినిగా,అవాప్య= పొంది, ఆబభూః = ప్రకాశించిరి.

తా.—తరువాత ఇతనికి తండ్రి కేశాంతపూర్వకముగా వివాహము గావించెను. రాజకన్యలు చీకటిని తొలంచువాఁ డయినయీకుమారుని, దక్షకన్యలైన రోహిణ్యాది తారలు చంద్రునిం బోలె, మంచిమగనిం గాఁ బడసి ప్రకాశించిరి.

వ్యా.—అ థేతి.—

'గౌ ర్నాఽఽదిత్యే బలీవర్దే క్రతుభేద షి-భేదయోః,
స్త్రీ తు స్యా ద్దిశి భారత్యాం భూమౌ చ సురభా వపి,
పుంస్త్రియోః స్వర్గ వ జ్రామ్బు రశ్మి దృ గ్బాణ లోమసు.' ఇతి కేశవః- గావో లోమాని దీయన్తే ఖణ్డ్యన్తేఽస్మి న్నితి వ్యుత్పత్త్యా గోదానం నామ బ్రాహ్మణాదీనాం షోడశాదిషు వర్షేషు కర్తవ్యం కేశాన్తాఖ్యం క ర్మోచ్యతే - త దుక్తం మనునా -

'కేశాన్తః షోడశే వర్షే బ్రాహ్మణస్య విధీయతే,
రాజన్యబన్ధో ర్ద్వావింశే, వైశ్యస్య ద్వ్యధికే తతః'. ఇతి.

అథ గురుః పితా * 'గురూ గీష్పతిపిత్రాద్యౌ' ఇత్యమరః, తస్య రఘోః, గోదానవిధేరనన్తరం, వివాహదీక్షాం, నిరవర్తయత్ కృతవానిత్యర్థః; అథ నరేన్ద్రకన్యాః, తం రఘుం, దక్షస్య సుతాః రోహిణ్యాదయః, తమోనుదం చన్ద్రమివ * 'తమోనుదోఽగ్నిచన్ద్రార్కాః' ఇతి విశ్వః, సత్పతిమ్, అవాప్య, ఆబభుః; రఘురపి తమోనుత్; అత్ర మనుః -

'వేదానధీత్య వేదౌ వా వేదం వాఽపి యథాక్రమమ్
అవిప్లుతబ్రహ్మచర్యో, గృహస్థాశ్రమమాశ్రయేత్.' ఇతి.

---

యువా యుగవ్యాయతబాహురంసలః
కవాటవక్షాః పరిణద్ధకన్ధరః
వపుఃప్రకర్షా దజయ ద్గురుం రఘు
స్తథాఽపి నీచై ర్వినయా దదృశ్యత. 34

టీక.—యువా = యౌవనవంతుఁడును, యుగ...హుః—యుగ = కాఁడులవలె - వ్యాయత = నిడుదలైన - బాహుః=భుజములుగలవాఁడును, అంసలః = కండపట్టిన మూఁపులుగలవాఁడును, కవాటవక్షాః - కవాట = తలుపువంటి - వక్షాః ఱొమ్ముకలవాఁడును, పరి—రః-పరిణద్ధ = విరివియైన - కన్ధరః - మెడగలవాఁడు, (అయిన), రఘుః = రఘువు, వపుః...త్—వపుః = ఒడలియొక్క - ప్రకర్షాత్ = పెంపువలన, గురుం = తండ్రిని, అజయత్ = మించెను, తథాఽపి = అట్లయినను, వినయాత్ = అణఁకువవలన, నీచైః = స్వల్పుఁడుగా, అదృశ్యత = అగపడెను.

తా.—రఘువు యౌవనమందు కాఁడులంత లేసి బల్లిదంపు బాహువులును, కండగల మూఁపులును, తలుపునంతదిట్టపు విరివి ఱొమ్మును విశాలమయిన కంఠమును గలిగి దేహముయొక్క పెంపుచేత తండ్రిని మించెను; కాని వినయముచే స్వల్పుఁడుగానే అగపడెను.

వ్యా.—సంప్రతి తస్య యౌవరాజ్యే యోగ్యతామాహ - యువేతి.—యువా, యుగో నామ ధుర్యస్కన్ధగతః సచ్ఛిద్రప్రాన్తో యానాఙ్గభూతో దారువిశేషః * 'యానాద్యఙ్గే యుగః పుంసి' ఇత్యమరః - యుగవత్ - వ్యాయతౌ దీర్ఘౌ - బాహూ యస్య సః, అంసావస్య స్త ఇత్యంసలః * 'బలవానంసలశ్చే' తి వృత్తికారః *'బలవాన్మాంసలోఽంసల ఇ' త్యమరః * 'వత్సాంసాభ్యాం కామబలే' ఇతి లచ్ప్రత్యయః, కవాటవక్షాః, పరిణద్ధకన్ధరః విశాలగ్రీవః * 'పరిణాహో విశాలతే' త్యమరః, రఘుః, వపుషః - ప్రకర్షాత్ ఆధిక్యాద్యౌవనకృతాత్, గురుం పితరమజయత్, తథాఽపి, వినయాన్నమ్రత్వేన, నీచైరల్పకః, అదృశ్యత; ఏతేన అనౌద్ధత్యం చ వివక్షితమ్,

---

తతః ప్రజానాం చిర మాత్మనా ధృతాం
నితాన్తగుర్వీం లఘయిష్యతా ధురం
నిసర్గ సంస్కార వినీత ఇత్యసౌ
నృపేణ చక్రే యువరాజశబ్దభాక్. 35

టీక.—తతః = తర్వాత, ఆత్మనా = తనచేత, చిరం = చాలకాలము, ధృతాం = నోవఁబడినదియు, నితా...ర్వీం - నితాన్త = మిక్కిలి - గుర్వీం=ఎక్కువయును, (అయినదానిని), ప్రజానాం=జనులయొక్క, ధురం = బరువును, లఘయిష్యతా = తేలికచేసికొనువాఁడైన, నృపేణ = రాజుచేత, అసౌ=ఈరఘువు, నిసర్గ...తః - నిసర్గ=స్వభావముచేతను - సంస్కార = విద్యావాసనచేతను, వినీతః = అడఁకువగలవాఁడు, ఇతి=అనునీహేతువువలన, యువ...భాక్ - యువరాజ=యువరాజని యెడు - శబ్ద = శబ్దమును - భాక్ = పొందినవాఁడుగా, చక్రే = చేయఁబడెను.

తా.—తర్వాత దిలీపమహారాజు తాను చిరకాలము మోచుచుండిన ప్రజాపాలనమనెడు బరువును తగ్గించుకొను నిమిత్తము స్వభావముచేతను విద్యచేతను అణఁకువ గలవాఁ డని రఘువునకు యౌవరాజ్యము నొసంగెను.

వ్యా.—సంప్రతి అస్య యౌవరాజ్య మాహ-తత ఇతి.—తతః, ఆత్మనా చిరం ధృతాం, నితాన్తగుర్వీం * 'వోతో గుణవచనా' దితి జీష్, ప్రజానాం ధురం ప్రజాపాలనప్రయాసం లఘయిష్యతా లఘూకరిష్యతా * 'తత్కరోతి త దాచష్ట' ఇతి లఘుశబ్దాణ్ణిచ్ - తతో ల్రుట్ * 'ల్రుట స్స ద్వే' తి శతృప్రత్యయః, నృపేణ దిలీపేన, అసౌ - రఘుః నిసర్గేణ స్వభావేన - సంస్కారేణ శాస్త్రాభ్యాసజనితవాసనయా చ, వినీతో నమ్రః, ఇతి హేతోః, యువరాజ ఇతి శబ్దం భజ తీతి తథోక్తః * 'భజో ణ్వి' రితి ణ్విప్రత్యయః, చక్రే కృతః; ద్వివిధో వినయః - స్వాభావికః కృత్రిమ శ్చేతి - తదుభయసంపన్న త్వాత్ పుత్రం యువరాజం చకారే త్యర్థః - అత్ర కామన్దకః -

'వినయోపగ్రహా న్భూత్యై కుర్వీత నృపతిః సు తాన్;
అవినీతకుమారం హి కుల మాశు విశీర్యతే.
వినీత మౌరసం పుత్రం యౌవరాజ్యేఽభిషేచయేత్.' ఇతి

---

నరేన్ద్రమూలాయతనా దనన్తరం
త దాస్పదం శ్రీ ర్యువరాజసంజ్ఞితమ్
అగచ్ఛ దంశేన గుణాభిలాషిణీ
నవావతారం కమలా ది వోత్పలమ్. 36

టీక.—గుణా...షిణీ – గుణ వినయాదిగుణములను - సౌరభాదిగుణములను - అభిలాషిణీ = కోరునట్టి, శ్రీః = రాజ్యలక్ష్మి - కలుములజవరాలు, నరే...త్ – నరేన్ద్రే = మహారాజనియెడు - మూలాయతనాత్ = ప్రధానస్థానమునుండి, అనన్తరం = చెంతనున్నట్టియు, యువరాజసంజ్ఞితం = యువరాజనెడిసంజ్ఞగలయట్టియు, తదాస్పదం - తత్ = ఆరఘువనియెడి - ఆస్పదం = స్థానమును, కమలాత్ = తామరనుండి నవావతారం - నవ = క్రొత్తదయిన - అవతారమ్ = పుట్టుకగల, ఉత్పలమివ = కలువనుంబోలె, అంశేన = భాగముచేత, అగచ్ఛత్ = పొందెను.

తా.—తావి లోనగుగుణములను కోరునదైన లక్ష్మి ప్రధానాధారమయిన కమలమునుండి చెంతను క్రొత్తగా విరిసినకలువలో ఎట్లు ఒకయంశముచేత నెలకొనునో, అట్లే వినయాదిగుణములను కోరున దైన రాజ్యలక్ష్మియు పెద్దరాజనెడు ప్రధానాధారముచెంత క్రొత్తగా యువరాజపట్టభద్రుఁ డైన యారఘుమహారాజునందు ఒకయంశముచేత ఇరవుకొనినది.

వ్యా.—నరేన్ద్రేతి.—గుణాన్ వినయాదీన్ సౌరభాదీంశ్చ - అభిలష్యతీతి గుణాభిలాషిణీ, శ్రీః రాజ్యలక్ష్మీః పద్మాశ్రయా చ, నరేన్ద్రో దిలీప ఏవ - మూలాయతనం ప్రధానస్థానం - తస్మాత్, అనన్తరం సన్నిహితం, యువరాజ ఇతిసంజ్ఞా అస్య సంజాతా యువరాజసంజ్ఞితం * తారకాదిత్వా దితచ్ప్రత్యయః, ఆత్మనః పదం స్థానం ఆస్పదమ్ * 'ఆస్పదం ప్రతిష్ఠాయా మి'తి నిపాతః, స రఘు రేవాస్పదం తదాస్పదం, కమలాత్ చిరోత్పన్నాత్, నవావతార మచిరోత్పన్నమ్, ఉత్పల మివ, అంశే నాగచ్ఛత్; స్త్రియో హి యూని రజ్యన్త ఇతి భావః.

---

విభావసుః సారథి నేవ వాయునా
ఘనవ్యపాయేన గభస్తిమా నివ
బభూవ తే నాతితరాం సుదుస్సహః
కటప్రభేదేన క రీవ పార్థివః. 37

టీక.—సారథినా = తోడయిన, వాయునా = గాలిచేత, విభావసు రివ = అగ్నియుంబోలెను, ఘనవ్యపాయేన = (మేఘములపోకచేత) శరత్కాలముచేత, గభస్తిమా నివ= సూర్యుఁడువోలెను, కటప్రభేదేన - కట = గండస్థలములయొక్క - ప్రభేదేన=మదమూరుటచేత, కరీవ = ఏనుఁగువోలెను, పార్థివః = దిలీపమహారాజు, తేన- ఆయువరాజుచేత, అతితరాం = మిక్కిలి, సుదుస్సహః = ఓర్వఁగూడనివాఁడు, బభూవ = ఆయెను.

తా.—7. ప్రతోడి యగ్నియు, శరత్కాలపు సూర్యుఁడును, మదస్రావము తోడి గజేంద్రమును, ఎట్లో అట్లే, రఘుమహారాజుతోడి దిలీపమహారాజు అసాధ్యుఁడుగా నుండెను.

వ్యా.—విభావసు రితి.—సారథినా సహాయభూతేన - ఏతద్విశేషణ ముత్తర వాక్యే ష్వప్యనుషఙ్జనీయం - తేన, వాయునా, విభావసు ర్వహ్ని రివ * 'చిత్రభాను ర్విభావసు రి' త్యమరః, ఘనవ్యపాయేన-శరత్సమయేన - సారథినా, గభస్తిమాన్ సూర్య ఇవ, కటో గణ్డః * 'గణ్డః కటో మదో దాన మి' త్యమరః-తస్య-ప్రభేదః స్ఫోటనం-మదోదయ ఇ త్యర్థః - తేన, క రీవ, పార్థివః దిలీపః, తేన రఘుణా, అతితరా మత్యన్తం సుదుస్సహః అత్యన్తాసహ్యో బభూవ.

---

నియుజ్య తం హోమతురఙ్గరక్షణే
ధనుర్ధరం రాజసుతై రనుద్రుతమ్
అపూర్ణ మేకేన శతక్రతూపమః
శతంక్రతూనా మపవిఘ్న మాప సః. 38

టీక.—శత...మః - శతక్రతు = (నూఱుజన్నముల వాఁడే) దేవేంద్రుఁడే - ఉపమః = సాటిగాఁగల, సః = ఆదిలీపమహాజు, రాజసుతైః = రాకొమరులచేత, అనుద్రుతం = అన్వితుఁడైన, ధనుర్ధరం = విలుకానిని, తం = ఆరఘు మహారాజును, హోమ...క్షణే - హోమ = వేలిమికైన - తురఙ్గ = గుఱ్ఱములయొక్క - రక్షణే = కాపుదలయందు, నియుజ్య = నియమించి ఏకేన = ఒకయాగముచేత, అపూర్ణానాం = కొఱవడిన, క్రతూనాం = (అశ్వమేధ) యాగముల యొక్క, శతం = నూటిని, అప విఘ్నం యథాతథా = విఘ్నములు లేకుండ. ఆప = పొందెను.

తా.—. రాజపుత్రులను తోడిచ్చి ఆరణవీరుని రఘుమహారాజును జన్నపు గుఱ్ఱ ముల వెంట కాపుదలగా పంపి, దేవేంద్ర సమానుఁడా దిలీపమహారాజు నిర్విఘ్నముగా తొంబదితొమ్మిది యాగములు నెఱవేర్చెను.

వ్యా.—నియు జ్యేతి.— శతక్రతు రిన్ద్రః ఉపమా యస్య సః దిలీపః * 'శతం వై కల్యా రాజపుత్రా దేవా ఆశాపాలా' ఇత్యాదిశ్రుత్యా, రాజసుతైః, అనుద్రుత మను గతం, ధనుర్ధరం, తం రఘుం, హోమతురఙ్గాణాం - రక్షణే, నియుజ్య, ఏకేన క్రతునా అపూర్ణమ్ ఏకోనం, క్రతూనా మశ్వమేధానాం, శతమ్ అపవిఘ్నం అపగత విఘ్నం యథా తథా, ఆప.

---

తతః పరం తేన మఖాయ యజ్వనా
తురఙ్గ ముత్సృష్ట మనర్గళం పునః
ధనుర్భృతా మగ్రత ఏవ రక్షిణాం
జహార శక్రః కిల గూఢ విగ్రహః. 39

టీక.—తతః పరం = అటుతర్వాత, యజ్వనా = యథావిధిగా యాగము చేసిన, తేన=ఆదిలీపమహారాజుచేత, పునః = మరల, మఖాయ = యాగముసేయుటకై, ఉత్సృష్టమ్ = విడువఁబడిన, అనర్గళం = అడ్డులేని, తురఙ్గం = గుఱ్ఱమును, ధనుర్భృతాం = విల్లుదాల్చిన, రక్షిణాం = కాపరులయొక్క, అగ్రత ఏవ=ఎదురనే, శక్రః=ఇన్ద్రుఁడు, గూఢవిగ్రహః సన్ - గూఢ=అగపడని - విగ్రహః సన్ - దేహము గలవాఁడై, జహార కిల = అపహరించెను గదా.

తా.—అటుపిమ్మట ఆదిలీపమహారాజు నూఱవజన్నమునకై విడువఁగా అడ్డులేకుండ పోవుచున్న గుఱ్ఱమును కాపరులకంటె యెదుటనే యిన్ద్రుఁడు అదృశ్యరూపమున కొనిపోయెను.

వ్యా.—తత ఇతి.— తతః పరం ఏకోనశతక్రతుప్రాప్త్యనన్తరం, యజ్వనా విధినేష్టవతా, తేన దిలీపేన, పున రపి, మఖాయ మఖం కర్తుం * 'క్రియార్థోపపదే' త్యాదినా చతుర్థీ, ఉత్సృష్టం ముక్తమ్, అనర్గళమ్ అప్రతిబన్ధమ్ - అవ్యాహతస్వైరగత మిత్యర్థః * 'అపర్యావర్తయన్తో ఽశ్వ మనుసరన్తి' త్యాపస్తమ్బస్మరణాత్, తురఙ్గం ధనుర్భృతాం, రక్షతాం రక్షిణామ్, అగ్రత ఏవ, శక్రః, గూఢవిగ్రహః సన్ తిరోహితదేహః సన్, జహార కిల - కిలే త్యైతిహ్యే.

---

విషాద లుప్త ప్రతిపత్తి విస్మితం
కుమారసైన్యం సపది స్థితం చ తత్,
వసిష్ఠధేను శ్చ యదృచ్ఛయాఽగతా
శ్రుతప్రభావా దదృశేఽథ నన్దినీ. 40

టీక.—తత్ =ఆ, కుమారసైన్యం - కుమార= రఘుమహారాజుయొక్క - సైన్యం= దండు, సపది = తక్షణము, విషా...త్తి - విషాద = దిగులుచేత - లుప్త = పోయిన - ప్రతిపత్తి = కర్తవ్యజ్ఞానముగలదియై. విస్మితం సత్ = ఆశ్చర్యపడినదై, స్థితం చ = ఉండను నుండెను ; అథ = అంతట, శ్రుతప్రభావా - శ్రుత = వినఁబడిన - ప్రభావా = మహిమగలది, యదృచ్ఛయా=స్వేచ్ఛచేత, ఆగతా=వచ్చినట్టిది, వసిష్ఠధేనుః - వసిష్ఠ = వసిష్ఠులవారి - ధేనుః = గోవు, నన్దినీ = నందిని, దదృశే చ = అగపడను నగపడెను.

తా.—అంతట కుమారుని సైనికులు దిగులుపడి యేమి చేయనుం దోఁపక యాశ్చర్య పడుచుండిరి. తత్క్షణమే వసిష్ఠులవారి నందినీధేనువు ఆకస్మికముగా వచ్చి వారి మ్రోల నిలిచినది. తదీయ ప్రభావమును వారు వినికివలన నెఱింగి యుండిరి.

వ్యా.—విషా దేతి.—తత్, కుమారస్య రఘోః - సైన్యం సేనా, సపది, విషాదః ఇష్టనాశకృతో మనోభఙ్గః - తదుక్తం * 'విషాద శ్చేతసో భఙ్గ ఉపాయాభావ చిన్తనైరి'తి - తేన లుప్తా - ప్రతిపత్తిః కర్తవ్యజ్ఞానం - యస్య తత్తథోక్తం, విస్మితమ్ అశ్వనాశ స్యాకస్మికత్వా దాశ్చర్యావిష్టం సత్, స్థితం తస్థౌ చ, అథ, శ్రుతప్రభావా, యదృచ్ఛయా స్వేచ్ఛయా, ఆగతా, నన్దినీ నామ వసిష్ఠధేను శ్చ, దదృశే; రఘోః త్వప్రసాద లబ్ధత్వాత్ తదనుజిఘృక్ష యేతి భావః; ద్వౌ చకారౌ పవిలమ్బసూచకౌ.

---

తదఙ్గనిష్యన్దజలేన లోచనే
ప్రమృజ్య పుణ్యేన పురస్కృతః సతామ్
అతీన్ద్రియే ష్వ ప్యుపపన్నదర్శనో
బభూవ భావేషు దిలీపనన్దనః. 41

టీక.— సతాం = సత్పురుషులచేత, పురస్కృతః = గౌరవింపఁబడిన, దిలీపనన్దనః = దిలీపపుత్త్రుఁడు (రఘుమహారాజు), పుణ్యేన = పావనమయిన, తద...న— తత్ - ఆనందినియొక్క - అఙ్గ=అవయవముయొక్క - నిష్యన్ద=ద్రవమయినట్టి - జలేన= నీటితో - అనఁగా - మూత్రముతో, లోచనే = కన్నులను, ప్రమృజ్య = తుడుచుకొని, అతీన్ద్రియే ష్వపి = ఇంద్రియముల నతిక్రమించినవానియందు సయితము, భావేషు = వస్తువులయందు, ఉప...నః...ఉపపన్న = లభించిన - దర్శనః = దృష్టిగలవాఁడు, బభూవ=ఆయెను.

తా.—అంతట, సజ్జనపూజితుఁడయిన యారఘుమహారాజు పావనమయిన యా నందినీమూత్రముతో కన్నులు కడుగుకొనెను. వెంటనే ఆయనకు ఇంద్రియాగోచరవస్తువులందు సయితము దృష్టి కలిగెను.

వ్యా.—తద ఙ్గేతి.—సతాం, పురస్కృతః పూజితః, దిలీపస్య నన్దనో రఘుః, పుణ్యేన పవిత్రేణ, తస్యాః నన్దిన్యాః - యదఙ్గం తస్య - నిష్యన్దో ద్రవః - స ఏవ జలం మూత్ర మిం త్యర్థః - తేన, లోచనే ప్రమృజ్య శోధయిత్వా, అతీన్ద్రియేషు ఇన్ద్రియ మతిక్రాన్తేషు * 'అత్యాదయః క్రాన్తాద్యర్థే ద్వితీయ యే'తి సమాసః * ద్విగు ప్రాప్తాపన్నాలంపూర్వ గతిసమాసేషు పరవల్లిఙ్గతా ప్రతిషేధా ద్విశేష్యనిఘ్నత్వం, భావేషు వస్తుభూతేషు, ఉపపన్నదర్శనః సంపన్న సాక్షాత్కారశక్తిః, బభూవ.

---

స పూర్వతః పర్వతపక్షశాతనం
దదర్శ దేవం నరదేవసంభవః
పునః పునః సూత నిషిద్ధచాపలం
హరన్త మశ్వం రథరశ్మిసంయతమ్. 42

టీక.—నరదేవసంభవః - నరదేవ = (దిలీప) మహారాజువలన - సంభవః = పుట్టుకగల్గిన, సః = అరఘువు, పునఃపునః = మరలమరల, సూత...లం—సూత = సారథిచేత - నిషిద్ధ = ఆఁపఁబడిన - చాపలం = ఉదుటుతనముగలదై, రథ...న్తం— రథ = తేరియొక్క - రశ్మి = ప్రగ్గములతో - సంయతమ్ = కట్టఁబడ్డ, అశ్వం = గుఱ్ఱమును, హరన్తం = అపహరించుచున్నవానిని, పర్వ...సం—పర్వత = కొండల యొక్క - పక్ష = ఱెక్కలకు - శాతనం = ఛేదకుఁడయిన, దేవం = ఇంద్రుని, పూర్వతః = తూర్పునందు, దదర్శ = చూచెను.

తా.—అంతట గుఱ్ఱము తప్పించుకొని పోవుటకై దుముకుచుండుటయు, దాని దుడుకుతనమును ఇంద్రసారథియైన మాతలి మాటిమాటికి అణఁగఁగొట్టుచు తేరిప్రగ్గములతో దానిని కట్టివైచుటయు, అట్లు అగుఱ్ఱమును కొండల ఱెక్కలనఱుకుడుగాఁ డయిన యింద్రుఁడు తూర్పుదిక్కునకు కొనిపోవుచుండుటయు, రఘువునకు ప్రత్యక్ష మాయెను.

వ్యా.—స ఇతి.—నరదేవసంభవః స రఘుః, పునఃపునః - సూతేన మాతలినా - నిషిద్ధ చాపలం నివారి తౌద్ధత్యం, రథస్య - రశ్మిభిః ప్రగ్రహైః * 'కిరణప్రగ్రహౌ రశ్మీ' ఇ త్యమరః - సంయతం బద్ధమ్, అశ్వం, హరన్తం, పర్వతపక్షాణాం - శాతనం ఛేదకం, దేవ మిన్ద్రం, పూర్వతః పూర్వస్యాం దిశి, దదర్శ.

---

శతై స్త మక్ష్ణా మనిమేషవృత్తిభి
ర్హరిం విదిత్వా హరిభి శ్చ వాజిభిః
అవోచ దేనం గగనస్పృశా రఘుః
స్వరేణ ధీరేణ నివర్తయ న్నివ. 44

టీక.—రఘుః = రఘువు, తం = ఆగుఱ్ఱపుమ్రుచ్చును, అనిమేషవృత్తిభిః = ఱెప్పవాల్చుపనిలేని, అక్ష్ణాం = కన్నులయొక్క, శతైః = నూఱులచేతను, హరిభిః = పచ్చని వన్నెగల, వాజిభి శ్చ = గుఱ్ఱములచేతను, హరిం = దేవేంద్రునిఁగా, విదిత్వా = తెలిసికొని, గగన స్పృశా - గగన = మింటిని - స్పృశా = తాఁకునట్టి, ధీరేణ = గంభీరపు, స్వరేణ = ధ్వనిచేత, నివర్తయ న్నివ = వెన్కకు మరలించువాఁడువోలె, ఏనమ్ = ఈదేవేంద్రునితో, అవోచత్ = పలికెను.

తా.—తెప్పపాటులేని నూర్లకొలది కన్నులచేతను పచ్చని గుఱ్ఱములచేతను గుఱ్ఱపు మ్రుచ్చు దేవేంద్రుఁడని తెలిసికొని రఘువు ఆతని వెనుకకు మరలించువాఁడు వోలె మిన్నుముట్టెడు ధీరంపు టెలుంగుతో నిట్లు హెచ్చరించెను.

వ్యా.—శతై రితి.—రఘుః, తమ్ అశ్వహర్తారమ్, అనిమేష వృత్తిభిః నిమేష వ్యాపారశూన్యైః, అక్ష్ణాం శతైః, హరిద్భిః వాజిభి ర్హరిత్వైశ్చ * 'హరి ర్వర్ణవిఖ్యాతో హరిత్కపిల వర్ణయో రి'తి కేశవః, ఏనం హరి, మిన్ద్రం విదిత్వా * 'హరి ర్వాతార్కచన్ద్రేన్ద్ర యమోపేన్ద్ర మరీచి ష్వి'తి విశ్వః, గగనస్పృశా వ్యోమ వ్యాపినా, ధీరేణ గమ్భీరేణ, స్వరేణ ధ్వనినా, నివర్తయ న్నివ అవోచత్.

---

మఖాంశభాజాం ప్రథమో మనీషిభి
స్త్వ మేవ దేవేన్ద్ర సదా నిగద్యసే;
అజస్రదీక్షాప్రయతస్య మద్గురోః
క్రియావిఘాతాయ కథం ప్రవర్తసే? 44

టీక.—హేదేవేన్ద్ర = ఓదేవేంద్రుఁడా, మనీషిభిః = విద్వాంసులచేత, త్వమేవ=నీవే, మఖాంశభాజాం - మఖ=యజ్ఞములయందు - అంశ = హవి ర్భాగములను - భాజాం = పొందెడి వారిలోపల, ప్రథమః = మొదటి వాఁడవుగా, సదా = ఎల్లప్పుడు, నిగద్యసే = చెప్పఁబడుచున్నావు; తథాఽపి = అట్లయినను, అజస్ర = సర్వదా - దీక్షా = యాగదీక్షయందు - ప్రయతస్య = నియతుఁ డయిన, మద్గురోః - మత్ - నాయొక్క - గురోః = తండ్రియొక్క, క్రి...య—క్రియా = క్రియయొక్క—విఘాతాయ = చెఱుపుటకొఱకు, కథం = ఎట్లు, ప్రవర్తసే = కడంగెదవు ?

తా.—ఓదేవేంద్రుఁడా! యజ్ఞభాగభోజనులలో నిన్నే మొదటివానినిగా సర్వదా చెప్పుదురు. అట్టి నీవే నిరంతరము యజ్ఞదీక్షయందే యుండునట్టి నాతండ్రియొక్క యజ్ఞక్రియనే చెఱుప గడంగితి వేమి ?

వ్యా.—మ ఖేతి.— హే దేవేన్ద్ర, మనీషిభి స్త్వ మేవ, మఖాంశభాజాం యజ్ఞభాగభుజాం దేవానాం మధ్యే, ప్రథమః సదా, నిగద్యసే కథ్యసే; తథాఽపి అజస్రదీక్షాయాం నిత్యదీక్షాయాం - ప్రయతస్య నియతస్య, మద్గురోః మమ పితుః, క్రియా విఘాతాయ క్రియాం విహన్తు మిత్యర్థః * 'తుమర్థా చ్చ భావవచనా ది'తి చతుర్థీ, కథం ప్రవర్తసే.

---

త్రిలోకనాథేన సదా మఖద్విష
స్త్వయా నియమ్యా నను దివ్యచక్షుషా,
స చేత్ స్వయం కర్మసు ధర్మచారిణాం
త్వ మన్తరాయో భవసి, చ్యుతో విధిః. 45

టీక — త్రిలోకనాథేన - త్రిలోక=మూఁడులోకములకును - నాథేన = దొరవును, దివ్య చక్షుషా = దివ్యదృష్టిగలవాఁడవును, (అయిన), త్వయా = నీచేత, మఖద్విషః = యజ్ఞద్రోహులు, సదా = ఎల్లప్పుడును, నియమ్యా నను = దండింపఁబడఁదగినవారుగదా, సః = అట్టి, త్వం = నీవు, ధర్మచారిణాం - ధర్మ = వేదచోదితకర్మములను - చారిణాం = చేయువారియొక్క, కర్మసు = యాగములయందు, స్వయం= స్వయముగానే, అన్తరాయః = విఘ్నభూతుఁడవు, భవసి చేత్ = అగుదు వేని, విధిః= అనుష్ఠానము, చ్యుతః (భవేత్) = అంతరించినది (అగును).

తా.—మఱియు మూఁడులోకములకును దొరవు నీవు యాగద్రోహులను నీదివ్యదృష్టిచేత సర్వదా కనిపట్టి దండింపవలసినవాఁడవు గదా. అటువంటి నీవే ధర్మమాచరించువారి యాగకర్మములను భంగపఱచెద వేని ఇఁక అనుష్ఠానములు అంతరించినవే గదా.

వా.—త్రిలోకనాథే నేతి.—త్ర్యవయవో లోక స్త్రిలోకః - తస్య నాథః - త్రిలోకనాథః * శాకపార్థివాదిత్వా న్మధ్యమపదలోపి సమాసః - తేన త్రిలోకనియామకేన, దివ్యచక్షుషా అతీన్ద్రియార్థదర్శినా, త్వయా, మఖద్విషః క్రతువిఘ్నకర్తారః, సదా,నియమ్యా నను శిక్షణీయాః ఖలు, సః త్వం, ధర్మచారిణాం, కర్మసు క్రతుషు, స్వయ, మన్తరాయః విఘ్నో భవసి చేత్, విధి రనుష్ఠానం, చ్యుతః క్షతః స్యాత్, లోకే సత్కర్మకథై వాస్త మియా దితి భావః.

---

త దఙ్గ మగ్ర్యం మఘవ న్మహాక్రతో
రముం తురఙ్గం ప్రతిమోక్తు మర్హసి;
పథః శుచే ర్దర్శయితార ఈశ్వరా
మలీమసా మాదదతే న పద్ధతిమ్. 46

టీక.—హే మఘవన్ = ఓ ఇంద్రుఁడా, తత్ = కావున, మహాక్రతోః = అశ్వమేధయాగమునకు, అఙ్గమ్ = సాధనమును, అగ్ర్యమ్ = శ్రేష్ఠమును, (అయిన), అముం తురఙ్గం = ఈ గుఱ్ఱమును, ప్రతిమోక్తుం = ఒడయనికే విడుచుటకు, అర్హసి= తగుదువు. తథా హి = అట్లేగదా;—శుచేః = పవిత్రమయిన, పథః = దారిని, దర్శ-

యితారః = చూపువారయిన, ఈశ్వరాః = ప్రభువులు, మలీమసాం = కలుషమయిన, పద్ధతిం = దారిని, నాదదతే = స్వీకరింపరు.

తా.—కనుక నీవు అశ్వమేధయాగమునకు సాధనమయిన యీ మా తేజిని మాకు వదలిపెట్టుట న్యాయ్యము. మంచినడువడిని నడిచి చూపించెడి పెద్దలు స్వయముగా చెడునడువడిని అవలంబింపరు.

వ్యా.—త దితి.—హే మఘవన్, తత్ తస్మాత్ కారణాత్, మహాక్రతో రశ్వమేధస్య, అఙ్గం సాధనమ్ అగ్ర్యం శ్రేష్ఠమ్, అముం తురఙ్గం, ప్రతిమోక్తుం ప్రతిదాతుం, అర్హసి, తథా హి, శుచేః పవిత్రస్య - పథః దర్శయితారః - సన్మార్గప్రదర్శకాః, ఈశ్వరాః మహాన్తః, మలీమసాం మలినాం, పద్ధతిం - నాదదతే న స్వీకుర్వతే - అసన్మార్గం నావలమ్బన్తే ఇత్యర్థః * 'మలీమసం తు మలినం కచ్చరం మలదూషిత మి' త్యమరః.

---

ఇతి ప్రగల్భం రఘునా సమీరితం
వచో నిశమ్యాధిపతి ర్దివౌకసామ్
నివర్తయామాస రథం సవిస్మయః,
ప్రచక్రమే చ ప్రతివక్తు ముత్తరమ్. 47

టీక.— ఇతి = ఇట్లు, రఘుణా = రఘువుచేత, సమీరితం = చెప్పఁబడిన, ప్రగల్భం = ప్రౌఢమయిన, వచః = మాటను, నిశమ్య = విని, దివౌకసాం = వేల్పుల యొక్క, అధిపతిః = ప్రభువు, సవిస్మయః సన్ = ఆశ్చర్యముతోఁ గూడినవాఁడై, రథం = (తన) తేరిని, నివర్తయామాస = మరల్చెను; ఉత్తరం = బదులు, ప్రతివక్తుం= పల్కుటకు, ప్రచక్రమే చ = ఆరంభించినవాఁడును అయ్యెను.

తా.—ఈప్రకారము రఘువు ధీరముగా పలికినమాటను విని అతనిప్రభావమున కాశ్చర్యపడి దేవేంద్రుఁడు రథమును వెనుకకు మరలించి అతని కిట్లు బదులు పల్కెను.

వ్యా.—ఇ తీతి—ఇతి రఘుణా సమీరితం ప్రగల్భం వచః, నిశమ్యాకర్ణ్య, దివౌకసః స్వర్గౌకసః * 'దివం స్వర్గేఽన్తరిక్షే చే'తి విశ్వః - తేషా మధిపతి ర్దేవేన్ద్రః, రఘుప్రభావాత్, సవిస్మయః సన్, రథం నివర్తయామాస, ఉత్తరం ప్రతివక్తుం ప్రచక్రమే చ.

---

య దాత్థ రాజన్యకుమార తత్ తథా,
యశ స్తు రక్ష్యం పరతో యశోధనైః;

జగత్ప్రకాశం త దశేష మిజ్యయా
భవద్గురు ర్లఙ్ఘయితుం మ మోద్యతః. 48

టీక.—హే రాజన్యకుమార = ఓక్షత్రియపుత్త్రుఁడా, యత్ = దేనిని, ఆత్థ = పలుకుచున్నావో, తత్ = అది, తథా = అట్లో; కింతు = మఱేమనిన, యశోధనైః = యశః = కీర్తియే - ధనైః = ధనముగాఁగలవారిచేత, పరతః = శత్రువులవలననుండి, యశః = కీర్తి, రక్ష్యం = కాపాడుకొనఁబడఁదగినది. భవద్గురుః - భవత్ = నీ యొక్క - గురుః = తండ్రి, జగత్ప్రకాశం - జగత్ = లోకములలో - ప్రకాశమ్ = ప్రసిద్ధమయిన, అశేషం = సమస్తమయిన, మమ = నాయొక్క, తత్ = ఆకీర్తిని, ఇజ్యయా = జన్నముచేత, లఙ్ఘయితుం = అతిక్రమించుటకు, ఉద్యతః = పూనుకొన్నాఁడు.

తా.—ఓక్షత్రియకుమారుఁడా' నీవన్నమాట వాస్తవమే. అయినను మాబోఁటి కీర్తిమంతులు పరులవలననుండి తమ కీర్తిని కాపాడుకొనవలయును. నీతండ్రి జగత్ప్రసిద్ధమయిన నాకీర్తి నెల్ల యాగముచే హరించుటకు పూనుకొనియున్నాఁడు; కావున నే నాతని యాగమును భంగపఱుపంగడంగితిని.

వ్యా.— య ఇతి.—హే రాజన్యకుమార - క్షత్రియకుమార * మూర్ధాభిషిక్తో రాజన్యో బాహుజః క్షత్త్రియో విరా డిత్యమరః, య ద్వాక్యమ్, ఆత్థ బ్రవీషి * 'బ్రువః పఞ్చానా మి'త్యాదినా ఆహాదేశః, తత్ తథా సత్యం, కిం తు, యశోధనైః రస్మాదృశైః, పరతః శత్రుతః, యశో రక్ష్యమ్; తతః కి మి త్యత ఆహ - భవద్గురుః త్వత్పితా, జగత్ప్రకాశం లోకప్రసిద్ధమ్, అశేషం సర్వం, మమ త ద్యశః, ఇజ్యయా యాగేన, లఙ్ఘయితుం తిరస్కర్తుమ్, ఉద్యతః ఉద్యుక్తః.

---

హరి ర్యథైకః పురుషోత్తమః స్మృతో,
మహేశ్వర స్త్ర్యమ్బక ఏవ నాపరః,
తథా విదు ర్మాం మునయః శతక్రతుం,
ద్వితీయగామీ న హి శబ్ద ఏష నః. 49

టీక.—యథా = ఏప్రకారము, హరిః = విష్ణువు, ఏకఏవ = ఒకఁడే, పురుషోత్తమః = పురుషోత్తముఁడుగా, స్మృతః = తలంపఁబడుచున్నాఁడో, యథా, త్ర్యమ్బక ఏవ = ముక్కంటియే, మహేశ్వరః = మహేశ్వరుఁడుగా, స్మృతః, అపరః = మఱియొకఁడు, (తథా = అట్లు), న స్మృతః = తలంపఁబడఁడో, తథా = ఆప్రకారమే, మునయః = ఋషులు, మాం = నన్ను, శతక్రతుం = నూరుజన్నముల వానినిగా, విదుః = ఎఱుంగుదురు; నః = మాయొక్క, ఏషః = ఈ, శబ్దః = పేరు,

ద్వితీయగామీ - ద్వితీయ = రెండవవానిని - గామీ = పొందునట్టిది - న హి = కానే కాదు.

తా.—పెద్దలు ఏప్రకారము విష్ణుమూర్తి నొక్కనినే పురుషోత్తముఁ డనియు ముక్కంటి నొక్కనినే మహేశ్వరుఁ డనియుఁ, వ్యవహరింతురో, ఆప్రకారమే మునులు నన్నొకనినే నూఱుగుఱ్ఱపుజన్నములవానినిగా పేర్కొనుచున్నారు. మా ముగ్గురయొక్క యీపురుషోత్తమాది శబ్దములు మఱియొకరికి చెందవు. కావున నాశతక్రతునామము నీతండ్రికి చెందకుండుటకై యతని యీనూఱవయాగమును భంగపెట్టుచున్నాను.

వ్యా.—కిం ఙ ద్యశ ఇ త్య త్రాహ - హరి రితి.— * పురుషే షూత్తమ ఇతి సప్తమీసమాసః * 'న నిర్ధారణే' ఇతి షష్ఠీసమాసనిషేధాత్ - కర్మధారయే తు * 'స న్మహ త్పర మోత్త మోత్కృష్టాః పూజ్యమానైః' ఇ త్యుత్తమపురుష ఇతిస్యాత్ - యథా, హరిః విష్ణుః, ఏక ఏవ, పురుషోత్తమః స్మృతః, యథా త్ర్యమ్బక ఏవ మహేశ్వరః స్మృతః, నాపరః పుమాన్ తథా స్మృతః, తథా మునయః మాం శతక్రతుం, విదుః విదన్తి * 'విదో లటో వే'తి ఝే ర్జుసాదేశః ; నోఽస్మాకం - హరిహరయోర్మమ చే త్యర్థః, ఏష త్రితయోఽపి శబ్దః, ద్వితీయం గచ్ఛ తీతి ద్వితీయగామీ నహి * ద్వితీయా ప్రకరణే గమ్యాదీనా ముపసంఖ్యానాత్ సమాసః.

---

> అతో ఽయ మశ్వః కపిలానుసారిణా
> పితు స్త్వదీయస్య మయాఽపహారితః ;
> అలం ప్రయత్నేన త, వాత్ర మానిధాః
> పదం పదవ్యాం సగరస్య సంతతేః. 50

టీక.—అతః = కావున, త్వదీయస్య = నీవాఁడైన, పితుః = తండ్రియొక్క, అయమ్ అశ్వః = ఈగుఱ్ఱము, కపి...ణా - కపిల = కపిలమహామునిని - అనుసారిణా = పోలిన, మయా = నాచేత, అపహారితః = అపహరింపఁబడినది; అత్ర = ఈగుఱ్ఱముకై, తవ ప్రయత్నేన = నీ పూనికను, అలం = మానుము; సగరస్య = సగరచక్రవర్తియొక్క, సంతతేః = సంతానముయొక్క, పదవ్యాం = సరణియందు, పదం = అడుగును, మానిధాః = పెట్టకుము.

తా.—కావున నీతండ్రియొక్క నూఱవ గుఱ్ఱమును నేను కైకొంటిని. దీనిని సాధించుకొనుటకై నీవు యత్నింపకుము. ఏలయన - యత్నింతువేని పూర్వము యజ్ఞాశ్వము నిమిత్తమున సగరచక్రవర్తికొడుకులకు కపిలమహామునిచేత అయినగతి నీకు నాచేత నగును.—నిన్ను భస్మము గావించెద ననుట.

జహార చాన్యేన మయూరపత్త్రిణా
శరేణ శక్రస్య మహాశనిధ్వజమ్ ;
చుకోప తస్మై స భృశం సురశ్రియః
ప్రసహ్య కేశవ్యపరోపణాదివ. 56

టీక.—మయూరపత్త్రిణా = నెమలి ఱెక్కలుగల, అన్యేన శరేణ = మఱియొక బాణముతో, శక్రస్య = ఇంద్రునియొక్క, మహాశనిధ్వజం - మహాత్ = గొప్ప-అశని = పిడుగే అయిన, ధ్వజం = టెక్కెమును, జహార చ = కొట్టివైవనుంగూడ కొట్టివైచెను; సః = ఆయింద్రుఁడు, సురశ్రియః = దేవలక్ష్మికి, ప్రసహ్య = బలిమిమెయి, కేశ...వ—కేశ = తలవెండ్రుకలయొక్క - వ్యపరోపణాదివ = ఛేదించుట వలననుంబోలె, తస్మై = ఆరఘుమహారాజుమీఁద, భృశం = మిక్కిలి, చుకోప = కోపగించెను.

తా.—ఇంతియగాక ఆరఘువు దేవేంద్రుని పిడుగుఁడెక్కెమును నెమలిఱెక్కలుగట్టిన మఱియొకబాణముతో విఱుగఁగొట్టెను. అందులకు సురలక్ష్మియొక్క కేశపాశమును బలాత్కారముగ గత్తిరించినట్టుగా దేవేంద్రుఁడు రఘువుపై క్రోధము పూనెను.

వ్యా.—జహారేతి—అన్యేన మయూరపత్త్రిణా మయూరపక్షవతా, శరేణ శక్రస్యేన్ద్రస్య, మహాశనిధ్వజం మహాన్తమశనిరూపం ధ్వజం, జహార చిచ్ఛేద చ; స శక్రః, సురశ్రియః, ప్రసహ్య బలాత్కృత్య, కేశానాం - వ్యపరోపణాత్ అవతారణాచ్ఛేదనాదివేత్యర్థః, తస్మై రఘవే - భృశమత్యర్థం - చుకోప - తం హన్తుమైచ్ఛదిత్యర్థః * 'క్రుధ ద్రుహే' త్యాదినా సంప్రదానత్వా చ్చతుర్థీ.

---

తయో రుపాన్తస్థిత సిద్ధసైనికం
గరుత్మదాశీవిషభీమదర్శనైః
బభూవ యుద్ధం తుములం జయైషిణో
రధోముఖై రూర్ధ్వముఖైశ్చ పత్త్రిభిః. 57

టీక.— జయైషిణోః - జయ = గెలుపును - ఏషిణోః = కోరుచున్న, తయోః = ఆయింద్రరఘువులకు, గరు...నైః - గరుత్మత్ = గద్దలవలెను - ఆశీవిష = ములవలెను - భీమ = భయంకరములైన - దర్శనైః = అగపడుటలుఁగలిగినవియు, అధోముఖైః = అధోముఖములును, ఊర్ధ్వముఖైశ్చ = ఊర్ధ్వముఖములును (అయిన), పత్త్రిభిః = బాణములచేత, ఉపా...కం - ఉపాన్త = సమీపమందు - స్థిత = ఉన్నట్టి,

సిద్ధ = దేవతలును - సైనికం = సేనాజనులును కలిగినట్టిది, తుములం = సంకుల మయిన పోరు, బభూవ = జరిగెను.

తా.—అంతట ఓండొరుల గెలువం దమకపడి యాయిరువురును దొమ్మిగా పోరిరి. ఇంద్ర బాణములు క్రిందికిని రఘుబాణములు మీఁదికిని (రెక్కలతోడిపాములవలె-లేక) గరుత్మంతులవలెను పాములవలెను చూపఱకు భయ మగునట్లుగా పర్వుచుండినవి. ఆయాశ్చర్యమును మింట సిద్ధులును నేలను రఘుసైనికులును తటస్థులై చూచుచుండిరి.

వ్యా.—తయో రితి—జయైషిణో రన్యోన్యజయకాఙ్క్షిణో స్తయో రిన్ద్రరఘ్వోః గరుత్మన్తః పక్షవన్తః * 'గరు త్పక్షః ఛదః పత్త్ర మి' త్యమరః - ఆశీవిషాః ఆశిషి దంష్ట్రాయాం విషం యేషాం తే ఆశీవిషాః సర్పాః * పృషోదరాదిత్వాత్ సాధుః * 'ఆశీ ర్హితాశంసాఽహిదంష్ట్రయో రి' త్యమరః, త ఇవ భీమదర్శనాః సపక్షాః సర్పా ఇవ ద్రష్టౄణాం భయావహా ఇత్యర్థః - అథవా - గరుత్మన్తః గరుడాః - ఆశీవిషాః సర్పాః - త ఇవ భీమదర్శనాః - పరస్పరవిరుద్ధప్రయోగై రితి భావః - తైః, అధోముఖై రూర్ధ్వముఖై శ్చ - ఇన్ద్రముక్తా అధోముఖాః రఘుముక్తా ఊర్ధ్వముఖా శ్చ - తయో ర్ధన్వినో రుపర్యధోదేశావస్థితత్వా దితి భావః, పత్త్రిభి ర్బాణైః, ఉపాస్తే స్థితాః తటస్థాః - సిద్ధా దేవాః ఇన్ద్రస్య - రఘో శ్చ సైనికం - యస్మిన్ తత్ తథోక్తం, తుములం సంకులం, యుద్ధం బభూవ.

---

అతిప్రబన్ధప్రహితాస్త్రవృష్టిభి
స్తమాశ్రయం దుష్ప్రసహస్య తేజసః
శశాక నిర్వాపయితుం న వాసవః
స్వత శ్చ్యుతం వహ్ని మి వాద్భి రమ్బుదః. 58

టీక.—వాసవః = ఇంద్రుఁడు, అతి...భిః - అతి ప్రబన్ధ = బొత్తిగా ఎడతెంపు లేకుండ - ప్రహిత = ప్రయోగింపఁబడిన - అస్త్ర = పోటుముట్ల యొక్క - వృష్టిభిః = జడుల చేత, దుష్ప్రసహస్య = ఓర్వరాని, తేజసః = శౌర్యమునకు, ఆశ్రయం = తావల మయిన, తం = ఆరఘువును, అమ్బుదః = మేఘుఁడు, అద్భిః = నీళ్లతో, స్వతః = తనవలన నుండి, చ్యుతం = వెలువడిన, వహ్ని మివ = నిప్పును బోలె, నిర్వాపయితుం = తెగటార్చుటకు, న శశాక = సమర్థుఁడు కాఁడాయెను.

తా.—ఎనమండ్రు లోకపాలుర యంశములచే జనించిన వాఁడగుటచే ఇంద్రాంశముకూడ కలవానిని ఆరఘువును ఇంద్రుఁడు ఎడతెంపులేకుండ అస్త్రములను జడిగాఁ గురియించియు - మేఘము తనలోనుండి వెలువడిన పిడుగును తననీళ్లచేత ఎట్లు ఆర్ప నేరదో అట్లే అణఁపనేరఁ డాయెను.

దానా త్పృష్ఠచిహ్నా, సీధ్ధరయా న్నదీవేగా దివ, సుహ్మా స్సుహ్మదేశీయై రాజభిః * సుహ్మాదయ శ్శబ్దాః జనపదవాచకాః క్షత్రియా నాచక్షతే, వైతసీం వేతససమ్బన్ధినీం వృత్తిం ప్రణతత్వ మి త్యర్థః, ఆశ్రిత్య, ఆత్మా సంరక్షితః; అత్ర కౌటిల్యః * 'బలీయసాఽభియుక్తో దుర్బల స్సర్వ త్రానుప్రణతో వైతసం ధర్మ మాతిష్ఠే ది'తి.

---

వఙ్గా నుత్ఖాయ తరసా నేతా నౌసాధనోద్యతాన్

నిచఖాన జయస్తమ్భాన్ గఙ్గా స్రోతోఽన్తరేషు సః. 36

టీక.—నేతా = (ఆ) రాజు, నౌ...తాన్ - నౌ = ఓడలనెడు - సాధన = సహాయముల చేత - ఉద్యతాన్ = సమకట్టిన, వఙ్గాన్ = వంగదేశరాజులను, తరసా = బలముచేత, ఉత్ఖాయ = పెల్లార్చి, గఙ్గా...షు—గఙ్గా = మిన్నేటియొక్క - స్రోతః = ప్రవాహములయొక్క - అన్తరేషు = నడిమితావులయందు, జయస్తమ్భాన్ - జయ = గెలుపుం దెలుపున వయిన - స్తమ్భాన్ = కంబములను, నిచఖాన = నాటెను.

తా.—అట రఘుమహారాజు వంగదేశపురాజులు ఓడ లెక్కి వచ్చి యెదిరింపఁగా వారిని బలిమిమెయి నోడఁగొట్టి, గంగలోని లంకలలో తన జయస్తంభములను నాటెను.

వ్యా.—వఙ్గా నితి.—నేతా నాయకః, సః రఘుః, నౌభిః సాధనైః - ఉద్యతాన్ సన్నద్ధాన్ వఙ్గాన్ రాజ్ఞః, తరసా బలేన * 'తరసీ బలరంహసీ'ఇతి యాదవః, ఉత్ఖాయ ఉన్మూల్య, గఙ్గాయాః - స్రోతసాం ప్రవాహాణామ్ - అన్తరేషు, జయస్తమ్భాన్, నిచఖాన స్థాపితవా ని త్యర్థః.

---

ఆపాదపద్మప్రణతాః కలమా ఇవ తే రఘుం

ఫలైః సంవర్ధయామాసు రుత్ఖాతప్రతిరోపితాః. 37

టీక.—ఆ...తాః—ఆ పాద పద్మ = పాద కమల పర్యంతమును - ప్రణతాః = మ్రొక్కినారు గనుకనే, ఉత్ఖా...తాః - ఉత్ఖాత = పూర్వము రాజ్యాధికారమునుండి తొలఁగింపఁబడియు - ప్రతిరోపితాః = పిమ్మట మరల ప్రతిష్ఠింపఁబడినవారయిన, తే = ఆవంగరాజులు, ఆ...తాః—ఆపాదపద్మ = పాదపద్మపర్యంతమును, ప్రణతాః = వంగినవై, ఉత్ఖా...తాః—ఉత్ఖాత = పూర్వము పెల్లగింపఁబడి - ప్రతిరోపితాః = తర్వాతనాటఁబడిన, కలమాఇవ = వరిపైరులవలె, రఘుం = రఘుమహారాజును, ఫలైః = ధనముల చేతను - ధాన్యముల చేతను, సంవర్ధయామాసుః = పెంపొందించిరి.

తా.—అంతట వంగరాజులు రఘుమహారాజునకు అతనిపాదపద్మములు తమశిరమునకు సోఁకునట్లుగా మ్రొక్కిరి. అతఁడు తొలుత వారిని రాజ్యమునుండి తొలఁగించినవాఁ డ

య్యును ఆనమ్రులకై మన్నించి మరల రాజ్యమున నెలకొల్పెను. వారును ఆయనకు ధనము లర్పించి పెంపు గావించిరి. ఇది యెట్లుండెననఁగా - వరినాఱును పెకలించి యూడ్చిన యెడల (అనఁగా మరల నాటినయెడల), అది (ఎదిగి) ఒడయని పాదపద్మముల మూలము వఱకువంగి వరి యొసంగి యెట్లు పెంపొందించునో - అట్లు ఉండెను.

వ్యా.—ఆపాదేతి - ఆపాదపద్మమ్ అఙ్ఘ్రిపద్మపర్యన్తం - ప్రణతాః అత ఏవ, ఉత్ఖాతాః పూర్వముద్ధృతా అపి-ప్రతిరోపితాః పశ్చాత్ స్థాపితాః, తే వఙ్గాః, కలమాః శాలివిశేషా ఇవ * 'శాలయః కలమాద్యాశ్చ షష్టికాద్యాశ్చపుంస్యమీ' ఇత్యమరః, తేఽ ప్యాపాదపద్మం మూలపద్మపర్యన్తం ప్రణతాః * 'పాదో బుధ్నే తురీయాంశ' ఇతి విశ్వః - ఉత్ఖాతప్రతిరోపితాశ్చ, రఘుం, ఫలైః ధనైః - అన్యత్ర సస్యైః, సంవర్ధయామాసుః * 'ఫలం ఫలే ధనే బీజే నిష్పత్తౌ భోగలాభయోః । సస్యే' ఇతి కేశవః.

---

స తీర్త్వా కపిశాం సైన్యై ర్బద్ధద్విరదసేతుభిః
ఉత్కలై ర్దర్శితపథః కళిఙ్గాభిముఖో యయౌ. 38

టీక.—సః = ఆరఘుమహారాజు, బద్ధ...భిః—బద్ధ = కట్టఁబడిన - ద్విరద = ఏనుఁగులనెడు - సేతుభిః = అనకట్టగల, సైన్యైః = సైనికులతో, కపిశాం = కపిశానదిని, తీర్త్వా = దాఁటి, ఉత్కలైః = ఓఢ్రరాజులచేత, దర్శి...సః—దర్శిత = చూపఁబడిన - పథః సః = దారికలవాఁడై, కళి...ఖః—కళిఙ్గ = కళిఙ్గదేశమునకు, అభిముఖః = ఎదురై, యయౌ = తరలెను.

తా.—ఆరఘుమహారాజు ఏనుఁగులను వంతెనగా నిలిపి దానిమీఁదుగా దండుతో కపిశానదిని దాఁటినవాఁడై, ఉత్కలరాజులు చూపించిన దారినిబట్టి కళింగదేశమునకు పోయెను.

వ్యా.—స ఇతి.—స రఘుః, బద్ధాః ద్విరదా ఏవ. సేతవో యైః తైః సైన్యైః, కపిశాం నామ నదీం - కపిలా మితి కేచి త్పఠన్తి - తాం, తీర్త్వా, ఉత్కలైః రాజభిః, దర్శితపథః సందర్శితమార్గః సన్, కళిఙ్గాభిముఖః కళిఙ్గదేశాభిముఖః, యయౌ.

---

స ప్రతాపం మహేన్ద్రస్య మూర్ధ్ని తీక్ష్ణం న్యవేశయత్
అఙ్కుశం ద్విరదస్యేవ యన్తా గమ్భీరవేదినః. 39

టీక.—సః = ఆరఘుమహారాజు, మహేన్ద్రస్య = మహేంద్రపర్వతముయొక్క, మూర్ధ్ని = శిఖరమునందు, తీక్ష్ణం = ఓర్వఁగూడని, ప్రతాపం = పరాక్రమమును, యన్తా = మావటీఁడు, గమ్భీరవేదినః = గంభీరవేదిఅనెడి, ద్విరదస్య = ఏనుఁగు

యొక్క, మూర్ధ్ని = శిరమునందు, తీక్ష్ణం = వాఁడియయిన, అంకుశ మివ = అంకుసమునుంబోలె, న్యవేశయత్ = ఉంచెను.

తా.—గంభీరవేది యనఁగా తోలుఁజీలినను రక్తము కాఱినను మాంసము డోడినను మదాతిరేకముచేత ఎఱుంగక యుండునట్టియేనుఁగు. అట్టియేనుఁగుశిరమున మావటీఁడు అంకుశమును వైచుప్రకారము రఘుమహారాజు మహేంద్రపర్వతముయొక్క శిఖరమందు తనప్రతాపమును నిలిపెను.

వ్యా.—స ఇతి.—స రఘుః, మహేన్ద్రస్య కులపర్వతవిశేషస్య - సప్త కులపర్వతాః -

'మహేన్ద్రో మలయః సహ్యః శుక్తిమా నృక్షపర్వతః
విన్ధ్య శ్చ పారియాత్ర శ్చ స ప్తైతే కులపర్వతాః.'

ఇతి విష్ణుపురాణవచనాత్, మూర్ధ్ని, తీక్ష్ణం దుస్సహం, ప్రతాపం, యన్తా సారథిః *'నియన్తా ప్రాజితా యన్తా సూతః క్షత్తా చ సారథి రి' త్యమరః, గమ్భీరవేదినః గజవిశేషస్య, మూర్ధ్ని, తీక్ష్ణం నిశితమ్, అఙ్కుశ మివ, న్యవేశయత్ నిక్షిప్తవాన్ -

'త్వగ్భేదా చ్ఛోణితస్రావా న్మాంసస్య చ్యవనా దపి
ఆత్మానం యో న జానాతి స స్స్యా ద్గమ్భీరవేదికః' ఇతి రాజపుత్రీయే -
'చిరకాలేన యో వేత్తి శిక్షాం పరిచితా మపి
గమ్భీరవేదీ విజ్ఞేయః స గజో గజవేదిభిః' ఇతి మృగచర్మీయే.

---

ప్రతిజగ్రాహ కాళిఙ్గ స్త మస్త్రై ర్గజసాధనః
పక్షచ్ఛేదోద్యతం శక్రం శిలావర్షీవ పర్వతః. 40

టీక.—గజసాధనః - గజ = ఏనుఁగులే - సాధనః = సేనాంగముగాఁగలిగిన, కాళిఙ్గః = కళింగరాజు, అస్త్రైః = ఆయుధములతో, తం = ఆరఘుమహారాజును, పక్ష...తం - పక్ష = ఱెక్కలయొక్క - ఛేద = నఱుకుటయందు - ఉద్యతం = ఉద్యుక్తుఁడయిన, శక్రం = ఇంద్రుని, శిలావర్షీ - శిలా = రాలను-వర్షీ = కురిసెడు, పర్వత ఇవ = కొండవలె, ప్రతిజగ్రాహ = ఎదిరించెను.

తా.—కళింగరాజునకు ఏనుఁగులదండు అధికము. అట్టి యుపకరణములుఁగల యాతఁడు ఱెక్కలు నఱుకవచ్చిన యింద్రుని రాలవానతో కొండ యెదిరించినట్టు ఆరఘుమహారాజును ఆయుధప్రయోగముతో ఎదిరించెను.

వ్యా.—ప్రతిజగ్రాహేతి.—గజసాధనః, కాళిఙ్గః కళిఙ్గానాం రాజా *'ద్వ్యఞ్మగధ కళిఙ్గ సూరమసా ద ణి' త్యణ్ప్రత్యయః, అస్త్రై రాయుధైః, తం రఘుం, పక్షాణాం-

ఛేదే ఛేదనే - ఉద్యతమ్ ఉద్యుక్తం, శక్రం, శిలావర్షీ పర్వత ఇవ, ప్రతిజగ్రాహ అభియుక్తవాన్.

---

ద్విషాం విషహ్య కాకుత్స్థ స్తత్ర నారాచదుర్దినం
సన్మఙ్గళస్నాత ఇవ ప్రతిపేదే జయశ్రియమ్. 41

టీక.—కాకుత్స్థః = రఘుమహారాజు, తత్ర = ఆమహేంద్రపర్వతమునందు, ద్విషాం = శత్రువులయొక్క, నారాచదుర్దినం - నారాచ = బాణవిశేషములయొక్క - దుర్దినం = వర్షమును, విషహ్య = ఓర్చి, స...వ - సత్ = యథాశాస్త్రముగా - మఙ్గళ = శుభముకొఱకు - స్నాతఇవ = అభిషేకింపఁబడినవాఁడువోలె, జయశ్రియం - జయలక్ష్మిని, ప్రతిపేదే = పొందెను.

తా.—అచ్చట రఘుమహారాజు శత్రువుల నారసములవర్షమును ఓర్చినవాఁడై మంగళార్థము అభిషేకింపఁబడినవాఁడువోలె గెలుపుసిరిని గైకొనెను—ఆబాణవర్షమును ఓర్చుట అతనికి మంగళాభిషేకమువలె లీలగాను ఉత్సవముగాను ఉండె ననియు, పెండ్లికొమారుఁడు మంగళాభిషేకము పొంది కన్నియను పడయునట్లు ఆయన యాబాణవర్షము నోర్చి జయలక్ష్మిం బడసె ననియు, భా.

వ్యా.— ద్విషా మితి.—కాకుత్స్థః - రఘుః, తత్ర మహేన్ద్రాద్రౌ, ద్విషాం, నారాచదుర్దినం - నారాచానాం బాణవిశేషాణాం - దుర్దినం లక్షణయా వర్ష ముచ్యతే * 'మేఘచ్ఛన్నేఽహ్ని దుర్దిన మి' త్యమరః, విషహ్య సహిత్వా, స ద్యథాశాస్త్రం- మఙ్గళస్నాత ఇవ విజయమఙ్గళార్థ మభిషిక్త ఇవ. జయశ్రియం, ప్రతిపేదే.
* 'య త్తు సర్వౌషధిస్నానం తన్మఙ్గళ ముదీరిత మి'తి యాదవః.

---

తామ్బూలీనాం దళై స్తత్ర రచితాపానభూమయః
నారికేళాసవం యోధాః శాత్రవం చ పపు ర్యశః. 42

టీక.—తత్ర = ఆమహేంద్రపర్వతమందు, యోధాః = జోదులు, రచి...యః సన్తః - రచిత=నిర్మింపఁబడిన - ఆపానభూమయః సన్తః = పానయోగ్యప్రదేశములు గలవారై, నారికేళాసవం = టెంకాయకల్లును, తామ్బూలీనాం = తములపుఁదీఁగలయొక్క - దళైః = ఆకులతో, శాత్రవం = శత్రువులదైన, యశోవ = కీర్తినింబోలె, పపుః = త్రాగిరి.

తా.—అచ్చట రఘుమహారాజుయొక్క జోదులు పానగోష్ఠికి తగినట్లు తావులు చక్కఁజేసికొని తములపాకుదొన్నెలతో శత్రువులయశస్సునో యనునట్లు టెంకాయ

కల్లును త్రాగిరి.—కల్లు యశస్సువలె తెలుపనియు, ఈ యపజయముచే ఆశత్రువుల కీర్తి పోయె ననియు భా.

వ్యా.—తామ్బూలీనా మితి.—తత్ర మహేన్ద్రాద్రౌ * యుధ్యన్త ఇతి యోధాః పచాద్యచ్, రచితాః కల్పితాః - ఆపానభూమయః పానయోగ్యప్రదేశాః - యైస్తే తథోక్తాః సన్తః* 'ఆపానం పానగోష్ఠికే' త్యమరః, నారికేళాసవం నారికేళమద్యం, తామ్బూలీనాం నాగవల్లీనాం దళైః పత్త్రైః, పపుః; కి మివ - శాత్రవం శత్రుసంబన్ధి, యశోవ యశ ఇవ - వకార ఇవార్థే * 'ఇవార్థే వశబ్దో వాశబ్దో వా బోధ్య' ఇతి వచనాత్; తత్ర యథేచ్ఛం విజహ్రు రి త్యర్థః.

---

గృహీతప్రతిముక్తస్య స ధర్మవిజయీ నృపః
శ్రియం మహేన్ద్రనాథస్య జహార న తు మేదినీమ్. 43

టీక.—ధర్మవిజయీ - ధర్మ = ధర్మార్థముగ - విజయీ = జయశీలుఁడయిన, స నృపః = ఆరఘుమహారాజు, గృహీ...స్య - గృహీత = పట్టఁబడి - ప్రతిముక్తస్య= విడువఁబడిన, మహేన్ద్రనాథస్య = కళింగరాజుయొక్క, శ్రియం = సిరిని, జహార= కైకొనెను, మేదినీం తు = పుడమినో, న జహార = కొనఁడాయెను.

తా.—ధర్మముకొఱకే జయించువాఁడు గావున రఘుమహారాజు కళింగరాజును పట్టియు మరల విడిచిపెట్టి ధర్మములుసేయుటకై యతనిసిరిని మాత్రము కైకొని అతని భూమిని అతనికే ఇచ్చివైచెను.

వ్యా.—గృహీ తేతి.—ధర్మవిజయీ ధర్మార్థం జయశీలః స నృపో రఘుః, గృహీత శ్చాసౌ ప్రతిముక్త శ్చ తస్య, మహేన్ద్రనాథస్య కాళిఙ్గస్య, శ్రియం జహార - ధర్మార్థ మితి భావః, మేదినీం తు న జహార - శరణాగతవాత్సల్యా దితి భావః.

---

తతో వేలాతటేనైవ ఫలవత్పూగమాలినా
అగస్త్యచరితా మాశా మనాశాస్యజయో యయౌ 44

టీక.—తతః = తూర్పును గెలిచినతర్వాత, సః = ఆరఘుమహారాజు, ఫల...నా - ఫలవత్ = కాయలుగల - పూగ = పోఁకమ్రాఁకులయొక్క - మాలినా= వరుస గలిగిన, వేలా...న- వేలా = కడలియొరయొక్క-తటేనైవ = గట్టుననే, అగ...తాం- అగస్త్య = అగస్త్యులవారిచేత - చరితామ్ = ఆశ్రయింపఁబడిన, ఆశాం = (దక్షిణ) దిక్కునకు, అనా...సన్ - అనాశాస్య = కోరనక్కఱలేని - జయః సన్ = గెలుపు గలవాఁడై, యయౌ = పోయెను.

తా.—ఈప్రకారము తూరుపుదిక్కును జయించిన తర్వాత రఘుమహారాజు కాచిన పోఁకతోఁటలచే శోభిల్లుచున్న సముద్రతీరము వెంబడినే అప్రయత్నముగా జయ ము లందుచు అగస్త్యులవారికి తావల మయిన దక్షిణదిక్కునకు ఏఁగెను.

వ్యా.—తత ఇతి.—తతః ప్రాచీవిజయానన్తరం, స రఘుః, ఫలవత్పూగమాలినా ఫలితక్రముకశ్రేణీమతా * 'వ్రీహ్యాదిభ్యశ్చే' తీ నిప్రత్యయః,వేలాయాః సముద్రకూలస్య - తటే నైవ ఉపాన్తే నైవ, అగస్త్య చరితామ్ ఆశాం దక్షిణాం దిశమ్, అనాశాస్య జయః అయత్న సిద్ధత్వా దప్రార్థనీయజయః సన్, యయౌ.

' అగస్త్యో దక్షిణా మాశా మాశ్రిత్య నభసి స్థితః
వరుణ స్యాత్మజో యోగీ విన్ధ్య వాతాపిమర్దనః.' ఇతి బ్రహ్మాణ్డపురాణే.

---

స సైన్యపరిభోగేన గజదానసుగన్ధినా
కావేరీం సరితాం పత్యుః శఙ్కనీయా మి వాకరోత్. 45

టీక.—సః = ఆరఘుమహారాజు, గజ...నా—గజ = ఏనుఁగులయొక్క - దాన = మదజలముచేత - సుగన్ధినా = తావికలదైన, సైన్యపరిభోగేన - సైన్య = సైనికులయొక్క - పరిభోగేన = అనుభవించుటచేత, కావేరీం = కావేరీనదిని, సరితాం పత్యుః = నదులభర్తకు (సముద్రునికి), శఙ్కనీయా మివ = నమ్మఁదగనిదానినిబోలె, అకరోత్ = చేసెను.

తా.—రఘుమహారాజుయొక్క సైనికులును ఏనుఁగులును కావేరియందు జలవిహారణము సల్పినందున వారియంగరాగములును వాని మదజలములును కావేరియందు అంటి యుండుటంబట్టి, ఆ సంభోగచిహ్నములవలన నదీభర్తయయిన సముద్రునికి తనభార్య యయిన కావేరిమీఁద సందేహము కలుగునో యనున ట్లాయెను.

వ్యా.—స ఇతి.—స రఘుః, గజానాం - దానేన మదేన - సుగన్ధినా సురభి గన్ధినా * ' గన్ధ స్యే ' త్యాదినా ఇకారాదేశః సమాసాన్తః - య ద్యపి గన్ధ స్యే త్యేత దేకాన్తగ్రహణం కర్తవ్య మితి నైసర్గికగన్ధవివక్షాయా మేవ ఇకారాదేశః- తథాఽపి నిరఙ్కుశాః కవయః - తథాచ మాఘకావ్యే -

'వపు రయుక్షృదగుచ్ఛ సుగన్ధయ స్సతతగా స్తత గానగిరోఽళిభి రి'తి - నైషధేచ -
'అపాం హి తృప్తాయ నవారిధారా స్వాదుః సుగన్ధిః స్వదతే తుషా రే'తి-
'నకర్మధారయా న్మత్వర్థీయ' ఇతి నిషేధా దినిప్రత్యయాన్తపక్షోఽపి జఘన్య ఏవ, సేనాయాం సమవేతాః జనాః సైన్యాః * సేనాయాం సమవేతా యె సైన్యా స్తే సైనికాశ్చ త' ఇత్యమరః * 'సేనాయా వే' త్యణ్ - తేషాం - పరిభోగేన ఉపభోగేన, కావే

రీం నామ సరితం, సరితాం పత్యుః సముద్రస్య, శఙ్కనీయా మవిశ్వసనీయా మివ, అకరోత్; సంభోగలిఙ్గదర్శనాద్భర్తు రవిశ్వాసో భవ తీతి భావః.

---

బలై రధ్యుషితా స్తస్య విజిగీషో ర్గతాధ్వనః
మరీచోద్భ్రాన్తహారీతా మలయాద్రే రుపత్యకాః. 46

టీక.—విజిగీషోః = గెలువఁగోరినవాఁడై, గతాధ్వనః - గత = కడచిన - అధ్వనః = దారికలిగిన, తస్య = ఆరఘుమహారాజుయొక్క, బలైః = సైన్యములచేత, మరీచోద్భ్రాన్తహారీతాః - మరీచ = మిరియాలచెట్లయందు - ఉద్భ్రాన్త = ఎగురుచుండు - హారీతాః = పచ్చపిట్టలుకలవైన, మలయాద్రేః = మలయపర్వతముయొక్క, ఉపత్యకాః = సమీపప్రదేశములు, అధ్యుషితాః = అధిష్ఠింపఁబడినవి.

తా.—అనంతరము రఘుమహారాజుయొక్క దండులు మఱియుం గొంతదూర మరిగి అచట మార్గాయాసము తీఱునట్లు మలయపర్వతముచెంత పచ్చపిట్ట లెగయుచున్న మిరియాలచెట్లుగల ప్రదేశములయందు విడిసినవి.

వ్యా.—బలై రితి.—విజిగీషో ర్విజేతు మిచ్ఛోః, గతాధ్వన, స్తస్య రఘో, ర్బలైః సైన్యైః * 'బలం శక్తౌ బలే సైన్య' ఇతియాదవః, మరీచేషు మరీచవనేషు-ఉద్భ్రాన్తాః సంభ్రాన్తాః - హారీతాః పక్షివిశేషాః - యాసు తాః * 'తేషాం విశేషా హారీతో మద్గుః కారణ్డవః ప్లవ' ఇ త్యమరః, మలయాద్రే, రుపత్యకాః ఆసన్నభూమయః * 'ఉపత్యకాఽద్రే రాసన్నా భూమి రూర్ధ్వ మధిత్యకే' త్యమరః * 'ఉపాధిభ్యాం త్యక న్నాసన్నా రూఢయో రి' తి త్యకన్ప్రత్యయః - అధ్యుషితాః - ఉపత్యకాసు ఉషిత మి త్యర్థః * 'ఉపాన్వధ్యాఙ్వస' ఇతి కర్మత్వమ్.

---

ససఞ్జు రశ్వక్షుణ్ణానా మేలానా ముత్పతిష్ణవః
తుల్యగన్ధిషు మత్తేభకటేషు ఫలరేణవః. 47

టీక.—అశ్వక్షుణ్ణానాం - అశ్వ = గుఱ్ఱములచేత - క్షుణ్ణానాం = త్రొక్కఁబడిన, ఏలానాం = ఏలకతీఁగలయొక్క, ఉత్పతిష్ణవః = ఎగిరెడుస్వభావముకలవయిన, ఫలరేణవః - ఫల = కాయలయొక్క - రేణవః=పరాగములు, తుల్యగన్ధిషు - తుల్య = సమానమయిన - గన్ధిషు = తావికలవైన, మత్తే...షు—మత్తేభ = మదపుటేనుఁగుల యొక్క - కటేషు = గండస్థలములయందు, ససఞ్జుః = తగులుకొన్నవి.

తా.—గుఱ్ఱముల త్రొక్కుడుచేత నలిగిన యేలకికాయలపొడుములు ఎగసి అట్టి పరిమళమే కలవైన మదపుటేనుఁగులగండస్థలములకు అంటుకొన్నవి.

వ్యా.—ససఞ్జు రితి.— అశ్వైః క్షుణ్ణానామ్ అశ్వఖురచూర్ణీకృతానా మిత్యర్థః, ఏలానామ్ ఏలాలతానామ్ ఉత్పతిష్ణవః ఉత్పతనశీలాః * 'అలంకృ ఞి'త్యాదినా ఇష్ణు చ్ప్రత్యయః, ఫలరేణవః ఫలరజాంసి, తుల్యగన్ధిషు సమానగన్ధిషు * తుల్యాధనీతినత్ ఇన్నత్త బహువ్రీహిః, మత్తేభానాం - కటేషు గణ్డేషు, ససఞ్జుః సంసక్తాః * 'గజగణ్డకటీ కటావి' త్యమరః.

---

భోగివేష్టనమార్గేషు చన్దనానాం సమర్పితం
నాస్రసత్ కరిణాం గ్రైవం త్రిపదీచ్ఛేదినా మపి. 48

టీక:—చన్దనానాం=గందపుమ్రాఁకులయొక్క, భోగి...షు—భోగి=పాములయొక్క - వేష్టన = చుట్టుకొనుటవలననైన - మార్గేషు = నఱదలయందు, సమర్పితం = తగిలింపఁబడినదై, త్రిపదీ...మపి—త్రిపదీ= కాలిగొలుసులను - ఛేదినా మపి = త్రెంపునవియైనను, కరిణాం=ఏనుఁగులయొక్క, గ్రైవం = మెడకట్టు, నాస్రసత్ = జాఱదాయెను.

తా.—గందపుమ్రాఁకులకు పాములు చుట్టుకొనుట చేతనయిన నఱదలలో మదపుటేనుఁగులను మెడసరి పెణలతో కట్టి వైవఁగా, ఆకట్టు, కాలిగొలుసులను సైతము త్రెంపుకొనునదైన యా యేనుఁగుల యీడ్పులకు సయితము, సడల దాయెను.

వ్యా.—భో గీతి.—చన్దనానాం చన్దనద్రుమాణాం భోగివేష్టనమార్గేషు సర్పవేష్టననిమ్నేషు, సమర్పితం సఞ్జితం, త్రిపదీచ్ఛేదినా మపి పాదశృఙ్ఖలచ్ఛేదకానా మపి * 'త్రిపదీ పాదబన్ధన మితి' యాదవః, కరిణాం గజానాం, గ్రీవాసు భవం గ్రైవం కణ్ఠబన్ధనం * 'గ్రీవాభ్యోఽణ్చే'త్యణ్ప్రత్యయః, నాస్రసత్ న స్రస్త మభూత్ * 'ద్యుద్భ్యో లు జి' తి పరస్మైపదం * పుషాదిత్వా దఙాదేశః * 'అనిదితా మి'తి నకారలోపః.

---

దిశి మన్దాయతే తేజో దక్షిణస్యాం రవే రపి,
తస్యా మేవ రఘోః పాణ్డ్యాః ప్రతాపం న విషేహిరే. 49

టీక — దక్షిణస్యాం దిశి = దక్షిణదిక్కునందు, రవే రపి = సూర్యునియొక్కయు, తేజః = తేజస్సు, మన్దాయతే = తగ్గుచున్నది. తస్యా మేవ (దిశి) = ఆ (దక్షిణ) దిక్కునందే, పాణ్డ్యాః = పాండుదేశరాజులు, రఘోః = రఘుమహారాజుయొక్క, ప్రతాపం = పరాక్రమమును, న విషేహిరే = ఓర్వలేరైరి.

తా.—సూర్యుఁడు దక్షిణాయనమున మందతేజుఁడగును. దానిని బట్టి కవి యిట్లు వర్ణించుచున్నాఁడు.—దక్షిణ దిక్కునందు సూర్యుఁడు కూడ పాండ్యరాజులకు వెఱచి

నిండు తేజము చూపలేక మందతేజము దాల్చును. అట్టి శూరులైన యాపాండ్యులు సయితము రఘుమహారాజుయొక్క తేజమును ఓర్వలేరయిరి.

వ్యా.—ది శీతి.—దక్షిణస్యాం దిశి, రవేరపి తేజః మన్దాయతే మన్దం భవతి * లోహితాదిత్వాత్ క్యష్ప్రత్యయః * 'వా క్యష' ఇత్యాత్మనేపదం-దక్షిణాయనే అర్కతేజో మాన్ద్యాదితి భావః, తస్యామేవ దిశి పాణ్డ్యాః పాణ్డూనాం జనపదానాం రాజానః *'పాణ్డోర్డ్యణ్ వక్తవ్య' ఇతి కృతే తస్య బహుత్వే లుకి పాణ్డవ ఇతి స్యాత్-అతః ప్రకృతే పాణ్డుషు సాధవః పాణ్డ్యాః *'తత్రసాధు రి'తి యత్ప్రియః,రఘోః ప్రతాపం, న విషేహిరే న సోఢవన్తః; సూర్యవిజయినోఽపి విజితవానితి నాయకస్య మహానుత్కర్షో గమ్యతే.

---

తామ్రపర్ణీసమేతస్య ముక్తాసారం మహోదధేః
తే నిపత్య దదుస్తస్మై యశః స్వమివ సంచితమ్. 50

టీక.—తే = అపాండ్యరాజులు, తా...స్య-తామ్రపర్ణీ = తామ్రపర్ణీనదితో - సమేతస్య=కూడియున్న, మహోదధేః = మహాసముద్రముయొక్క, సంచితం = కూడఁబెట్టఁబడిన, ముక్తాసారం=మౌక్తికశ్రేష్ఠమును, స్వం=తమదైన, సంచిత = కూడఁబెట్టఁబడిన, యశ ఇవ=కీర్తినింబోలె, తస్మై = అరఘుమహారాజునకు, నిపత్య=మ్రొక్కి, దదుః = ఇచ్చిరి.

తా.— పాండ్యరాజులు రఘుమహారాజునకు శరణాగతులై, తాము చిరకాలము నుండి తామ్రపర్ణీసాగరసంగమమున సంపాదించి కూడఁబెట్టుకొనియున్న మేలిముత్తెముల రాశిని తమ చిరసంచితయశమునుంబోలె అయనకు సమర్పించిరి.

వ్యా.—తామ్రప ర్ణీతి.—పాణ్డ్యాః, తామ్రపర్ణ్యా నద్యా - సమేతస్య సంగతస్య, మహోదధే ర్దక్షిణసముద్రస్య సంబన్ధి, సంచితం, ముక్తాసారం మౌక్తికవరం * 'సారో బలే స్థిరాంశే చ న్యాయ్యే క్లీబం వరే త్రిషి'త్యమరః, స్వం స్వకీయం సంచితం యశ ఇవ, తస్మై రఘవే, నిపత్య ప్రణిపత్య, దదుః, యశసః శుభ్రవర్ణత్వాదౌపమ్యం - తామ్రపర్ణీసంగమే మౌక్తికోత్పత్తి రితిప్రసిద్ధమ్.

---

స నిర్విశ్య యథాకామం తటే ష్వాలీఢచన్దనౌ
స్తనావివ దిశ స్తస్యాః శైలౌ మలయదర్దురౌ. 51
అసహ్య విక్రమః సహ్యం దూరా న్ముక్త ముదన్వతా
నితమ్బ మివ మేదిన్యాః స్రస్తాంశుక మలఙ్ఘయత్. 52

టీక.—అసహ్యవిక్రమః - అసహ్యా = ఓర్వరాని - విక్రమః = పరాక్రమము కలవాఁడయిన, సః = ఆరఘుమహారాజు, తటేషు = చఱులయందు, ఆలీ...నా - ఆలీఢ = పర్విన-చన్దనా = గంధపుఁజెట్లు (పాలిండ్ల పరముగా గంధపుఁ బూఁత) గలవియై, తస్యాః దిశః = ఆదక్షిణదిక్కునకు, స్తనావివ (స్థితౌ) = పాలిండ్లు వోలె నున్న, మలయ దర్దురౌ = మలయము దర్దురమును అనెడు, శైలౌ = పర్వతములను, యథాకామం = ఇచ్ఛ ప్రకారము, నిర్విశ్య = అనుభవించి, ఉదన్వతా = సముద్రునిచేత, దూరాత్ ముక్తం = దూరముగా వదలఁబడినదియు, స్రస్తాంశుకం - స్రస్త = జాఱిన-అంశుకం = వలువకలదియు, (అయిన), మేదిన్యాః నితమ్బ మివ = భూమియొక్క పిఱుందు వోలె నున్నట్టి, సహ్యమ్ = సహ్యపర్వతమును, అలఙ్ఘయత్ = దాఁటెను.

తా.—దరులలో గంధపుఁజెట్లు దట్టముగా ఎదిగి పొదివియున్న మలయ దర్దురము లనెడు జోడుపర్వతములను దక్షిణదిక్కనెడురమణియొక్క చందనచర్చితమయిన చనుఁగవనుంబోలె యథేచ్ఛముగా ననుభవించినవాఁడై, సహింపరానిపరాక్రమముగల యారాజు కడలి దూరముగా వదలినట్టి సహ్యపర్వతమును భూదేవియొక్క వలువయొడలిన పిఱుందునుంబోలె దాఁటెను.

వ్యా.—స ఇతి అస హ్యేతి చ.—శ్లోకద్వయం కుళక మేతత్—అసహ్యవిక్రమః, స రఘుః, తటేషు సానుషు, ఆలీఢచన్దనౌ వ్యాప్తచన్దనద్రుమౌ - స్తనపక్షే ప్రాన్తేషు వ్యాప్తచన్దనానులేపౌ, తస్యాః దక్షిణస్యాః, దిశః, స్తనావివ స్థితౌ, మలయదర్దురౌ నామ, శైలౌ, యథాకామం యథేచ్ఛం, నిర్విశ్య ఉపభుజ్య, * 'నిర్వేశో భృతి భోగయో' రిత్యమరః, ఉదకా న్యస్మిన్, స న్తీ త్యుదన్వాన్ ఉదధిః * 'ఉదన్వానుదధిః సిన్ధు' రిత్యమరః * 'ఉదన్వా నుదధౌ చే'తి నిపాతః - తేన సముద్రేణ, దూరాన్ముక్తం దూరత స్త్యక్తం * 'స్తోకా న్తికదూరార్థకృచ్ఛ్రాణి క్తే నే'తి సమాసః * 'పఞ్చమ్యాః స్తోకాదిభ్య శ్చే'తి పఞ్చమ్యా అలుక్, స్రస్తాంశుకం, మేదిన్యాః, నితమ్బ మివ స్థితం, సహ్యాద్రిం, మలఙ్ఘయత్ ప్రాప్తః - అతిక్రాన్తో వా.

తస ప్యానీకై ర్విసర్పద్భి రపరాన్తజయోద్యతైః
రామాస్త్రోత్సారితో ఽప్యాసీత్ సహ్యలగ్న ఇవార్ణవః. 53

టీక.—అప...తైః - అపరాన్త = పశ్చిమదేశములయొక్క, జయ = గెలుపునందు - ఉద్యతైః = పూనుకొన్నవై, విసర్పద్భిః = పోవుచున్నవైన, తస్య = ఆరఘుమహారాజుయొక్క, అనీకైః = దండులచేత, అర్ణవః = సముద్రము, రా...పి - రామ = పరశురామునియొక్క - అస్త్ర = ఆయుధములచేత, ఉత్సారితోఽపి = తొలఁగింపఁబడినదయినను, సహ్యలగ్న ఇవ - సహ్య = సహ్యపర్వతమునందు - లగ్న ఇవ = తగిలియున్నదియుంబోలె, ఆసీత్ = ఆయెను.

తా.—పూర్వము పరశురాముఁడు సహ్యమునకు అంటియున్న సముద్రమును తన యస్త్రముచేత సహ్యమునకు దూరముగా తఱిమెను. ఇప్పుడు రఘుసైన్యములు పడమటిదేశములను జయించుటకై అటునడచి సముద్రమెడలినయాదేశమందు నిండఁగా సముద్రమే మరల వచ్చి సహ్యమునకు తగులుకొన్నదా యను నట్లుండెను — అనగా సేన సముద్రమువలె నుండె నని భా.

వ్యా.—సంప్రతి ప్రతీచీం దిశ మభియయా వి త్యాహ - తస్యేతి.—అపరాన్తానాం పాశ్చాత్యానాం జనపదానాం - జయే - ఉద్యతైః ఉద్యుక్తైః - * 'అపరాన్తాస్తు పాశ్చాత్యా' ఇతి యాదవః, విసర్పద్భిః గచ్ఛద్భిః, తస్య - రఘోః. అనీకైః సైన్యైః * 'అనీకం తు రణే సైన్య' ఇతి విశ్వః, అర్ణవః సముద్రః * 'సరస్వాన్ సాగరోఽర్ణవ' ఇ త్యమరః, రామస్య జామదగ్న్యస్య - అస్త్రైః - ఉత్సారితః అపసారితోఽపి, సహ్యలగ్న ఇవ సహ్యపర్వతసక్త ఇవ, ఆసీత్ ; అస్య సైన్యం ద్వితీయోఽర్ణవ ఇ వాదృశ్య తేతి భావః ; పరశురామేణ సహ్యపర్వతవర్తీ సముద్రః విశోత్సారిత ఇతి కథాఽత్రానుసంధేయా.

---

భయోత్సృష్టవిభూషాణాం తేన కేరళయోషితామ్
అలకేషు చమూరేణు శ్చూర్ణప్రతినిధీకృతః. 54

టీక.— తేన = ఆరఘుమహారాజుచేత, భయో...ణాం - భయ = భయముచేత—ఉత్సృష్ట = తీసివేయఁబడిన - విభూషాణాం = నగలుగలవారయిన, కేరళయోషితాం = కేరళదేశస్త్రీలయొక్క, అలకేషు = ముంగురులయందు, చమూరేణుః - చమూ = దండుయొక్క - రేణుః = ధూళి, చూర్ణ...తః - చూర్ణ = కుంకుమాది చూర్ణములకు - ప్రతినిధీ కృతః = బదు లయినదిగా చేయఁబడెను.

తా.—రఘుమహారాజుయొక్క దాడికి అడలి కేరళదేశాంగనలు తొడవులు వదలి యడవులకు దాఁటుచుండఁగా (ఎఱ్ఱని) రఘుసేనాధూళి వారిముంగురులం దవిలి వానికి కుంకుమాలంకారశోభను గలిగించినది.

వ్యా.— భయేతి.— తేన రఘుణా, భయోత్సృష్టవిభూషాణాం భయేన పరిహృత భూషణానాం, కేరళయోషితాం కేరళదేశీయాఙ్గనానామ్, అలకేషు, చమూరేణుః సేనారజః, చూర్ణప్రతినిధీకృతః - చూర్ణస్య కుఙ్కుమాదిరజసః - ప్రతినిధీకృతః ; ఏతేన యోషితాం పలాయనం చమూనాం తదనుధావనం చ ధ్వన్యతే.

---

మురళామారుతోద్ధూత మగమత్ కైతకం రజః
తద్యోధవారవాణానా మయత్నపటవాసతామ్. 55

టీక.—మురళా...తం—మురళా = మురళానదియొక్క, మారుత = గాలి చేత - ఉద్ధూతం = రేఁపఁబడినట్టిది, కైతకం = మొగలిపూవులదయిన, రజః = ధూళి, తద్యో...నాం - తత్ = ఆరఘుమహారాజుయొక్క - యోధ = వీరభటులయొక్క - వారవాణానాం-కవచములకు, అయ...తామ్ - అయత్న = యత్నములేక సిద్ధమయిన - పటవాసతాం = బుక్కాతనమును, అగమత్ = పొందెను.

తా.—అట మురళానది వాయువులు రేఁపిన మొగలిపూధూళి ఆసేని జోదుల మైమఱువులపయిం బడి వానికి ప్రయత్నము లేకయే సిద్ధించిన బుక్కాగా శోభిల్లెను.

వ్యా.—మురళేతి.—మురళా నామ కేరళదేశేషు కాచి న్నదీ - మురళీతి కేచి త్పఠన్తి - తస్యాః - మారుతేన - ఉద్ధూతమ్ ఉత్థాపితం, కైతకం కేతకీ సంబన్ధి, రజః, తద్యోధవారవాణానాం రఘుభటకఞ్చుకానాం * 'కఞ్చుకో వారవాణోఽస్త్రీ' త్య మరః, అయత్న పట వాసతామ్ అయత్న సిద్ధ వస్త్ర వాసనాద్రవ్యత్వమ్. అగమత్ * 'పిష్టాతః పటవాసక' ఇ త్యమరః.

---

అభ్యభూయత వాహానాం చరతాం గాత్రశిఞ్జితైః
వర్మభిః పవనోద్ధూత రాజతాళీవన ధ్వనిః. 56

టీక.—చరతాం = చనుచున్న, వాహానాం గుఱ్ఱములయొక్క, గా...తైః - గాత్ర = మేనులయందు - శిఞ్జితైః=ధ్వనులుచేయుచున్న - వర్మభిః = కవచములచేత, పవ...నిః...పవన = గాలిచేత = ఉద్ధూత = కదలింపఁబడిన - రాజతాళీ = శ్రీతాళ వృక్షములయొక్క - పవన = అడవులయొక్క - ధ్వనిః = శబ్దము, అభ్యభూయత = తిరస్కరింపఁబడెను.

తా.—గుఱ్ఱములపౌజు నడచుచుండఁగా వాని కవచములధ్వని గాలికి కదలుచున్న శ్రీతాళవనముల ధ్వనిని మించి యుండెను.—ఈ కవచముల ధ్వనిలో అట్టిదే అయిన తాటియడవిధ్వని వినఁబడ దాయె నని భా.

వ్యా.—అభ్యభూయ తేతి.—చరతాం గచ్ఛతాం, వాహానాం వాజినాం, *'వాజి వా హార్వ గన్ధర్వ హయ సైన్ధవ సప్తయ' ఇ త్యమరః, గాత్రశిఞ్జితైః గాత్రేషు శబ్దాయమానైః * కర్తరి క్తః - 'గాత్రసఞ్జితైః' ఇతి వా పాఠః * సఞ్చతే ర్యాణ్ణ్యన్తాత్ కర్మణి క్తః, వర్మభిః కవచైః, పవనోద్ధూతానాం వాతేన కమ్పితానాం రాజతాళీవనానాం శ్రీతాళవృక్షవనానాం - ధ్వనిః, అభ్యభూయత తిరస్కృతః; 'మర్మర' ఇతిపాఠే- వాహానాంగాత్రశిఞ్జితైః గాత్రధ్వనిభిః . గాత్రస్థవర్మ ధ్వనిభి రి త్యర్థః * భావే క్తః- మర్మరః మర్మరాయమాణ ఇతి ధ్వనే ర్విశేషణమ్* 'అథ మర్మరః స్వనితే వస్త్రపర్ణానాం' ఇత్యమరః.

---

ఖర్జూరీస్కన్ధనద్ధానాం మదోద్గారసుగన్ధిషు
కటేషు కరిణాం పేతుః పున్నాగేభ్యః శిలీముఖాః. 57

టీక.—ఖర్జూ...నాం = ఖర్జూరీ = చిట్టీఁదుచెట్లయొక్క - స్కన్ధ = బోదెలయందు - నద్ధానాం = కట్టఁబడిన, కరిణాం = ఏనుఁగులయొక్క, . మదో... షు—మద = మదముయొక్క - ఉద్గార = ఉప్పొంగుటలచేత - సుగన్ధిషు = తావి కలిగిన, కటేషు = గండస్థలములయందు, శిలీముఖాః = తుమ్మెదలు, పున్నాగేభ్యః = పొన్నపూవులనుండి, పేతుః = వ్రాలినవి.

తా.—దండు నిలిచినప్పుడు ఏనుఁగులను చిట్టీఁదుచెట్లబోదెలకుం గట్టిరి. అంతట తుమ్మెదలు పొన్నపూవులను విడిచి మదజలస్రావముచేత పరిమళించుచున్న తదీయ గండస్థలములందు వ్రాలినవి.

వ్యా.—ఖర్జూరీతి.—ఖర్జూరీణాం తృణద్రుమవిశేషాణాం * 'ఖర్జూరః కేతకీ తాళీ ఖర్జూరీ చ తృణద్రుమా' ఇత్యమరః - స్కన్ధేషు ప్రకాణ్డేషు * 'అస్త్రీ ప్రకాణ్డః స్కన్ధః స్యా న్మూలా చ్ఛాఖావధే స్తరోః' ఇత్యమరః - నద్ధానాం బద్ధానాం, కరిణాం గజానాం, మదోద్గారేణ మదస్రావేణ - సుగన్ధిషు * గన్ధస్యేత్యాదినా ఇకారః, కటేషు గణ్డస్థలేషు 'గజగణ్డకటీకటా' వి త్యమరః, పున్నాగేభ్యః * పున్నాగపుష్పాణి విహా యేతి ల్యబ్లోపే పఞ్చమీ, శిలీముఖాః అళయః పేతుః * 'అళిబాణౌ శిలీముఖా' వి'త్యమరః, తతోఽపి సౌగన్ధ్యాతిశయా దితి భావః.

---

అవకాశం కి లోదన్వాన్ రామా యాభ్యర్థితో దదౌ,
అపరాన్తమహీపాలవ్యాజేన రఘవే కరమ్. 58

టీక.—ఉదన్వాన్ = సముద్రుఁడు, రామాయ = పరశురామునికి, అభ్యర్థితః సన్ = యాచింపఁబడినవాఁడై, అవకాశం - చోటును, దదౌకిల = ఇచ్చెను గద, రఘవే తు = రఘుమహారాజునకన్ననో, అప...న - అపరాన్తమహీపాల = పడమటిదేశపురాజులయొక్క - వ్యాజేన = నెపముచేత, కరం = కప్పమును, దదౌ = ఇచ్చెను.

తా.—సముద్రుఁడు పరశురామునికి యాచితుఁడై చోటిచ్చెను. రఘుమహారాజునకన్ననో పడమటిరాజు లనెడు మిషచేత కప్ప మొసంగెను.—పరశురాముని కన్న రఘుమహారాజు గొప్పవాఁ డని భా.

వ్యా.—అవకాశ మితి.—ఉదన్వానుదధిః, రామాయ జామదగ్న్యాయ, అభ్యర్థితః యాచితః సన్, అవకాశం స్థానం, దదౌ కిల, రఘవే తు, అపరాన్త మహీపాలవ్యాజేన, కరం బలిం, దదౌ * 'బలిహస్తాంశవః కరా' ఇ త్యమరః; అపరాన్తానాం సముద్రమధ్యదేశత్వాత్ తైర్దత్తే కరే సముద్రదత్తత్వోపచారః, కరదానం తు భీత్యా న యాచ్ఞ యేతి రామా ద్రఘో రుత్కర్షః.

---

మత్తేభరదనోత్కీర్ణవ్యక్తవిక్రమలక్షణం
త్రికూట మేవ తత్రోచ్చై ర్జయస్తమ్భం చకార సః. 59

టీక.—తత్ర = అపడమటిదిక్కున. సః = ఆరఘుమహారాజు, మత్తే...ణం - మత్త = మదించిన - ఇభ = ఏనుఁగులయొక్క - రదన = దంతములయొక్క - ఉత్కీర్ణ = గీఱలనెడి - వ్యక్త = స్పష్టములయిన - విక్రమ = మగంటిమియొక్క - లక్షణం = గుర్తులు కలిగిన, త్రికూట మేవ = త్రికూటపర్వతమునే, ఉచ్చైః = ఎత్తయిన, జయ స్తమ్భం = గెలుపుకంబమునుగా, చకార = చేసెను.

తా.—అపడమటిసీమయందు త్రికూటాద్రియందు రఘుమహారాజుయొక్క మదపుటేనుఁగుల కోరాటముచేత నయినకోఁతలచేత ఆతనిమగంటిమి వెల్లడి యగుచుండుటంబట్టి ఆకొండయే యతనికి విజయప్రశస్తవర్ణములు చెక్కినయెత్తుస్తంభముగా నుపయోగపడెను.

వ్యా.—మత్తే భేతి.—తత్ర దేశే, స రఘుః, మత్తానామ్ - ఇభానాం - రదనోత్కీర్ణాని దన్తక్షతా న్యేవ * భావే క్తః - వ్యక్తాని స్ఫుటాని - విక్రమలక్షణాని పరాక్రమచిహ్నాని - విజయవర్ణావళీస్థానీయాని యస్మిన్ తం తథోక్తం, త్రికూటమేవ, ఉచ్చైరున్నతం, జయస్తమ్భం చకార; గాఢప్రహారైః త్రికూటాద్రిరేవ ఉత్కీర్ణజయస్తమ్భ ఇవ రఘో ర్జయఖ్యాపకోఽ భూది త్యర్థః.

---

పారసీకాం స్తతో జేతుం ప్రతస్థే స్థలవర్త్మనా
ఇన్ద్రియాఖ్యా నివ రిపూం స్తత్త్వజ్ఞానేన సంయమీ. 60

టీక.—తతః = అటుతర్వాత, సః = ఆరఘుమహారాజు, సంయమీ = యోగి, తత్త్వజ్ఞానేన - తత్త్వ = ఆత్మయొక్క - జ్ఞానేన = ఎఱుకచేత, ఇన్ద్రియాఖ్యాన్ - ఇన్ద్రియ = ఇంద్రియములనెడి - ఆఖ్యాన్ = పేరుగల, రిపూ నివ=శత్రువులను బోలె, స్థలవర్త్మనా—స్థల = నేలయొక్క - వర్త్మనా = దారిచేత, పారసీకాన్ = పారసీక (దేశపు) రాజులను, జేతుం = గెలుచుటకు, ప్రతస్థే = తరలెను.

తా.—తర్వాత రఘుమహారాజు - యోగి యింద్రియములను ఆత్మజ్ఞానము చేత ఎట్లు జయించునో అట్లు - పారసీకరాజులను నేలదారిచే జయించువాఁడై తరలెను.— సముద్రయానము నిషిద్ధము గాన నేలదారిని పోయె నని కవిహృదయము.

వ్యా.—పారసీకా నితి.—తతః, స రఘుః, సంయమీ యోగీ, తత్త్వజ్ఞానేన, ఇన్ద్రియాఖ్యాన్ ఇన్ద్రియనామకాన్, రిపూ నివ, పారసీకాన్ రాజ్ఞః, జేతుం, స్థలవర్త్మనా ప్రతస్థే - న తు నేదిష్ఠే నాపి జలపథేన - సముద్రయానస్య నిషిద్ధత్వా దితి భావః.

---

యవనీముఖపద్మానాం సేహే మధుమదం నసః
బాలాతప మి వాబ్జానా మకాలజలదోదయః. 61

టీ.—సః = ఆరాజు, యవ...నాం - యవనీ = యవనస్త్రీలయొక్క - ముఖపద్మానాం = మోముఁదామరలయొక్క, మధుమదం - మధు = సారాయిచేతనయిన- మదం = కైపురక్తిమను, అకా...యః - అకాల = వర్షావ్యతిరిక్తకాలమునందు - జలద = మేఘములయొక్క - ఉదయః = పుట్టుక, అబ్జానాం = తామరలయొక్క, బాలాతప మివ = లేఁతయెండనుం బోలె, న సేహే = సహింపఁ డాయెను.

తా.—అచ్చట రఘుమహారాజు, వర్షాకాల వ్యతిరిక్తమేఘోదయము ఏవిధముగా తామరలనుండి లేఁతయెండను తొలఁగించునో, ఆవిధముగానే యవనాంగనల మోముఁదమ్ములనుండు కైపుకాంతిని ఎడలించెను.—వారి భర్తలను పొరికిం జేరుటచేత వారికి మధుపానము లేకుండఁ జేసె నని భా.

వ్యా.—యవ నీతి.—స రఘుః, యవనీనాం యవనస్త్రీణాం * 'జాతే ర స్త్రీ విషయా దయోపధా ది'తి జీష్, ముఖాని పద్మా నీ వేత్యుపమితసమాసః - తేషాం, మధునా మద్యేన - యో మదః మదరాగః - కార్యకారణయో రభేదేన నిర్దేశః - తం, న సేహే; కధ మివ—అకాలే ప్రావృడ్వ్యతిరిక్తకాలే - జలదోదయః - ప్రావృషి పద్మవికాసస్య అప్రస్తుతత్వాత్, అబ్జానాం సంబన్ధినం బాలాతప మివ - అబ్జహితత్వా దబ్జసంబన్ధిత్వం సౌరాతపస్య.

---

సంగ్రామ స్తుముల స్తస్య పాశ్చాత్త్యై రశ్వసాధనైః
శార్ఙ్గకూజిత విజ్ఞేయప్రతియోధే రజ స్యభూత్. 62

టీక.—తస్య = ఆరఘుమహారాజునకు, అశ్వసాధనైః - అశ్వ = గుఱ్ఱములే - సాధనైః = సహాయములుగాఁ గలవారయిన, పాశ్చాత్త్యైః = పడమటిదేశపు మ్లేచ్ఛులతో, శార్ఙ్గ...ధే - శార్ఙ్గ = సింగిణివిండ్లయొక్క - కూజిత = టంకారములచేత- విజ్ఞేయ - తెలియఁదగిన - ప్రతియోధే = ఎదిరిజోదులుగల, రజసి = ధూళియందు, తుములః = దొమ్మియయిన, సంగ్రామః = యుద్ధము, అభూత్ = ఆయెను.

తా.—యవనులకు గుఱ్ఱపుదండు మెండును ప్రధానసేనాంగమును గాన దానితో వారు రఘుమహారాజు నెదుర్కొనఁగా దొమ్మియుద్ధము జరిగినది. ఆగుఱ్ఱపుఁ బౌఁజు లేపిన ధూళిలో ఆదొమ్మిలో ఎవరికిని ఎదిరిజోదు కనఁబడకుండెను. మఱి పో రెట్లు జరిగె ననఁగా ధనుష్టంకారముల చేతను (కొమ్ము లూఁదెడునాదముచేత నేని) ఎదిరిజోదులు తెలియ నగుచుండిరి.

వ్యా.—సంగ్రామ ఇతి.—తస్య రఘోః అశ్వసాధనైః, పశ్చాద్భవైః పాశ్చా

త్త్రైః యవనైః సహ * 'దక్షిణా పశ్చాత్పురస్తస్త్యగి'తి త్యక్ - సహార్థే తృతీయా, శృఙ్గాణాం వికారాః శార్ఙ్గాణి ధనూంషి - తేషాం - కూజితైః జ్యాశబ్దైః - అథవా - శార్ఙ్గైః శృఙ్గసంబద్ధిభిః - కూజితైః - విజ్ఞేయాః అనుమేయాః - ప్రతియోధాః ప్రతిభటాః - యస్మిన్ తస్మిన్, రజసి, తుములః సంగ్రామః సంకులం యుద్ధ, మభూత్ * 'తుములం రణసంకుల మి'త్యమరః.

---

భల్లాపవర్జితై స్తేషాం శిరోభిః శ్మశ్రులై ర్మహీం
తస్తార సరఘావ్యాప్తైః స క్షౌద్రపటలై రివ. 63

టీక.—సః = ఆ రఘుమహారాజు, భల్లా...తైః - భల్ల = బల్లెములతో - అపవర్జితైః = తీసివేయఁబడినవియు, శ్మశ్రులైః = పెరిఁగిన మొగము వెండ్రుకలు గలవియు, (నయిన), తేషాం = ఆయవనులయొక్క, శిరోభిః = తలలతో, సర...ప్తైః - సరఘా = తేనెటీఁగల చేత - వ్యాప్తైః = పొదువఁబడిన, క్షౌద్ర పటలై రివ = తేనె పట్టుల చేతనుం బోలె, మహీం = నేలను, తస్తార = కప్పెను.

తా.—రఘుమహారాజు ఆరౌతుల తలకాయలను బల్లెములతో తెగ నేసెను. వారికి గడ్డములును మీసములును దట్టముగా మిక్కుటముగా ఎదిగియుండుటవలన వారితలకాయలు తేనెటీఁగలు కమ్మిన తేనెపట్ట వలె నుండినవి. అట్టి యాతలకాయలు ఈ వెండ్రుకల చేతను స్వయము పెక్కులగుట చేతను అవి రాలినచోట వాని క్రింది నేల కానరాకుండెను.

వ్యా.—భల్లేతి.—స రఘుః, భల్లాపవర్జితైః బాణవిశేషకృత్తైః, శ్మశ్రులైః ప్రవృద్ధముఖరోమవద్భిః *సిధ్మాదిత్వాల్లచ్ప్రత్యయః, తేషాం పాశ్చాత్యానాం, శిరోభిః, సరఘాభిః మధుమక్షికాభిః వ్యాప్తైః * 'సరఘా మధుమక్షి కే'త్యమరః, క్షుద్రాః సరఘాః * 'క్షుద్రా వ్యఙ్గా నటీ వేశ్యా సరఘా కణ్టకారి కే'త్యమరః - క్షుద్రాభిః కృతాని క్షౌద్రాణి మధూని * 'క్షౌద్రం మధుని పానీయ' ఇతి విశ్వః * 'క్షుద్రా భ్రమర వటర పాదపాద ఞ్'తి అఞ్ప్రత్యయః సంజ్ఞాయాం విషయే - తేషాం - పటలైః పుఞ్జైః, రివ, మహీం, తస్తార ఛాదయామాస.

---

అపనీతశిరస్త్రాణాః శేషా స్తం శరణం యయుః;
ప్రణిపాతప్రతీకారః సంరమ్భో హి మహాత్మనామ్. 64

టీక.—శేషాః = (చావక) మిగిలినవారు, అప...స్త్రాః - అపనీత = తీసివేయఁబడిన - శిరస్త్రాణాః సన్తః = బొమిడికములుఁగలవారై, తం = ఆరఘుమహారాజును, శరణం = రక్షకునిగా, యయుః = చేరిరి, తథా హి = అదే సరి, మహాత్మనాం = పూజ్యులయొక్క, సంరమ్భః = క్షోభ, ప్రణి...రః - ప్రణిపాత = మ్రొక్కే - ప్రతీకారః = ప్రతిక్రియగాఁ గలది.

తా.—హతశేషు లయినయవనులు శిరములనుండి బొమిడికములను లివిచి వైచి కొని ఆమహారాజును శరణుఁజొచ్చిరి. అతఁడును వారిని మన్నించెను. మహాత్ముల కోపము అపరాధి సేయుప్రణామముచేత శాంతించును గదా.

వ్యా.—అపనీ తేతి.—శేషాః హతావశిష్టాః, అపనీతశిరస్త్రాణాః అపసారితశీర్షణ్యా స్సన్తః - శరణాగతలక్షణ మేతత్, తం రఘుం, శరణం యయుః, తథాహి - మహాత్మనాం, సంరమ్భః క్షోభః, ప్రణిపాతః ప్రణతి రేవ - ప్రతీకారో యస్య సః - పరకీయ మౌద్ధత్య మేవ మహాత్మనా మసహ్యం న తు జీవిత మితి భావః.

---

వినయన్తే స్మ తద్యోధా మధుభి ర్విజయశ్రమమ్
ఆస్తీర్ణాజినరత్నాసు ద్రాక్షావలయభూమిషు. 65

టీక.—తద్యోధాః - తత్ = ఆరఘుమహారాజుయొక్క - యోధాః = జోదులు, ఆస్తీ...సు - ఆస్తీర్ణ=పఱుపఁబడిన - అజిన రత్నాసు = మేలి తోళ్లుగల, ద్రా...షు - ద్రాక్షావలయ = దాకపొదరిండ్లయొక్క - భూమిషు = తావులయందు, మధుభిః = మద్యములతో, విజయశ్రమం - విజయ = గెలుపుచేతనైన - శ్రమం = అలయికను, వినయన్తేస్మ = పోఁగొట్టుకొనిరి.

తా.—అంతట అతని భటులు గెలుపుకై తామఁపోరినయలయికను ద్రాక్షపొద రిండ్లలో మేలి తోలుతివాసులు పఱచుకొని వానిపై కూర్చుండి ద్రాక్షసారాయి త్రాగి తీర్చుకొనిరి.

వ్యా.—వినయన్త ఇతి.—తస్య రఘోః, యోధాః భటాః, ఆస్తీర్ణాని - అజిన రత్నాని చర్మశ్రేష్ఠాని - యాసు తాసు, ద్రాక్షావలయానాం ద్రాక్షాకుఞ్జానాం - భూమిషు * 'మృద్వీకా గోస్తనీ ద్రాక్షా స్వాద్వీ మధుర సేతి చే' త్యమరః, మధుభిః ద్రాక్షాఫలప్రకృతికై ర్మద్యైః, విజయశ్రమం యుద్ధఖేదం, వినయన్తే స్మ అపనీతవన్తః * 'కర్తృస్థే చాశరీరే కర్మ ణీ' త్యాత్మనేపదం * 'లట్ స్మే' ఇతి భూతార్థే లట్.

---

తతః ప్రతస్థే కౌబేరీం భాస్వా నివ రఘు ర్దిశమ్
శరై రుస్రై రి వోదీచ్యా నుద్ధరిష్య న్రసా నివ. 66

టీక.—తతః = తర్వాత, రఘుః = రఘుమహారాజు, భాస్వా నివ = సూర్యుఁడు వోలె, శరైః = బాణములచేతను, ఉస్రైరివ = కిరణముచేతనుంబోలె, ఉదీచ్యాన్ = ఉత్తరదేశాధీశులను, రసానివ = నీళ్లనుంబోలె, ఉద్ధరిష్యన్ = నిర్మూలముచేయఁ బోవు వాఁడై (పైకి పీల్చువాఁడై అని సూర్యపరము), కౌబేరీం = కుబేరునిదైన, దిశం = దిక్కునకు, ప్రతస్థే = తరలెను.

తా.—తర్వాత రఘుమహారాజు ఏవిధముగా సూర్యుఁడు కిరణములతో నీళ్లను ఎగఁబీల్చునో, ఆవిధముగా బాణములతో ఉత్తరదిక్కురాజులను పెలార్చువాఁడై, ఉత్తరదిక్కునకు తరలెను.

వ్యా.—తత ఇతి.—తతః, రఘుః, భాస్వాన్ సూర్య ఇవ, శరైః బాణైః, ఉస్రైః కిరణై రివ * 'కిర ణోస్ర మయూఖాంశు గభస్తి ఘృణి ఘృష్టయ' ఇ త్యమరః, ఉదీచ్యాన్ ఉదగ్భవాన్, రసాన్ ఉదకానీవ, ఉద్ధరిష్యన్ ఉన్మూలయిష్యన్, కౌబేరీం కుబేరసంబన్ధినీం, దిశ ముదీచీం, ప్రతస్థే; అనేకేవశబ్దేయ ముపమా - యథాఽఽహ దణ్డీ * 'ఏకానేకేవశబ్దత్వాత్ సావాక్యార్థోపమా ద్విధే'తి.

---

వినీతాధ్వశ్రమా స్తస్య సిన్ధుతీరవివేష్టనైః
దుధువు ర్వాజినః స్కన్ధాన్ లగ్నకుఙ్కుమకేసరాన్. 67

టీక.—సిన్ధు...నైః—సిన్ధు = సింధునదముయొక్క - తీర = దరియందు - వివేష్టనైః = పొరలుటచేత, వినీ...మాః—వినీత = తీర్చుకోఁబడిన - అధ్వశ్రమాః= మార్గాయాసముగలవైన, తస్య = ఆరఘుమహారాజుయొక్క, వాజినః = గుఱ్ఱములు, లగ్న...రాన్—లగ్న = అంటుకొన్న - కుఙ్కుమ = కుంకుమపుష్పములయొక్క - కేసరాన్ = కింజల్కములుగల, స్కన్ధాన్=కందములను, దుధువుః = దులఁపుకొన్నవి.

తా.—రఘుమహారాజుయొక్క గుఱ్ఱములు సింధునదీతీరమందు పొరలియాడుటచేత మార్గాయాసమును తీర్చుకొన్నవి. అపొరలాడినప్పుడు కందముల కంటుకొన్న కుంకుమపూరేకులను ఒడలు దులఁపుకొనుటచే రాల్చివైచికొన్నవి.

వ్యా.—వినీ తేతి.—సిన్ధు ర్నామ కాశ్మీరదేశే కశ్చి న్నదవిశేషః * 'దేశే నదవిశేషేఽబ్ధౌ సిన్ధు ర్నా సరితి స్త్రియా మి' త్యమరః - తస్య - తీరే - వివేష్టనైః అఙ్గపరివర్తనైః, వినీ తాధ్వశ్రమాః గత మార్గఖేదా ఇత్యర్థః, తస్య రఘోః, వాజినః అశ్వాః, లగ్నాః కుఙ్కుమకేసరాః కుఙ్కుమకిఞ్జల్కాః యేషు తాన్-అథవా లగ్న కుఙ్కుమాః-కేసరాః సటాః - యేషాం తాన్, స్కన్ధాన్, దుధువుః కమ్పయ న్తి స్మ.

---

తత్ర హూణావరోధానాం భర్తృషు వ్యక్తవిక్రమం
కపోలపాటలాదేశి బభూవ రఘుచేష్టితమ్. 68

టీక.—తత్ర=ఆయుత్తరదేశమందు, భర్తృషు=పెనిమిటులందు, వ్యక్తవిక్రమం · వ్యక్త = స్పష్టమయిన - విక్రమం = పరాక్రమముగలదైన, రఘుచేష్టితం - రఘు = రఘుమహారాజుయొక్క - చేష్టితం = ఁేత, హూ...నాం - హూణ = హూణదేశ

రాజులయొక్క - అవరోధానాం = అంతఃపురస్త్రీలకు, కపో...దేశి - కపోల= చెక్కిళ్లయందు - పాటల = ఎఱుపుయొక్క-అదేశి = నేర్పునట్టిది, బభూవ = అయెను.

తా.—అచ్చట రఘుమహారాజు హూణరాజులపై స్పష్టముగా చూపిన పరాక్రమము వారి రాణివాసములచెక్కిళ్లకు ఎఱ్ఱదనమును నేర్పెను.—అనఁగా తమ భర్తలను రఘువు తెగటార్చినందులకు ఆరాణివాసములు మొగమున మొత్తుకొన్నందున వారిచెక్కిళ్లు కందిన వని భా.

వ్యా.—తత్రేతి.—తత్ర ఉదీచ్యాం దిశి, భర్తృషు వ్యక్తవిక్రమం - భర్తృవధేన స్ఫుటపరాక్రమ మి త్యర్థః, రఘుచేష్టితం రఘువ్యాపారః, హూణా జనపదాః క్షత్త్రియాః - తేషా - మవరోధా అన్తఃపురస్త్రియః - తాసాం, కపోలేషు - పాటలస్య పాటలిమ్నః తాడనాదికృతారుణ్యస్య - ఆదేశి ఉపదేశి, బభూవ ; అథవా - పాటలః - ఆదేశి ఉపదేష్టా - యస్య త ద్బభూవ - స్వయం తే నాఖ్యాత మి త్యర్థః.

---

కామ్బోజాః సమరే సోఢుం తస్య వీర్య మనీశ్వరాః
గజాలానపరిక్లిష్టై రక్షోటైః సార్ధ మానతాః. 69

టీక.—కామ్బోజాః = కంబోజదేశరాజులు, సమరే = యుద్ధములో, తస్య = ఆరఘుమహారాజుయొక్క, వీర్యం = పరాక్రమమును, సోఢుం = ఓర్చుటకు, అనీశ్వరాః సన్తః = అసమర్థు లయి, గజా...ష్టైః—గజ = ఏనుఁగులయొక్క - ఆలాన = కాలికట్టులచేత - పరిక్లిష్టైః = ఒరయఁబడిన, అక్షోటైః సార్థం = ఊడుగుచెట్లతోఁగూడ, ఆనతాః = నమ్ర లయిరి.

తా.—కాంబోజరాజులు యుద్ధములో అతనిపరాక్రమమునకు ఆఁగలేక, అతనియేనుఁగులంగట్టిన యూడుగుచెట్లు వానికాళ్ల సంకెలల యీడ్పునకు వంగినట్లుగానే తాము ను అతనికి నమ్రులయిరి.

వ్యా.—కామ్బోజా ఇతి.—కామ్బోజాః, రాజానః, సమరే, తస్య రఘోః, వీర్యం పరాక్రమం, సోఢుమ్, అనీశ్వరాః అశక్తాః సన్తః, గజానా - మాలానం బన్ధనం * భావే ల్యుట్ * 'విభాషా లీయతే రి' త్యాత్వం - తేన - పరిక్లిష్టైః పరిఘృష్టైః, అక్షోటైః సార్ధం వృక్షవిశేషైః సహ, ఆనతాః నమ్రాః.

---

తేషాం సదశ్వభూయిష్ఠా స్తుఙ్గద్రవిణరాశయః
ఉపదా వివిశుః శశ్వ న్నోత్సేకాః కోసలేశ్వరమ్. 70

టీక.—తేషాం = ఆకాంబోజరాజులయొక్క - సద...స్థాః - సత్ = మేలయిన-అశ్వ = గుఱ్ఱములచేత = భూయిష్ఠాః = అధికములయిన, తుఙ్గ...యః—తుఙ్గ= ఉన్నతము లయిన - ద్రవిణ = బంగారముయొక్క రాశయః = పోగులనెడి, ఉపదాః = కానుకలు, శశ్వత్ = మాటిమాటికి, కోసలేశ్వరం = రఘువును, వివిశుః = ప్రవేశించినవి, ఉత్సేకాః = గర్వములన్ననో, న వివిశుః = ప్రవేశింపవాయెను.

తా.—కాంబోజరాజులు రఘుమహారాజునకు మిక్కుటముగా ఉత్తమాశ్వములను ఎత్తయిన బంగారురాసులను మాటిమాటికి కానుక లొసంగిరి. కాని దానికిని ఆయన గర్వపడలేదు.

వ్యా.—తేషా మితి - తేషాం కామ్బోజానాం, సద్భి రశ్వై ర్భూయిష్ఠాః, తుఙ్గాః - ద్రవిణానాం సువర్ణానాం * 'హిరణ్యం ద్రవిణం ద్యుమ్న మి'త్యమరః-రాశయ ఏవ, ఉపదాః ఉపాయనాని * 'ఉపాయన ముపగ్రాహ్య ఉపహార స్తథోప దే'త్యమరః, కోసలేశ్వరం రఘుం, శశ్వత్, అసకృత్ వివిశుః * 'ముహుః పునః పునః శశ్వ దభీక్ష్ణ మసకృ త్సమా'ఇత్యమరః, తథాఽపి - ఉత్సేకాః గర్వాస్తు, న వివిశుః - స త్యపి గర్వకారణే న గర్విత ఇ త్యర్థః.

---

తతో గౌరీగురుం శైల మారురోహాశ్వసాధనః
వర్ధయ న్నివ తత్కూటా నుద్ధూతై ర్ధాతురేణుభిః. 71

టీక.—తతః = తర్వాత, అశ్వసాధనః - అశ్వ = గుఱ్ఱములే - సాధనః - సహాయములుగాఁ గలవాఁడై, (రఘుమహారాజు), గౌరీగురుం - గౌరీ = పార్వతికి - గురుం = తండ్రి అయిన, శైలమ్=కొండను, ఉద్ధూతైః = (గుఱ్ఱములగొరిజలచేత) రేఁపఁబడిన, ధాతురేణుభిః - ధాతు = గైరికాదిధాతువులయొక్క - రేణుభిః=ధూళులచేత, తత్కూటాన్ - తత్ = ఆకొండయొక్క - కూటాన్ - శిఖరములను, వర్ధయన్నివ = పెంచుచున్నవాఁడువోలె, ఆరురోహ = ఎక్కెను.

తా.—తర్వాత రఘువు గుఱ్ఱములమీఁద హిమవంతము నెక్కెను. అవి లేపిన గైరికాది ధాతువుల ధూళీమండలములచేత ఆకొండశిఖరములు ఎదుగుచున్నవో యనునట్లు ఒప్పారినవి.

వ్యా.—తత ఇతి.—తతోఽన న్తరమ్, అశ్వసాధనః స, గౌర్యాః గురుం పితరం. శైలం హిమవన్త మి త్యర్థః * 'గురూ గీష్పతి పిత్రాద్యా వి' త్యమరః, ఉద్ధూతైః అశ్వఖురోద్ధూతైః, ధాతూనాం గైరికాదీనాం - రేణుభిః * 'రేణు ర్ద్వయోః స్త్రియాం ధూళి రి' త్యమరః, తత్కూటాన్ తస్య శృఙ్గాణి 'కూటోఽస్త్రీ శిఖ

రం శృఙ్గ మి' త్యమరః, పథఞాయ స్నివ, ఆరురోహ; ఉత్పతద్ధూళిదర్శనా గ్గిరిశిఖరవృద్ధి భ్రమో జాయత ఇతి భావః.

---

శశంస తుల్యసత్త్వానాం సైన్య ఘోషేఽప్యసంభ్రమం
గుహాశయానాం సింహానాం పరివృ త్యావలోకనమ్. 72

టీక.—తుల్యసత్త్వానాం - తుల్య=(సైనికులతో) సమానమయిన - సత్త్వానాం= బలముగలవై, గుహాశయానాం - గుహా = గుహలయందు-శయానాం = పరుండియున్న, సింహానాం = సింహములయొక్క (సింహములు), పరివృత్య = వెన్కకుతిరిగి, అవ లోకనం = చూచుట, సైన్య...పి - సైన్య = సేనయొక్క - ఘోష అపి = గొల్లు నందు సయితము, అసంభ్రమం = కలఁకలేమిని, శశంస = చెప్పెను.

తా.—రఘుమహారాజుయొక్క సైనికులు మహాకోలాహలముతో నడచుచుం డఁగా సమీపమున గుహలలో పరుండియున్న సింహములు ఆసైనికులతో బలములో సమానమైనట్టివి వారి కోలాహలమును లెక్కసేయక వారిని పరున్నవి పరుండియే మొగ ము మాత్రము వెనుకకు మరల్చి కాంచుచుండినవి.అందువలన నవి సైనికులకు సమబలము లగుటచే వెఱవలే దని తెలియుచుండెను.

వ్యా.—శశంసేతి.— తుల్యసత్త్వానాం సైన్యైః సమానబలానాం, గుహాసు శేరత ఇతి గుహాశయాః - తేషాం * 'అధికరణే శేతే' రి'త్యచ్ప్రత్యయః * 'దరీ తు కన్దరో వా స్త్రీ దేవఖాతబిలే గుహా' ఇత్యమరః, సింహానాం హరీణాం * 'సింహో మృగేన్ద్రః పఞ్చాస్యో హర్యక్షః కేసరీ హరిః' ఇత్యమరః - సంబన్ధి, పరివృత్య పరా వృత్య - అవలోకనం శయి త్వైవ గ్రీవాభఙ్గేన అవలోకనం - కర్తృ, సైన్యఘోషే సేనాకలకలే సంభ్రమకారణే స త్యపి, అసంభ్రమమ్ అన్తః క్షోభవిరహం * నఞః ప్రసజ్యప్రతిషేధేఽపి సమాస ఇష్యతే, శశంస కథయామాస - సైన్యేభ్య ఇ త్యర్థా ల్లభ్యతే; బాహ్యచేష్టిత మేవ మనోవృత్తే రనుమాపక మితి భావః; అసంభ్రాన్తత్వే హేతుః తుల్యసత్త్వానా మితి - న హి సమబలః సమ బలా ద్బిభే తీతి భావః.

---

భూర్జేషు మర్మరీభూతాః కీచకధ్వనిహేతవః
గఙ్గాశీకరిణో మార్గే మరుత స్తం సిషేవిరే. 73

టీక.—భూర్జేషు = బుజపత్తిరిచెట్లయందు, మర్మరీభూతాః = మర్మరధ్వని కలవై, కీచక...వః - కీచక = బొంగువెదుళ్లయొక్క - ధ్వని = శబ్దములకు - హేతవః= కారణములై, గఙ్గాశీకరిణః - గఙ్గా=మిన్నేటియొక్క - శీకరిణః = తుంపురులుకలవైన, మరుతః = వాయువులు, మార్గే = దారిలో, తం = ఆరాజును, సిషేవిరే= సేవించినవి.

తా.—దారిలో ఆమహారాజును,—భుజపత్త్రవృక్షములందు మర్మరధ్వనిం బుట్టించుచు, అట్లనుటచేత అందుల కెంతపాటి వేగము వలయునో అంతపాటియే వేగము గలవై - అనఁగా మందములై, బొంగువెదుళ్లలోఁ దూఱి వెలువడుటచే వానిని మధురముగా ధ్వనింపఁజేయుచు, మిన్నేటి తుంపురులం దెచ్చుచు, వీతెంచుచున్న మంద శ్రావ్య శీతల వాయువులు—సేవించినవి.

వ్యా.—భూర్జే ష్వితి.—భూర్జేషు భుజపత్త్రవృక్షేషు * 'భుజపత్త్రో భుజో భూర్జో ఽమృదుత్వక్ చర్మకా వపీ'తి యాదవః, మర్మరః శుష్కపర్ణధ్వనిః * 'మర్మరః శుష్కపర్ణానా మి'తి యాదవః - అయం చ శుక్లాదిశబ్దవత్ గుణి న్యపి వర్తతే ప్రయోక్ష్యతే చ * 'మర్మరైరగరుధూపగన్ధిభి రి'తి - తతో మర్మరీభూతాః మర్మరశబ్దవన్తో భూతా ఇ త్యర్థః, కీచకానాం వేణువిశేషాణాం - ధ్వనిహేతవః- శ్రోత్రసుఖావహా శ్చేతి భావః, గఙ్గాయాః శీకరాః ఏషాం స న్తీతి గఙ్గాశీకరిణః శీతలా ఇ త్యర్థః, మరుతః వాతాః, మార్గే, తం రఘుం, సిషేవిరే అసేవ న్తే త్యర్థః.

---

విశశ్రము ర్నమేరూణాం ఛాయా స్వధ్యాస్య సైనికాః
దృషదో వాసితోత్సఙ్గా నిషణ్ణమృగనాభిభిః. 74

టీక.—సైనికాః = జోదులు, నమేరూణాం = సురపొన్నలయొక్క - ఛాయాసు = నీడలయందు, నిష...భిః - నిషణ్ణ = పరున్న - మృగ - కస్తూరిమృగములయొక్క - నాభిభిః=కస్తూరులచేత, వాసితోత్సఙ్గాః - వాసిత = తావి గొలుపఁబడిన - ఉత్సఙ్గాః = తలములుగల, దృషదః = బండలను, అధ్యాస్య = అధిష్ఠించి, విశశ్రముః = సేదదేరిరి

తా.—రఘుసైనికులు సురపొన్నలనీడలలో పరుండిన కస్తూరిమృగముల కస్తూరిచేత ఉపరితలములు పరిమళించుచున్న బండలపైని చేరి విశ్రమించిరి.

వ్యా.—విశశ్రము రితి.—సైనికాః సేనాయాం సమవేతాః * 'ప్రాగ్వహతేష్ఠ గి'తి ఠక్ప్రత్యయః, నమేరూణాం సురపున్నాగానాం, ఛాయాసు, నిషణ్ణానాం - దృష త్సూపవిష్టానాం మృగాణాం నాభిభిః, వాసి తోత్సఙ్గాః సురభిత తలాః, దృషదః శిలాః, అధ్యా స్యాధిష్ఠాయ, విశశ్రము ర్విశ్రాన్తాః.

---

సరళాసక్తమాతఙ్గగ్రైవేయస్ఫురితత్విషః
ఆస న్నోషధయో నేతు ర్నక్త మస్నేహదీపికాః. 75

టీక.—సరళా...షః - సరళ = దేవదారువిశేషములయందు - ఆసక్త = తగుల్కొనియున్న - మాతఙ్గ = ఏనుఁగులయొక్క - గ్రైవేయ = మెడసరిపెణలయందు -

స్ఫురిత = ప్రతిబింబించిన - త్విషః = కాంతులుగలవైన, ఓషధయః = వెలుతురుఁదీఁగలు, నేతుః = రాజునకు, నక్తం = రాత్రియందు, అస్నేహదీపికాః - అస్నేహ= నూనె లేని - దీపికాః = దివ్వెలు, ఆసన్ = అయినవి.

తా.—ఆ హిమవత్పర్వతములో రాత్రియందు రఘుమహారాజు దండు విడిసిన చోట, సరళవృక్షములకు కట్టినయేనుఁగుల మెడగొలుసులందు ప్రతిబింబించుచున్న వెలుంగులతోడి జ్యోతిష్మతీలతలు ఆ ప్రభువునకు నూనె యక్కఱ లేని దివ్వెలుగా నుపయోగపడినవి.

వ్యా.—సరళేతి—సరళేషు దేవదారువిశేషేషు - ఆసక్తాని సజ్జితాని - మాతఙ్గానాం గజానాం - గ్రైవాసు భవాని గ్రైవేయాణి కణ్ఠశృఙ్ఖలాని * 'గ్రీవాభ్యోఽణ్చే'తి చకారాత్ ఢకప్రత్యయః - తేషు - స్ఫురిత త్విషః ప్రతిఫలిత భాసః, ఓషధయః నక్తం జ్వలన్త్యో లతావిశేషాః, నేతుః నాయకస్య రఘోః, అస్నేహదీపికాః తైలనిరపేక్షదీపికాః, ఆసన్.

---

తస్యోత్సృష్టనివాసేషు కణ్ఠరజ్జుక్షతత్వచః
గజవర్ష్మ కిరాతేభ్యః శశంసు ర్దేవదారవః. 76

టీక.—తస్య = ఆతనియొక్క, ఉత్సృ...షు - ఉత్సృష్ట = విడువఁబడిన నివాసేషు = విడిదలలయందు, కణ్ఠ...చః - కణ్ఠరజ్జు = మెడసరిపణులచేత - క్షత= చిదుపఁబడిన - త్వచః = పట్టలుగలవైన, దేవదారవః = దేవదారువృక్షములు, కిరాతేభ్యః=బోయలకు, గజవర్ష్మ - గజ = ఏనుఁగులయొక్క - వర్ష్మ = ప్రమాణమును, శశంసుః = చెప్పినవి.

తా.—రఘుమహారాజు విడిచిన విడిదలలయందు ఏనుఁగుల మెడగొలుసుల రాపిడిచేత దేవదారువృక్షములపట్టలు చిదిగియున్న యెత్తును చూచి బోయలు 'ఆహా! ఇంతింత గొప్పయేనుఁగులు ఈరాజునకుఁ గలవు గదా!' అని యూహించుకొని యాశ్చర్యపడిరి.

వ్యా.—తస్యేతి.—తస్య రఘోః, ఉత్సృష్టేషు ఉజ్ఝితేషు - నివాసేషు సేనానివేశేషు, కణ్ఠరజ్జుభిః గజగ్రైవేయైః - క్షతాః నిష్పిష్టాః - త్వచః యేషాం తే, దేవదారవః, కిరాతేభ్యః, గజానాం-వర్ష్మ ప్రమాణం * 'వర్ష్మ దేహ ప్రమాణయో రి' త్యమరః, శశంసుః కథితవన్తః; దేవదారుస్కన్ధే త్వక్క్షతైః గజానా మౌన్నత్య మనుమీయత ఇ త్యర్థః.

---

తత్ర జన్యం రఘో ర్ఘోరం పార్వతీయై ర్గణై రభూత్
నారాచ క్షేపణీ యాశ్మ నిష్పే షోత్పతి తానలమ్. 77

టీక.—తత్ర = ఆహిమాలయమందు, రఘోః = రఘుమహారాజునకు, పార్వతీయైః — పర్వతమందలి - గణైః = ఉత్సవసంకేతు లనెడుగణములతో, నారా... లమ్ - నారాచ = నారసములయొక్కయు - క్షేపణీయ = విసరివైచుగుదియలయొక్కయు = అశ్మ = రాలయొక్క - నిష్పేష = ఒరయికలచేత - ఉత్పతిత = ఎగసిన - అనలం = నిప్పుగలదై, ఘోరం = భయంకరమయిన, జన్యం = యుద్ధము, అభూత్ = జరిగెను.

తా.—హిమాలయమందు రఘుమహారాజునకు ఉత్సవసంకేతు లనుపేరి గణములకును-నారసములు, విసరివైచుగుదియలు, రాలు—వీని రాపిడిచేత నిప్పులు పైకి దుముకుచున్న భయంకరయుద్ధము జరిగెను.

వ్యా.—తత్రేతి.—తత్ర - హిమాద్రౌ, రఘోః, పర్వతే భవైః పార్వతీయైః * 'పర్వతా చ్ఛ'ఇతి ఛప్రత్యయః, గణై రుత్సవసంకేతాఖ్యై ర్గణై స్సప్తభిః సహ * 'గణా నుత్సవసంకేతా నజయ త్సప్త పాణ్డవ' ఇతి మహాభారతే, నారాచానాం బాణవిశేషాణాం - క్షేపణీయానాం భిణ్డివాలానామ్ - అశ్మనాం పాషాణానాం చ - నిష్పేషేణ సంఘర్షేణ - ఉత్పతితః అనలః యస్మి౯ తత్తథోక్తం * 'క్షేపణీయో భిణ్డివాలః సృగో దీర్ఘఃమహాఫల ఇ'తి యాదవః, ఘోరం భీమం, జన్యం యుద్ధమ్, అభూత్ * 'యుద్ధ మాయోధనం జన్య మి' త్యమరః.

---

శరై రుత్సవసంకేతా౯ స కృత్వా విరతోత్సవా౯
జయోదాహరణం బాహ్వో ర్గాపయామాస కిన్నరా౯. 78

టీక.—సః = ఆరఘుమహారాజు, శరైః = బాణములచేత, ఉత్సవసంకేతా౯- ఉత్సవసంకేతు (లనెడి యేడుగణము) లను, విరతోత్సవా౯ - విరత = పోయిన - ఉత్సవా౯ = పండుగులుకలవారినిగా, కృత్వా = చేసి, కిన్నరా౯ = కిన్నరులను, బాహ్వోః = (తన) భుజములయొక్క, జయోదాహరణం — జయ = గెలుపుం దెలుపు- ఉదాహరణం = ప్రబంధవిశేషమును, గాపయామాస = పాడించెను.

తా.—రఘుమహారాజు ఆయుత్సవసంకేతులను జయించుటచేత ఉత్సవ హీనులంగావించి, అంతకు మున్ను ఓ డెఱుఁగనివారిజయము గావున, తన బాహువుల యా జయమును తెలుపు ప్రబంధమును కిన్నరులచేత పాడించెను.

వ్యా.—శరై రితి.— స రఘుః, శరై ర్బాణైః, ఉత్సవసంకేతా౯ నామ గణా౯, విరతోత్సవా౯ కృత్వా - జి త్వే త్యర్థః, కిన్నరా౯ గన్ధర్వవిశేషా౯, బాహ్వోః స్వభుజయోః, జయోదాహరణం జయఖ్యాపకం ప్రబన్ధవిశేషం, గాపయామాస

* గతిబుద్ధీత్యాదినా కిన్న రాణాం కర్తృత్వమ్; గణానాం చ అభూతపూర్వః పరాజయ ఇతి ధ్వన్యతే.

---

పరస్ప రేణ విజ్ఞాత స్తే షూపాయనపాణిషు
రాజ్ఞా హిమవతః సారో, రాజ్ఞః సారో హిమాద్రిణా. 79

టీక.—తేషు = ఆయుత్సవసంకేతనామకగణములు, ఉపా...షు సత్సు - ఉపాయన=కానుకలు - పాణిషు సత్సు = చేతులయందుఁగలవారు కాఁగా, రాజ్ఞా = రఘుమహారాజుచేత, హిమవతః = మంచుకొండయొక్క, సారః = (ధనమనెడు) స్థిరాంశము, హిమాద్రిణా = హిమవత్పర్వతము చేత, రాజ్ఞః = రఘుమహారాజుయొక్క, సారః = (బలమనెడు) స్థిరాంశము, పరస్పరేణ = ఒండొరులచే, విజ్ఞాతః = (ఒకటొకటియు) ఎఱుఁగబడినది.

తా.—అంతట ఆయుత్సవసంకేతులు రఘుమహారాజునకు వెలలేని కానుకలను చేతులం గొని వచ్చిరి. అందువలన అంతటివారిని ఓడించిన రాజుయొక్క బలము హిమవంతునికిని అట్టి కానుకలకు మూల మయిన హిమవంతుని ధనము రాజునకును బోధపడినవి.

వ్యా.—పరస్పరే ణేతి.— తేషు గణేషు, ఉపాయనయుక్తాః పాణయో యేషాం తేషు సత్సు, పరస్పరేణ అన్యోన్యం, రాజ్ఞా, హిమవతః, సారః ధనరూపః, విజ్ఞాతః, హిమాద్రిణా రాజ్ఞః సారః బలరూపః, విజ్ఞాతః ; ఏతేన తత్రత్యవస్తూనా మనర్ఘత్వం గణానాం చ అభూతపూర్వః పరాజయ ఇతి ధ్వన్యతే.

---

తత్రాక్షోభ్యం యశోరాశిం నివేశ్యావరురోహ సః
పౌలస్త్యతులిత స్యాద్రే రాదధాన ఇవ హ్రియమ్. 80

టీక.—సః = ఆరఘుమహారాజు, తత్ర=ఆహిమవత్పర్వతమందు, అక్షోభ్యం = తిరస్కరింపనలవిగాని దానిని, యశోరాశిం - యశః = కీర్తులయొక్క - రాశిం = ప్రోవును, నివేశ్య = పేర్చి, పౌల...స్య - పౌలస్త్య = రావణునిచేత - తులితస్య = ఎత్తఁబడిన, అద్రేః = పర్వతమునకు (కైలాసమునకు), హ్రియం = సిగ్గును, ఆదధాన ఇవ = కలిగించుచున్నవాఁడు వోలె, అవరురోహ = దిగెను.

తా.—ఆహిమవంతమందు తిరస్కరింప నలవిగాని కీర్తులప్రోవును పేర్చి, ఆరాజు పూర్వము రావణునిచేత ఎత్తివై చఁబడిన కైలాసమునకు, ఒకరు గెలిచినదానిని గెలుచుటయందు అతిశయము ఏమియు లేదని లజ్జపెట్టువాఁడుంబోలె, దానిమీఁదికిఁ బోక దిగి వచ్చెను.

వ్యా.—తత్రేతి.—స రఘుః, తత్ర హిమాద్రౌ, అక్షోభ్య మప్రధృష్యం, యశో రాశిం, నివేశ్య నిధాయ, పౌలస్త్యేన రావణేన - తులితస్య చాలితస్య, అద్రేః కైలాసస్య, హ్రియమ్, ఆదధానః జనయ న్నివ, అవరురోహ; కైలాస మగత్వైవ ప్రతినివృత్త ఇత్యర్థః; న హి శూరాః పరేణ పరాజిత మభియుఞ్జీర న్నితి భావః.

---

చకమ్పే తీర్ణలౌహిత్యే తస్మిన్ ప్రాగ్జ్యోతిషేశ్వరః
తద్గజాలానతాం ప్రాప్తైః సహ కాలాగురుద్రుమైః. 81

టీక.—తస్మిన్ = ఆరఘుమహారాజు, తీర్ణ...త్యే - తీర్ణ = దాఁటఁబడిన-లౌహిత్యే సతి = లౌహిత్యయను పేరి నది కలవాఁడు కాఁగా, ప్రాగ్జ్యోతిషేశ్వరః = ప్రాగ్జ్యోతిషదేశపురాజు, తద్గజాలానతాం - తత్ = ఆరఘుమహారాజుయొక్క - గజ = ఏనుఁగుల యొక్క - ఆలానతాం = కట్టుకంబపుఁదనమును, ప్రాప్తైః = పొందినట్టి, కాలాగరుద్రుమైః సహ = నల్లయగరుచెట్లతోఁ గూడ, చకమ్పే = వడఁకెను.

తా.—తర్వాత రఘుమహారాజు లౌహిత్యానదిని దాఁటుడు, ఆతనియేనుఁగులను గట్టిన నల్లయగురుచెట్లతోఁ గూడ ప్రాగ్జ్యోతిషరాజు వడఁకం దొడంగెను.

వ్యా.—చకమ్ప ఇతి.—తస్మిన్ రఘౌ, తీర్ణా లౌహిత్యా నామ నదీ యేన తస్మిన్ తీర్ణలౌహిత్యే సతి, ప్రాగ్జ్యోతిషాణాం జనపదానా మీశ్వరః, తస్య రఘోః-గజానా మాలానతాం, ప్రాప్తైః, కాలాగురుద్రుమైః కృష్ణాగరువృక్షైః సహ, చకమ్పే కమ్పితవాన్.

---

న ప్రసేహే స రుద్ధార్క మధారావర్షదుర్దినం
రథవర్త్మరజోఽ ప్యస్య కుత ఏవ పతాకినీమ్! 82

టీక.—సః = ఆప్రాగ్జ్యోతిషరాజు, రుద్ధార్కం - రుద్ధ = కమ్మఁబడిన-అర్కం = సూర్యుఁడుకలదై, అధా...నం - అధారావర్ష = ధారావర్షములేని - దుర్దినం = ముసాబుదినమైన, అస్య = ఈరఘుమహారాజుయొక్క, రథ...పి - రథవర్త్మన = తేరిదారియందలి - రజోఽపి = ధూళినిసైతము, న ప్రసేహే = ఓర్వఁడాయెను, పతాకినీం తు = దండు నన్ననో, కుత ఏవ ప్రసేహే = ఓర్చుట యే యొక్కడిది !

తా.—ప్రాగ్జ్యోతిషరాజు రఘుమహారాజుయొక్క తేరిదారిదుమ్ము వానలేనిమబ్బు దినమో యనునట్లుగా సూర్యునిఁ గానరానీక ఆకాశమును గ్రమ్ముకోనఁగాఁ జూచి ఆ మాత్రమునకే భీతుఁడాయెను. పోరికిం గడంగక నమ్రుఁడాయెనని వేఱ చెప్పవలయునా!

వ్యా.—నేతి.—సః ప్రాగ్జ్యోతిషేశ్వరః, రుద్ధార్క మావృతసూర్యమ్, అధారావ
షణం చ తత్ దుర్దినం చ ధారావృష్టిం వినైవ దుర్దినీభూతమ్, అస్య రఘోః,
రథవర్త్మరజోఽపి, న ప్రసేహే, పతాకినీం తు, కుత ఏవ ప్రసేహేన కుతోఽపీ త్యర్థః.

---

తమీశః కామరూపాణా మత్యాఖణ్డలవిక్రమం
భేజే భిన్నకటై ర్నాగై రన్యా నుపరురోధ యైః. 83

టీక.—కామరూపాణాం = కామరూపదేశముయొక్క, ఈశః = రాజు, అత్యాఖణ్డలవిక్రమం=ఇంద్రుని పరాక్రమును మించిన, తం=ఆరఘుమహారాజును, యైః= ఏ యేనుఁగులచేత, అన్యాన్ = ఇతర రాజులను, ఉపరురోధ = అరికట్టెనో, అట్టి, భిన్నకటైః - భిన్న = మదముగాఱుచున్న - కటైః = గండస్థలములుగల, నాగైః = ఏనుఁగులచేత, భేజే = సేవించెను.

తా.—కామరూపదేశరాజు తనమీఁదికి ఇంద్రుని గెలిచిన రఘుమహారాజు రాఁగానే అంతవఱకు తాను తన కడమపగతురను మదముతోఁడిగండములుగల యేయేనుఁగుల చేత జయించెనో ఆయేనుఁగులను ఆయనకు కానుకగా అర్పించి శరణుఁజొచ్చెను.— రఘువు శూరులకును శూరుఁడు అని భా.

వ్యా.—తమితి.—కామరూపాణాం నామ దేశానాం ఈశః,అత్యాఖణ్డలవిక్రమ మతీన్ద్రపరాక్రమం, తం రఘుం, భిన్నాః స్రవన్మదాః - కటాః గణ్డాః - యేషాం తైః, నాగై ర్గజైః సాధనైః - భేజే - నాగాన్ దత్త్వా శరణం గత ఇ త్యర్థః; కీదృశైః - యై ర్నాగైః, అన్యాన్ రఘువ్యతిరిక్తాన్ నృపాన్, ఉపరురోధ ; శూరాణా మపి శూరో రఘు రితి భావః.

---

కామరూపేశ్వర స్తస్య హేమపీఠాధిదేవతాం
రత్నపుష్పోపహారేణ ఛాయా మానర్చ పాదయోః 84

టీక.—కామరూపేశ్వరః = కామరూపదేశపురాజు, హేమ...తాం - హేమపీఠ = బంగారపుఁబీఁటకు - అధిదేవతాం = అధిష్ఠానదేవత యైనదానిని, తస్య = ఆరఘుమహారాజుయొక్క, పాదయోః = అడుగులయొక్క, ఛాయాం = కాంతిని, రత్న...ణ - రత్న=మణులనెడి - పుష్ప = పూవులయొక్క - ఉపహారేణ = సమర్పణముచేత, ఆనర్చ = పూజచేసెను.

తా.—కామరూపదేశపురాజు బంగారపుఁబీఁటమీఁద పర్విన రఘుమహారాజ పాదకాంతిని దేవతనుంబోలె, పుష్పములకు బదులుగా రత్నములతో పూజించెను.

వ్యా.—కామరూపేతి.—కామరూపేశ్వరః, హేమపీఠస్యాధిదేవతాం, తస్య రఘోః, పాదయోః, ఛాయాం కనకమయపాదపీఠవ్యాపినీం కాన్తిం, రత్నాన్యేవ పుష్పాణి - తేషా ముపహారేణ సమర్పణేన, అనర్చ పూజయామాస.

---

ఇతి జిత్వా దిశో జిష్ణు ర్న్యవర్తత రథోద్ధతం
రజో విశ్రామయ న్రాజ్ఞాం ఛత్త్రశూన్యేషు మౌళిషు. 85

టీక.—జిష్ణుః = జయశీలుఁడైన, సః = ఆరఘుమహారాజు, ఇతి = ఈవిధముగా, దిశః = దిక్కులను, జిత్వా = గెలిచి, రథోద్ధతం - రథ = తేరులచే - ఉద్ధతం = రేఁపఁబడిన, రజః = ధూళిని, రాజ్ఞాం = రాజులయొక్క, ఛత్త్రశూన్యేషు - ఛత్త్ర = గొడుగుచేత - శూన్యేషు = కొఱఁబడిన, మౌళిషు = సిగలయందు, విశ్రామయన్ = నిలుపుచు, న్యవర్తత = వెనుకకు మరలెను.

తా.—జయశీలుఁడు రఘుమహారాజు ఈప్రకారమున ఎల్లదిక్కులను జయించి, తాను ఏకచ్ఛత్త్రాధిపతి యగుటంబట్టి తనమ్రోల నితరరాజులు ఛత్త్రముం దాల్పరు గావున వారిసిగలయందు తనతేరిధూళి ప్రాలి నిలుచుచుండఁగా తనరాజధానికి మరలెను.

వ్యా.—ఇతీతి.—జిష్ణుః జయశీలః * 'గ్లా జి స్థ శ్చ గ్స్నుః' ఇతి గ్స్నుః ప్రత్యయః, స రఘుః, ఇ త్థం, దిశః, జిత్వా, రథైః ఉద్ధతం, రజః, ఛత్త్రశూన్యేషు రఘో రేకచ్ఛత్త్రత్వా దితి భావః, రాజ్ఞాం, మౌళిషు సంయతకేశేషు * 'చూడా కిరీటం కేశాశ్చ సంయతా మౌళయః కచాః' ఇ త్యమరః - శిఖా స్వి త్యర్థః, విశ్రామయన్ సంక్రామయ న్ని త్యర్థః, న్యవర్తత నివృత్తః.

---

స విశ్వజిత మాజహ్రే యజ్ఞం సర్వస్వదక్షిణమ్,
ఆదానం హి విసర్గాయ సతాం వారిముచా మివ. 86

టీక.—సః = ఆరఘుమహారాజు, సర్వ...ణం - సర్వస్వ = సర్వధనమును-దక్షిణం = దక్షిణగాఁగలిగిన, విశ్వజితం = విశ్వజిత్తను పేరిటి, యజ్ఞం = జన్నమును, ఆజహ్రే = చేసెను ; తథా హి = అది సరియే గదా, సతాం = సాధువులకు, వారిముచామ్ ఇవ = మేఘములకుంబోలె, ఆదానం = పుచ్చుకొనుట, విసర్గాయ హి = ఇచ్చుటకొఱకుఁ గదా.

తా.—అనంతరము ఆరాజు, సర్వధనము దక్షిణగాఁగలదైన విశ్వజిత్తనెడి యాగమును చేసెను. సాధువులు ధన మార్జించుట సత్పాత్త్రమునకు ఇచ్చుటకే గదా.

వ్యా.—స ఇతి.—స రఘుః, సర్వస్వం దక్షిణా యస్య తం సర్వస్వదక్షిణం * 'విశ్వజి త్సర్వదక్షిణః' ఇతి శ్రుతేః, విశ్వజితం నామ, యజ్ఞమ్, ఆజహ్రే కృతవా ని

త్యర్థాః; యుక్తం చైతదిత్యాహ-సతాం సాధూనాం, వారిముచాం మేఘానామివ, ఆదానమ్ అర్జనం, విసర్గాయ త్యాగాయ హి - సత్పాత్రవినియోగా యేత్యర్థాః.

---

సత్రాన్తే సచివసఖః పురస్క్రియాభి
ర్గుర్వీభిః శమిత పరాజయ వ్యలీకాన్
కాకుత్థ్సః చిరవిరహోత్సుకావరోధాన్
రాజన్యాం స్వపురనివృత్తయేఽనుమేనే. 87

టీక.—కాకుత్థ్సః = రఘుమహారాజు, సత్రాన్తే - సత్ర = విశ్వజిద్యాగము యొక్క - అన్తే = కడపటను, సచివసఖః సన్ - సచివ = మంత్రులకు - సఖః సన్ = మిత్త్రుఁడై, గుర్వీభిః = అధికములయిన, పురస్క్రియాభిః = సత్కారములచేత, శమి...కాన్ - శమిత = అర్పఁబడిన - పరాజయ = ఓటమిచేతనయిన - వ్యలీకాన్ = దుఃఖముకలవారును, చిర...ధాన్ - చిర = బహుకాలమందలి - విరహ = ఎడఁబాపుచేత - ఉత్సుక = ఉవ్విళ్లూరుచున్న - అవరోధాన్ = అంతఃపురస్త్రీలుకలవారును, (అయిన), రాజన్యాన్ = రాజులను, స్వ...యే, స్వ = తమవైన - పుర=పట్టణములకు - నివృత్తయే = పోవుటకు, అనుమేనే = అంగీకరించెను.

తా.—యాగము ముగియఁగానే రఘుమహారాజు దిగ్విజయములో తనకు ఓడినవారై తన పరివారములోఁ జేరి వచ్చియున్న రాజులను ఆయోటమిదుఃఖము ఆఱిపోవునట్లుగా మంత్రిసమేతుఁడై మిక్కిలి గొప్పగా సత్కరించినవాఁడై, చిరకాలమునుండి వారిని బాసిన దుఃఖము వారిభార్యలకుఁ దీఱునట్లుగా వారిని తమతమ నగరములకు పోవుటకు సెలవిచ్చెను.

వ్యా.—సత్రాన్త ఇతి.—కాకుత్థ్సః రఘుః, సత్రాన్తే యజ్ఞాన్తే * 'సత్రమాచ్ఛాదనే యజ్ఞే సదాదానే వనేఽపి చే' త్యమరః, సచివానాం సఖా సచివసఖః సన్-తేషా మత్యన్తానుసరణద్యోతనార్థం రాజ్ఞః సఖిత్వవ్యపదేశః * 'రాజాహస్సఖిభ్య ష్ట జి' తి టచ్, గుర్వీభిః, పురస్క్రియాభిః పూజాభిః, శమితం పరాజయేన య - ద్వ్యలీకం దుఃఖం - వైలక్ష్యం వా - త ద్యేషాం తాన్ శమితపరాజయవ్యలీకాన్ * 'దుఃఖే వైలక్ష్యే వ్యలీక మి' తి యాదవః, చిరవిరహేణ - ఉత్సుకాః ఉత్కణ్ఠితాః - అవరోధాః అన్తఃపురాఙ్గనాః - యేషాం తాన్, రాజ్ఞోఽపత్యాని రాజన్యాః క్షత్త్రియాః-తాన్ * 'రాజ శ్వశురా ద్య ది' తి యత్ప్రత్యయః * 'మూర్ధాభిషిక్తో రాజన్యో బాహుజః క్షత్త్రియో విరా డి' త్యమరః, స్వపురం ప్రతి - నివృత్తయే గమనాయ, అనుమేనే అనుజ్ఞాతవాన్.

---

తే రేఖాధ్వజకలశాతపత్రచిహ్నం
సమ్రాజ శ్చరణయుగం ప్రసాదలభ్యం
ప్రస్థానప్రణతిభి రఙ్గులీషు చక్రు
ర్మౌళిస్రక్చ్యుతమకరన్దరేణుగౌరమ్. 83

టీక.—తే = ఆరాజులు, రేఖా...హ్నం—రేఖా = గీఱలుగానున్న - ధ్వజ= టెక్కెములును - కలశ = గిండ్లును - ఆతపత్ర = గొడుగులును - చిహ్నం = గుర్తులు గాఁగలదియు, ప్రసాదలభ్యం - ప్రసాద = అనుగ్రహముచేతనే - లభ్యం = పొందఁదగినదియు, (నయిన), సమ్రాజః = సార్వభౌముఁడగు రఘుమహారాజుయొక్క, చరణయుగం - చరణ = అడుగులయొక్క - యుగం = జతను, ప్రస్థా...భిః—ప్రస్థాన = ప్రయాణకాలమందలి - ప్రణతిభిః = నమస్కారములచేత, అఙ్గులీషు - వ్రేళ్లయందు, మౌళి...రం—మౌళి = సిగలయందలి - స్రక్ = పూదండలనుండి - చ్యుత = జాఱిన - మకరన్ద = పూఁదేనెలచేతను - రేణు = పుప్పొడులచేతను, గౌరం = పసుపువన్నెగలదానినిగా, చక్రుః = చేసిరి.

తా.—సార్వభౌముఁడయిన యారఘుమహారాజునకు పాదములయందు టెక్కెపు రేఖ, గిండిరేఖ, గొడుగురేఖయు, నుండినవి. అవి అట్టి మహాపురుషులకేగాని మఱెవ్వరికిని ఉండవు. కావున అవియే యాతనిపాదములకు గుర్తుగా నుండెను. మఱియు అతని యనుగ్రహము పొందనివారికి ఆపాదములను స్పృశింప శక్యము గాదు. అట్టియాపాదములకు ఆరాజులు ప్రణమిల్లి నిజనగరములకుం దరలిరి. వారు పలువు రయినందునను అత్యంత భక్తివినయములతో ఆపాదములకు తమశిరములఁ సోఁకమ్రొక్కినందునను వారి సిగదండలయందలి పూఁదేనెయు పుప్పొడియుం గప్పఁగా వానివ్రేళ్లంతయు ఒక్కటియే పసుపువన్నె యయినవి.

వ్యా.—త ఇతి.— తే రాజన్యాః, రేఖా ఏవ ధ్వజాశ్చ కలశాశ్చ ఆతపత్రాణి చ ధ్వజాద్యాకారరేఖా ఇ త్యర్థః - తాని చిహ్నాని యస్య తత్తథోక్తం, ప్రసాదేనైవ లభ్యం ప్రసాదలభ్యం, సమ్రాజః సార్వభౌమస్య రఘో, శ్చరణయుగం, ప్రస్థానే ప్రయాణసమయే - యాః - ప్రణతయః నమస్కారాః - తాభిః కరణైః అఙ్గులీషు, మౌళిషు కేశబన్ధేషు - యాః - స్రజః మాల్యాని - తాభ్యః - చ్యుతైః - మకరన్దైః పుష్పరసైః - రేణుభిః పరాగైశ్చ - గౌరం గౌరవర్ణం, చక్రుః. ప్రహర్షణీవృత్తమ్.

•

# రఘువంశే

## పంచమస్సర్గః.

త మధ్వరే విశ్వజితి క్షితీశం నిశ్శేష విశ్రాణిత కోశజాతమ్
ఉపాత్తవిద్యో గురుదక్షిణార్థీ కౌత్సః ప్రపేదే వరతన్తుశిష్యః. 1

టీక.—విశ్వజితి=విశ్వజిత్తను పేరి, అధ్వరే = జన్నమునందు, నిశ్శే...తం—నిశ్శేష = మిగతలేకుండ - విశ్రాణిత = ఈఁబడిన - కోశ = ధనరాసులయొక్క - జాతం = సమూహముగలిగిన, తం క్షితీశం = ఆ రఘుమహారాజును, ఉపాత్తవిద్యః - ఉపాత్త = నేర్వఁబడిన - విద్యః = విద్యలుకలవాఁడు, వర...ష్యః—వరతన్తు = వరతంతుమహామునియొక్క - శిష్యః=చట్టు, కౌత్సః = కౌత్సుఁడనువాఁడు, గురు...ర్థీ—గురుదక్షిణా = గురుదక్షిణను - అర్థీ = వేఁడువాఁడై, ప్రపేదే = చేరెను.

తా.—కలధనము లన్నియుం ఆవిశ్వజిద్యాగమున దానము చేసి రిక్తుఁడై యున్న యారఘుమహారాజుకడకు వరతంతుమునివలన సమస్తవిద్యాగ్రహణమును పూర్తి గావించుకొన్నవాఁడు తచ్ఛిష్యుఁడు కౌత్సుఁ డనునాతఁడు గురుదక్షిణ యాచించుటకై వచ్చెను.

వ్యా.—త మితి.—విశ్వజితి విశ్వజన్నామకే, అధ్వరే యజ్ఞే * 'యజ్ఞః సవోఽధ్వరో యాగ' ఇత్యమరః, నిశ్శేషం యథా తథా - విశ్రాణితం దత్తం * శ్రణ దానే చురాదిః - కోశానామ్ అర్థరాశీనాం - జాతం సమూహో - యేన తం తథోక్తం * 'కోశోఽస్త్రీ కుట్మలే ఖడ్గ పిధానేఽ ర్థౌఘ దివ్యయో రి' త్యమరః * 'జాతం జని సమూహయో రి' తి శాశ్వతః - ఏతేన కౌత్స స్యానవసరప్రాప్తత్వం సూచయతి, తం క్షితీశం రఘుం, ఉపాత్తవిద్యః లబ్ధవిద్యః, వరతన్తోః శిష్యః, కౌత్సః ఋషిః * 'ఋష్యన్ధక' ఇత్యణ్ - ఇఞోఽపవాదః, గురుదక్షిణార్థీ సన్ * 'పుష్కరాదిభ్యో దేశే' ఇత్యత్ర 'అర్థాచ్చాసన్నిహితే తదన్తాచ్చే' తి ఇనిః - అప్రత్యాఖ్యేయ ఇతి భావః, ప్రపేదే ప్రాప. అస్మిన్సర్గే వృత్త ముపజాతిః - లక్షణం తు -

'స్యా దిన్ద్రవజ్రా యది తౌ జగౌగః । ఉపేన్ద్రవజ్రా జతజా స్తతో గౌ.
అనన్తరోదీరితలక్ష్మభాజః । పాదా యదీయా ఉపజాతయస్తాః.' ఇతి లక్షణాత్.

స మృణ్మయే వీతహిరణ్మయత్వాత్
పాత్రే నిధాయార్ఘ్యమనర్ఘశీలః
శ్రుతప్రకాశం యశసా ప్రకాశః
ప్రత్యుజ్జగామాతిథి మాతిథేయః. 2

టీక.—అనర్ఘ శీలః - అనర్ఘ = వెలలేని - శీలః = స్వభావముగలవాఁడును, యశసా = కీర్తిచేత, ప్రకాశః = వెలుఁగుచున్న వాఁడును, ఆతిథేయః = అతిథులయందు సాధువును, (అయిన), సః = ఆరఘుమహారాజు, వీత...త్ - వీత = (దత్తమై) పోయినట్టి - హిరణ్మయత్వాత్ = బంగారుపాత్రములుకలవాఁడగుటవలన, మృణ్మయే = మట్టిదయిన - పాత్రే = పాత్రమునందు, అర్ఘ్యం = పూజాద్రవ్యమును, నిధాయ = ఉంచుకొని, శ్రుతప్రకాశం - శ్రుత = శాస్త్రములచేత - ప్రకాశమ్ = ప్రసిద్ధుఁడయిన, అతిథిం = అభ్యాగతునికి (కౌత్సమునికి), ప్రత్యుజ్జగామ = ఎదురేఁగెను.

తా.—అంతట మిక్కిలి దొడ్డ స్వభావముగలవాఁడును కీర్తిచే వెలుంగుచున్న వాఁడును అతిథిపూజాపరాయణుఁడును అయిన యారఘుమహారాజు బంగారుపాత్రములన్నియు దత్తములయి పోయినందున మట్టి పాత్రములో పూజాద్రవ్యము లుంచుకొన్న వాఁడై అభ్యాగతునికి ఆకౌత్సునికి ఎదురుగా నేఁగెను.

వ్యా.—స ఇతి.—అనర్ఘశీలః అమూల్యస్వభావః - అసాధారణస్వభావ ఇత్యర్థః * 'మూల్యే పూజావిధా వర్ఘః' - 'శీలం స్వభావే సద్వృత్తా వి'తి చామరః, యశసా కీర్త్యా, ప్రకాశత ఇతి ప్రకాశః * పచాద్యచ్, అతిథిషు సాధుః ఆతిథేయః * 'ప థ్యతిథి వసతీ'తి ఢఞ్ ప్రత్యయః, స రఘుః, హిరణ్యస్య వికారో హిరణ్మయం *'దాణ్డినాయ నే'త్యాదినానిపాతః,వీతహిరణ్మయత్వాత్ అపగతసువర్ణపాత్రత్వాత్ - యజ్ఞస్య సర్వస్వదక్షిణాకత్వా దితిభావః, మృణ్మయే మృద్వికారే, పాత్రే, అర్ఘార్థ మిదమ్ అర్ఘ్యం * 'పాదార్ఘాభ్యాం చే'తి యత్ప్రత్యయః - పూజార్థం ద్రవ్యం, నిధాయ, శ్రుతేన శాస్త్రేణ-ప్రకాశం ప్రసిద్ధం * 'శ్రుతం శాస్త్రావధృతయో రి'త్యమరః 'ప్రకాశోఽతి ప్రసిద్ధేఽపీ' త్యమరః, అతిథిమ్ అభ్యాగతం కౌత్సం * 'అతిథి ర్నా గృహాగత' ఇ త్యమ రః, ప్రత్యుజ్జగామ.

త మర్చయిత్వా విధివ ద్విధిజ్ఞ
స్తపోధనం మానధనాగ్రయాయీ
విశాంపతి ర్విష్టరభాజ మారాత్
కృతాఞ్జలిః కృత్యవి దిత్యువాచ. 3

టీక.—విధిజ్ఞః=శాస్త్రజ్ఞుండును, మాన...యీ - మాన = పరువే - ధన = ధనముగాఁగలవారిలో - అగ్రయాయీ = ముందుఁబోవువాఁడును, కృత్యవిత్ = కార్యజ్ఞుఁడును, (అయిన), విశాంపతిః = నరేశ్వరుఁడు (రఘుమహారాజు), విష్టరభాజం - విష్టర = ఆసనమును - భాజం = పొందిన, తం తపోనిధిం = ఆ కౌత్సఋషిఁని, విధివత్ = యథాశాస్త్రముగ, అర్చయిత్వా = పూజించి, ఆరాత్ = చెంతను, కృ...సన్ - కృత = చేయఁబడిన - అఞ్జలిః సన్ = కేలుమోడ్పుకలవాఁడై, ఇతి = చెప్పఁబోవు తీరున, ఉవాచ = పలికెను.

తా.—శాస్త్రజ్ఞుఁడును పరువుగలవారిలో మొదటివాఁడును చేయవలసిన సత్కారమును ఎఱిఁగినవాఁడును అయిన యారఘుమహారాజు ఆకౌత్సమునిని పీటపై కూర్చుండఁజేసి శాస్త్రోక్తవిధానమున పూజించి చెంతను చేతులు జోడించుకొని ఈరీతిని పలికెను.

వ్యా.—త మితి.—విధిజ్ఞః శాస్త్రజ్ఞః - అకరణే ప్రత్యవాయభీరు రిత్యర్థః, మానధనాగ్రయాయీ - మాన ఏవ ధనం యేషాం తేషాం మానినామ్ - అగ్రయాయీ అగ్రేసరః రఘుః * 'ద్వౌ విశౌ వైశ్యమనుజా వి'త్యమరః, విష్టరభాజమ్ ఆసనగతం - ఉపవిష్ట మి త్యర్థః * 'విష్టరో విటపీ దర్భముష్టిః పీఠాద్య మాసన మి'త్యమరః * 'వృక్షాసనయో ర్విష్టర' ఇతి నిపాతః, తం తపోధనం కౌత్సం, విధివత్ యథార్హం-యథాశాస్త్ర మి త్యర్థః * 'తదర్హ మి'తి వతిప్రత్యయః, అర్చయిత్వా, ఆరాత్ సమీపే * 'ఆరాద్దూరసమీపయో రి'త్యమరః, కృతాఞ్జలిః సన్, ఇతి వక్ష్యమాణప్రకారేణ ఉవాచ.

---

అప్యగ్రణీ ర్మన్త్రకృతా మృషీణాం కుశాగ్రబుద్ధే కుశలీ గురు స్తే
యత స్త్వయా జ్ఞాన మశేష మాప్తం లోకేన చైతన్యమి వోష్ణరశ్మేః?

టీక.—హే కుశాగ్రబుద్ధే = ఓయి దర్భమొనవంటి (సూక్ష్మ) బుద్ధిగలవాఁడా, యతః = ఏయొజ్జవలన, త్వయా = నీచేత, అశేషం = సమస్తమయిన, జ్ఞానం = తెలివి, లోకేన = జనముచేత, ఉష్ణరశ్మేః = వేఁడివెలుఁగువలన, చైతన్యమివ = మెలఁకువవలె, ఆప్తం = పొందఁబడెనో, (అతఁడు), మన్త్రకృతాం = మంత్రద్రష్టలయిన, ఋషీణాం = ఋషులలోపల, అగ్రణీః = శ్రేష్ఠుఁడయిన, తే = నీయొక్క గురుః = ఒజ్జ, కుశలీ అపి = క్షేమముగలవాఁడా?

తా.—దర్భమొనవంటి సూక్ష్మబుద్ధికల యో కౌత్సమునీ, సూర్యునివలన జనుఁడు మెలఁకువను పొందినట్లుగా ఏగురువువలన నీవు సమస్తమయిన తెలివిని పొందితివో ఆయన మంత్రద్రష్టలలో మొదటివాఁడు కుశలముగా నున్నాఁడా ?

వ్యా.—అప్యగ్రణీ రితి.—హే కుశాగ్రబుద్ధే * 'కుశాగ్రీయమతిః ప్రోక్తస్సూక్ష్మదర్శీ చ యః పుమా ని' తి హలాయుధః, మన్త్రకృతాం మన్త్రద్రష్టౄణాం * 'సుకర్మ పాప మన్త్రే' త్యాదినా క్విప్, ఋషీణా మగ్రణీః శ్రేష్ఠః, తే తవ, గురుః, కుశ ల్యపి క్షేమవా న్కిమ్ - అపిః ప్రశ్నే * 'గర్హా సముచ్చయ ప్రశ్న శఙ్కా సంభావనా స్వపీ' త్యమరః, యతః యస్మాత్, గురోః, త్వయా, అశేషం జ్ఞానం లోకేన, ఉష్ణరశ్మేః సూర్యాత్, చైతన్యం ప్రబోధ, ఇవ, ఆత్తం స్వీకృతమ్.

కాయేన వాచా మనసాఽపి శశ్వ
ద్యత్సంభృతం వాసవధైర్యలోపి
ఆపాద్యతే న వ్యయ మన్తరాయైః
కచ్చిన్మహర్షే స్త్రివిధం తప స్తత్ ? 5

టీక.— కాయేన = దేహమును శుష్కింపఁజేయునదైన యుపవాసాదుల చేతను, వాచా = వేదపాఠముచేతను, మనసా అపి = గాయత్రీ జపాదికముచేతను, వాస...పి—వాసవ = ఇంద్రునియొక్క - ధైర్య = ధైర్యమును - లోపి = పోఁగొట్టునదైన, యత్ = ఏతపస్సు, శశ్వత్ = సదా, సంభృతం = కూర్పఁబడెనో, మహర్షేః = వరతంతుఋషియొక్క, త్రివిధం=వాఙ్మనఃకాయసాధ్యమయిన, తత్ తపః = ఆతపస్సు, అన్తరాయైః = (ఇంద్రుఁడుపంపిన యచ్చరలను శపించుట మొదలయిన) విఘ్నముల చేత, వ్యయం = నాశమును, నాపాద్యతే కచ్చిత్ = పొందింపఁబడకయున్నది గదా ?

తా.—ఎవరేని అత్యంతోగ్రముగా తపస్సుచేయునపుడెల్ల ఇంద్రుఁడు ఆతపోమహిమచేత వారికి తనపదము కలుగు ననియు తనకు తొలఁగుననియు భయపడి వారికి తపోభంగము కావించుటకై అచ్చరలను పంపును. ఆతపస్వులు ధీరులేని ఆయచ్చరలను శపింతురు. దానంజేసి వారికి తపస్సు కొంత వ్యయమై పోవును. అంతట ఇంద్రునిభయమునుం గొంత తీఱును.—దీని ననుసంధించిన ప్రశ్న యిది.— మీగురువు మనోవాక్కాయములచే ఇంద్రునికి భయ మగునట్లుగా సర్వదా చేయుచున్న తపస్సునకు అచ్చరలను శపించుట లోనగు కారణములచేత వ్యయము కలుగకయున్నదిగదా ?

వ్యా.—కాయే నేతి.—కాయేన ఉపవాసాదికృచ్ఛ్రచాన్ద్రాయణాదినా, వాచా వేదపాఠేన, మనసా గాయత్రీజపాదినాఽపి, కరణేన, వాసవస్య ఇన్ద్రస్య - ధైర్యం - లుమ్పతి భిన త్తీతి వాసవధైర్యలోపి - స్వపదాపహార శఙ్కాజనక మి త్యర్థః, య త్తపః, శశ్వ దసకృత్ * 'ముహుః పునఃపునః శశ్వ దభీక్ష్ణ మసకృ త్సమా' ఇ త్యమ

రః, సంభృతం సంచితం, మహాషేః ర్వరతన్తోః, త్రివిధం వాఙ్మనః కాయ జం, తత్ తపః, అన్తరాయైః విఘ్నైః - ఇన్ద్రప్రేషితాప్సరశ్శాపాదిభిః, వ్యయం, నాపాద్యతే కచ్చిత్ న నీయతే కిం * 'కచ్చి త్కామప్రవేదనే' - 'విఘ్నో ఽన్తరాయః ప్రత్యూహా' ఇతి చామరః.

---

ఆధారబన్ధప్రముఖైః ప్రయత్నైః
సంవర్ధితానాం సుతనిర్విశేషం
కచ్చిన్న వాయ్వాది రుపప్లవో వః
శ్రమచ్ఛిదా మాశ్రమపాదపానామ్ ? 6

టీక.—ఆధా...ఖైః—ఆధార = పాదులయొక్క - బన్ధ = కట్టుటయే - ప్రముఖైః = మొదలుగాఁగల, ప్రయత్నైః = ఉపాయములచేత, సుత...షం—సుత = పుత్త్రులకంటె - నిర్విశేషం యథాతథా = విశేషములేనియట్లుగా, సంవర్ధితానాం = పెంపఁబడినవైన, శ్రమచ్ఛిదాం - శ్రమ = అయాసమును - ఛిదాం = పోఁగొట్టునవైన వః=మీయొక్క, ఆశ్ర...నాం - ఆశ్రమ = మునిపల్లెయందలి - పాదపానాం=చెట్లకు వాయ్వాదిః - వాయు = గాలి - ఆదిః = మొదలుగాఁగలయట్టి, ఉపప్లవః = కీడు, న కచ్చిత్ = లేదు గదా.

తా.—పాదులు చేయుట, నీరు పోయుట, లోనగు నుపాయములచే మీబిడ్డల నుంబోలె మీరు పెంచినవై బడలికను పోఁగొట్టునట్టి వయిన మీయాశ్రమవృక్షములకు విసరుగాలి లోనగు నుపద్రవములు ఏమియుఁ లేవు గదా?

వ్యా.—ఆధా రేతి.—ఆధారబన్ధప్రముఖైః ఆలవాల నిర్మాణాదిభిః, ప్రయత్నై రుపాయైః * 'ఆధార ఆలవాలేఽమ్బుబన్ధేఽధికరణేఽపిచే' తి విశ్వః, సుతేభ్యో నిర్గతో విశేషోఽతిశయో యస్మిన్ కర్మణి తత్తథా సుతనిర్విశేషమ్-అవైషమ్యం యథా త థే త్యర్థః, సంవర్ధితానాం, శ్రమచ్ఛిదాం శ్రమాపనోదకానాం, వః యుష్మాకమ్, ఆశ్రమపాదపానాం ఆశ్రమస్థవృక్షాణాం, వాయ్వాదిః అనిగ్రహణా ద్దవానల మత్త గజాదిః, ఉపప్లవః బాధా, న కచ్చిత్ నాస్తి కిమ్.

---

నివర్త్యతే యై ర్నియమాభిషేకో
యేభ్యో నివాపాఞ్జలయః పితౄణాం
తా న్యుఞ్ఛషష్ఠాఙ్కితసైకతాని
శివాని వ స్తీర్థజలాని కచ్చిత్ ? 7

టీక.—యైః = ఏతీర్థజలములచేత, నియ...కః—నియమ = నియమార్థమయిన - అభిషేకః = స్నానము, నిర్వర్త్యతే = నెఱవేర్పఁబడుచున్నదో, యేభ్యః = ఏతీర్థజలములనుండి, (ఉద్ధృత్య = ఎత్తి), పితౄణాం = పితృదేవతలకు, నివా... యః = తర్పణాంజలులు, (నిర్వర్త్యన్తే = నెఱవేర్పఁబడుచున్నవో,) ఉఞ్ఛ...ని— ఉఞ్ఛ = పఱిగధాన్యములయందు - షష్ఠ = ఆఱవపాలిచేత - అఙ్కిత = గురుతులుకల విగాచేయఁబడిన, సైకతాని = ఇసుకదిబ్బలుగలవి, వః = మీయొక్క, తాని తీర్థజలాని= ఆతీర్థజలములు, శివాని కచ్చిత్ = భద్రములు గదా.

తా.—మీకు నిత్యస్నానములకును పితృతర్పణములకును ఉపయోగపడునవియు ఇసుకతిన్నెలయందు మీపఱిగధాన్యముల (ఱేని కో రయిన) యాఱవపాలియొక్క రాసులు గలవియు నగు మీతీర్థోదకములు భద్రములు గదా?

వ్యా.—నిర్వర్త్యత ఇతి.—యైః తీర్థజలైః, నియమాభిషేకః నిత్యస్నానం, నిర్వర్త్యతే నిష్పాద్యతే, యేభ్యః జలేభ్యః - ఉద్ధృత్యేతి శేషః, పితౄణా మగ్ని ష్వా త్తాదీనాం, నివాపాఞ్జలయః తర్పణాఞ్జలయః * 'పితృదానం నివాపః స్యా' ది త్యమరః, నిర్వర్త్యన్తే, ఉఞ్ఛేషు ప్రకీర్ణోద్ధృతధాన్యేషు - ఉఞ్ఛో నామ ప్రకీర్ణానాం ధాన్యానా మేకైకశ ఉద్ధరణం - షష్ఠైః షష్ఠభాగైః - పాలకత్వా ద్రాజగ్రాహ్యైః - అఙ్కితాని - సైకతాని పులినాని - యేషాం తాని తథోక్తాని, వో యుష్మాకం, తాని తీర్థజలాని, శివాని భద్రాణి కచ్చిత్ - అనుపప్లవాని కి మి త్యర్థః * 'ఉఞ్ఛో ధాన్యాంశ కాదానం కణిశాద్యార్జనం శిల మి' తి యాదవః * 'షష్ఠాష్టమాభ్యాం ఞ చే' తి షష్ఠశబ్దా ద్భాగార్థేఽన్ప్రత్యయః - అత ఏవ పూరణార్థత్వాత్ * 'పూరణగుణే' త్యాదినా షష్ఠీసమాసప్రతిషేధః, సికతా ఏషు స న్తీతి సైకతాని * 'సికతా శర్కరాభ్యాం చే' త్యణ్.

---

క్రియానిమిత్తే ష్వపి వత్సలత్వా దభగ్నకామా మ్మునిభిః కుశేషు
తదఙ్కశయ్యాచ్యుతనాభినాళా కచ్చి న్మృగీణా మనఘా ప్రసూతిః ? ౘ

టీక.—క్రియా...పి—క్రియా=అనుష్ఠానములకు, నిమిత్తే ష్వపి = సాధనములయినను, కుశేషు = దర్భలయందు, మునిభిః = ఋషులచేత, వత్సలత్వాత్ = అనురక్తివలన, అభగ్నకామా - అభగ్న = కొట్టఁబడనటువంటి - కామా = ఇచ్ఛగలదియు, తద...ళా—తత్ = ఆఋషులయొక్క - అఙ్క = తొడలనెడి - శయ్యా = పడకలయందు - చ్యుత = ఊడిపడినట్టి - నాభినాళా = బొడ్డుచేరులు గలదియు, (నయిన), మృగీణాం = ఆఁడుజింకలయొక్క, ప్రసూతిః = సంతతి, అనఘా కచ్చిత్ =అపాయము లేనిదై యున్నది గదా.

తా.—అనుష్ఠాన సాధనములయిన దర్భలను మేయుచున్నను ఏ లేడిపిల్లలను ప్రే మాతిశయము చేత నివారింపక, మునీశ్వరులు, వానిబొడ్డు చేరులను పాములు తినకుండుటకై ఆ చేరులు తమంతట వారితొడలపై ఊడిపడునట్లుగా, ఒడులలో పరుండఁబెట్టుకొని పెం తురో, ఆ లేడిపిల్లలకు సేమము గదా?

వ్యా.—క్రి యేతి.—క్రియానిమిత్తేషు అనుష్ఠానసాధనే ష్వపి, కుశేషు, ముని భిః, వత్సలత్వాత్ మృగస్నేహాత్, అభగ్న కామా అప్రతిహతేచ్ఛా, తేషాం మునీనాం అఙ్కా ఏవ శయ్యాః - తాసు చ్యుతాని నాభినాళాని యస్యాః సా తథోక్తా * 'నాళో నాళ మ థాస్త్రియా మి' త్యమరః, మృగీణాం, ప్రసూతిః సంతతిః, అనఘా అవ్య సనా కచ్చిత్ అనపాయినీ కి మిత్యర్థః * 'దుఃఖై నోవ్యసనే ష్వఘ మి'తి యాదవః, తే హి వ్యాళభయా ద్దశరాత్ర మఙ్క ఏవ ధారయన్తి.

---

నీవారపాకాదికడఙ్గరీయై రామృశ్యతే జానపదై ర్న కచ్చిత్,
కాలోపపన్నాతిథికల్ప్యభాగం వన్యం శరీరస్థితిసాధనం వః ? 9

టీక.—కాలో...గం - కాల = తగినకాలములయందు - ఉపపన్న = వచ్చి నట్టి - అతిథి = అభ్యాగతులకు - కల్ప్య = చేయఁదగిన - భాగం - పాల్లుగలదియు, వన్యం = అడవిలోఁబుట్టినదియు, వః=మీకు, శరీ...నం - శరీర = దేహముయొక్క - స్థితి = నిలుకడకు - సాధనం - సాధకమును, (అయిన), నీ...ది - నీవారపాక = ని వ్వరిధాన్యమే - ఆదిః=మొదలుగాఁగలది, జానపదైః = దేశములనుండి వచ్చిన, కడఙ్గరీ యైః = పొల్లుకసవు మేయున వైనవృషభాదులచేత, నామృశ్యతే కచ్చిత్=తాఁకఁబడక యున్నది గదా.

తా.—అడవిలో తనంతటఁ పండి మీ జీవనమునకును మీయిండ్లకు కాలమున వచ్చునట్టి యతిథులకు పెట్టుటకును సాధన మయిన నివ్వరిధాన్యము లోనగుదానిని ఊళ్ల నుండి వృషభాదులు వచ్చి తాఁకుట లేదు గదా?

వ్యా.—నీవా రేతి.—కాలేషు యోగ్యకాలేషు- ఉపపన్నా నామాగ్నతానా - మతిథీనాం - కల్ప్యాః భాగా యస్య తత్తథోక్తం, వనే భవం వన్యం, శరీరస్థితేః జీవ నస్య సాధనం, వః యుష్మాకం పచ్యత ఇతి పాకః ఫలం ధాన్య మితి యావత్ - నీవా రస్య పాకః తృణధాన్యం - తదాది నీవారపాకాది - ఆదిశబ్దా చ్ఛ్యామాకాదిధాన్యం సంగ్రహః, జనపదేభ్య ఆగతైః జానపదైః * 'తత ఆగత' ఇ త్యణ్ప్రత్యయః, కడఙ్గరం బుసమ్ అర్హన్తీతి కడఙ్గరీయాః * 'కడఙ్గర దక్షిణా చ్ఛ చే'తి ఛప్రత్యయః * క

దజ్గరో బుసం క్లీబే ధాన్యత్వచి తుషః పుమా నిత్యమరః - తైర్గోవృషాదిభిః, నామృశ్యతే కచ్చిత్ న స్పృశ్యతే కి మిత్యర్థః.

---

అపి ప్రసన్నేన మహర్షిణా త్వం
సమ్యగ్వినీయానుమతో గృహాయ?
కాలో హ్యయం సంక్రమితుం ద్వితీయం
సర్వోపకారక్షమ మాశ్రమం తే. 10

టీక.—త్వం = నీవు, ప్రసన్నేన = అనుగ్రహవంతుఁడయిన మహర్షిణా = వరతంతుమహర్షిచేత, సమ్యక్ చక్కఁగా, వినీయ = నేర్పఁబడి, గృహాయ = గృహస్థాశ్రమస్వీకారమునకు, అనుమతోఽపి = అంగీకరింపఁబడితివా ఏమి, హి = ఏలయన, తే = నీకు, సర్వో...మం - సర్వ = సమస్తాశ్రమములకును - ఉపకార = ఉపకరించుటయందు - క్షమం = సమర్థమయిన, ద్వితీయమ్ = రెండవదయిన - ఆశ్రమం = ఆశ్రమమును - అనఁగా గార్హస్థ్యమును, సంక్రమితుమ్ - చేరుటకు, అయం = ఇది, కాలః = సమయము.

తా.—నీకు అనుగ్రహపూర్వకముగా వరతంతుమహాముని సకలవిద్యలను చక్కఁగా నేర్పి గృహస్థాశ్రమస్వీకారమునకు అనుజ్ఞ యిచ్చెనా? ఏల యడిగెద ననఁగా—నీకు బ్రహ్మచర్య వానప్రస్థ సన్న్యాసాశ్రమములకు ఉపకారక మయిన గృహస్థాశ్రమమును ప్రవేశించుటకు ఇపుడు కాలము గదా?

వ్యా.—అ పీతి.—కించ - త్వం, ప్రసన్నేన మహర్షిణా, వరతన్తునా, సమ్యగ్, వినీయ శిక్షయిత్వా - విద్యా ముపదిశ్యే త్యర్థః, గృహాయ గృహస్థాశ్రమం ప్రవేష్టుం * 'క్రియార్థోపపద' ఇత్యాదినా చతుర్థీ, అనుమతోఽపి అనుజ్ఞాతః కిం, హి యస్మాత్కారణాత్, తే తవ, సర్వేషా మాశ్రమాణాం బ్రహ్మచారి వానప్రస్థ యతీనామ్ - ఉపకారే-క్షమం శక్తం * 'క్షమం శక్తం హితే త్రి ష్వి'త్యమరః, ద్వితీయమ్ ఆశ్రమం గార్హస్థ్యం, సంక్రమితుం ప్రాప్తుం, అయం, కాలో హి - విద్యాగ్రహణానన్తర్యాత్త స్యేతి భావః * 'కాల సమయ వేలాసు తుము'న్నితి తుమున్ప్రత్యయః' సర్వోపకారక్షమ మి త్యత్ర మనుః -

'యథా మాతర మాశ్రిత్య సర్వే జీవన్తి జన్తవః.
వర్తన్తే గృహిణం తద్వ దాశ్రిత్యేతర ఆశ్రమాః' ఇతి.

---

తవార్హతో నాభిగమేన తృప్తం
మనో నియోగక్రియయోత్సుకం మే.

గురోర్నియోగాత్ ప్రేప్సితం — 

ర్వా ప్యాజ్ఞయా శాసితు రాత్మనా వా
ప్రాప్తోఽసి సంభావయితుం వనా న్మామ్? 11

టీక.—అర్హతః = పూజ్యుఁడవయిన, తవ = నీయొక్క, అభిగమేన = రాక చేత, మే = నాయొక్క, మనః = మనస్సు, తృప్తం = సంతుష్టము, న = కాలేదు, కిం తు = మఱేమనిన, నియోగక్రియయా - నియోగ = ఆజ్ఞయొక్క - క్రియయా = చేఁతయందు, ఉత్సుకం = తమకపడుచున్నది; శాసితుః = గురువుయొక్క, ఆజ్ఞయా అపి = ఆజ్ఞచేతనా, ఆత్మనా వా = నీ సమన్విహముచేతనా, మాం = నన్ను, సంభావయితుం = గౌరవించుటకు, వనాత్ = అడవినుండి, ప్రాప్తః = వచ్చినవాఁడవు, అసి = అగుచున్నావు (అయితివి.)

తా.—పూజ్యుఁడవు నీవు వచ్చినమాత్రాన నాకు సంతుష్టి కాలేదు. నీవు గురునాజ్ఞచే వచ్చితివా? లేక, స్వార్థముగానే వచ్చితివా ? నీవు వచ్చినకార్యమును నెఱవేర్చి కృతార్థుఁడను కాఁగోరుచున్నాను.

వ్యా.—కుశలప్రశ్నం విధాయ ఆగమనప్రశ్నం చికీర్షు రాహ - త వేతి.—అర్హతః పూజ్యస్య ప్రశస్తస్య * 'అర్హః ప్రశంసాయా మి'తి శతృప్రత్యయః, తవ, అభిగమేన ఆగమనమాత్రేణ, మే మమ, మనః, తృప్తం న తుష్టం, కిం తు, నియోగక్రియయా ఆజ్ఞాకరణే, ఉత్సుకమ్ ఉత్కణ్ఠం * 'తత్పరే ప్రసితాసక్తా విష్టార్థోద్యుక్త ఉత్సుక' ఇత్యమరః * 'ప్రసితోత్సుకాభ్యాం తృతీయా చే'తి సప్తమ్యర్థే తృతీయా శాసితు గురోః, ఆజ్ఞయాఽపి ఆజ్ఞయా వా, ఆత్మనా వా స్వతో వా * 'ప్రకృత్యాదిభ్య ఉపసంఖ్యాన మి'తి తృతీయా, మాం, సంభావయితుం బహు కర్తుం, వనాత్ప్రాప్తోఽసి; గుర్వర్థం వా స్వార్థం వా త్వదాగమన మి త్యర్థః.

---

ఇ త్యర్ఘ్యపాత్రానుమితవ్యయస్య
రఘో రుదారా మపి గాం నిశమ్య
స్వార్థోపపత్తిం ప్రతి దుర్బలాశ
స్త మి త్యవోచ ద్వరతన్తుశిష్యః. 12

టీక.—అర్ఘ...స్య - అర్ఘ్యపాత్ర=అర్ఘ్యమ (ము ఇచ్చినమట్టి) పాత్రము చేత - అనుమిత = ఊహింపఁబడిన - వ్యయస్య = సర్వధనత్యాగముగలిగిన, రఘోః = రఘుమహారాజుయొక్క, ఇతి = పూర్వోక్త మయిన, గాం = వాక్కును, ఉదారామపి = ఔదార్యముతోఁ గూడుకొన్నదానినే అయినను, నిశమ్య=విని, వరతన్తుశిష్యః= వరతంతుమునియొక్కశిష్యుఁడు (కౌత్సముని), స్వార్థోపపత్తిం ప్రతి - స్వార్థ = తన ప్ర,

యోజనముయొక్క - ఉపప త్తిం ప్రతి = సిద్ధిని గూర్చి, దుర్బలాశః సన్ - దుర్బల = మందమయిన - ఆశః సన్ = కోరికకలవాఁడై, తం = ఆరఘుమహారాజునుగూర్చి, ఇతి = ఈచెప్పఁబోవు ప్రకారిముగా, అవోచత్ = పలికెను.

తా.—కౌత్సముని 'నీ వచ్చినకార్యమును నెఱవేర్పం గుతూహలపడుచున్నాను,' అని ఔదార్యపూర్వకముగానే రఘుమహారాజు పలికినమాటను వినియు, తనకు అర్ఘ్యమిచ్చిన మట్టిపాత్రవలన రాజు సర్వస్వత్యాగముచే రిక్తుఁడై యున్నాఁ డని యూహించుకొని తనకార్యము నెఱవేఱు నను నాస యుడిగి, రాజున కిట్లు ఉత్తరము చెప్పెను.

వ్యా.—ఇ తీతి.—అర్ఘ్యపాత్రేణ మృణ్మయపాత్రేణ - అనుమితః - వ్యయః సర్వస్వత్యాగో - యస్యతస్య రఘోః, ఇతి ఉక్తప్రకారామ్, ఉదారామ్ ఔదార్యయుక్తా మపి, గాం వాచం 'మనో నియోగక్రియ యోత్సుకం మే' ఇ త్యేవంరూపాం * 'స్వర్గేషు పశు వా గ్వజ్ర ది జ్నేత్ర ఘృణి భూ జలే, లక్ష్యదృష్ట్యా స్త్రియాం పుంసి గౌ రి' త్యమరః, నిశమ్య శ్రుత్వా, వరతన్తు శిష్యః కౌత్సః, స్వార్థోపపత్తిం స్వకార్య సిద్ధిం ప్రతి, దుర్బలాశః సన్ మృణ్మయపాత్రదర్శనాత్ శిథిలమనోరథః సన్, తం రఘుం, ఇతి వక్ష్యమాణప్రకారేణ, ఆవోచత్ ఉక్తవాన్.

సర్వత్ర నో వా ర్త మవేహి రాజన్,
నాథే కుత స్త్వ య్యశుభం ప్రజానామ్?
సూ ర్యే తప త్యావరణాయ దృష్టేః
క ల్పేత లోకస్య కథం తమిస్రా? 13

టీక.—హే రాజన్=ఓరాజా, సర్వత్ర = అన్నిటను, నః = మాకు, వార్తం= స్వాస్థ్యమును, అవేహి = ఎఱుఁగుము. త్వయి = నీవు, నాథే సతి = పాలకుఁడవై యుండఁగా, ప్రజానాం = జనులకు, అశుభం = కీడు, కుతః = ఎక్కడిది, (తథాహి= అది సరియే), సూర్యే = సూర్యుఁడు, తపతి సతి = వెలుఁగుచుండఁగా, తమిస్రా = చీఁకటిమొత్తము, లోకస్య = జనముయొక్క, దృష్టేః = చూపుయొక్క, ఆవరణాయ = అడ్డుగమ్ముటకు, కథం = ఎట్లు, కల్పేత = సమర్థ మగును.

తా.—ఓరాజా, సూర్యుఁడు వెలుగుచుండఁగా జనముయొక్కచూపును చీఁకటిమొత్తము ఎట్లు ఆవరింపఁజాలదో, అట్లే నీవు ఏలుచుండఁగా మాకు ఎట్టికీడును లేదు, అన్ని విషయములను సేమమే కలదు.

వ్యా.—సర్వ త్రేతి.—హేరాజన్, సర్వత్ర, నః అస్మాకం, వార్తం స్వాస్థ్యమవేహి *'వార్తం ఫల్గు న్యరోగే చే' త్యమరః * 'వార్తం పాటవ మారోగ్యం భవ్యం

స్వాస్థ్య మనామయ మి'తి యాదవః, న చైత దాశ్చర్య మి త్యత ఆహ.—నాథ ఇతి.— త్వయి, నాథే ఈశ్వరే సతి, ప్రజానా, మశుభం దుఃఖం, కుతః, తథా హి అర్థాన్తరం న్యస్యతి సూర్య ఇ త్యాదినా - సూర్యే, తపతి ప్రకాశమానే సతి, తమిస్రా తమ స్తతిః * 'తమిస్రం తిమిరం రోగే తమిస్రా తు తమ స్తతౌ, కృష్ణపక్షనిశాయాం చేతి విశ్వః, లోకస్య జనస్య * 'లోక స్తు భువనే జన ఇ' త్యమరః, దృష్టే, రావరణాయ ఆవరణం కర్తుం, కథం కల్పేత సంపద్యేత - న కల్పే తే త్యర్థః - దృష్టి మావరీతుం నాల మి త్యర్థః * కృపే రలమర్థత్వా త్తద్యోగే * 'నమస్స్వస్తీ' త్యాదినా చతుర్థీ * 'అల మితి పర్యాప్త్యర్థ గ్రహణ మి'తి భగవాన్ భాష్యకారః * 'క్లృపి సంపద్యమానే చతుర్థీ'తి వక్తవ్యాత్.

---

భక్తిః ప్రతీక్ష్యేషు కులోచితా తే,
పూర్వాన్ మహాభాగ తయాఽతిశేషే,
వ్యతీతకాల స్త్వహ మభ్యుపేత
స్త్వామర్థిభావా దితి మే విషాదః. 14

టీక —ప్రతీక్ష్యేషు = పూజ్యులయందు, భక్తిః = గౌరవము, తే=నీయొక్క - కులోచితా - కుల = వంశము చేత - ఉచితా = అభ్యసింపఁబడినది, హే మహాభాగ = ఓయి సార్వభౌముఁడా, తయా = ఆభక్తిచేత, పూర్వాన్ = ముందుండినవారిని, అతిశేషే = మించుచున్నావు; కింతు = మఱేమనిన, అహం = నేను, వ్యతీతకాలః సన్ - వ్యతీత = కడచిన - కాలః సన్ - సమయముకలవాఁడ నై, అర్థిభావాత్ = యాచకత్వమువలన, త్వామ్=నిన్ను, అభ్యుపేతః = చేరితిని, ఇతి = ఇట్లని, మే=నాకు, విషాదః = క్లేశము.

తా.—ఓసార్వభౌముఁడా, పూజ్యులయెడ భక్తి మీకులమందు అభ్యస్తమై యున్నది. ఆవిషయములో నీవు మీపూర్వులను మించినవాఁడవు. కాని, నేను సమయము మించినపిమ్మట నిన్ను యాచింప వచ్చితి నని చింతించుచున్నాను.

వ్యా.—'క వా హేతు' ఇత్యాదినా య దుక్తం త న్న చిత్ర మి త్యాహ-భక్తి రితి.—ప్రతీక్ష్యేషు పూజ్యేషు * 'పూజ్యః ప్రతీక్ష్య' ఇ త్యమరః, భక్తి రనురాగవిశేషః, తే తవ, కులోచితా కులాభ్యస్తా*'అభ్యస్తేఽ ప్యుచితం న్యాయ్య మి'తి యాదవః, హే మహాభాగ సార్వభౌమ, తయా భక్త్యా, పూర్వాన్, అతిశేషే అతివర్తసే; కిం తు సర్వత్ర వార్తాంచేత్ తర్హి ఖిన్న ఇవ దృశ్యసే అత ఆహ-వ్యతీ తేతి.—అహం వ్యతీతకాలః అతిక్రాన్తకాలః సన్, అర్థిభావాత్ యాచకత్వాత్, త్వామ్, అభ్యుపేతః ప్రాప్తవా నస్మి, ఇతి, మే, విషాదః క్లేశః.

---

శరీరమాత్రేణ నరేన్ద్ర తిష్ఠన్నాభాసి తీర్థప్రతిపాదితర్ద్ధిః
ఆరణ్యకోపాత్తఫలప్రసూతిః స్తమ్బేన నీవార ఇవావశిష్టః. 15

టీక.—హేనరేన్ద్ర = ఓరాజా, తీర్థ...ర్ధిః - తీర్థ = సత్పాత్రమందు - ప్రతిపాదిత = ఈఁబడిన - ఋద్ధిః సన్ = సంపద గల్గిన, త్వం = నీవు, శరీరమాత్రేణ = దేహముతో మాత్రము, తిష్ఠన్ = నిలిచినవాఁడవై, ఆరణ్య...తిః - ఆరణ్యక = అడవిలోనిమున్యాదుల చేత - ఉపాత్త = కైకొనఁబడిన - ఫల = ఫలమనెడు - ప్రసూతిః = సంతతిగలిగినట్టి, స్తమ్బేన = కాఁడచేత, అవశిష్టః = మిగిలిన, నీవార ఇవ = నివ్వరిసస్యమువలె, ఆభాసి = ప్రకాశించుచున్నావు.

తా.—ఓమహారాజా, సత్పాత్రములకు నీధనమెల్ల నొసంగి దేహము మాత్రము మిగిలినవాఁడవై అడవిలో మునిప్రభృతులు ఫలమును గ్రహింపఁగా పట్టి దంటుమాత్రము మిగిలియున్న నివ్వరిసస్యమువలె ప్రకాశిఁచుచున్నావు.

వ్యా.—శరీ రేతి.—హే నరేన్ద్ర, తీర్థే సత్పాత్రే, ప్రతిపాదితా దత్తా - ఋద్ధిః సమృద్ధి - ర్యేన స తథోక్తః సన్-

'యోనౌ జలావతారే చ మన్త్ర్యాద్యష్టాదశ స్వపి
పుణ్యక్షేత్రే తథా పాత్రే తీర్థం స్యాద్దర్శనే ష్వపి.'

ఇతి హలాయుధః, శరీరమాత్రేణ, తిష్ఠన్, ఆరణ్యకాః ఆరణ్యే భవాః మనుష్యాః ముని ప్రముఖాః * 'అరణ్యాన్మనుష్యే' ఇతి వుఞ్ ప్రత్యయః - తైరుపాత్తా - ఫల మేవ ప్రసూతి ర్యస్య సః, స్తమ్బేన కాణ్డేన, అవశిష్టః * ప్రకృత్యాదిత్వాత్ తృతీయా, నీవార ఇవ, ఆభాసి శోభసే ప్రకాశస ఇత్యర్థః.

---

స్థానే భవా నేకనరాధిపః స
న్నకిఞ్చనత్వం మఖజం వ్యనక్తి,
పర్యాయపీతస్య సురైర్హిమాంశోః
కలాక్షయః శ్లాఘ్యతరో హి వృద్ధేః. R - C 16

టీక.—భవాన్ = నీవు, ఏకనరాధిపః సన్ = సార్వభౌముఁడవై, మఖజం = యజ్ఞమువలనఁగలిగిన, అకిఞ్చనత్వం = రిక్తత్వమును, వ్యనక్తి = వెల్లడించుచున్నావు, స్థానే = యుక్తము, తథా హి=అది సరియే, సురైః = వేల్పులచేత, పర్యాయ పీతస్య - పర్యాయ = వరుసగా - పీతస్య = త్రాగఁబడిన, హిమాంశోః = చంద్రునియొక్క, కలాక్షయః - కళ = కళలయొక్క - క్షయః = తఱుగుట:, వృద్ధేః — పెరుఁగుటకంటె, శ్లాఘ్యతరః = ఎక్కువ పొగడఁదగినది.

తా.—నీవు సర్వభూమికిని ఈశ్వరుఁడ వయ్యును యజ్ఞమువలన పేదఱికము నొంది యుండుట యుక్తమే. వేల్పులు వరుసగా త్రాగుటచేత చంద్రునికి కళలు తఱుగుట పెరుఁగుటకన్న శోభించును గదా.

వ్యా.—స్థాన ఇతి.—భవాన్, ఏకనరాధిపః సన్ సార్వభౌమః సన్, మఖజం యజ్ఞ జన్యం, న విద్యతే కించన యస్య సోఽకించనః దరిద్రః - తస్య భావ స్తత్త్వమ్ అకించనత్వం నిర్ధనత్వం, వ్యనక్తి ప్రకటయతి, తత్ప్రకటనం స్థానే యుక్తం* 'యుక్తే ద్వే సాంప్రతం స్థాన' ఇ త్యమరః; తథాహి - సురైః దేవైః,పర్యాయేణ * 'ప్రథమాం పిబతే వహ్ని ద్వితీయాం పిబతే రవి రితి సోమోత్పత్తివిహితక్రమే ణే త్యర్థః - పీతస్య, హిమాంశో శ్చన్ద్రమసః * 'హిమాంశు శ్చన్ద్రమా శ్చన్ద్ర' ఇ త్యమరః, కళా క్షయః, వృద్ధేః ఉపచయాత్, శ్లాఘ్యతరో హి పరః ఖలు * 'తనిమ్నా శోభన్తే గలిత విభవా శ్చార్థిషు నృపాః' ఇతి న్యాయా దితి భావః, అత్ర కామన్దకః -

'ధర్మార్థం క్షీణకోశస్య క్షీణత్వ మపి శోభతే
సురైః పీతావశేషస్య కృష్ణపక్షే విధో రివ.' ఇతి.

త దన్యత స్తావ దనన్యకార్యో
గుర్వర్థ మాహర్తు మహం యతిష్యే;
స్వ స్త్యస్తు తే; నిర్గళితామ్బుగర్భం
శరద్ఘనం నార్దతి చాతకోఽపి 17

టీక.—తత్ = కావున, అనన్యకార్యః = వేఱు ప్రయోజనము లేనివాఁడ నయిన, అహం = నేను, అన్యత స్తావత్ = మఱియొకరివలననే, గుర్వర్థం = గురుధనమును, ఆహ ర్తుం = సంపాదించుటకు, యతిష్యే = యత్నించెదను, తే = నీకు, స్వస్తి = మేలు, అస్తు = అగుగాక, తథాహి = అట్లేగదా, చాతకోఽపి = వానకోయిలయు, నిర్గ... ర్భం - నిర్గళిత = నిశ్శేషముగా కురిసిన - అమ్బు = ఉదకమే - గర్భం = కడుపులో కలిగిన, శరద్ఘనం = శరత్కాలమేఘమును, నార్దతి = యాచింపదు.

తా.—కావున గురుధనము నార్జించుటకన్న వేఱు ప్రయోజనము లేని నేను మఱి యొకదాతవలననే గురుధనమును సంపాదించుకొనియెదను; నీకు మేలు కలుగునుగాక. జలము నెల్ల కురిసి పట్టికడుపుగా నున్న శరత్కాలమేఘమును మేఘైకశరణ మగువాన కోయిల నయితము యాచింపదు గదా.

వ్యా.—త దితి.—త త్తస్మా త్కారణాత్, అనన్యకార్యః ప్రయోజనాన్తర రహితః, అహం, మన్యత స్తావత్ పదాన్యాన్తరా దేవ * 'యావ త్తావ చ్చ సాకల్యే

వధా మానే పఒధారణ' ఇ త్యమరః, గుర్వర్థం గురుధనమ్, ఆహర్తుమ్ ఆర్జితుం, యతిష్యే ఉద్యోక్ష్యే, తే తుభ్యం-స్వస్తి శుభమ్ - అస్తు * 'నమః స్వస్తీ' త్యాదినా చతుర్థీ; తథా హి - చాతకోఒపి * 'ధరణీపతితం తోయం చాతకానాం రుజాకరమ్' ఇతి హేతోః అనన్యగతికోఒపి త్రిదశః, నిగళితమ్ అమ్బ్వేవ గర్భే యస్య తం, శరద్ఘనం శరన్మేఘం, నార్దతి న యాచతే * 'అర్ద గతౌ యాచనే చే'తి ధాతుః * 'యాచనార్థే రణేఒర్దన మి' తి యాదవః.

---

ఏతావ దుక్త్వా ప్రతియాతు కామం
శిష్యం మహర్షే ర్నృపతి ర్నిషిధ్య
'కిం వస్తు విద్వ న్గురవే ప్రదేయం
త్వయా? కియ ద్వే'తి త మన్వయుఙ్క్త. 18

టీక.—ఏతావత్ = ఇంతమాత్రము, ఉక్త్వా = పలికి, ప్రతియాతుకామం = మరలిపోవుటకు ఇచ్ఛగలవానిని, మహర్షేః - వరతంతుఋషికి, శిష్యం = శిష్యుఁడైనకౌత్సఋషిని, నృపతిః = రాజు, నిషిధ్య = ఆఁపి, హే విద్వన్ = ఓవిద్వాంసుఁడా, త్వయా = నీచేత, గురవే = ఒజ్జకు, ప్రదేయం = ఈఁబడవలసిన, వస్తు = ద్రవ్యము, కిం = ఏమి, కియ ద్వా = ఎంతపాటిది, ఇతి = ఇట్లని, తం = ఆకౌత్సఋషిని, అన్వయుఙ్క్త = ప్రశ్నించెను.

తా.—ఇంతమాత్రము చెప్పి వెడలిపో నున్న యా కౌత్సమునిని రఘుమహారాజు ఆఁపి, 'ఓ విద్వాంసుఁడా, నీవు గురువునకు ఈవలసిన ద్రవ్యము ఏమి? అదియు ఏపాటి?' అని యడిగెను.

వ్యా.—ఏతావ దితి.—ఏతావత్ ఏతావన్మాత్రం వాక్యమ్, ఉక్త్వా, ప్రతియాతుం కామో యస్య తం ప్రతియాతుకామం * 'తుం కామ మనసో ర పీ' తి మకారలోపః, మహర్షేః వరతన్తోః, శిష్యం కౌత్సం, నృపతిః రఘుః, నిషిధ్య నివార్య, హే విద్వన్, త్వయా గురవే ప్రదేయం వస్తు, కిం కిమాత్మకం, కియత్ కింపరిమాణకం వా, ఇతి ఏవం, తం కౌత్సమ్, అన్వయుఙ్క్త అపృచ్ఛత్ * 'ప్రశ్నోఒనుయోగః పృచ్ఛా చే' త్యమరః.

---

తతో యథావ ద్విహితాధ్వరాయ
తస్మై స్మయావేశ వివర్జితాయ

వర్ణాశ్రమాణాం గురవే స వర్ణీ
విచక్షణః ప్రస్తుత మాచచక్షే. 19

టీక.— తతః = తర్వాత, యథా...య—యథావత్ = యథార్థముగా - విహిత = చేయఁబడిన - అధ్వరాయ=యజ్ఞముకలవాఁడును, స్మయా...య—స్మయ= గర్వముయొక్క - ఆవేశ = పట్టుటచేత - వివర్జితాయ=రహితుఁడును, వర్ణాశ్రమాణాం- వర్ణ = బ్రాహ్మణాదివర్ణములకును - ఆశ్రమాణాం = బ్రహ్మచర్యాద్యాశ్రమములకును- గురవే = నియామకుఁడును, (అయిన), తస్మై = ఆరఘుమహారాజునకు, విచక్షణః = విద్వాంసుఁడును, వర్ణీ = బ్రహ్మచారియు, (అయిన), సః = ఆకౌత్సఋషి, ప్రస్తుతమ్= ప్రకృతమును, ఆచచక్షే = చెప్పెను.

తా.—అంతట—యథార్థముగా యాగముచేసినవాఁడును గర్వరహితుఁడును వర్ణాశ్రమ ధర్మపరిపాలకుఁడును అయిన యారఘుమహారాజుతో విద్వాంసుఁడును బ్రహ్మచారియు నయిన యా కౌత్సముని యిట్లు ప్రకృతమును వక్కాణించెను.

వ్యా.—తత ఇతి.—తతః అనన్తరం, యథావత్ యథార్హం*అర్హార్థే వతి ప్రత్యయః - విహితాధ్వరాయ విధివ దనుష్ఠిత యజ్ఞాయ - సదాచారా యే త్యర్థః, స్మయావేశవివర్జితాయ గర్వాభినివేశశూన్యాయ - అనుద్ధతా యే త్యర్థః, వర్ణానాం బ్రాహ్మణాదీనామ్ - ఆశ్రమాణాం బ్రహ్మచర్యాదీనాం చ, గురవే నియామకాయ * 'వర్ణాః స్యు ర్బ్రాహ్మణాదయ ఇ' త్యమరః * 'బ్రహ్మచారీ గృహీ వానప్రస్థో భిక్షు శ్చతుష్టయే ఆశ్రమో ఽస్త్రీ' త్యమరః - వర్ణాశ్రమాణాం సర్వకార్యనిర్వాహకా యే త్యర్థః, తస్మై రఘవే, విచక్షణః విద్వాన్, వర్ణీ బ్రహ్మచారీ *'వర్ణినో బ్రహ్మచారిణ' ఇ త్యమరః * 'వర్ణా ద్బ్రహ్మచారి ణి' తి ఇనిప్రత్యయః, స కౌత్సః, ప్రస్తుతం ప్రకృతమ్, ఆచచక్షే కథయామాస.

సమాప్తవిద్యేన మయా మహర్షి
ర్విజ్ఞాపితో ఽభూ ద్గురుదక్షిణాయై,
స మే చిరా యాస్ఖలితోపచారాం
తాం భక్తి మే వాగణయత్ పురస్తాత్. 20

టీక.—సమాప్తవిద్యేన - సమాప్త = ముగింపఁబడిన - విద్యేన = విద్యలుగల, మయా = నాచేత, మహర్షిః = వరతంతుఋషి, గురుదక్షిణాయై = గురుదక్షిణను స్వీకరించుటకు, విజ్ఞాపితః = విన్నవింపఁబడినవాఁడు, అభూత్ = ఆయెను, సః = ఆయన, చిరాయ = బహుకాలమునుండి, అస్ఖ...రాం—అస్ఖలిత = పొరఁబాటులేని -

ఉపచారాం = సేవగల, మే = నాయొక్క, తాం = ఆ, భక్తిమేవ = భక్తినే, పురస్తాత్ = మొదట, అగణయత్ = గణించెను.

తా.—మహర్షి నాకు పదునాలుగు విద్యలును నేర్పి ముగించినంతట నేను ఆయనను నావలన గురుదక్షిణ యేమేని స్వీకరింపు మని వేడుకొంటిని. ఆయనయు నాయొక్క యఖండితభక్తిచేతనే తనకు గురుదక్షిణ యైన దనియు, వేఱు గురుదక్షిణ ఈ నక్కఱ లే దనియు వక్కాణించెను.

వ్యా.—సమాప్తేతి.—సమాప్తవిద్యేన మయా, మహర్షిః గురుదక్షిణాయై గురుదక్షిణాస్వీకారార్థం, విజ్ఞాపితోఽభూత్, స చ గురు, శ్చిరాయ చిరాత్, అస్ఖలితోపచారాం తాం దుష్కరాం మే భక్తి మేవ, పురస్తాత్ప్రథమమ్, అగణయత్ సంఖ్యాతవాన్, భక్త్యైవ సంతుష్టః కిం దక్షిణ యే త్యుక్తవా నిత్యర్థః - అథవా భక్తి మేవ తాం దక్షిణామ్ అగణయ దితి యోజ్యమ్.

---

నిర్బన్ధసంజాతరుషాఽర్థకార్శ్య
మచిన్తయిత్వా గురుణాఽహ ముక్తః
విత్తస్య విద్యాపరిసంఖ్యయా మే
కోటీశ్చతస్రో దశ చాహరేతి. 21

టీక.—నిర్బ...షా—నిర్బన్ధ = బలవంతపెట్టుటచేత - సంజాత = పుట్టిన - రుషా = కోపముగలిగిన, గురుణా = ఒజ్జచేత, అర్థకార్శ్యమ్ - అర్థ = ధనము యొక్క - కార్శ్యమ్ = పేదఱికమును, అచిన్తయిత్వా = తలంపకయే, అహం = నేను, విత్తస్య = ధనముయొక్క, చతస్రః = నాలుగును, దశ చ = పదియును, కోటీః = కోట్లను, మే = నాకొఱకు, ఆహర = తెమ్ము, ఇతి = ఇట్లని, విద్యా...యా—విద్యా= (పదునాలుగు) విద్యలయొక్క - పరిసంఖ్యయా = లెక్కప్రకారము, ఉక్తః = చెప్పఁబడితిని.

తా.—నేను తనమాటను వినక బలవంతపెట్టఁగా గురువు కోపగించి నాకు ధనము లేమిని ఆలోచింపక తాను నేర్పినవిద్యల లెక్కకు సరిగా పదునాలుగు కోట్ల ధనమును తనకు తెచ్చి యీవలసిన దని యాజ్ఞాపించెను.

వ్యా.—నిర్బన్ధేతి.—నిర్బన్ధేన ప్రార్థనాతిశయేన - సంజాతరుషా సంజాతక్రోధేన, గురుణా వరతన్తునా, అర్థకార్శ్య మర్థదారిద్ర్యమ్, అచిన్తయిత్వా అవిచార్య, అహం, విత్తస్య ధనస్య, చతస్రః దశ కోటీః చతుర్దశ కోటీః, మే మహ్యం, మామాహర ఆనయ, ఇతి, విద్యాపరిసంఖ్యయా విద్యాసంఖ్యానుసారేణైవ, ఉక్తః -

'అఙ్గాని వేదా శ్చత్వారో మీమాంసా న్యాయవిస్తరః
పురాణం ధర్మశాస్త్రం చ విద్యా హ్యేతా శ్చతుర్దశే'తి.

---

సోఽహం సపర్యావిధిభాజనేన మత్వా భవన్తం ప్రభుశబ్దశేషమ్ [22
అభ్యుత్సహే సంప్రతినోపరోద్ధు మల్పేతరత్వాచ్ఛ్రుతనిష్క్రియస్య.

టీక.—సోఽహం = ఆనేను, సప...న - సపర్యా = పూజయొక్క - విధి= చేతయొక్క - భాజనేన = పాత్రముచేత, భవన్తం = నిన్ను, ప్రభుశబ్దశేషం - ప్రభు శబ్ద = దొరయనుపేరుమాత్రమే - శేషం = మిగులుగాఁగలవానినిగా, మత్వా = తెలిసి కొని, శ్రుత నిష్క్రియస్య - శ్రుత = విద్యయొక్క - నిష్క్రియస్య = మూల్యము యొక్క, అల్పేతరత్వాత్ = మిక్కిలి గొప్ప దగుటవలన, సంప్రతి = ఇప్పుడు, ఉప రోద్ధుం = ఇబ్బంది పెట్టుటకు, నాభ్యుత్సహే = కోరను.

తా.—అట్లు వచ్చిన నేను నీవు అర్ఘ్య మిచ్చిన మట్టిపాత్రముచేతనే నీ విపుడు ధన మెల్ల వ్యయించి దొర యను పేరుమాత్రము శేషముగా నున్నా వని తెలిసికొంటిని. కాన నిపుడు నిన్ను ఇబ్బంది పెట్టుట నామతము గాదు, ఏలన నాకు కావలసిన గురు దక్షిణ మిక్కిలి గొప్ప మొత్తముగా నున్నది.

వ్యా.—సోఽహ మితి.—సోఽహం, సపర్యావిధిభాజనేన అర్ఘ్యపాత్రేణ, భవన్తం, ప్రభుశబ్దమాత్ర మేవ శేషో యస్య తం మత్వా - నిస్వం నిశ్చిత్యే త్యర్థః, శ్రుతనిష్క్రియస్య విద్యామూల్యస్య, అల్పేతరత్వా దతిమహత్త్వాత్, సంప్రతి, ఉపరో ద్ధుం నిర్బన్ధుం, నాభ్యుత్సహే న సోఢవా నస్మి.

---

ఇత్థం ద్విజేన ద్విజరాజకాన్తి రావేదితో వేదవిదాం వరేణ
ఏనోనివృత్తేన్ద్రియవృత్తి రేనం జగాద భూయో జగదేకనాథః.

టీక.—ద్విజ...న్తిః - ద్విజరాజ= చంద్రునియొక్క - కాన్తిః = కాంతివంటి కాంతిగలవాఁడును, ఏనో...త్తిః - ఏనః = పాపమునుండి - నివృత్త = మరలిన - ఇన్ద్రియ=ఇంద్రియములయొక్క - వృత్తిః = వ్యాపారముగలవాఁడును, జగదేకనాథః - జగత్ = లోకమునకు - ఏకనాథః = ఒకఁడే ప్రభువును, (అయిన రఘుమహారాజు), వేదవిదాం = వేదవేత్తలలోపల, వరేణ = శ్రేష్ఠుఁడయిన, ద్విజేన = ఆబ్రాహ్మణుని చేత, ఇత్థం = ఇట్లు, ఆవేదితః సన్ = ఎఱిఁగింపఁబడినవాఁడై, ఏనం = ఈకౌత్స ఋషితో, భూయః = మరల, జగాద = పలికెను.

తా.—ఈప్రకారము వేదవేత్తలలో శ్రేష్ఠుఁడయిన యాకౌత్సమునిఁ ఎఱిఁగింపఁగా, బ్రాహ్మణులకు రాజగుచంద్రునికాంతివంటి కాంతి గలవాఁడును, పాపమునం జొరని

యింద్రియవ్యాపారము కలవాఁడును, లోకమునకెల్ల నేకచ్ఛత్రాధిపతియును, అగు రఘు మహారాజు వెండియు నిట్లు వాక్రుచ్చెను.

వ్యా.—ఇత్థ మితి.—ద్విజరాజకాన్తి శ్చన్ద్రకాన్తిః * 'ద్విజరాజః శశధరో నక్షత్రేశ' ఇ త్యమరః, * 'తస్మా త్సోమరాజానో బ్రాహ్మణాః సోమోఽస్మాకం బ్రాహ్మణానాగ్ం రా జే'తి శ్రుతేః, ఏనసః పాపాత్ - నివృత్తా ఇన్ద్రియవృత్తి ర్యస్య సః, జగదేక నాథః రఘుః, వేదవిదాం-వరేణ శ్రేష్ఠేన, ద్విజేన కౌత్సేన, ఇత్థ, మావేదితః నివేదితః సన్, ఏవం కౌత్సం, భూయః పునః, జగాద.

గుర్వర్థ మర్థీ శ్రుతపారదృశ్వా
రఘోః సకాశా దనవాప్య కామం,
గతో వదాన్యాన్తర మి త్యయం మే
మాభూ త్పరీవాదనవావతారః. 24

టీక.—శ్రు...శ్వా - శ్రుత = శాస్త్రముయొక్క - పార = తుదను-దృశ్వా= చూచినవాఁడు, గుర్వర్థం = గురువుకొఱకు, అర్థీ = యాచించువాఁడు, రఘోః = రఘువుయొక్క, సకాశాత్ = సమీపమునందుండి, కామం = కోరినయర్థమును, అనవాప్య = పొందక, వదాన్యాన్తరం = మఱియొకదాతకడకు, గతః = పోయెను, ఇతి = ఇట్లని, అయం = ఈ, పరీ...రః - పరీవాద = నిందయొక్క - నవ = క్రొత్త యిన - అవతారః = పుట్టుక - మే = నాకు, మాభూత్ = లేకుండుత.

తా.—గురుదక్షిణ యాచింపవచ్చినవాఁడు సకల శాస్త్రపారగుఁడు రఘువువలన తన కోరినయర్థమును పొందక, వేఱొక దాతకడకు పోయె ననెడి యపవాద ఇంతకుముం దెన్నఁడును లేనిది నాకు కలుగ కుండుఁ గావుత.

వ్యా.—గుర్వర్థ మితి.—శ్రుతస్య శాస్త్రస్య - పారమ్ అన్తం - దృష్టవాన్ శ్రుతపారదృశ్వా * దృశేః క్వనిప్ ప్రత్యయః, గురవే గుర్వర్థం - గురుదక్షిణార్థమ్, అర్థీ యాచకః, విశేషణద్వయే నాపి అస్య, అప్రత్యాఖ్యేయత్వ మాహ, రఘోః సకాశాత్, కామం, మనోరథ, మనవాప్య అప్రాప్య, వదాన్యాన్తరం దాత్రన్తరం, గతః, * 'స్యు ర్వదాన్య స్థూలలక్ష దానశౌణ్డా బహుప్రదే' ఇత్యమరః, ఇ త్యేవంరూపస్య, పరీవాదస్య అపవాదస్య, నవో నూతనః - అవతారః ఆవిర్భావః, మే, మాభూత్ మాస్తు ; రఘో రితి స్వ నామగ్రహణం సంభావితత్వద్యోతనార్థం - తథా చ * 'సంభావితస్య చాకీర్తి ర్మరణా దతిరిచ్యతే' ఇతి భావః.

స త్వం ప్రశస్తే మహితే మదీయే
వసంశ్చతుర్థోఽగ్నిరివాగ్న్యగారే
ద్విత్రాణ్యహాన్యర్హసి సోఢుమర్హన్
యావద్యతే సాధయితుం త్వదర్థమ్. 25

టీక.—సః = అట్టి, త్వం = నీవు, మహితే = పూజితమును, ప్రశస్తే = ప్రసిద్ధమును, (అయిన), మదీయే=నాదైన, అగ్న్యగారే - అగ్ని=త్రేతాగ్నులయొక్క- అగారే = శాలయందు, చతుర్థః = నాలుగవ, అగ్ని రివ = యజ్ఞేశ్వరునివలె, వసన్ = ఉండి, ద్విత్రాణి = రెండుమూఁడు, అహాని = దినములు, సోఢుం = ఓర్చుటకు, అర్హసి = తగుదువు, హే అర్హన్ = ఓయిపూజ్యుఁడా, త్వదర్థం=త్వత్= నీయొక్క - అర్థం = ప్రయోజనమును, సాధయితుం = నెఱవేర్చుటకు, యావత్ యతే = యత్నము చేసెదను.

తా.—మహనీయుఁడవు నీవు పూజితమును ప్రఖ్యాతమును అయిన నా యగ్నిశాలలో త్రేతాగ్నులతో నాలుగవయగ్నివిగా వసించుచు, రెండుమూఁడు దినములు ఓర్వుము. అంతలో నీకార్యమును నేను సాధించెదను.

వ్యా.—స ఇతి.—సః, త్వం, మహితే పూజితే, ప్రశస్తే ప్రసిద్ధే, మదీయే మత్సంబన్ధిని, అగ్న్యగారే త్రేతాగ్నిశాలాయాం, చతుర్థోఽగ్నిరివ, వసన్, ద్విత్రాణి ద్వే త్రీణి వా, అహాని దినాని * 'సంఖ్యావ్యయే'త్యాదినా బహువ్రీహిః * 'బహువ్రీహౌ సంఖ్యేయే డ జబహుగణా ది'తి డచ్ప్రత్యయః, సోఢు మర్హసి. హే అర్హన్ మాన్య, త్వదర్థం తవ ప్రయోజనం, సాధయితుం, యావద్యతే యతిష్యే * 'యావత్పురా నిపాతయో ర్లట్' ఇతి భవిష్యదర్థే లట్.

తథేతి తస్యావితథం ప్రతీతః
ప్రత్యగ్రహీత్ సంగరమగ్రజన్మా
గామాత్తసారాం రఘురప్యవేక్ష్య
నిష్క్రష్టుమర్థం చకమే కుబేరాత్. 26

టీక.—అగ్రజన్మా = (ఆ)బ్రాహ్మణుఁడు (కౌత్సుఁడు). ప్రతీతః సన్=ప్రీతుఁడై, తస్య = ఆరఘుమహారాజుయొక్క, అవితథం = వమ్ముగాని, సంగరం = ప్రతిజ్ఞను, తథేతి = వల్లెయని, ప్రత్యగ్రహీత్ = అంగీకరించెను, రఘు రపి = రఘుమహారాజును, గామ్ = భూమిని, ఆత్తసారామ్ - ఆత్త = గ్రహింపఁబడిన, సారాం=ధనము కలదానిని,

అవేక్ష్య = చూచి, కుబేరాత్ = కుబేరునివలన, అర్థం = ధనమును, నిష్క్రష్టుం = తెచ్చుటకు, చకమే = కోరెను.

తా.—రఘుమహారాజుయొక్క వమ్మగాని యాప్రతిజ్ఞను ఆబ్రాహ్మణుఁడు సరియే యని యొప్పుకొనెను. రఘుమహారాజును భూమిలోనున్న ధనమునెల్ల తాను అప్పటికే గ్రహించియున్నందున మఱి యప్పుడు భూమిలో ధనము లేమిని పరికించి, కౌత్సునికి కావలసిన యాధనమును కుబేరునివలననుండి తెచ్చుటకు తరిలెను.

వ్యా.—త థేతి —అగ్రజన్మా బ్రాహ్మణః, ప్రతీతః ప్రీతః సన్ * 'ఖ్యాతే హృష్టే ప్రతీత' ఇ త్యమరః, తస్య రఘోః, అవితథ మమోఘం, సంగరం ప్రతిజ్ఞామ్ * 'అథ ప్రతి జ్ఞాజి సంవి దాపత్సు సంగర' ఇ త్యమరః, త థేతి, ప్రత్యగ్రహీత్ అఙ్గీచకార, రఘు రపి, గాం భూమిమ్, ఆ త్తసారాం గృహీతధనా మవేక్ష్య, కుబేరాత్, అర్థం ధనం, నిష్క్రష్టుమ్ ఆహర్తుం, చకమే ఇయేష.

---

వసిష్ఠమన్త్రోక్షణజప్రభావా దుదన్వదాకాశమహీధరేషు
మరుత్సఖ స్యేవ బలాహకస్య గతి ర్విజఘ్నే న హి తద్రథస్య. 27

టీక.—వసిష్ఠమన్త్రోక్షణజప్రభావాత్ - వసిష్ఠ = వసిష్ఠులవారియొక్క - మన్త్ర = మంత్రములచేత - ఉక్షణ = చల్లుటవలన - జ = పుట్టిన - ప్రభావాత్ = సామర్థ్యముచేత, ఉదన్వ దాకాశ మహీధరేషు = సముద్రాంతరిక్ష పర్వతములయందు, మరుత్సఖస్య - మరుత్ = గాలికి - సఖస్య = చెలికాఁడయిన, బలాహకస్యేవ = మేఘముయొక్క (గతి) వలె, తద్రథస్య - తత్ = ఆరఘుమహారాజుయొక్క - రథస్య = తేరియొక్క, గతిః = గమనము, న విజఘ్నే హి = కొట్టఁబడదాయెను గదా.

తా.—సముద్రాంతరిక్ష పర్వతములయందు, అప్రతిహత మయినగతి గాలిచెలికానికి మేఘునికి ఏప్రకారముగా కలదో, ఆప్రకారముగానే వసిష్ఠులవారు చల్లిన మంత్రోదకముల ప్రభావముచేత రఘుమహారాజుయొక్క రథమునకును కలదు గదా.

వ్యా.—వసి ష్ఠేతి.—వసిష్ఠస్య యన్మన్త్రం - తేన - ఉక్షణం అభిమన్త్ర్య ప్రోక్షణం - తజ్జాత్ ప్రభావాత్ సామర్థ్యా ద్ధేతోః, ఉదన్వదాకాశమహీధరేషు సముద్రాకాశపర్వతేషు, మరుత్సఖస్య * మరుత స్స ఖేతి షష్ఠీతత్పురుషః - బహువ్రీహౌ సమాసాన్తాసంభవాత్ - తతో వాయుసహాయ స్యేతి లభ్యతే, వారీణాం వాహకో బలాహకః * 'పృషోదరాదిత్వా త్సాధుః * వబయో రభేదా ద్వలాహకః - త స్యేవ మేఘ స్యేవ, తద్రథస్య రఘురథస్య, గతిః సంచారః, న విజఘ్నే న విహతా, హి.

---

అథాధిశిశ్యే ప్రయతః ప్రదోషే రథం రఘుః కల్పిత మస్త్రగర్భం
సామ న్తసంభావన యైవ ధీరః కైలాసనాథం తరసా జిగీషుః. 28

టీక.—అథ = తర్వాత, ప్రదోషే = మునిమాపున, ప్రయతః = పరిశుద్ధుఁడును, ధీరః = ధైర్యశాలియును, (అయిన), రఘుః = రఘుమహారాజు, కైలాసనాథం = కుబేరుని, సా...వ - సామన్త = రాజమాత్రుఁడనెడి - సంభావనయైవ = తలంపుచేతనే, తరసా = బలముచేత, జిగీషుః సన్ = జయింపఁగోరినవాఁడై, కల్పితం = సన్నద్ధమును, అస్త్రగర్భం - అస్త్ర = ఆయుధములు - గర్భం = లోపల కలదియు, (అయిన), రథం = తేరియందు, అధిశిశ్యే = పరుండెను.

తా.—తర్వాత ఆధీరుఁడు రఘుమహారాజు కుబేరుని ఒకరాజమాత్రునిఁగా నెంచి బలిమిమెయి జయింపఁగోరినవాఁడై, రథమును సిద్ధము చేయించి అందులోపల అస్త్రము లుంపించి, మునిమాపున (శుభకర మయిన గోధూళిలగ్నంబున) ఆరథములో తాను శయనించెను.

వ్యా.—అ థేతి.—అథ ప్రదోషే రజనీముఖే - తత్కాలే యానారోహణవిధానాత్ * 'ప్రదోషో రజనీముఖ మి' త్యమరః, ప్రయతః, ధీరః, రఘుః, సమన్తాద్భవః సామన్తః రాజమాత్ర మితి - సంభావన యైవ మనీష యైవ, కైలాసనాథం కుబేరం, తరసా బలేన, జిగీషు ర్జేతు మిచ్ఛుః సన్, కల్పితం సజ్జితం, అస్త్రాణి గర్భే యస్య తం, రథ మధిశిశ్యే రథే శయితవా ని త్యర్థః * 'అధి శీఙ్ స్థాసాం క ర్మే' తి కర్మత్వమ్.

ప్రాతః ప్రయాణాభిముఖాయ తస్మై
సవిస్మయాః కోశగృహే నియుక్తాః
హిరణ్మయీం కోశగృహస్య మధ్యే
వృష్టిం శశంసుః పతితాం నభస్తః. 29

టీక.—ప్రాతః = వేకువను, ప్ర...య - ప్రయాణ = పయనమునకు - అభిముఖాయ = సిద్ధపడుచున్న, తస్మై = ఆరఘుమహారాజునకు, కోశగృహే = ధనగృహమందు, నియుక్తాః = అధికృతులగు పురుషులు, సవిస్మయాః సన్తః = ఆశ్చర్యముతోఁగూడినవారై, కోశగృహస్య = ధనగృహముయొక్క, మధ్యే = నడుమను, నభస్తః = ఆకాశమునుండి, పతితాం = పడిన, హిరణ్మయీం = స్వర్ణవికారమయిన, వృష్టిం = వానను, శశంసుః = చెప్పిరి.

తా.—వేకువను రఘుమహారాజు తరలనుండఁగా ధనగృహమందు ఆకాశమునుండి బంగారు వాన కురిసెను. ఆవృత్తాంతమును ధనగృహాధికృతులు వచ్చి ఆయనతో చెప్పిరి.

వ్యా.—ప్రాత రితి.— ప్రాతః ప్రయాణాభిముఖాయ, తస్మై రఘవే, కోశగృహే నియుక్తాః అధికృతాః భాణ్డాగారికాః, సవిస్మయాః స న్తః, కోశగృహస్య భాణ్డాగారస్య, మధ్యే, నభ స్తః ఆకాశాత్ * పఞ్చమ్యా స్తసిల్ప్రత్యయః, పతితాం, హిరణ్మయీం సువర్ణమయీం * 'దాణ్డినాయ నే' త్యాదినా నిపాతనాత్ సాధుః, వృష్టిం శశంసుః కథయామాసుః.

తం భూపతి ర్భాసుర హేమరాశిం
లబ్ధం కుబేరా దభియాస్యమానాత్
దిదేశ కౌత్సాయ సమస్త మేవ
శృఙ్గం సుమేరో రివ వజ్రభిన్నమ్. 30

టీక.—భూపతిః = రఘుమహారాజు, అభియాస్యమానాత్ = ఎవనిమీఁదికి తాను పో నుండెనో, కుబేరాత్ = ఆకుబేరునివలన, లబ్ధం=పొందఁబడినదానిని, వజ్రభిన్నం - వజ్ర = వజ్రాయుధముచేత - భిన్నం = ఖండింపఁబడిన, సుమేరోః = మేరు పర్వతముయొక్క, శృఙ్గ మివ స్థితం = శిఖరమోయన్నట్లుండెడి, తం భాసుర హేమరాశిం = ప్రకాశించుచున్న యా బంగారు పోగును, సమస్త మేవ = అంతను, కౌత్సాయ = కౌత్సఋషికి, దిదేశ = ఇచ్చెను.

తా.—ఈ ప్రకారము రఘుమహారాజు కుబేరునిమీఁదికి తరల నుండఁగా వచ్చి పడిన యాబంగారము కుబేరుఁడు పంపినట్టిది. అదియు వజ్రాయుధపు ప్రేటునకు చీలి కూలిన మహామేరు శృంగమో యనుటకు తగినంతటి గొప్పరాశిగా పడెను. రఘుమహారాజు కౌత్స మునికి అతఁడు యాచించిన పదునాలుగుకోట్ల ధనమేగాక ఆబంగారు రాశి నంతయు ఇచ్చి వైచెను.

వ్యా.—త మితి.—భూపతిః రఘుః, అభియాస్యమానాత్ అభిగమిష్యమాణాత్, కుబేరాత్, లబ్ధం, వజ్రేణ కులిశేన - భిన్నం లూనం, సు మేరోః, శృఙ్గ మివ శిఖర మివ స్థితం * 'పాదం సు మేరో రితి క్వచిత్పాఠః - పాదం ప్రత్యన్తపర్వత మివ స్థితం * 'పాదాః ప్రత్యన్తపర్వతా' ఇ త్యమరః, తం, భాసురం భాస్వరం * 'భఞ్జ భాస మిదో ఘుర జితి ఘురచ్ప్రత్యయః, హేమరాశిం, సమస్త మేవ కృత్స్న మేవ, కౌత్సాయ, దిదేశ దదౌ - న తు చతుర్దశకోటిమాత్ర మి త్యేవకారార్థః.

జనస్య సాకేతనివాసిన స్తౌ
ద్వావ ప్యభూతా మభినన్ద్యసత్త్వౌ

గురుప్రదేయాధికనిస్స్పృహోఽర్థీ
నృపోఽర్థికామా దధికప్రదశ్చ. 31

టీక.—గురు...హః—గురు = గురువునకు - ప్రదేయ = ఈవలసిన దానికంటె - అధిక = ఎక్కువయందు - నిస్స్పృహః = ఆశలేని, అర్థీ = యాచకుఁడయినకౌత్సర్షియు, అర్థికామాత్ - అర్థి = యాచకునియొక్క - కామాత్ = కోరినదానికంటె, అధికప్రదః = అధిక = ఎక్కువను - ప్రదః = ఇచ్చువాఁడయిన, నృపశ్చ = రఘుమహారాజును, ద్వావపి = ఇరువురును, సాకేతనివాసినః - సాకేత = అయోధ్యయందు - నివాసినః = కాఁపురమున్న; జనస్య = జనమునకు, అభి...త్త్వౌ-అభినన్ద్య = మెచ్చుకొనఁదగిన - సత్త్వౌ = వ్యవసాయములుగలవారు, అభూతామ్ = అయిరి.

తా.—అయోధ్యాపురవాసు లయిన జనులు ఆయిరువురయొక్కయు వ్యవసాయమునకు ఆశ్చర్యసంతోషములు చెందిరి. ఏయిరువుర వ్యవసాయమునకు అనఁగా— గురువునకు ఈవలసినదానికంటె ఎక్కువ కైకొననొల్లని యాచకుఁడైన కౌత్సమునియొక్కయు, యాచకుఁడు అడిగిన దానికన్న ఎక్కువ యిచ్చునట్టి యా రఘుమహారాజుయొక్కయు, వ్యయసాయమునకు.

వ్యా.—జనస్యేతి —తావర్థిదాతారౌ, ద్వావపి, సాకేతనివాసినః * 'సాకేతం స్యాదయోధ్యాయాం కోసలానన్దినీ తథే' తి యాదవః, జనస్య, అభినన్ద్యసత్త్వౌ స్తుత్యవ్యవసాయౌ, అభూతాం * 'ద్రవ్యాసువ్యవసాయేషు సత్త్వమస్త్రీ తు జన్తుషు' త్యమరః, కౌద్వౌ - గురవే - ప్రదేయా - దధికే అతిరిక్తద్రవ్యే - నిస్స్పృహః నిరపేక్షః, అర్థీ కౌత్సః, అర్థికామాత్ అర్థినో మనోరథాత్, అధికం ప్రదదా తీతి తథోక్తః, * 'ప్రే దాజ్ఞ' ఇతి కప్రత్యయః నృపః రఘుశ్చ.

---

అథోష్ట్రవామీశతవాహితార్థం
ప్రజేశ్వరం ప్రీతమనా మహర్షిః
స్పృశన్ కరేణానతపూర్వకాయం
సంప్రస్థితో వాచ మువాచ కౌత్సః. 32

టీక.—అథ = ధన మిచ్చినతర్వాత, ప్రీతమనాః - ప్రీత = సంతసించిన - మనాః = మనస్సుగల, మహర్షిః = మహర్షియైన, కౌత్సః = కౌత్సుఁడు, సంప్రస్థితః సన్ = తరలినవాఁడయి, ఉష్ట్ర...ర్థం—ఉష్ట్ర = లొట్టియలయొక్కయు - వామీ = ఆఁడుగుఱ్ఱములయొక్కయు - శత = నూఱులచేత - వాహిత = మోయింపఁబడిన - అర్థం = ధనముగలవానిని, ఆనత...కాయం—ఆనతి = వంగిన - పూర్వకా

యం = మేనిముందటిభాగముగలవానిని, ప్రజేశ్వరం=జననాథుని, కరేణ = చేతితో, స్పృశన్ = తడవుచు, వాచం = మాటను, ఉవాచ = పలికెను.

తా.—ఈప్రకారము ఇచ్చిన యాధనమును లొట్టియలమీఁదను ఆఁడుగుఱ్ఱముల మీఁదను నూర్లమీఁద ఎక్కించి భక్తిచేత ముస్తైయి త్రుంగ నిలిచి యున్న రఘుమహారాజును సంప్రీతుఁ డయిన యా కౌత్సమహామౌని చేతితో తడవుచు నిట్లనియె.

వ్యా.—అ థేతి.—అథ ధనప్రదానానన్తరం, ప్రీతమనాః హృష్టమానసః, మహర్షిః కౌత్సః, సంప్రస్థితః సన్ ప్రస్థాస్యమానః సన్ *'ఆశంసాయాం భూతవ చ్చే'తి భవిష్యదర్థే క్తః, ఉష్ట్రాణాం క్రమేళకానాం - వామీనాం బడబానాం చ - శతైః - ర్వాహితార్థం ప్రాపితధనమ్, ఆనతపూర్వకాయం వినయేన నమ్ర మిత్యర్థః, ప్రజేశ్వరం రఘుం, కరేణ స్పృశన్ వాచ మువాచ.

> కి మత్ర చిత్రం యది కామసూ ర్భూ
> ర్వృత్తే స్థిత స్యాధిపతేః ప్రజానామ్?
> అచిన్తనీయ స్తవ తు ప్రభావో
> మనీషితం ద్యౌ రపి యేన దుగ్ధా. 33

టీక.—వృత్తే = (రాజుయొక్క) నడవడియందు, స్థితస్య = ఉన్నట్టి, ప్రజానామధిపతేః = నరేంద్రునికి (నీకు), భూమిః = భూమి, కామసూర్యది - కామ = కోరిన యర్థములను - సూః యది = కనునేని, అత్ర = ఈవిషయమందు, చిత్రం = వింత, కిం = ఏమి? కిం తు = మ టేమనిన, యేన = ఏనీచేత, ద్యౌ రపి = ఆకాశముసయితము, మనీషితం = ఇష్టార్థమును, దుగ్ధా = పిదుకఁబడినదో, (అ), తవ = నీయొక్క, ప్రభావ స్తు = మహిమయన్ననో, అచిన్తనీయః = తలంచుటకు అశక్య మయినది.

తా.—ప్రజల యీశ్వరుఁడవు నీవు-ధనమును న్యాయముచే ఆర్జించుట పెంచుట పాలించుట సత్పాత్రమున కిచ్చుట - యనునాల్గువిధము లయిన రాచనడవడిని తప్పక యుండఁగా - నీకోరినయర్థములను భూమి యీను నేని అది యేమివింత! నీ ప్రభావ మన్ననో వింతగా నున్నది.—ఎట్లనఁగా నీయిష్టార్థమును నీకు దివి సయితము పిదికినది.

వ్యా.—కి మితి—వృత్తే రాజవృత్తే,

> 'న్యాయే నార్జన మర్థస్య వర్ధనం పాలనం తథా,
> సత్పాత్రే ప్రతిపత్తి శ్చ రాజవృత్తం చతుర్విధమ్,' ఇతి కామన్దకః-

తస్మిన్ వృత్తే, స్థితస్య, ప్రజానా మధిపతేః నృపస్య, భూః భూమిః, కామాన్ సూయత ఇతి కామసూః - యది * 'సత్సూ ద్విష' ఇత్యాదినా క్విప్, అత్ర కామప్ర

సవే, కిం చిత్రం న చిత్ర మి త్యర్థః; కిం తు, తవ ప్రభావః మహిమా తు, అచిన్త నీయః చిన్తితు మశక్యః, యేన త్వయా, ద్యౌ రపి, మనీషిత మభిలషితం దుగ్ధా

* 'దుహే ర్ద్వికర్మకా దప్రధానే కర్మణి క్తః -

' ప్రధానకర్మ ణ్యాఖ్యేయే లాదీ నాహు ర్ద్వికర్మణామ్,
అప్రధానే దుహాదీనాం, ణ్యన్తే కర్తు శ్చ కర్మణః.' ఇతి విధానాత్.

---

ఆశాస్య మన్యత్ పునరుక్తభూతం
శ్రేయాంసి సర్వా ణ్యధిజగ్ముష స్తే;
పుత్త్రం లభ స్వాత్మగుణానురూపం
భవన్త మీడ్యం భవతః పి తేవ. 34

టీక.—సర్వాణి = సకలమయిన - శ్రేయాంసి = మంగళములను, అధిజగ్ముషః = పొందినవ, తే = నీకు, అన్యత్ = (పుత్త్రుఁడు తప్ప) వెఱు, ఆశాస్యం=ఆశీర్వాద సాధ్యము, పునరుక్తభూతం = చెప్పినదానినిసే మరల చెప్పుటవంటిదిగా నున్నది. కిం తు = మఱేమనిన, ఈడ్యం = స్తుతింపఁదగిన, భవన్తం = నిన్ను, భవతః = నీయొక్క, పి తేవ = తండ్రివలె, ఆత్మ...పం - ఆత్మ = నీయొక్క - గుణ = గుణములకు - అను రూపం = తగినట్టి, పుత్త్రం=కుమారుని, లభస్వ = పొందుము.

తా.—కరితురగరాజ్యాది మంగళములన్నియుఁ నీకు ఉండనే యున్నవి. కావున అవియే నీకు కలఁగునట్లు ఆశీర్వదించుట చెప్పినమాటనే చెప్పుటవలె నిష్ప్రయోజనము. మఱి ఒక్కటిమాత్రము కోరఁదగినది యున్నది. అది యే మనఁగా సుపుత్త్రుఁడు. కావున నీతండ్రి సుగుణములందు తనకు తుల్యుని పొగడ్తకుఁ దగినవానిని నిన్ను వడసినట్లు, నీవును నీవంటిగుణములు కలవానిని నీకు తుల్యుని పుత్త్రునిం బడయుదువుగాక.

వ్యా.—ఆశాస్య మితి.—సర్వాణి కరితురగరాజ్యాదీని, శ్రేయాంసి కల్యాణాని * 'శ్వ శ్శ్రేయసం శివం భద్రం కల్యాణం మఙ్గళం శుభ మి'త్యమరః, అధిజగ్ముషః ప్రాప్తవతః, తే తవ, అన్యత్ పుత్త్రాతిరిక్తమ్, ఆశాస్యమ్ ఆశీస్సాధ్యం, పునరుక్తభూతం - సర్వం సిద్ధ మి త్యర్థః, కిం తు, ఈడ్యం స్తుత్యం, భవన్తం, భవతః పి తేవ దిలీప ఇవ, ఆత్మగుణానురూపం త్వత్తుల్యగుణ మి త్యర్థః, పుత్త్రం, లభస్వ ప్రాప్నుహి.

---

ఇత్థం ప్రయుజ్యాశిష మగ్రజన్మా
రాజ్ఞే ప్రతీయాయ గురోః సకాశమ్;

రాజాఽపి లేభే సుత మాశు తస్మా
దాలోక మర్కా దివ జీవలోకః. 35)

టీక.—అగ్రజన్మా = (ఆ) బ్రాహ్మణుఁడు (కౌత్సముని), ఇత్థం = ఇట్లు, రాజ్ఞే = (రఘుమహా)రాజునకు, ఆశిషం = దీవనను, ప్రయుజ్య = ప్రయోగించి, గురోః= ఒజ్జయొక్క, సకాశం = సమీపమునకు, ప్రతీయాయ = పోయెను ; రాజా అపి = (రఘుమహా)రాజును, జీవలోకః = ప్రాణిసమూహము, అర్కాత్ = సూర్యునివలన, ఆలోక మివ = వెలుతురునుంబోలె, తస్మాత్ = ఆదీవనవలన, ఆశు = శీఘ్రముగ, సుతం = పుత్త్రుని, లేభే = పొందెను.

తా.—ఈప్రకారము ఆశీర్వాదముం బ్రయోగించి కౌత్సముని తనగురువుకడకుం బోయెను. రఘుమహీపతియుఁ సూర్యునివలన ప్రాణికోటి వెలుతురుం బొందినట్లు ఆ యాశీర్వాదమువలన శీఘ్రముగా పుత్త్రునిం బడసెను.

వ్యా.—ఇత్థ మితి.—అగ్రజన్మా బ్రాహ్మణః * 'అగ్రజన్మా ద్విజశ్రేష్ఠే భ్రాతరి బ్రహ్మణి స్మృత' ఇతి విశ్వః, ఇత్థ మనేన ప్రకారేణ, రాజ్ఞే రఘవే, ఆశిషమ్ ఆశీర్వాదం, ప్రయుజ్య, గురో ర్వరతన్తోః, స్సకాశం సమీపం, ప్రతీయాయ ప్రాప; రాజాఽపి, జీవలోకః ప్రాణిసమూహః * 'జీవః ప్రాణిని గీష్పతా వి'తి విశ్వః, అర్కాత్ సూర్యాత్, ఆలోక ప్రకాశ మివ - 'చైతన్య మి'తి పాఠే జ్ఞానమ్ * 'ఆలోకా దర్శన ద్యోతా వి'త్యమరః' తస్మా దాశీఃప్రయోగా, దాశు శీఘ్రం, సుతం పుత్త్రం, లేభే ప్రాప.

బ్రాహ్మే ముహూర్తే కిల తస్య దేవీ
కుమారకల్పం సుషువే కుమారం;
అతః పితా బ్రహ్మణ ఏవ నామ్నా
త మాత్మజన్మాన మజం చకార. 36

టీక.—తస్య = ఆరఘుమహారాజుయొక్క, దేవీ = పట్టపురాణి, బ్రాహ్మే = బ్రహ్మదేవతాక మయిన, ముహూర్తే = (అజనామక) ముహూర్తమందు, కుమారకల్పం= కుమారస్వామితో ఇంచుమించుగా సమానుఁడయిన, కుమారం = కొడుకును సుషువే కిల= కనెను గద, అతః = ఇందువలన, పితా = తండ్రి (రఘుమహారాజు), బ్రహ్మణ ఏవ = బ్రహ్మయొక్కయే, నామ్నా = పేరిచేత, తం = ఆ, ఆత్మజన్మానమ్ = కొడుకును, అజం = అజునిఁగా, చకార = చేసెను.

తా.—అతని పట్టపుదేవి అజనామక మయిన బ్రహ్మదేవతాక ముహూర్తమందు అనఁగా అరుణోదయకాలమందు, కుమారస్వామికి ఇంచుమించుగా సమానుఁడయిన

కుమారునిం గనియెను. ఇందువలన ఆరఘుమహారాజు బ్రహ్మకే పేరయిన యజశబ్దమును ఆ కుమారునికి నామముగా చేసెను.

వ్యా.—బ్రాహ్మ ఇతి.—తస్య రఘోః, దేవీ మహిషీ * 'దేవీ కృతాభిషేకాయా మి'త్యమరః, బ్రాహ్మే * 'త స్యేద మి'త్యణ్ - బ్రహ్మదేవతాకే అజనామకే, ముహూర్తే, ఈష దసమాప్తం కుమారం కుమారకల్పం స్కన్దసదృశం * 'ఈషదసమాప్తౌ వి'త్యాదినా కల్పప్ ప్రత్యయః, కుమారం పుత్త్రం, సుషువే, కిలేతి సంభావనాయాం * 'వార్తాసంభావ్యయోః కి లే'త్యమరః * 'కుమారో బాలకే స్కన్దే' ఇతి విశ్వః, అతః బ్రహ్మముహూర్తోత్పన్నత్వాత్, పితా రఘుః, బ్రహ్మణ ఏవ నామ్నా తమ్, ఆత్మజన్మానం పుత్త్రమ్, అజమ్ అజనామకం - చకార * అజో హరౌ హరే కామే విధౌ ఛాగే రఘోః సుత' ఇతి విశ్వః.

రూపం త దోజస్వి, త దేవ వీర్యం,
త దేవ నైసర్గిక మున్నతత్వం;
న కారణాత్ స్వా ద్బిభిదే కుమారః
ప్రవర్తితో దీప ఇవ ప్రదీపాత్. 37

టీక.—ఓజస్వి = తేజముకలదయిన, రూపం = శరీరము, తదేవ = అదే (తండ్రిదే), వీర్యం = శౌర్యము, తదేవ = అదే, నైసర్గికమ్ = స్వాభావికమైన, ఉన్నతత్వం = ఔన్నత్యము, తదేవ = అదే, కుమారః = బాలుఁడు, ప్రవర్తితః = వెలిఁగింపఁబడిన, దీపః = దీపము, ప్రదీపా దివ = (మొదటి) దీపముకంటె ఎట్లో అట్లే, స్వాత్ = తనదైన, కారణాత్ = కారణమైనతండ్రికంటె, న బిభిదే = వేఱు కాఁడాయెను.

తా.—ఆకుమారుఁడు తేజము గలరూపమందును, శౌర్యమందును, స్వాభావికౌన్నత్యమందును, ఎల్ల విషయములందును, దీపము తనకారణ మయిన దీపమును ఎట్లో అట్లే పూర్తిగా సరిపోలి యుండెను.

వ్యా.—రూప మితి.—ఓజస్వి తేజస్వి - బలిష్ఠం వా * 'ఓజ స్తేజసి ధాతూనా మవష్టమ్భప్రకాశయోః, ఓజో బలే చ దీప్తౌ చే'తి విశ్వః, రూపం వపుః * 'అథ రూపం నపుంసకం, స్వభా వాకృతి సౌన్దర్య వపుషి శ్లోకశబ్దయో రి'తి విశ్వః, తదేవ పైతృక మేవ, వీర్యం శౌర్యం, తదేవ, నైసర్గికం స్వాభావికమ్, ఉన్నతత్వం తదేవ తాదృ గేవే త్యర్థః, కుమారో బాలకః, ప్రవర్తితః ఉత్పాదితో, దీపః, ప్రదీపాత్ స్వోత్పాదకాత్ దీపా దివ, స్వాత్ స్వకీయాత్ * 'పూర్వాదిభ్యో నవ

భ్యో వేతి స్వాద్భావాభావో వైకల్పికత్వాత్, కారణాత్ జనకాత్, న బిభిదే భిన్నో నా భూత్ - సర్వాత్మనా తాదృశ ఏ వే త్యర్థః.

ఉపాత్తవిద్యం విధివ ద్గురుభ్య
స్తం యౌవనోద్భేదవి శేషకా న్తం
శ్రీః సాభిలాషాఽపి గురో రనుజ్ఞాం
ధీ రేవ కన్యా పితు రాచకాఙ్క్షే. 38

టీక.—గురుభ్యః = ఒజ్జలవలన, విధివత్ = యథాశాస్త్రముగ, ఉపాత్త విద్యం - ఉపాత్త = గ్రహింపఁబడిన - విద్యం = విద్యలుగలవానిని, యౌవ...న్తం - యౌవన = జవ్వనముయొక్క - ఉద్భేద = ఆవిర్భావమువలననయిన - విశేష = అతిశయముచేత - కాన్తం = మనోహరుఁడయిన, తం = అతనిని (అజుని) గూర్చి, సాభిలాషా అపి = కోరికతోఁగూడినదైనను, శ్రీః = రాజ్యలక్ష్మి, ధీరా = స్థిరోన్నతచిత్తము గల, కన్యా = కన్యక, పితు రివ - తండ్రియొక్క (యనుమతిని) పోలె, గురోః = గురువయిన రఘుమహారాజుయొక్క, అనుజ్ఞామ్ = అనుమతిని, ఆచకాఙ్క్షే = ఎదురు చూచుచుండెను.

తా.—గురువువలన యథాశాస్త్రముగా సకలవిద్యలును నేర్చి జవ్వనము ఉదయించుటచే మిక్కిలి మనోహరుఁ డయిన యువకుమారుని కోరినదయ్యు రాజ్యలక్ష్మి అతనిం గవయుటకు-స్థిరోన్నత చిత్తయైన కన్య వివాహార్థము తండ్రియొక్క యనుమతిని ఎదురుచూచునట్లుగా రఘుమహారాజుయొక్క యనుజ్ఞను ఎదురుసూచుచుండెను.— యౌవరాజ్యార్హుఁ డాయె నని భా.

వ్యా.—ఉపాత్తేతి.—గురుభ్యః, విధివత్ యథాశాస్త్రమ్, ఉపాత్తవిద్యం లబ్ధవిద్యం, యౌవనస్య ఉద్భేదా దావిర్భావా ద్ధేతోః - విశేషేణ అతిశయేన - కాన్తం సౌమ్యం, తమ్ అజం ప్రతి, సాభిలాషా అపి శ్రీః, ధీరా స్థిరోన్నతచిత్తా * 'స్థిరచిత్తోన్నతి ర్యా తు తద్ ధైర్య మితి సంజ్ఞిత మి'తి భూపాలః, కన్యా, పితు రివ, గురోః రఘోః, రనుజ్ఞా మాజ్ఞామ్, ఆచకాఙ్క్షే ఇయేష ; యౌవరాజ్యార్హోఽభూ ది త్యర్థః; అనుజ్ఞాశబ్దా త్పితృపారతన్త్ర్యమ్ ఉపమాసామర్థ్యా త్పాణిగ్రహణయోగ్యతా చ ధ్వన్యతే.

అ థేశ్వరేణ క్రథకైశికానాం
స్వయంవరార్థం స్వసు రిన్దుమత్యాః

ఆప్తః కుమారానయనోత్సుకేన
భోజేన దూతో రఘవే విసృష్టః. 39

టీక.—అథ = తర్వాత, స్వసుః = చెల్లెలయిన, ఇన్దుమత్యాః = ఇందుమతి యొక్క, స్వయంవరార్థణాం = స్వయంవరనిమిత్తముగ, కుమా...న - కుమార = అజ మహారాజుయొక్క - ఆనయన = రప్పించుటయందు - ఉత్సుకేన = ఆసక్తుఁడయిన, క్రథకైశికానాం = విదర్భదేశముయొక్క - ఈశ్వరేణ = ఱేఁడయిన, భోజేన = భోజమహారాజుచేత, ఆప్తః = హితుఁడయిన, దూతః = దూత, రఘవే = రఘుమహా రాజుకొఱకు, విసృష్టః = పంపఁబడెను.

తా.—ఇట్లుండఁగా విదర్భరాజు భోజుఁడు తన చెల్లెలికి ఇందుమతికి స్వయంవర ము గావించువాఁడై అందులకు అజమహారాజును రప్పింపఁగోరి రఘుమహారాజుకడకు ఆప్తుఁ డగుదూతను పంపెను.—ఆప్తుని పంపుటచే అజునికే చెల్లెలిని ఈఁగోరిక సూచితము.

వ్యా.—అ థేతి.—అథ, స్వసు ర్భగిన్యాః ఇన్దుమత్యాః, స్వయంవరార్థం, కుమారస్య అజస్య - ఆనయనే ఉత్సుకేన, క్రథకైశికానాం విదర్భదేశానాం, ఈశ్వ రేణ స్వామినా, భోజేన రాజ్ఞా, ఆప్తః హితః, దూతః, రఘవే, విసృష్టః ప్రేషితః * 'క్రియామాత్రయోగేఽపి చతుర్థీ'; ఆప్తగ్రహణ మత్రైవ తాత్పర్య మితి ద్యోత నార్థమ్.

---

తం శ్లాఘ్యసమ్బన్ధ మసౌ విచిన్త్య
దారక్రియాయోగ్యదశం చ పుత్రం
ప్రస్థాపయామాస ససైన్య మేన
మృద్ధాం విదర్భాధిపరాజధానీమ్. 40

టీక.—అసౌ = ఈరఘుమహారాజు, తం = ఆభోజరాజును, శ్లాఘ్య సంబన్ధం - శ్లాఘ్య = కోరఁదగిన - సంబన్ధం = వియ్యముకలవానినిగా, విచిన్త్య = ఆలోచించి, పుత్త్రం చ = కుమారునిని, దార...శం - దారక్రియా = వివాహమునకు - యోగ్య = తగిన - దశం = వయసుకలవానినిగా, విచిన్త్య = ఆలోచించి, ససైన్యం = దండుతోఁ గూడినవానిని, ఏనమ్ = ఈపుత్త్రుని (అజమహారాజును), ఋద్ధాం = సమృద్ధ మయిన, విద...నీం - విదర్భాధిప = విదర్భరాజుయొక్క - రాజధానీం = ప్రధానపట్టణము నకు, ప్రస్థాపయామాస = పంపెను.

తా.—రఘుమహారాజు భోజరాజుతోడి వియ్యము కోరఁదగిన దనియుం, కుమా

రుఁడు వివాహయోగ్యవయస్సులో నున్నాఁ డనియు, ఆలోచించుకొని, అజమహా రాజును సంపత్సమృద్ధమయిన విదర్భరాజధానికి దండుతో పంపెను.

వ్యా.—త మితి.—అసౌ రఘుః, తం భోజం, శ్లాఘ్యసంబన్ధం అనూచానత్వాది గుణయోగాత్ స్పృహణీయసంబన్ధం, విచిన్త్య విచార్య, పుత్త్రంచ దారక్రియాయోగ్య దశం వివాహ యోగ్య వయసం విచిన్త్య, ససైన్య మేనం పుత్త్రమ్ అజం, ఋద్ధాం సమృద్ధాం, విదర్భాధిపస్య భోజస్య - రాజధానీం పురీం ప్రతి, ప్రస్థాపయామాస - ధీయన్తే ఽస్యా మితి ధానీ * 'కరణాధికరణయో శ్చే' త్యధికరణే ల్యుట్ప్రత్యయః - రాజ్ఞాం ధానీతి విగ్రహః * 'ప్రధాననగరీ రాజ్ఞాం రాజధానీతి కథ్యత' ఇతి శబ్దార్ణవే.

తస్యోపకార్యారచితోపచారా వన్యేతరా జానపదోపదాభిః
మార్గే నివాసా మనుజేన్ద్రసూనో ర్బభూవు రుద్యానవిహారకల్పాః.41

టీక.—ఉప...రాః - ఉపకార్యా = రాజునకుఁదగిన డేరాలు లోనగువాని యందు - రచిత = చేయఁబడిన - ఉపచారాః = పాన్పు లోనగు నుపచారములుంగలవియు, జాన...భిః - జానపద = దేశములనుండి వచ్చినవారియొక్క - ఉపదాభిః = కానుకలచేత, వన్యేతరాః = అడవిలోనివిగానివియు, (అయిన), తస్య మనుజేన్ద్రసూనోః = ఆ రాజకుమారునియొక్క, మార్గే నివాసాః = దారిలోని విడిదలలు, ఉద్యా...ల్పాః - ఉద్యాన = విహారవనము లనెడి - విహారకల్పాః = క్రీడాస్థానములతో సమానములు, బభూవుః = అయినవి.

తా.—ఆయజమహారాజునకు దారిలో రాజార్హమయిన డేరాలు లోనగు వాని యందు సిద్ధము సేయఁబడిన శయనాద్యుపచారములు గలవియు, వన్యము లయ్యును దేశములనుండి వచ్చినవారు సమర్పించిన కానుకలచేత అవన్యములుగా తోఁచుచున్నట్టివియు, నయిన విడిదలలు క్రీడారామ తుల్యములుగా నుండినవి.

వ్యా.—త స్యేతి.—ఉపకార్యాసు రాజయోగ్యేషు పటభవనాదిషు * 'సౌధో ఽస్త్రీ రాజసదన ముపకా ర్యోపకారి కే' త్యమర వచనవ్యాఖ్యానే 'ఉపక్రియతే ఉపకరోతి చ పటమణ్డపాదిరాజసదన మి'తి క్షీరస్వామీ - రచితాః - ఉపచారాః శయనాదయో - యేషు తే తథోక్తాః, జానపదానాం జనపదేభ్య ఆగతానామ్ - ఉపదాభిః ఉపాయనైః * 'ఉపాయన ముపగ్రాహ్య ముపహార స్తథోప దే' త్యమరః, వన్యాః వనే భవాః - ఇతరే యేషాం తే వన్యేతరాః అవన్యా ఇ త్యర్థః * 'న బహువ్రీహా వి'తి సర్వనామసంజ్ఞానిషేధః - తత్పురుషే సర్వనామసంజ్ఞా దుర్వారైవ, తస్య, మనుజేన్ద్రసూనో రజస్య, మార్గే - నివాసాః వసతయః * 'తత్పురుషే కృతి బహుళ మి'తి సప్తమ్యా అలుక్, ఉద్యానాని ఆక్రీడాః * 'పుమా నాక్రీడ ఉద్యాన మి' త్యమ

రః - తా స్యేవ - విహారాః విహారస్థానాని - తత్కల్పాః తత్సదృశా ఇ త్యర్థః *'ఈష దసమాప్తౌ వి'తి కల్పప్ ప్రత్యయః, బభూవుః.

స నర్మదారోధసి శీకరార్ద్రై
ర్మరుద్భి రానర్తితనక్తమాలే
క్లాన్తం రజోధూసరకేతు సైన్యం
నివేశయామాస విలఙ్ఘితాధ్వా. 42

టీక.—విలఙ్ఘితాధ్వా - విలఙ్ఘిత = దాటఁబడిన - అధ్వా = దారిగలిగిన, సః= ఆఁసఁజమహారాజు, శీకరార్ద్రైః - శీకర = తుంపురులచేత - ఆర్ద్రైః = తడిసైన, మరుద్భిః = తెమ్మెరలచేత, ఆన...లే - ఆనర్తిత = కంపింపఁబడిన - నక్తమాలే = కానుగుచెట్లుగల, నర్మ...సి - నర్మదా = రేవానదియొక్క = రోధసి = దరియందు, క్లాన్తం = బడలినదియు, రజో...తు - రజః = దుమారముచేత - ధూసర = బూడిదవన్నెగల - కేతు = జెండాలుగలదియు, (అయిన), సైన్యం = దండును, నివేశయామాస = విడియించెను.

తా.—దారి కడచి అజమహారాజు తుంపురులచే చల్లగాను కానుగుచెట్లు కంపించుపాటిగా మందముగాను గాలి వీచుచుండుటచే నివాసార్హ మయిన నర్మదదరిని జెండాలు దుమారముచేత బూడిదవన్నె పొందుడు బడలియున్న దండును విడియించెను.

వ్యా —స ఇతి.—విలఙ్ఘితాధ్వా అతిక్రాన్తమార్గః, సః అజః, శీకరార్ద్రైః శీతలై రి త్యర్థః, మరుద్భిః వాతైః, ఆనర్తితాః కమ్పితాః - నక్తమాలాః చిరిబల్వాఖ్య వృక్షభేదాః - యస్మిన్ - నివేశార్హ ఇ త్యర్థః *'చిరిబిల్వో నక్తమాలః కరజ శ్చ కరఞ్జకః' ఇ త్యమరః, నర్మదారోధసి రేవాతీరే, క్లాన్తం శ్రాన్తం, రజోభిః ధూసరాః కేతవో యస్య తత్, సైన్యం, నివేశయామాస.

అథోపరిష్టా ద్భ్రమరై ర్భ్రమద్భిః
ప్రాక్సూచితాన్తస్సలిలప్రవేశః
నిర్ధౌతదానామలగణ్డభిత్తి
ర్వన్యః స్సరిత్తో గజ ఉన్మమజ్జ. 43

టీక.—అథ = దండు దిగినతర్వాత, ఉపరిష్టాత్ = పైని - భ్రమద్భిః = తిరుగుచున్న = భ్రమరైః = తుమ్మెదలచేత, ప్రాక్సూ...శః - ప్రాక్ = (లేచుటకు) ముందు

గా - సూచిత = తెలుపఁబడిన - అన్తః = లోపలి - సలిల = నీళ్లయందు - ప్రవేశః= చొచ్చుట కలదియు, నిర్ధౌ... త్తిః - నిర్ధౌత=పూర్తిగా కడుగఁబడిన - దాన=మదోదకముకలవై - అమల = నిర్మలమయిన - గణ్డభిత్తిః = చెక్కిటి గోడలుగలదియు, వన్యః = అడవిదియు, (అయిన), గజః = ఏనుఁగు, సరిత్తః = (నర్మదా) నదినుండి - ఉన్మమజ్జ = లేచెను.

తా.___అంతట, నర్మదానదిలో ఒకచోట నీళ్ల మీఁద తుమ్మెదలు సుడియుచుండినవి. అందువలన నీళ్లలోపల మదపుటేనుఁగు మునిఁగియున్న దని తెలియనాయెను. అంతటఁ మదము నంతయు నీళ్లు పూర్తిగా కడిగివైచినందున శుభ్రము లయినచెక్కిటి గోడలతో అడవియేనుఁగు ఏటిలోనుండి పైకి లేచినది.

వ్యా.___అ థేతి.___అథ సేనానివేశానన్తరమ్, ఉపరిష్టా దూర్ధ్వం * 'ఉప ర్యుపరిష్టా ది'తి నిపాతః, భ్రమద్భిః - మదలోభా దితి భావః, భ్రమరైః, ప్రాక్ ఉన్మజ్జనాత్పూర్వం - సూచితః జ్ఞాపితః - అన్తస్సలిలే ప్రవేశో యస్య స తథోక్తః, నిర్ధౌతదానే క్షాళితమదే - అత ఏవ అమలే గణ్డభిత్తీ యస్య స తథోక్తః * 'దానం గజమదే త్యాగ' ఇతి విశ్వః, వన్యో గజ, స్సరిత్తః నర్మదాయాః సకాశాత్ * పఞ్చమ్యాస్తసిల్ప్రత్యయః, ఉన్మమజ్జ ఉత్థితః.

నిశ్శేషవిక్షాళితధాతునాఽపి వప్రక్రియా మృక్షవత స్తటేషు,
నీలోర్ధ్వరేఖాశబలేన శంస ద్దన్తద్వయే నాశ్మవికుణ్ఠితేన. 44

టీక.___నిశ్శేష...పి - నిశ్శేష = పూర్తిగా - విక్షాళిత = కడుగఁబడిన - ధాతునా అపి = గైరికాదిధాతువులుకలదానిచే నైనను, నీలో...న - నీల = నల్లని - ఊర్ధ్వరేఖా = నిలువుగీఱలచేత - శబలేన = చిత్రవర్ణమయి, అశ్మవికుణ్ఠితేన - అశ్మ= రాలచేత - వికుణ్ఠితేన = మొక్కఁగొట్టఁబడిన, దన్తద్వయేన - దన్త = కోఱలయొక్క- ద్వయేన = జతచేత, ఋక్షవతః = ఋక్షవత్పర్వతముయొక్క, తటేషు = దరులయందు, వప్రక్రియాం = కోరాడుకేళిని, శంసన్ = చెప్పుచు, (గజః = ఏనుఁగు, ఉన్మమజ్జ = లేచెను.)

తా.___ఆఋక్షవత్పర్వతమందు ఆయేనుఁగు క్రీడార్థము దరులను కోరాడుచుండిన విధము - దానికోఱలయందలి గైరికాది ధాతువులను నీరు కడిగివైచినందున వానిచే తెలియకపోయినను - రాలచే మొక్కపోయిన యాకోఱలచేతను అందలినల్లని నిలువుగీఱల చేతను - తెలియ నగుచుండెను.

వ్యా.___నిశ్శే షేతి.___కథంభూతో గజః - నిశ్శేషం యథా తథా విక్షాళితధాతునాఽపి ధౌతగైరికాది ధాతునాఽపి, నీలాభిః ఊర్ధ్వరేఖాభిః తటాఘాతజనితాభిః.

శబలేన కర్బురేణ * 'చిత్రం కిర్మీర కల్మాష శబలైతాశ్చ కర్బురే' ఇత్యమరః, అశ్మభిః పాషాణైః వితుణ్ణితేన కుణ్ఠీకృతేన, దన్తద్వయేన, బుద్ధ్వా నామ కశ్చిత్ త్రికూటః పర్వతః - తస్య తటేషు, వప్రక్రియాం వప్రక్రీడా ముత్ఖాతకేళి మిత్యర్థః * 'ఉత్ఖాతకేళిః శృఙ్గాద్యై ర్వప్రక్రీడా నిగద్యతే' ఇతి శబ్దార్ణవే, శంసన్ కథయన్ - సూచయ న్నిత్యర్థః.

సంహారవిక్షేపలఘుక్రియేణ హస్తేన తీరాభిముఖః సశబ్దం
బభౌ సభిన్దన్ బృహత స్తరఙ్గా న్వార్యర్గళాభఙ్గ ఇవ ప్రవృత్తః. 45

టీక.—సంహా...ణ - సంహార = ముడుచుటయందును - విక్షేప = చాచుటయందును - లఘు = వడిగల - క్రియేణ = వ్యాపారముగల, హస్తేన = తొండముతో, సశబ్దం యథా తథా = ధ్వనితోఁగూడినట్లుగా, బృహతః = గొప్పలైన, తరఙ్గాన్ = అలలను, భిన్దన్ = పగుల్చుచు, తీరాభిముఖః - తీర = గట్టునకు - అభిముఖః = ఎదురై, సః = ఆగజము, వా...ఙ్గే - వారీ = గజబంధనస్థానములయొక్క - అర్గళా = గడియమ్రాఁకులయొక్క - భఙ్గే = విఱుచుటయందు, ప్రవృత్త ఇవ = ప్రవర్తిల్లినదియుంబోలె, బభౌ = ప్రకాశించెను.

తా.—ఆయేనుఁగు ముణుఁచుటయందును చాఁచుటయందును లాఘవము కలిగిన తొండముతో పెద్దశబ్ద మగునట్లుగా పెద్దయలలను పగులఁగొట్టుచు, ఆకొట్టుటచేత ఏనుఁగుల కట్టుతావుల గడియమ్రాఁకులను ఇట్లే విఱిచెద నని తెలుపుచున్నదియుంబోలె నొప్పుచు, గట్టువైపు వచ్చుచుండెను.

వ్యా.—సంహా రేతి.—సంహార విక్షేపయోః సంకోచ ప్రసారణయోః - లఘు క్రియేణ శీఘ్రవ్యాపారేణ * 'లఘు క్షిప్ర మరం ద్రుత మి'త్యమరః, హస్తేన శుణ్డాదణ్డేన * 'హస్తో నక్షత్ర భేదే స్యాత్ క రేభ కరయో ర పీ'తి విశ్వః, సశబ్దం సఘోషం యథా తథా, బృహతః తరఙ్గాన్, భిన్దన్ విదారయన్, తీరాభిముఖః స గజః, వారీ గజబన్ధనస్థానం * 'వారీ తు గజబన్ధనీ'ఇతి యాదవః * వార్యా - అర్గళాయాః విష్కమ్భస్య - భఙ్గే భఞ్జనే- ప్రవృత్త ఇవ బభౌ.

శైలోపమః శైవలమఞ్జరీణాం జాలాని కర్షన్నురసా స పశ్చాత్
పూర్వం తదుత్పీడితవారిరాశిః సరిత్ప్రవాహ స్తట ముత్ససర్ప. 46

టీక.—శైలోపమః - శైల = పర్వతమే - ఉపమః = సామ్యముగాఁగల, సః = ఆగజము, శైవలమఞ్జరీణాం - శైవల = నాచుఁదీఁగలయొక్క - మఞ్జరీణాం = గుబురుల

యొక్క = జాలాని = మొత్తములను, ఉరసా = ఱొమ్ముచేత, కర్షన్ = ఈడ్చుకొని, పశ్చాత్ = పిమ్మట, తటం = గట్టును, ఉత్ససర్ప = ఎక్కెను, తదు...శిః - తత్ = ఆయేనుఁగుచేత - ఉత్పీడిత = ఎగఁద్రోయఁబడిన - వారిరాశిః = నీళ్ల మొత్తముగలదైన, సరిత్ప్రవాహః - సరిత్ = (నర్మదా) నదియొక్క - ప్రవాహః = పాఱుదల, తటం= గట్టును, పూర్వం = మొదట, ఉత్ససర్ప = ఎక్కెను.

తా.—ఆయేనుఁగు గట్టునకు వచ్చుటలో, కొండయంతటి తదీయశరీరముచేత ముందటికి త్రోయఁబడిన నీటిమొత్తము మొదట గట్టెక్కెను. తర్వాత ఏనుఁగు నాచుఁదీఁగ గుబురుల మొత్తములను ఈడ్చుకొని వచ్చి గట్టెక్కెను.

వ్యా.—శైలేతి.—శైలోపమః స గజః, శైవలమఞ్జరీణాం, జాలాని బృన్దాని * 'జలనీలీ తు శైవాలం శైవల' ఇత్యమరః, ఉరసా కర్షన్ పశ్చాత్ తటం ఉత్ససర్ప, పూర్వం, తేన గజేన - ఉత్పీడితః నున్నః - వారిరాశి ర్యస్య సః, సరిత్ప్రవాహః, తటమ్, ఉత్ససర్ప ఉజ్జగామ.

---

తస్యైకనాగస్య కపోలభిత్త్యో ర్జలావగాహక్షణమాత్రశాన్తా
వన్యేతరానేకపదర్శనేన పునర్దిదీపే మదదుర్దినశ్రీః 47

టీక.—తస్య = ఆ, ఏకనాగస్య - ఏక=ఒక్క - నాగస్య = ఏనుఁగుయొక్క, కపోల భిత్త్యోః = గోడలవంటి గండస్థలములయందు, జలా...శాన్తా...జల = నీటియందు - అవగాహ = మునుకచేత - క్షణమాత్ర = నిమేషమాత్రము - శాన్తా = అణఁగిన, మద...శ్రీః—మద = మదజలముయొక్క - దుర్దిన = వర్షముయొక్క, శ్రీః = సంపద, వన్యే...న—వన్యేతర = అడవివిగానట్టి - అనేకప = ఏనుఁగుల యొక్క - దర్శనేన = చూచుటచేత, పునః = మరల, దిదీపే = వెంపొందెను.

తా.—ఆ గజమునకు ఒక్కదానికి నీట మునిఁగినందున క్షణముసేపు శాంతించియుండిన మదజలవర్షము అజమహారాజుయొక్క గ్రామ్యగజములను చూడఁగానే మరల ఊటిఁ కురియసాగెను.

వ్యా.—తస్యేతి.—తస్య ఏకనాగస్య ఏకాకినో గజస్య, కపోలభిత్త్యోః గణ్డస్థలయోః, జలావగాహేన క్షణమాత్రం - శాన్తా నివృత్తా, మదదుర్దినశ్రీః మదవర్షలక్ష్మీః, వన్యేతరాణాం గ్రామ్యాణామ్, అనేకపానాం ద్విపానాం, దర్శనేన * 'ద్విరదోఽనేకపో ద్విప' ఇత్యమరః, పున ర్దిదీపే వవృధే.

---

సప్తచ్ఛదక్షీరకటుప్రవాహ
మసహ్య మాఘ్రాయ మదం తదీయం

విలఙ్ఘితాధోరణతీవ్రయత్నాః
సేనాగజేన్ద్రా విముఖా బభూవుః. 48

టీక.—సప్త...హం - సప్తచ్ఛద = ఏడాకులయరఁటిచెట్టుయొక్క - క్షీర = పాలవలె - కటు = పరిమళవంతమయిన - ప్రవాహం = ఓడికగలదియు, అసహ్యం = ఓర్వఁగూడనిదియు, (అయిన), తదీయం = ఆయేనుఁగుదియైన, మదం = మదోదకమును, అఘ్రాయ = మూర్కొని, విల...త్నాః - విలఙ్ఘిత = మెడ్డివైవఁబడిన - ఆధోరణ=మావటీంద్రయొక్క - తీవ్ర = గడుసయిన - యత్నాః = ప్రయత్నముగలవై, సేనాగజేన్ద్రాః - సేనా = దండులోని - గజేన్ద్రాః = గజరాజములు, విముఖాః = పెడమొగముగలవి, బభూవుః = అయినవి.

తా.—ఆయేనుఁగుమదము ఏడాకులయరఁటిపాలవలె పరిమళించుచుండెను. అట్టి యా యోర్వరాని మదగంధమును అఘ్రాణించినవై దండులోని యేనుఁగులు మావటీంద్ర తీవ్రయత్నములకు లోఁగక పెడమొగ మయినవి.

వ్యా.—సప్తచ్ఛ దేతి.—సప్తచ్ఛదస్య వృక్షవిశేషస్య - క్షీరవత్ - కటుః సురభిః - ప్రవాహః ప్రసారో యస్య తం * 'కటు తిక్త కషాయాస్తు సౌరభ్యేఽపి ప్రకీర్తితా' ఇతి యాదవః, అసహ్యం, తదీయం గజసంబన్ధినం, మద, మాఘ్రాయ, సేనాగజేన్ద్రాః, విలఙ్ఘితః తిరస్కృతః - ఆధోరకానాం హస్తిపకానాం - తీవ్రో మహాన్ - ప్రయత్నో యైస్తే తథోక్తాః సన్తః * 'ఆధోరణా హస్తిపకా హస్త్యారోహా నిషాదిన' ఇత్యమరః, విముఖాః పరాఙ్ముఖాః, బభూవుః.

---

స చ్ఛిన్నబన్ధ ద్రుత యుగ్యశూన్యం
భగ్నాక్ష పర్యస్త రథం క్షణేన
రామాపరిత్రాణ విహస్త యోధం
సేనానివేశం తుములం చకార. 49

టీక.—సః = ఆయేనుఁగు, ఛిన్న...న్యం - ఛిన్న = త్రెంపఁబడిన - బన్ధ = కట్లుగలిగిన - ద్రుత = పలాయితములయిన - యుగ్య = గుఱ్ఱములుగలిగినదియు - శూన్యం= పాడఁజేసినదియు, భగ్నా...థం - భగ్న=విఱిగిన - అక్ష = ఇరుసులుంకలవిగనుకనే - పర్యస్త = ఉరలఁబడిన - రథం = తేరులుగలదియు, రామా...ధం - రామా = స్త్రీల యొక్క - పరిత్రాణ = సంరక్షణయందు - విహస్త = వ్యాకులులయిన - యోధం = జోదులుంకలదియు, (అయినట్టి), సేనా నివేశం=దండు విడిదలను, క్షణేన = నిముసములో, తుములం = అల్లకల్లోలము, చకార = చేసెను.

తా.—ఆయేనుఁగుయొక్క ధాకకు క్షణములో—గుఱ్ఱములు కట్లు త్రెంచుకొని పాఱిపోయి సేనను పాడుపెట్టినవి, ఇరుసులుఁ విఱిగి తేరులుఁ ఉరలఁబడినవి, జోదులు స్త్రీలను కాపాడుకొనుటకు తత్తరపడసాగిరి.—పాళెము ఇట్లు హల్లకల్లోల మైనది.

వ్యా.—స ఇతి.—సః గజః, ఛిన్నాః బన్ధాః యై స్తే ఛిన్నబన్ధాః - ద్రుతాః పలాయితాః - యుగం వహన్తీతి యుగ్యాః అశ్వాః * 'తద్వహతి రథ యుగ ప్రాసఙ్గ మి'తి యత్ప్రత్యయః - యస్మిన్ సః - స చాసౌ శూన్య శ్చ - తమ్, అక్షాః రథావయవాః దారువిశేషాః * 'అక్షో రథ స్యావయవే పాశకేఽప్యథ మిస్త్రియ'ఇతి శాశ్వతః - భగ్నాః అక్షాః యేషామ్ తే భగ్నాక్షాః - అత ఏవ పర్యస్తాః పతితాః - రథాః యస్మిన్ తం, రామాణాం స్త్రీణాం - పరిత్రాణే సంరక్షణే - విహస్తాః వ్యాకులాః - యోధా యస్మిన్ తం - రామాపరిత్రాణవిహస్తయోధం * 'విహస్త వ్యాకులౌ సమౌ' ఇ'త్యమరః, సేనానివేశం శిబిరం, క్షణేన, తుములం సంకులం, చకార.

---

త మాపత న్తం నృపతే రవధ్యో
వన్యః క రీతి శ్రుతవాన్ కుమారః
నివర్తయిష్య న్విశిఖేన కుమ్భే
జఘాన నాత్యాయత కృష్టశార్జ్గః. 50

టీక —నృపతేః = రాజునకు, వన్యః = అడవిదైన, కరీ = ఏనుఁగు, అవధ్యః = చంపఁదగినదికాదు, ఇతి = ఇట్లని, శ్రుతవాన్ = శాస్త్రమువలన విన్నవాఁడు, కుమారః=అజమహారాజు, ఆపతన్తం = మీఁదికివచ్చుచున్న, తం = ఆయేనుఁగును, నివర్తయిష్యన్ = మరలించువాఁడై, నాత్యా...సన్—నాత్యాయత = అనతిదీర్ఘముగా - కృష్ట=లాగఁబడిన - శార్జ్గః సన్=సింగిణివిల్లుకలవాఁడై, విశిఖేన = కోలతో, కుమ్భే = కుంభస్థలమునందు, జఘాన = కొట్టెను.

తా.—యుద్ధమునఁ దప్ప ఏనుఁగును చంపఁగూడ దని శాస్త్రమువలన నెఱింగినవాఁడు గాన అజమహారాజు మీఁదికి వచ్చుచున్నయాయేనుఁగును వెనుకకు మరల్చువాఁడై, సింగిణివింటి యల్లెత్రాటిని విశేషముగా తివియక ఒకపాటిగా తివిచి కోలతో దానికుంభస్థలము నేసెను.

వ్యా.—త మితి.—నృపతేః రాజ్ఞః, వనే భవః వన్యః, కరీ, అవధ్యః హన్తు మయోగ్య, ఇతి, శ్రుతవాన్ శాస్త్రా దభిజ్ఞాతవాన్, కుమారః అజః, ఆపతన్తమ్ అభిధావన్తం, తం గజం, నివర్తయిష్యన్ న తు ప్రహరిష్యన్, అత ఏవ, నాత్యాయతమ్ అనతిదీర్ఘం * నఞర్థస్య నశబ్దస్య సుప్సు పేతి సమాసః - కృష్టశార్జ్గః ఈషదాకృష్ట

చాపః సః, విశిఖేన బాణేన, తమ్మై, జఘాన ; అత్ర చాక్షుషః * 'లక్ష్మీకా మో యుద్ధా దన్యత్ర కరివధం న కుర్యాత్, ఇయం హి శ్రీ ర్యే కరిణ' ఇతి - అత ఏవ 'యుద్ధా దన్యత్ర' ఇతి ద్యోతనార్థమేవ వన్యగ్రహణం కృతమ్.

---

స విద్ధమాత్రః కిల నాగరూప ముత్సృజ్య తద్విస్మితసైన్యదృష్టః
స్ఫురత్ప్రభామణ్డలమధ్యవర్తి కాన్తం వపు ర్వ్యోమచరం ప్రపేదే. 51

టీక.—సః = ఆయేనుఁగు, విద్ధమాత్రః కిల - కొట్టఁబడినమాత్రానికే, నాగరూపం = ఏనుఁగుదేహమును, ఉత్సృజ్య = వదలి, తద్వి...సః - తత్ = అందులకు - విస్మిత = ఆశ్చర్యపడిన - సైన్య = సైనికులచేత - దృష్టః సః = చూడఁబడిన దై, స్ఫుర...ర్తి - స్ఫురత్ = వెలుఁగుచున్న - ప్రభా = కాంతులయొక్క - మణ్డల = మొత్తముయొక్క - మధ్య = నడుమను - వర్తి = ఉన్నదై, కాన్తం = మనోహరమై, వ్యోమచరం - వ్యోమ = ఆకాశమునందు - చరం = సంచరించెడి, వపుః = శరీరమును, ప్రపేదే = పొందెను.

తా.—కోల తగిలినమాత్రాన ఏనుఁగు ఆదేహమును వదలినదై సైనికులు అందుల కాశ్చర్యపడి చూచుచుండఁగా ధగధగని కాంతిపుంజము ఆకాశగమనమును గల మనో హరదేహమును పొందినది.

వ్యా.—స ఇతి.—స గజః, విద్ధమాత్రః తాడితమాత్రః కిల న తు ప్రహృతః, తథాఽపి, నాగరూపం గజశరీరమ్, ఉత్సృజ్య, తేన వృత్తాన్తేన విస్మితైః సైన్యైః దృష్టః సః, స్ఫురతః ప్రభామణ్డలస్య మధ్యవర్తి, కాన్తం మనోహరం, వ్యోమచరం వపుః దివ్యం శరీరం, ప్రపేదే ప్రాప.

---

అథ ప్రభావోపనతైః కుమారం కల్పద్రుమోత్థైః రవకీర్య పుష్పైః
ఉవాచ వాగ్మీ దశనప్రభాభిః సంవర్ధితోరస్థ్సలతారహారః. 52

టీక.—అథ = అంతట, ప్రభావోపనతైః - ప్రభావ = మహిమచేత - ఉపనతైః = ప్రాప్తములైన, కల్పద్రుమోత్థైః - కల్పద్రుమ = కల్పవృక్షమునందు - ఉత్థైః పుట్టిన, పుష్పైః = పువ్వులతో, కుమారం = అజమహారాజును, అవకీర్య = వెదచల్లి, దశన ప్రభాభిః = దంత కాంతులచేత, సంవ...రః - సంవర్ధిత = పెంపొందింపఁబడిన - ఉరస్థ్సల = ఱొమ్ముప్రదేశమందలి - తార = గొప్పదైన - హారః = ముత్తెపుఁజేరులు గలవాఁడై, వాగ్మీ = మాటనేర్పరి యైన, సః = ఆపురుషుఁడు, ఉవాచ = పల్కెను.

తా ___ అంతట ఆదివ్యపురుషుఁడు తన ప్రభావముచే వచ్చిన కల్పవృక్షకుసుమములను అజమహారాజుపైఁ గురిసి, మాటనేర్పు మెఱయ, దంతకాంతులచే ఱొమ్ములోని ముత్తెపుఁబేరుల కాంతులు వర్ధిల్లుచుండఁగా, ఇట్లు వక్కాణించెను.

వ్యా.___ అ థేతి.___ అథ, ప్రభావేన - ఉపనతైః ప్రాప్తైః, కల్పద్రుమోత్థైః కల్పవృక్షోత్పన్నైః, పుష్పైః, కుమారమ్ అజం, అవకీర్య అభివర్ష్య - పుష్పవృష్టిం ప్రకీర్యే త్యర్థః, దశనప్రభాభిః దన్తకాన్తిభిః, సంవర్ధితాః ఉరస్స్థలే యే - తారహారాః స్థూలముక్తాహారాః - తే యేన స తథోక్తః, వాచోఽస్య సన్తీతి వాగ్మీ వక్తా * 'వాచో గ్మిని రి' తి గ్మినిప్రత్యయః, స పురుషః ఉవాచ.

---

మతఙ్గశాపా దవలేపమూలా దవాప్తవా నస్మి మతఙ్గజత్వం
అవేహి గన్ధర్వపతే స్తనూజం ప్రియంవదం మాం ప్రియదర్శనస్య 53

టీక.___ అవ...త్ ___ అవలేప = (నా) గర్వమే - మూలాత్ = కారణముగాఁ గలదైన, మతఙ్గశాపాత్ - మతఙ్గ = మతంగమునియొక్క - శాపాత్ = తిట్టువలన, మతఙ్గజత్వం = ఏనుఁగుఁదనమును, అవాప్తవాన్ = పొందినవాఁడను, అస్మి = అయితిని, మాం = నన్ను, ప్రియదర్శనస్య = ప్రియదర్శనుఁడను పేరి, గన్ధర్వపతేః = గంధర్వరాజునకు, తనూజం = కుమారునిఁగాను, ప్రియంవదం = ప్రియంవదుఁడను పేరివానినిగాను, అవేహి = ఎఱుంగుము.

తా.___ నాగర్వమునకు కినిసి మతంగముని పెట్టిన శాపముచేత నేను ఏనుఁగనైతిని. నాతండ్రి గంధర్వరాజు, ప్రియదర్శనుఁ డను నాతఁడు, నా పేరు ప్రియంవదుఁడు.

వ్యా.___ మతఙ్గేతి.___ అవలేప మూలాత్ గర్వ హేతుకాత్ * 'అవలేపస్తు గర్వే స్యా ల్లేపనే ద్వేషణేఽపి చే' తి విశ్వః, మతఙ్గస్య మునేః - శాపాత్, మతఙ్గజత్వం * 'మతఙ్గజో గజో నాగ ఇ' త్యమరః, అవాప్తవాన్ ప్రాప్తవా, నస్మి, మాం, ప్రియదర్శనస్య ప్రియదర్శనాఖ్యస్య, గన్ధర్వపతేః గన్ధర్వరాజస్య, తనూజం పుత్రం - 'స్త్రియాం మూర్తి స్తను స్తనూ రి' త్యమరః, ప్రియంవదం ప్రియంవదాఖ్య, మవేహి జానీహి * ప్రియం వద తీతి ప్రియంవదః * 'ప్రియవశే వదః ఖ చి' తి ఖచ్ప్రత్యయః.

---

స చానునీతః ప్రణతేన పశ్చా
న్మయా మహర్షి ర్మృదుతా మగచ్ఛత్ ;
ఉష్ణత్వ మగ్న్యాతపసంప్రయోగా
చ్ఛైత్యం హి యత్ సా ప్రకృతి ర్జలస్య. 54

టీక.—సః = ఆ, మహర్షిః చ = మతంగముని యు, ప్రణతేన = మ్రొక్కినట్టి, మయా = నాచేత, అనునీతః సన్ = వేడుకొనఁబడినవాఁడై, పశ్చాత్ = తర్వాత, మృదుతాం = కనికరమును, అగచ్ఛత్ = పొందెను, (తథా హి = అదేసరి), జలస్య = నీటికి, ఉష్ణత్వం = వేడిమి, అగ్న్యా...త్—అగ్నిః = నిప్పుయొక్కగాని - ఆతప=ఎండయొక్కగాని - సంప్రయోగాత్ = సంబంధమువలన, (కలుగును), శైత్యం = చలువ, యత్ = ఏదికలదో, సా = అది, ప్రకృతిః = స్వభావము.

తా.—పిమ్మట నేను నమస్కరించి వేడుకోఁగా మతంగముని కనికరించెను. నీటికి నిప్పుయొక్కగాని ఎండయొక్కగాని కూడికవలన వేడి కలుగునేగాని, చలువయే గదా స్వాభావికము. అట్లే మహామునికిని నాగర్వముచేత కోపము కలిగెనేగాని దయయే స్వాభావికము.

వ్యా.—స ఇతి.—మహర్షి ర్మతఙ్గ శ్చ, ప్రణతేన నమ్రేణ, మయా, అనునీతః సన్, పశ్చా, న్మృదుతాం శాన్తి - మగచ్ఛత్ - దయార్ద్రోఽభూ దిత్యర్థః; తథా హి - జలస్య, ఉష్ణత్వం అగ్నే రాతపస్య వా - సంప్రయోగా త్సంపర్కాత్, న తు ప్రకృత్యా ఉష్ణత్వం, యత్, శైత్యం శీతలత్వం, సా శీతలతా, ప్రకృతిః స్వభావః * విధేయప్రాధాన్యా త్స్వేతి స్త్రీలిఙ్గనిర్దేశః; మహర్షీణా మపి శాన్తి రేవస్వభావః న క్రోధ ఇతి భావః.

---

ఇక్ష్వాకువంశప్రభవో యదా తే
భేత్స్యత్యజః కుమ్భ మయోముఖేన
సంయోక్ష్యసే స్వేన వపుర్మహిమ్నా
త దేత్యవోచ త్స తపోనిధి ర్మామ్. 55

టీక.—ఇక్ష్వా...వః—ఇక్ష్వాకు = ఇక్ష్వాకురాజుయొక్క - వంశ = కులము నందు = ప్రభవః - పుట్టుకగలిగిన, అజః = అజమహారాజు, యదా = ఎప్పుడు, తే = నీయొక్క, కుమ్భం = కుంభస్థలమును, అయోముఖేన = బాణముచేత, భేత్స్యతి = పగుల్చునో, తదా = అప్పుడు, స్వేన = స్వకీయమయిన, వపుర్మహిమ్నా - వపుః = దేహముయొక్క - మహిమ్నా = ప్రభావముతో, సంయోక్ష్యసే = కూడుకొందువు, ఇతి = ఈప్రకారముగ, సః = ఆ, తపోనిధిః = మతంగముని, మాం = నాతో, అవోచత్ = పలికెను.

తా.—'ఇక్ష్వాకువంశజుఁడు అజుఁడు బాణముతో నీకుంభస్థలమును ఎప్పుడు చీల్చునో అప్పుడు వెండియు నీకు ప్రభావసంపన్నమయిన నీదేహము వచ్చును;' అని మహాముని శాపాంతము ననుగ్రహించెను.

వ్యా.—ఇక్ష్వా క్వేతి.—ఇక్ష్వాకువంశే ప్రభవో యస్య సః అజః, యదా, తే తవ, కుమ్భమ్, అయోముఖేన లోహాగ్రేణ శరేణ, భేత్స్యతి విదారయిష్యతి, తదా, స్వేన, వపుషా మహిమ్నా, పునః, సంయోక్ష్యసే సంగచ్ఛసే, ఇతి అనేన ప్రకారేణ, సః, తపోనిధిః తపసాం స్థానభూతః మతఙ్గః, మా మవోచత్.

---

సమ్మోచితః సత్త్వవతా త్వయాఽహం
శాపా చ్చిర ప్రార్థితదర్శనేన
ప్రతిప్రియం చే ద్భవతో న కుర్యాం
వృథా హి మే స్యాత్ స్వపదోపలబ్ధిః.　　56

టీక.—చిర...న - చిర = బహుకాలమునుండి - ప్రార్థిత = కోరఁబడిన - దర్శనేన - దర్శనముగలవాఁడవును, సత్త్వవతా=బలవంతుఁడవును, (అయిన), త్వయా = నీచేత, అహం = నేను, శాపాత్ = శాపమునుండి, సమ్మోచితః = విడిపింపఁబడితిని, భవతః = నీకు, ప్రతిప్రియం = ప్రత్యుపకారమును, న కుర్యాం చేత్ = చేయనయేని, మే = నాకు, స్వపదోపలబ్ధిః - స్వ = స్వకీయమయిన - పద = స్థానముయొక్క - ఉపలబ్ధిః = ప్రాప్తి, వృథా హి = వ్యర్థమే, స్యాత్ = అగును.

తా.—అప్పటినుండియు చిరకాలము నేను నీదర్శనమును కోరుచుంటిని. బలవంతుఁడవు నీవు ఇప్పుడు నన్ను శాపమునుండి విడిపించితివి. ఈయుపకారమునకు ప్రత్యుపకారము చేయనేని, నాకు నా తొంటి పదవి ప్రాప్తించుట వ్యర్థమే గదా.

వ్యా.—సమ్మోచిత ఇతి —చిరం ప్రార్థితం చిరకాలం కాఙ్క్షితం - దర్శనం యస్య తేన, సత్త్వవతా బలవతా, త్వయా, అహం, శాపాత్, సమ్మోచితః మోక్షం ప్రాపితః; భవతః, ప్రతిప్రియం ప్రత్యుపకారం, న కుర్యాం చేత్, మే, స్వపదోపలబ్ధిః స్వస్థానప్రాప్తిః * 'పదం వ్యవసిత త్రాణ స్థాన లక్ష్మాఙ్ఘ్రి వస్తు ష్వి'త్యమరః, వృథా స్యాత్ * 'వ్యర్థకే తు వృథా ముధే' త్యమరః; తదుక్తం * 'ప్రతికర్తు మశక్యస్య జీవితా న్మరణం వర మి'తి.

---

సమ్మోహనం నామ సఖే మ మాస్త్రం
ప్రయోగ సంహార విభక్త మన్త్రం
గాన్ధర్వ మాదత్స్వ, యతః ప్రయోక్తు
ర్న చారిహింసా విజయ శ్చ హస్తే.　　57

టీక.—హేసఖే = ఓసఖుఁడా, యతః = ఏయస్త్రమువలన, ప్రయోక్తుః = ప్రయోగించువానికి, అరిహింసా - అరి = శత్రువులవలని - హింసా=బాధ, న చ = లేదో, విజయ శ్చ=గెలుపును, హస్తే = చేతిలో నున్నదో, ప్రయో...స్త్రమ్ - ప్రయోగ = ఏయుంటయందును - సంహార = ఆఁపుటయందును - విభక్త = వినియుక్తమయిన - మన్త్రం = మంత్రముకలదియు, గాన్ధర్వం = గంధర్వదేవతాకమైనట్టిదియు, సమ్మోహనం నామ=సమ్మోహనము అని ప్రసిద్ధమయిన, మమ=నాయొక్క, అస్త్రం = (ఆ) యస్త్రమును, ఆదత్స్వ = కైకొనుము.

తా.—సఖుఁడా, నాకు సంమోహన మని ప్రసిద్ధమయినట్టిది ప్రయోగోపసంహారములయందు వినియుక్త మయినమంత్రము గలయట్టిది గంధర్వదేవతాకము అస్త్రము కలదు. దానిం బ్రయోగించువానికి శత్రువులవలన బాధ లేదు, గెలుపు హస్తగతము; దానిని నీ కిచ్చెద, కైకొమ్ము.

వ్యా.—సమ్మోహన మితి.—హే సఖే - సఖిశబ్దేన సమప్రాణతోక్తా-యథోక్తం-

'అత్యాగసహనో బన్ధుః, స దైవానుమతః సుహృత్,
ఏకక్రియం భవే న్మిత్త్రం, సమప్రాణః సఖా మతః.' ఇతి,

ప్రయోగసంహారయోః విభక్తః మన్త్రః యస్య తత్తథోక్తం వినియుక్తమన్త్ర మిత్యర్థః, గాన్ధర్వం గన్ధర్వదేవతాకం, సంమోహ్యతే అనే నేతి సంమోహనం నామ, మమ అస్త్రం, ఆదత్స్వ గృహాణ, యతః యస్మాత్, ప్రయోక్తుః అస్త్రప్రయోగిణః, అరిహింసా అరిభ్యః సకాశాత్ హింసా చ, న, విజయ శ్చ - హస్తే హస్తగతః - విజయో భవ తీ త్యర్థః.

---

అలం హ్రియా మాం ప్రతి య న్ముహూర్తం
దయాపరో ఽభూః ప్రహర న్నపి త్వం;
తస్మా దుపచ్ఛన్దయతి ప్రయోజ్యం
మయి త్వయా న ప్రతిషేధరౌక్ష్యమ్. 58

టీక.—మాం ప్రతి=నన్నుఁగూర్చి, హ్రియా = (కొట్టినందులకైన) లజ్జ, అలం= వలదు, యత్ = ఎందువలన, త్వం = నీవు, మాం = నన్ను, ప్రహరన్నపి = కొట్టుచున్నను, ముహూర్తం = ఇంచుకసేపు, దయాపరః = దయపూనినవాఁడవు, అభూః = అయితివో, తస్మాత్ =అందువలన, ఉపచ్ఛన్దయతి = వేఁడుకొనుచున్న, మయి=నాయందు, త్వయా = నీచేత, ప్రతిషేధరౌక్ష్యం - ప్రతిషేధ = పరిహారమనెడి - రౌక్ష్యం = పరుషత్వము, ప్రయోజ్యం న=ప్రయోగింపఁదగినది కాదు.

తా.—నన్ను వధించినందులకై నీవు లజ్జింపవలదు; క్షణమాత్రము కొట్టినవాఁడ వైనను నాకు మహోపకారి వైతివి. కావున నీవు నా ప్రార్థనను నిషేధించు పారుష్యమును వహించుట న్యాయ్యము గాదు.

వ్యా.—వధలజ్జితః కథ మస్త్రగ్రహణపరః స్యా మితి చేత్ తత్రాహ - అల మితి.—కించ, మాం ప్రతి, హ్రియా ప్రహారనిమిత్తయా లజ్జయా, అలమ్ * 'అలం భూషణ పర్యాప్తి శక్తి వారణ వాచక మి' త్యమరః, కుతః, య ద్యతో హేతోః, త్వం మాం ప్రహార న్నపి ముహూర్తం, దయాపరః కృపాళు, రభూః, త త్తస్మాత్కారణాత్, ఉపచ్ఛన్దయతి ప్రార్థనాయమానే తు, మయి, త్వయా, ప్రతిషేధః పరిహారః-స ఏవ రౌక్ష్యం పారుష్యం, న ప్రయోజ్యం న కర్తవ్యమ్.

---

త థే త్యుపస్పృశ్య పయః పవిత్రం
సోమోద్భవాయాః సరితో నృసోమః
ఉదఙ్ముఖః సోఽస్త్రవి దస్త్రమన్త్రం
జగ్రాహ తస్మా న్నిగృహీతశాపాత్. 59

టీక.—నృసోమః = పురుషశ్రేష్ఠుఁడును, అస్త్రవిత్ = అస్త్రజ్ఞుఁడును, (అయిన), సః = ఆయజమహారాజు, త థేతి = వల్లెయని, సోమోద్భవాయాః - సోమ = చంద్రునివలన - ఉద్భవాయాః = పుట్టుకగలిగిన - సరితః = ఏటియొక్క - అనఁగా నర్మదయొక్క, పవిత్రం=పరిశుద్ధమయిన, పయః=నీటిని, ఉపస్పృశ్య = ఆచమనముచేసి, ఉదఙ్ముఖః సన్ = ఉత్తరాభిముఖుఁడయి, నిగృహీతశాపాత్ - నిగృహీత = నివారింపఁబడిన-శాపాత్ = శాపముకలిగిన, తస్మాత్ = ఆప్రియంవదునివలన, అస్త్రమన్త్రం - అస్త్ర = సమ్మోహనాస్త్రముయొక్క - మన్త్రం = మంత్రమును, జగ్రాహ = గ్రహించెను.

తా.—అస్త్రజ్ఞుఁడయిన యాపురుషశ్రేష్ఠుఁడు అజమహారాజు అందుల కంగీకరించి పవిత్రమయిన నర్మదాజలముతో ఆచమనముచేసి ఉత్తరాభిముఖుఁడై సమ్మోహనాస్త్రమంత్రమును శాపవిమోచితుఁడైన ప్రియంవదునివలన ఉపదేశము పొందెను.

వ్యా.—త థేతి.—నా-సోమ శ్చన్ద్ర-ఇవ నృసోమః * సోమ ఓషధిచన్ద్రయో రి' తి శాశ్వతః - పురుషశ్రేష్ఠ ఇ త్యర్థః * ఉపమితసమాసః, అస్త్రవిత్ అస్త్రజ్ఞః, సః అజః, త థేతి, సోమాత్ ఉద్భవో యస్యా స్తస్యాః సోమోద్భవాయాః సరితః నర్మదాయాః * 'రేవా తు నర్మదా సోమోద్భవా మేకలకన్య కే' త్యమరః, పవిత్రం పయః, ఉపస్పృశ్య పీత్వా - ఆచ మ్యే త్యర్థః, ఉదఙ్ముఖః సన్, నిగృహీతశాపాత్ నివర్తితశాపాత్ - ఉపకృతా ది త్యర్థః, తస్మాత్ ప్రియంవదాత్, అస్త్రమన్త్రం జగ్రాహ.

---

ఏవం తయో రధ్వని దైవయోగా
దాసేదుషోః సఖ్య మచిన్త్య హేతు
ఏకో యయౌ చైత్రరథప్రదేశాం
త్సౌరాజ్యరమ్యా నపరో విదర్భాన్. 60

టీక.—ఏవం = ఈప్రకారము, అధ్వని = దారిలో, దైవయోగాత్ = దైవ ఘటనవలన, అచిన్త్యహేతు - అచిన్త్య = ఊహింపశక్యముగాని - హేతు = కారణముకలిగిన, సఖ్యం = స్నేహమును, ఆసేదుషోః = పొందిన, తయోః = యిరువురలో, ఏకః = ఒకఁడు (ప్రియంవదుఁడు), చైత్ర...శాన్ - చైత్రరథ = కుబేరోద్యానముయొక్క - ప్రదేశాన్ = ప్రదేశములకు, యయౌ = పోయెను, అపరః = ఇతరుఁడు (అజమహారాజు), సౌ...మ్యాన్ - సౌరాజ్య = మంచిరాజు ఉండుటచేత - రమ్యాన్ = మనోహరములయిన, విదర్భాన్ = విదర్భదేశమునకు, యయౌ = పోయెను.

తా.—కారణము కానరాని చెలిమిని ఈవిధముగా దారిలో దైవయోగంబునం బొందిన యా యిద్దఱిలో ప్రియంవదుఁడు కుబేరోద్యానమునకును, అజమహారాజు మంచిరాజుయొక్క యేలుబడిచే మనోహరమయిన విదర్భదేశమునకును బోయిరి.

వ్యా.—ఏవ మితి.—ఏవమ్, అధ్వని మార్గే, దైవయోగాత్ దైవవశాత్, అచిన్త్యహేతు అనిర్ధార్యహేతుకం, సఖ్యం సఖిత్వం * 'సఖ్యు ర్య' ఇతి యప్రత్యయః, ఆసేదుషోః ప్రాప్తవతో, స్తయో ర్మధ్యే, ఏకో గన్ధర్వః, చైత్రరథస్య కుబేరోద్యానస్య - ప్రదేశాన్ * 'అ స్యోద్యానం చైత్రరథ మి'త్యమరః, అపరః అజః, సౌరాజ్యేన రాజన్వత్తయా - రమ్యాన్, విదర్భాన్ విదర్భదేశాన్ యయౌ.

---

తం తస్థివాంసం నగరోపకణ్ఠే తదాగమారూఢగురుప్రహర్షః [62
ప్రత్యుజ్జగామ క్రథకైశికేన్ద్ర శ్చన్ద్రం ప్రవృద్ధోర్మి రి వోర్మిమాలీ.

టీక.—నగరోపకణ్ఠే - నగర = పట్టణముయొక్క - ఉపకణ్ఠే = సమీపమందు, తస్థివాంసం = ఉన్నట్టి, తం = ఆయజమహారాజును, తదా...ర్షః - తత్ = ఆయజమహారాజుయొక్క - ఆగమ = రాకచేత - ఆరూఢ = పుట్టిన - గురు = ఎక్కుడయిన - ప్రహర్షః = సంతోషముగలవాఁడై, క్రథకైశికేన్ద్రః = విదర్భరాజు, ప్రవృద్ధోర్మిః - ప్రవృద్ధ = పెరిఁగిన - ఊర్మిః = అలలుగలిగిన, ఊర్మిమాలీ = సముద్రుఁడు, చన్ద్రమివ = చంద్రునింబోలె, ప్రత్యుజ్జగామ = ఎదురుకొనెను.

తా.—అజమహారాజు వచ్చి పట్టణముచెంత నిలువఁగానే, అతనిరాకకు అత్యం

తము సంతోషించినవాఁడై విదర్భరాజు అతనికి, అలలు పెరిఁగి సముద్రుఁడు చంద్రునికిం బోలె, ఎదు రేఁగెను.

వ్యా.—త మితి.—నగరస్య - ఉపకణ్ఠే, తస్థివాంసం స్థితం, త మజం, తస్య అజస్య - ఆగమేన - ఆరూఢః ఉత్పన్నః - గురుః ప్రహర్షః యస్య సః, క్రథకైశికేన్ద్రః విదర్భరాజః, ప్రవృద్ధోర్మిః, ఊర్మిమాలీ సముద్రః, చన్ద్రమివ ప్రత్యుజ్జగామ.

---

ప్రవేశ్య చైనం పుర మగ్రయాయీ
నీచై స్త థోపాచర దర్పితశ్రీః,
మేనే యథా తత్ర జనః సమేతో
వైదర్భ మాగన్తు మజం గృహేశమ్. 62

టీక.—అగ్రయాయీ = ముందుపోవుచు, నీచైః = నమ్రుఁడై, సః = ఆభోజరాజు, ఏనం = ఈయజమహారాజును, పురం = పట్టణములో, ప్రవేశ్య = ప్రవేశపెట్టి, అర్పితశ్రీః సన్ - అర్పిత = ఒసఁగఁబడిన - శ్రీః సన్ = సిరిగలవాఁడై, యథా = ఏ ప్రకారము, తత్ర = ఆపురమందు, సమేతః = కూడిన, జనః = జనము, వైదర్భం = భోజరాజును, ఆగన్తుం = అతిథినిగాను, అజం = అజమహారాజును, గృహేశం = ఇంటిదొరనుగాను, మేనే = తలంచెనో, తథా = ఆప్రకారము, ఉపాచరత్ = ఉపచరించెను.

తా.—భోజరాజు తాను ముందు పోవుచు అజమహారాజును పురప్రవేశము సేయించి వినయముతో అతనికి సిరు లర్పించినవాఁడై, ఘనముగా నుపచారములు గావించెను. ఆనగరమున కూడియున్న జనులు. ఆయుపచరించిన విధముం గాంచి, అజుఁడే యింటి దొర, భోజుఁడే అతిథి, యని తలంచిరి.

వ్యా.—ప్రవే శ్యేతి.—సః భోజః, ఏనమ్ అజమ్, అగ్రయాయీ సేవార్థ మ్మేణ పురో గచ్ఛ న్ని త్యర్థః, నీచైః నమ్రః, పురం ప్రవేశ్య ప్రవేశం కారయిత్వా, ప్రీత్యా, అర్పితా శ్రీ ర్యేన స త థోక్తః సన్, తథా, తేన ప్రకారేణ, ఉపాచరత్ ఉపచరితవాన్, యథా యేన ప్రకారేణ, తత్ర పురే, సమేతః మిళితః, జనః, వైదర్భం భోజమ్ ఆగన్తుం ప్రాఘుణికం - అతిథి మి త్యర్థః * 'స్యా దావేశిక ఆగన్తు రతిథి ర్నా గృహాగత' ఇత్యమరః, మేనే, అజం, గృహేశం గృహపతిం, మేనే.

---

తస్యాధికారపురుషైః ప్రణతైః ప్రదిష్టాం
ప్రాగ్ద్వారవేదివినివేశిత పూర్ణకుమ్భాం

రమ్యాం రఘుప్రతినిధిః స నవోపకార్యాం
బాల్యాత్ పరా మివ దశాం మదనోఽధ్యువాస. 63

టీక.—రఘుప్రతినిధిః - రఘు = రఘువే - ప్రతినిధిః = సాటిగాఁగలిగిన, సః = ఆయజుఁడు, ప్రణతైః = నమస్కరించినవారైన, తస్య = ఆభోజునియొక్క, అధికార పురుషైః = నియోగిజనులచేత, ప్రదిష్టాం = చూపఁబడినదియు, ప్రాగ్ద్వా...మ్భాం - ప్రాగ్ద్వార = పూర్వద్వారముయొక్క - వేది = అరఁగునందు - వినివేశిత = ఉంపఁబడిన - పూర్ణ = నిండు - కుమ్భాం = కలశముకలదియు, రమ్యాం = మనోహరమును, (అయిన), నవోపకార్యాం - నవ = క్రొత్తదయిన - ఉపకార్యాం = రాజభవనమును, మదనః = మన్మథుఁడు, బాల్యాత్ = పసితనముకంటె, పరాం = తర్వాతిదైన, దశా మివ = అవస్థనుబోలె - అనఁగా - యౌవనమునుంబోలె, అధ్యువాస = అధిష్ఠించెను.

తా.—భోజరాజుయొక్క నియోగిజనులు రఘుమహారాజతుల్యుఁడైన యూయజమహారాజునకు నమస్కరించి విడిదియిల్లు చూపిరి. దాని తూర్పువాకిటి యరఁగుమీఁద మంగళార్థము నిండుకలశము ఉంపఁబడియుండెను. ఆమనోహర నూతన రాజభవనమున అజమహారాజు యౌవనదశయందు మన్మథుండువోలె విడిసెను.

వ్యా.—త స్యేతి.—రఘుప్రతినిధిః రఘుకల్పః - రఘుతుల్య ఇ త్యర్థః - ఉక్తం చ దణ్డినా సాదృశ్యవాచకప్రస్తావే * 'కల్ప దేశీయ దే శ్యాది ప్రఖ్య ప్రతినిధీ అ పీ'తి, సః అజః, ప్రణతైః నమస్కృతవద్భిః * కర్తరి క్తః, తస్య - భోజస్య - అధికారః నియోగః - తస్య పురుషైః అధికృతై రి త్యర్థః, ప్రదిష్టాం నిర్దిష్టాం. ప్రాగ్ద్వారస్య వేద్యాం - వినివేశితః ప్రతిష్ఠాపితః - పూర్ణః కుమ్భో యస్యా స్తాం - స్థాపితమఙ్గళకలశా మి త్యర్థం, రమ్యాం రమణీయాం, నవోపకార్యాం నూతనరాజభవనం * 'ఉపకార్యా రాజసద్మ న్యుపచారోచితేఽన్యవ ది'తి విశ్వః, మదనః మన్మథః, బాల్యా త్పరాం శైశవానన్తరాం - దశాం యౌవన మి వే త్యర్థః. అధ్యువాస అధిష్ఠితవాన్ * 'ఉపాన్వధ్యాఙ్వస' ఇతి కర్మత్వమ్.

---

తత్ర స్వయంవరసమాహృత రాజలోకం
కన్యాలలామ కమనీయ మజస్య లిప్సోః
భావావబోధకలుషా దయి తేవ రాత్రౌ
నిద్రా చిరేణ నయనాభిముఖీ బభూవ. 64

టీక.—తత్ర = ఆరాజభవనమందు, స్వయం...కం - స్వయంవర = స్వయంవర నిమిత్తము - సమాహూత = రప్పింపఁబడిన - రాజ లోకం = రాజ జనముగలిగిన, కమనీయం = అభిలషింపఁదగిన, కన్యాలలామ = కన్యాశ్రేష్ఠమును, లిప్సోః = పొందఁగోరిన, అజస్య = అజమహారాజునకు, భావా...షా - భావ = (పురుషుని) యభిప్రాయముయొక్క - అవబోధ = ఎఱుంగుటయందు - కలుషా = అశక్తురా లయిన, దయి తేవ = ప్రియవలె, రాత్రౌ = రాత్రియందు, నిద్రా = నిద్ర, చిరేణ = చాలసేపటికి, నయనాభిముఖీ = నయన - కన్నులకు - అభిముఖీ = ఎదురుగా వచ్చినట్టిది, బభూవ = ఆయెను.

తా.—నానాదిగ్దేశములనుండి ఎవతెస్వయంవరముకై రాజులు రావింపఁబడిరో కోరఁదగినదైన యాకన్యాలలామమును పొందఁగోరి తలపోయుచున్న యా యజమహారాజునకు, ఆరాజభవనమునందు, పురుషుని తమకము నెఱుంగనేరని కాంతవలె నిద్ర చాల సేపటికి వచ్చెను.

వ్యా.—త త్రేతి.—తత్ర ఉపకార్యాయాం, స్వయంవర నిమిత్తం సమాహూతః రాజలోకో యేన తత్, కమనీయం స్పృహణీయం, కన్యాలలామ కన్యాశ్రేష్ఠం -

'లలామోఽస్త్రీ లలామాఽపి ప్రభావే పురుషే ధ్వజే

శ్రేష్ఠ భూషా పుణ్డ్ర శృఙ్గ పుచ్ఛ చిహ్నాశ్వ లిఙ్గేషు.' ఇతి యాదవః,

లిప్సోః లబ్ధు మిచ్ఛోః, లభేః సన్నన్తా దుప్రత్యయః, అజస్య, భావావబోధే పురుషస్య అభిప్రాయపరిజ్ఞానే - కలుషా అసమర్థా, దయి తేవ ప్రియత మేవ, రాత్రౌ, నిద్రా, చిరేణ బహుకాలేన, నయనాభిముఖీ, బభూవ; * 'రాజానం కామినం చోరం ప్రవిశన్తి ప్రజాగరాః' ఇతి భావః * అభిముఖీశబ్దః జీబన్తః చ్వ్యన్తో వా.

---

తం కర్ణభూషణనిపీడితపీవరాంసం
శయ్యోత్తరచ్ఛదవిమర్ద కృశాఙ్గరాగం
సూతాత్మజాః సవయసః ప్రథితప్రబోధం
ప్రాబోధయ న్నుషసి వాగ్భి రుదారవాచః. 65

టీక.—కర్ణ...సం-కర్ణభూషణ = కర్ణకుండలములచేత - నిపీడిత = ఒత్తుకొనఁబడిన - పీవర = బలిసిన - అంసం = భుజశిరస్సుగలవాఁడును, శయ్యో...గం - శయ్యా= పాన్పుయొక్క - ఉత్తరచ్ఛద = పైవలువయొక్క - విమర్ద = ఒరయికచేత - కృశ = కొంచెమయిన - అఙ్గరాగం = మైపూఁతగలవాఁడును, ప్రథిత = ప్రకృష్టమయిన - ప్రబోధం = జ్ఞానముగలవాఁడును, (అయిన), తం = ఆయజమహారాజును, సవయసః =

సమానవయస్కులును, ఉదారవాచః - ఉదార = ప్రౌఢములయిన - వాచః = వాక్కులుగలవారును, (అయిన), సూతాత్మజా = వందిపుత్త్రులు, వాగ్భిః = స్తుతి పాఠముల చేత, ఉషసి = ప్రాతఃకాలమునందు, ప్రాబోధయన్ = మేలుకొలిపిరి.

తా.—తెల్లవాఱునప్పటికి అజమహారాజునకు కర్ణకుండలములు బలుపుగల భుజ శిరములందు ఒత్తుకొన్నగుర్తు లేర్పడియుండెను; పానుపుయొక్క పైవలువ ఒరసికొనుట వలన మైపూఁత కడు సన్నగిల్లెను; ఇట్లున్న యాయజమహారాజును అధికజ్ఞానము కల వానిని తనయీడువాండ్రగు వందిపుత్త్రులు ప్రౌఢవచస్కులు ఉషఃకాలమందు స్తుతు లచే మేలుకొలిపిరి.

వ్యా.—త మితి.—కర్ణభూషణాభ్యాం నిపీడితౌ - పీవరౌ పీనౌ - అంసౌ భుజశిరసీ - యస్య తం, శయ్యాయాః - ఉత్తరచ్ఛదస్య ఉపర్యాస్తరణస్య వస్త్రస్య - విమర్దేన ఘర్షణేన - కృశః విరళః - అఙ్గరాగః యస్య తం - న త్వఙ్గనాసఙ్గా దితి భావః, ప్రథితప్రబోధం ప్రకృష్టజ్ఞానం, త మేవ మజం, సవయసః సమానవయస్కాః, ఉదారవాచః ప్రగల్భగిరః, సూతాత్మజాః వన్దిపుత్త్రాః - 'వైతాళికా' ఇతి వా పాఠః * 'వైతాళికా బోధకరా' ఇ త్యమరః, వాగ్భిః స్తుతిపాఠైః, ఉషసి ప్రాతఃకాలే, ప్రాబోధయన్ ప్రబోధయామాసుః.

---

రాత్రి ర్గతా మతిమతాంవర ముఞ్చ శయ్యాం,
ధాత్రా ద్విధైవ నను ధూ ర్జగతో విభక్తా;
తా మేకత స్తవ బిభర్తి గురు ర్వినిద్ర,
స్తస్యా భవా నపరధుర్యపదావలమ్బీ. 66

టీక.—హే మతిమతాం వర = బుద్ధిమంతులలోపల శ్రేష్ఠుఁడా, రాత్రిః = రాత్రి, గతా = గడచినది, శయ్యాం = పానుపును, ముఞ్చ = వదలుము, ధాత్రా = బ్రహ్మచేత, జగతః = లోకముయొక్క, ధూః = భారము, ద్విధైవ = రెండుభాగములు గానే, విభక్తా నను = పంచఁబడినది గద, తామ్ = ఆభారమును, ఏకతః = ఒకవైపున, తవ = నీయొక్క, గురుః = తండ్రి, వినిద్రః సన్ = మేలుకొన్నవాఁడై, బిభర్తి = మోచుచున్నాఁడు, తస్యాః = ఆభారమునకు, భవాన్ = నీవు, అపర...మ్బీ— అపర = కడమ - ధుర్య = మోఁపరియొక్క - పద = స్థానమును - అవలమ్బీ = పొందినవాఁడవు.

తా.—బుద్ధిమంతులలో అగ్రేసరుఁడా, తెల్లవాఱినది, పాన్పునుండి లెమ్ము. బ్రహ్మ దేవుఁడు మీయిరువురయందే గదా భూభారమును రెండుభాగములుగా పంచినాఁడు.

అందు నీతండ్రి మేల్కొని తనప్రక్క నున్న భారమును మోచుచున్నాఁడు, నీవు మే ల్కొని రెండవప్రక్క మోవవలయుఁగదా.

వ్యా.—రాత్రి రితి. హే మతిమతాం వర బుద్ధిమతాం శ్రేష్ఠ, రాత్రిః, గతా, శయ్యాం, ముఞ్చ వినిద్రో భ వే త్యర్థః ;—వినిద్రత్వస్య ఫల మాహ.—ధా త్రేతి - ధాత్రా బ్రహ్మణా, జగతో ధూః భారః * 'ధూః స్యా ద్యానముఖే భార' ఇతి యా దవః, ద్వాభ్యామేవ ద్వయో రే వే త్యర్థః - ఏవకార స్తృతీయనిషేధార్థః, విభక్తా నను విభజ్య స్థాపితా ఖలు ; త త్కి మత ఆహ - తాం ధురమ్, ఏకతః ఏకత్ర కోటౌ, తవ, గురుః పితా, వినిద్రః సన్, బిభర్తి, తస్యాః ధురః, భవాన్, ధురం వహ తీతి ధుర్యః భారవాహీ - తస్య పదం వాహనస్థానమ్ - అపరం య ద్ధుర్యపదం త దవలమ్బత ఇతి అపరధుర్యపదావలమ్బీ - అతో వినిద్రో భ వే త్యర్థః - న హ్యుభయవాహ్యా మేకో వహ తీతి భావః.

---

నిద్రావశేన భవతాఽ ప్యనవేక్షమాణా
పర్యుత్సుకత్వ మబలా నిశి ఖణ్డి తేవ
లక్ష్మీ ర్వినోదయతి యేన దిగన్తలమ్బీ
సోఽపి త్వదాననరుచిం విజహాతి చన్ద్రః. 67

టీక.—నిద్రావశేన = నిద్రాధీనుఁడవయిన, భవతా = నీయందు, పర్యుత్సుకత్వ మపి = అనురక్తతనుసయితము, నిశి = రాత్రియందు, ఖండితా = వేఱొకతెను భర్త కూడె నని తెలిసి యలిగియున్న, అబలేవ = నాయికవలె, అనపేక్షమాణా = ఒప్పరి కించి, లక్ష్మీః = లక్ష్మి, యేన = ఎవనితోఁగూడ, వినోదయతి = వినోదము సల్పు చున్నదో, సః = ఆ, చన్ద్రోపి = చంద్రుఁడుకూడ, దిగ...సన్—దిక్ = (పడమటి) దిక్కుయొక్క - అన్త = కొనను - లమ్బిసన్ = వ్రేలువాఁడై, త్వదా...చిం— త్వత్ = నీయొక్క - ఆనన = ముఖముయొక్క - రుచిం = కాంతిని, విజహాతి = వదలుచున్నాఁడు.

తా.—నీవు రాత్రియందు అన్యకాంతతోనుంబోలె నిద్రతోఁ గూడి యుండుట చేత, నీపై ఈసు వహించిన ఖండితనాయికయుంబోలె లక్ష్మి నీయందలి యనురక్తిని ఒప్పరికించి నీమోముతోడి సాదృశ్యము కలవాఁడైన చంద్రునితో వినోదమొందుచుండె నది. ఇప్పుడు ఆచంద్రుఁడు పడమటిదిక్కుం జేరినవాఁడై నీమోముకాంతిని కోల్పోయి యున్నాఁడు. కావున నీవు నిద్రమేల్కొని అనన్యశరణను లక్ష్మిని పరిగ్రహింపుము.

వ్యా.—నిద్రేతి.—చన్ద్రారవిన్దరాజవదనాదయో లక్ష్మీనివాసస్థాన మితి ప్రసిద్ధి మాశ్రి త్యోచ్యతే - నిద్రావశేన నిద్రాధీనేన - స్త్రీ స్తరాసఙ్గోఽత్ర ధ్వన్యతే,

భవతా త్వయా - పర్యుత్సుకత్వ మపి త్వ య్యనుర క్తత్వమ పీ త్యర్థః * 'ప్రసితోత్సు కాభ్యాం తృతీయా చే'తి స ప్తమ్యర్థే తృతీయా - అపి శబ్దః తద్విషయానురాగస్య అనుపేక్ష్యత్వ ద్యోతనార్థః, సిశి, ఖణ్డితా భర్తు రన్యాసఙ్గజ్ఞానకలుషితా - అబ లేవ నాయి కేవ * 'జ్ఞాతేఽన్యాసఙ్గవికృతే ఖణ్డి తేర్ష్యాకషాయి తే'తి దశరూప కే, అనపేక్షమాణా అవిచారయ న్తీ సతీ - ఉపేక్షమా ణే త్యర్థః, లక్ష్మీః, యేన చన్ద్రేణ సహ - త్వదాననసదృశత్వా దితి భావః, వినోదయతి వినోదం కరోతి - వినోదశబ్దాత్ * 'త త్కరో'తి త దాచష్ట' ఇతి ణిచ్ - సాదృశ్యదర్శనాదయో హి విరహిణాం వినోదస్థానా నీతి భావః, సః చన్ద్రోఽపి, దిగ న్తలమ్బీ పశ్చిమాకా న్త గతః సన్ - అ స్తం గచ్ఛ న్ని త్యర్థః - అత ఏవ త్వదాననరుచిం తవ ముఖ కా న్తిం విజహాతి - త్వన్ముఖసాదృశ్యం త్యజ తీ త్యర్థః - అతః ని ద్రాం విహాయ తాం లక్ష్మీమ్ అనన్యశరణాం పరిగృహా ణే త్యర్థః ; అథవా ని ద్రావశేన భవతా అనపేక్ష్య మాణా అనిరీక్ష్యమాణా * కర్మణి శానచ్ లక్ష్మీః ప్రయోజకక ర్త్రీ యేన చన్ద్రేణ ప్రయోజ్యేన పర్యుత్సుకత్వం త్వద్విరహవేదనాం భర్తృజన్య విరహవేదనాం చ * 'కా లాక్షమత్వ మౌత్సుక్యం మనస్తాప జ్వరాదికృ ది'త్యలంకారే, వినోదయతి నిరాసయ తీతి యోజనా.—శేషం పూర్వవత్ ; నాథస్తు ణిజర్థోపప త్తి మపశ్యన్ ఇమం పక్ష ముపైక్షిష్ట.

---

త ద్వల్గునా యుగపదు న్మిషి తేన తావత్
సద్యః పరస్పరతులా మధిరోహతాం ద్వే
ప్రస్పన్దమానపరుషేతరతార మ న్త
శ్చక్షు స్తవ ప్రచలితభ్రమరం చ పద్మమ్. 68

టీక.—తత్ = కావున, వల్గునా = మనోహరమైన, యుగపత్ తావత్ = సమకాలమందలి - ఉన్మిషితేన = వికాసము చేత, అ న్తః = లోపల, ప్రస్ప...రం- ప్రస్పన్దమాన = కదలుచున్న - పరుషేతర = మృదువైన - తారం = కనుగ్రుడ్డుకల దైన, తవ = నీయొక్క, చక్షుః = కన్నును, అ న్తః = లోపల, ప్రచ...రం = ప్రచలి త = చలించుచున్న - భ్రమరం = తుమ్మెదకలదైన, పద్మం చ = తామరయు, ద్వే = రెండును, సద్యః = తత్క్షణము, పరస్పర తులాం = ఒండొకటితో పోలికను, అధిరోహ తామ్ = పొందునుగాక.

తా.—కావున, లోన చలించుచున్న నల్లగ్రుడ్డుకల నీకన్ను, లోన చలించుచున్న తుమ్మెదగల తమ్మియు, ఈరెండును ఒండొకటితో ఇప్పటికే కలిగియున్న సాదృశ్యమును

సమకాలమందే మనోహరముగా వికసించుటచేత పూర్తి చేసికొనునుగాక.— తమ్మలు వికసించుచున్నవి, నీకన్నులును వానితోనే వికసించునుగాక మేలుకొమ్మని ఫలితార్థము.

వ్యా.—త దితి.—తత్ తస్మాత్ లక్ష్మీపరిగ్రహాత్ కారణాత్, వల్గునా మనోజ్ఞేన * 'వల్గు స్థానే మనోజ్ఞే చ వల్గు భాషిత మన్య వ ది'తి విశ్వః, యుగప త్త్వాత్ ఉన్మిషితేన యుగప దున్మిలితేన, సద్యః, ద్వే అపి, పరస్పరతులా మన్యోన్యసాదృశ్యమ్, అధిరోహతాం ప్రాప్నుతాం * ప్రార్థనాయాం లోట్; కే ద్వే - అన్తః, ప్రస్పన్దమానా చలన్తీ - పరుషేతరా స్నిగ్ధా - తారా కనీనికా - యస్య త త్తథోక్తం * 'తారకాఽక్ష్ణః కనీని కే' త్యమరః, తవ, చక్షుః, అన్తః, ప్రచలితభ్రమరం చలద్భృఙ్గం, పద్మం చ; యుగపదున్మేషే సతి సంపూర్ణసాదృశ్యలాభ ఇతి భావః.

---

వృన్తా చ్ఛ్లథం హరతి పుష్ప మనోకహానాం,
సంసృజ్యతే సరసిజై రరుణాంశుభిన్నైః,
స్వాభావికం పరగుణేన విభాతవాయుః
సౌరభ్య మీప్సు రివ తే ముఖమారుతస్య. 69

టీక.—విభాతవాయుః = ప్రాతఃకాలవాయువు, స్వాభావికం = సహజమయిన, తే = నీయొక్క, ముఖమారుతస్య = నిట్టూర్పుగాలియొక్క, సౌరభ్యం = తావిని, పరగుణేన - పర = అన్యదీయమైన - గుణేన = తావిచేత, ఈప్సు రివ = పొందఁగోరినదివోలె, అనోకహానాం = వృక్షములయొక్క, శ్లథం=సడలిన, పుష్పం = పువ్వును, వృన్తాత్ = తొడిమనుండి, హరతి = అపహరించుచున్నది; అరు...న్నైః—అరుణ = సూర్యునియొక్క - అంశు = కిరణములచేత - భిన్నైః = విరియింపఁబడిన, సరసిజైః = పద్మములతోడ, సంసృజ్యతే = కలియుచున్నది.

తా.—నీ నిట్టూర్పులకు స్వతఃసిద్ధమైయున్న సౌగంధ్యమును తాను పరసౌగంధ్యముచే కృత్రిమముగా నలవరించుకొనం గోరినదివోలె తెల్లవాఱుసమయపుఁ బిల్లతెమ్మెర చెట్లనుండి తొడిమ సడలిన పూవులను కొనిపోవుచున్నది, సూర్యకిరణములకు వికసిల్లుచున్న కమలములతో కలియుచున్నది.—నిండార విరిసిన పూవులయు వికసించుచున్న తామరలయు సౌగంధ్యము నీ యూర్పులకు స్వాభావిక మనియు, తెమ్మెరకు తెచ్చికోలనియు, చెట్లనుండి పూవులు రాలుచున్నవి, సూర్యోదయ మగుచున్నది, కమలములు వికసిల్లుచున్నవి, వానిపరిమళములను వెదచల్లుచు చల్లగాలి వీతెంచుచున్నది, త్వరగా మేలుకొమ్ము అనియు, భా.

వ్యా.—వృన్తా దితి.—విభాతవాయుః ప్రభాతవాయుః, స్వాభావికం నైసర్గికం తే తవ, ముఖమారుతస్య నిశ్వాసపవనస్య, సౌరభ్యం తాదృక్సౌరభ్య మి త్యర్థః, పర

గుణేన అన్యదీయగుణేన సాంక్రామికగన్ధేనేత్యర్థః, ఈప్సురాప్తుమిచ్ఛు - రివ * 'ఆప్జ్ఞప్యృధా మీ ది' తి ఈకారాదేశః, అనోకహానాం వృక్షాణాం, శ్లథం శిథిలం, పుష్పం వృన్తాత్ ప్రసవబన్ధనాత్ * 'వృన్తం ప్రసవబన్ధన మి' త్యమరః, హరతి ఆదత్తే, అరుణాంశుభిస్సైన్యైః తరణికిరణోద్బోధితైః, సరసిజైః కమలైః సహ * 'తత్పురుషే కృతి బహుళ మి'తి సప్తమ్యా అలుక్, సంసృజ్యతే సంగచ్ఛతే * సృజే ర్దైవాదికాదివాత్కర్తరి లట్.

---

తామ్రోదరేషు పతితం ద్రుమపల్లవేషు
నిర్ధౌత హారగుళికా విశదం హిమామ్భః
ఆభాతి లబ్ధపరభాగతయాఽధరోష్ఠే
లీలాస్మితం సదశనార్చి రివ త్వదీయమ్. 70

టీక.—తామ్రోదరేషు - తామ్ర = ఎఱ్ఱని - ఉదరేషు = లోపలివైపుగలవైన, ద్రుమపల్లవేషు - ద్రుమ = చెట్లయొక్క - పల్లవేషు = చిగుళ్లయందు, పతితం = పడినట్టిది, నిర్ధౌత...దం—నిర్ధౌత=పులుఁగడిగిన - హార = ముత్తెపుఁబేరుయొక్క - గుళికా = ముత్తెపుఁబూసలవలె - విశదం = స్వచ్ఛమైనట్టిది, హిమామ్భః - హిమ = మంచుయొక్క - అమ్భః = నీరు, లబ్ధ...యా—లబ్ధ = పొందఁబడిన - పరభాగతయా = గుణోత్కర్షము కలదగుటచేత, అధరోష్ఠే = క్రింది పెదవియందు. త్వదీయం = నీదైన - సదశనార్చిః = దంతకాంతితోడి, లీలాస్మిత మివ = లీలా = విలాసార్థమయిన - స్మిత మివ = చిఱునవ్వువలె, ఆభాతి = రాజిల్లుచున్నది.

తా.—చెట్లలో మంచునీరు చిగురుటాకులయొక్క యెఱ్ఱని లోవైపునం బడి పులుగడిగిన ముత్తెపుఁబేరుయొక్క ముత్తెపుఁ బూసలయట్లు స్వచ్ఛమై ఆయెఱుపుచేత గుణోత్కర్షముం బొందినదై, కెమ్మోవియందు నెలకొనుటచే గుణోత్కర్షముం బొందినదై దంతకాంతులతోఁ గూడుకొన్న నీ చిఱునగవువలె విరాజిల్లుచున్నది.

వ్యా.—తామ్రేతి.—తామ్రోదరేషు అరుణాభ్యన్తరేషు, ద్రుమపల్లవేషు తరుపల్లవేషు * 'పల్లవోఽస్త్రీ కిసలయ మి' త్యమరః, పతితం నిర్ధౌతాః యాః - హారగుళికాః ముక్తామణయః - తద్వత్ - విశదం స్వచ్ఛం, హిమామ్భః, లబ్ధపరభాగతయా లబ్ధోత్కర్షతయా * 'పరభాగో గుణోత్కర్షః' ఇతి యాదవః, అధరోష్ఠే త్వదీయం త్వత్సంబన్ధి సదశనార్చిః దన్తకాన్తిసహితం, లీలాస్మిత మివ, ఆభాతి.

---

యావత్ప్రతాపనిధి రాక్రమతే న భాను
రహ్నాయ తావ దరుణేన తమో నిరస్తమ్;

ఆయోధనాగ్రసరతాం త్వయి వీర యాతే
కిం వా రిపూం స్తవ గురుః స్వయ ముచ్ఛినత్తి? 71

టీక.—ప్రతాపనిధిః - ప్రతాప = తేజస్సునకు - నిధిః = స్థానమయిన, భానుః= సూర్యుఁడు, యావత్ = ఎంతవఱకు, నాక్రమతే = ఉదయింపఁడో, తావత్ = అంతలోపల, అహ్నాయ = శీఘ్రముగ, అరుణేన = అనూరునిచేత, తమః = చీఁకటి, నిరస్తం = పోఁగొట్టఁబడినది, తథా హి = అదే సరి, హేవీర = ఓశూరుఁడా, త్వయి = నీవు, ఆయో...తాం—ఆయోధన = పోరులయందు - అగ్రసరతాం = ముందు పోవువానితనమును, యాతే సతి = పొందినవాఁడవుకాఁగా, తవ = నీయొక్క, గురుః = తండ్రి, రిపూన్ = శత్రువులను, స్వయం = తానే, ఉచ్ఛినత్తి కిం వా = తెగటార్చుచున్నాఁడా యేమి.

తా.—తేజోనిధి యగు సూర్యుఁడు ఉదయింపకముందే అనూరుఁడు శీఘ్రముగా చీఁకటిని విరియించినాఁడు. ఇది సరియే గదా. ఎట్లనఁగా నీవు యుద్ధములలో ముందుఁ బోవువాఁడవై యుండఁగా శత్రువులను మీతండ్రి స్వయముగా మడియించుచున్నాఁడా!

వ్యా.—యావ దితి.—ప్రతాపనిధి స్తేజోనిధిః, భానుః సూర్యః, యావత్, నాక్రమతే నోద్గచ్ఛతి * 'ఆఙ ఉద్గ మన' ఇ త్యాత్మనేపదం, తావత్ భా నావను దిత ఏ వే త్యర్థః, అహ్నాయ ఝడితి * 'ద్రాగ్ఝటిత్యఞ్జసాఽహ్నా యే' త్యమరః, అరుణేన అనూరుణా * 'సూరసూతోఽరుణోఽనూరు రి' త్యమరః, తమః నిరస్తం; తథాహి - హే వీర, త్వయి, ఆయోధనేషు యుద్ధేషు - అగ్రసరతాం పురస్సరతాం, యాతే సతి, గురుః పితా, రిపూన్, స్వయ, ముచ్ఛినత్తి కిం వా నోచ్ఛినత్త్యే వే త్యర్థః; న ఖలు యోగ్యే న్యస్తభారాణాం స్వామినాం స్వయం వ్యాపారఖేద ఇతి భావః.

---

శయ్యాం జహ త్యుభయపక్షవినీతనిద్రాః
స్తమ్బేరమా ముఖరశృఙ్ఖలకర్షిణ స్తే
యేషాం విభా న్తి తరుణారుణరాగయోగా
ద్భిన్నాద్రిగైరికతటా ఇవ దన్తకోశాః. 27

టీక.—యేషాం = ఏయేనుఁగులయొక్క, దన్తకోశాః = కోఱమొగ్గలు, తరుణా...త్ - తరుణారుణ = లేఁతసూర్యునియొక్క - రాగ = ఎఱుపుయొక్క - యోగాత్ = కూడికవలన, భిన్నా...ఇవ - భిన్న = కోరాఁడఁబడిన - అద్రి = కొండయొక్క - గైరిక = మనశ్శిలాదిధాతువులయొక్క - తటా ఇవ = గట్టులుఁకలవి

వోలె, విభాన్తి = ప్రకాశించుచున్నవో, ఉభయ... ద్రాః—ఉభయపక్ష = రెండు పార్శ్వములచేత, వినీత = తీర్చుకోఁబడిన - నిద్రాః = నిద్రగలవై, ముఖర...ణిః— ముఖర = శబ్దించుచున్న - శృఙ్ఖల = గొలుసులను - కర్షిణః = ఈడ్చుచున్నట్టివి, తే = నీయొక్క, స్తమ్బేరమాః = ఆ యేనుఁగులు, శయ్యాం = పడకను, జహతి = వదలుచున్నవి.

తా.—నీయేనుఁగులు కుడిబరిపై కొంతసేపును ఎడమబరిపై కొంతసేపును పరుండి, నిద్ర తీర్చుకొన్నవై, ఖలఖల మని మొరయుఁ గొలసుల నీడ్చుకొనుచు పడక విడుచుచున్నవి. లేఁతసూర్యుని యెఱ్ఱకాంతి కమ్మినట్టివాని కోఱమొగ్గలు కొండయొక్క మనఃశిలాది తటములను కోరాడిన యెరుపుతోడనుంబోలె ప్రకాశించుచున్నవి.

వ్యా.—శయ్యా మితి.—ఉభాభ్యాం పక్షాభ్యాం—వినీతా వ్యపనీతా నిద్రా యైస్తే ఉభయపక్షవినీతనిద్రాః * తత్ర సమాసవిషయే ఉభశబ్దస్థానే ఉభయశబ్దప్రయోగ ఏవ సాధు రిత్యనుసంధేయం - యథాహ కైయటః * 'తత్రోభా దుదాత్తో నిత్య మి'తి నిత్యగ్రహణ స్యేదం ప్రయోజనమ్ - వృత్తివిషయే ఉభశబ్ద ప్రయోగో మాభూత్ - ఉభయశబ్దస్యైవ యథా స్యాత్ - ఉభయపుత్త్ర ఇత్యాది భవతీతి, ముఖరాణి ఉత్థాన చలనా చ్ఛబ్దాయమానాని - శృఙ్ఖలాని నిగళాని-కషన్తీతి తథోక్తాః, తే తవ, స్తమ్బే రమన్త ఇతి స్తమ్బేరమాః హస్తినః * 'స్తమ్బేరమః పద్మీ' త్యమరః * 'తత్పురుషే కృతి బహుళ మితి సప్తమ్యా అలుక్, శయ్యాం, జహతి త్యజన్తి, యేషాం స్తమ్బేర మాణాం దన్తాః కోశా ఇవ దన్తకోశాః దన్తకుట్మలాః, తరుణారుణరాగయోగాత్ బాలార్కకిరణసంపర్కాద్ధేతోః భిన్నాద్రిగైరికతటా ఇవ విభాన్తి - ధాతురక్తా ఇవ భాన్తీత్యర్థః.

---

దీర్ఘే ష్వమీ నియమితాః పటమణ్టపేషు
నిద్రాం విహాయ వనజాక్ష వనాయుదేశ్యాః
వక్త్రోష్మణా మలినయన్తి పురోగతాని
లేహ్యాని సైన్ధవశిలాశకలాని వాహాః. 73

టీక.—వనజాక్ష - వనజ = కమలములవంటి - అక్ష = కన్నులుఁగలవాఁడా, దీర్ఘేషు=నిడుపులయిన, పటమణ్టపేషు = గుడ్డలతో చేయఁబడిన సాలలయందు (గుడారపుసాలలయందు), నియమితాః = కట్టఁబడిన, వనాయుదేశ్యాః = వనాయుదేశమునఁ బుట్టినవైన, అమీ = ఈ, వాహాః = గుఱ్ఱములు, నిద్రాం = నిద్రను, విహాయ = వదలి, పురోగతాని = ముందు ఉన్న, లేహ్యాని=ఆస్వాదింపఁదగినవైన, సైన్ధ...ని - సైన్ధవ=

సైంధవలవణముయొక్క-శిలా=శాలయొక్క-శకలాని=ముక్కలను, వక్త్రోష్మణా-వక్త్ర = నోటియొక్క - ఉష్మణా=వేడిచేత, మలినయన్తి = మలినములను జేయుచున్నవి.

తా.—ఓయి కమలాక్షుఁడా నిడుపులయిన గుడారపుసాలలయందు కట్టఁబడినట్టివనాయుదేశోద్భవము లయిన నీ గుఱ్ఱములు నిద్ర మాని తమకు ఆస్వాదించుటకై ముందుంపఁబడిన సైంధవలవణంపుముక్కలను నోటివేడిచేఁ మలినీకరించుచున్నవి.

వ్యా.—దీర్ఘేష్వితి.—హే వనజాక్ష నీరజాక్ష * 'వనే సలిల కాననే' ఇత్యమరః, దీర్ఘేషు పటమణ్డపేషు, నియమితాః బద్ధాః వనాయుందేశ్యాః వనాయుందేశోద్భవాః * 'పారసీకా వనాయుజా' ఇతి హలాయుధః, అమీ వాహాః అశ్వాః, నిద్రాం విహాయ, పురోగతాని, లేహ్యాని, ఆస్వాద్యాని, సైన్ధవశిలాశకలాని - సైన్ధవో లవణవిశేషః * 'సైన్ధవోఽస్త్రీ శీతశివం మణిబన్థం చ సిన్ధుజ మి'త్యమరః - తస్య శకలాని ఖణ్డాని,వక్త్రోష్మణా, మలినయన్తి మలినాని కుర్వన్తి; ఉక్తంచ సిద్ధయోగసంగ్రహే-

'పూర్వాహ్ణకాలే చాశ్వానాం ప్రాయశో లవణం హితం,
అరుచి గ్లాని శూలఘ్నం లవణం సైన్ధవం వరమ్.' ఇతి.

---

భవతి విరళభక్తి మ్లానపుష్పోపహారః
స్వకిరణపరివేషోద్భేదశూన్యాః ప్రదీపాః
అయ మపి చ గిరం న స్త్వత్ప్రబోధప్రయుక్తా
మనువదతి శుక స్తే మఞ్జువాక్ పఞ్జరస్థః. 74

టీక.—మ్లాన...రః-మ్లాన = వాడిన—పుష్ప = పువ్వులనెడి - ఉపహారః=కానుక, విరళభక్తిః = విరళ = పలుచనయిన - భక్తిః = రచనకలది, భవతి = అగుచున్నది, ప్రదీపాశ్చ = దీపములును, స్వకిరణ...న్యాః - స్వ = తమవయిన - కిరణ=వెలుఁగులయొక్క - పరివేష = గుడియొక్క - ఉద్భేద=స్ఫురణచేత - శూన్యాః = కొఱవడినవి, భవన్తి = అగుచున్నవి, అపి చ = మఱియు, మఞ్జువాక్ - మఞ్జు = మనోహరములయిన - వాక్=మాటలుగలది, పఞ్జరస్థః = పఞ్జర=పంజరమందు - స్థః=ఉండెడి, తే=నీయొక్క, అయం శుకః = ఈ చిలుక, త్వత్ప్ర...క్తాం - త్వత్ = నీయొక్క - ప్రబోధ = మేలుకొలుపుకొఱకు, ప్రయుక్తాం = ఉచ్చరింపఁబడిన, నః = మాయొక్క, గిరం = వాక్కును, అను వదతి = వెంబడి పలుకుచున్నది.

తా.—పూవులు వాడినందున పూజామాల్యాదికములకూర్పు సడలిపోయినది. దీపములు వానివెలుఁగులు కట్టినగుడి యొడలినందున వెలవెలఁబోవుచున్నవి. నిన్ను మేలుకొల్పుటకై మేము పాడెడుపాటలను ఈనీపంజరపుఁజిలుక మావెంబడి తానును పాడుచున్నది.

వ్యా.—భవ తీతి.—మ్లానః - పుష్పోపహారః పుష్పపూజా, మ్లానత్వా దేవ-విరళ భక్తిః విరళరచనో, భవతి, ప్రదీపాశ్చ, స్వకిరణానాం - పరివేషస్య మణ్డలస్య - ఉద్భేదేన స్ఫురణేన - కాన్త్యా భవన్తి-నిస్తేజస్కా భవన్తీ త్యర్థః, అపి చ, అయం మఞ్జువాక్ మధురవచనః, పఞ్జరస్థః, తే తవ, శుకః, త్వత్ప్రబోధనిమిత్తే - ప్రయుక్తాన్ ఉచ్చరితాం, నః అస్మాకం, గిరం వాణీమ్, అనువదతి అనుకృత్య వద తీ త్యర్థః; ఇత్థం ప్రభాతలిఙ్గాని వర్తన్తే - అతః ప్రబోద్ధవ్య మితి భావః.

---

ఇతి విరచితవాగ్భి ర్వన్దిపుత్త్రైః కుమారః
సపది విగతనిద్ర స్తల్ప ముజ్ఝాఞ్చకార
మదపటునినదద్భి ర్బోధితో రాజహంసైః
సురగజ ఇవ గాఙ్గం సైకతం సుప్రతీకం. 75

టీక.—ఇతి = ఈ ప్రకారము, విరచితవాగ్భిః - విరచిత = చేయఁబడిన, వాగ్భిః = స్తోత్రములుగలిగిన, వన్దిపుత్త్రైః - వన్ది=స్తుతిపాఠకులయొక్క - పుత్త్రైః= కుమారులచేత, సపది = తత్క్షణము, విగతనిద్రః - విగత = పోయిన - నిద్రః = నిదుర గల, కుమారాః = యువరాజు, తల్పం = పానుపును, మద...ద్భిః - మద = పొగరు చేత - పటు=తీయగా - నినదద్భిః = కూయుచున్న, రాజహంసైః = రాయంచలచేత, బోధితః=మేల్కొలుపఁబడిన, సుప్రతీకః = సుప్రతీకమని పేరి, సురగజః = దిగ్గజము, గాఙ్గం = గంగదయిన, సైకత మివ = ఇసుకతిన్నెనుబోలె, ఉజ్ఝాంచకార=వదలెను.

తా.—ఈప్రకారము వందికుమారులు చేసిన స్తోత్రములకు రాజకుమారుఁడు నిద్రమేల్కొన్నవాఁడై, రాయంచల మదమధురకూజితములకు మేల్కొన్న యీశాన దిగ్గజము గంగాసైకతమునుండి లేచినట్లు, పానుపునుండి లేచెను.

వ్యా.—ఇ తీతి.—ఇ త్థం, విరచితవాగ్భిః, వన్దిపుత్త్రైః వైతాళికైః - పుత్త్రగ్రహణం సమానవయస్కత్వద్యోతనార్థం, సపది, విగతనిద్రః, కుమారః అజః, తల్పం శయ్యాం * 'తల్పం శయ్యాట్టదారే ష్వి'త్యమరః, ఉజ్ఝాఞ్చకార వినసర్జ * 'ఇజాదే శ్చ గురుమతోఽనృచ్ఛ' ఇ త్యామ్ప్రత్యయః, కథ మివ ? మదేన - పటు మధురం - నినదద్భిః, రాజహంసైః బోధితః, సుప్రతీకః సుప్రతీకాఖ్యః, సురగజః ఈశానదిగ్గజః, గఙ్గాయాః ఇదం గాఙ్గం, సైకతం పులిన మివ * 'తోయోత్థితం త త్పులినం సైకతం సికతామయ మి'త్యమరః * 'సికతా శర్కరాభ్యాం చే' త్యణ్ప్రత్యయః; సుప్రతీక గ్రహణం ప్రాయశః తస్య కైలాసవాసిత్వాత్ నిత్యగఙ్గాతటవిహారసంభవార్థ మి త్యను సంధేయమ్.

---

అథ విధి మవసాయ్య శాస్త్రదృష్టం
దివసముఖోచిత మఞ్చితాక్షిపక్ష్మా
కుశలవిరచితానుకూలవేషః
క్షితిపసమాజ మగాత్ స్వయంవరస్థమ్. 76

టీక.—అథ = లేచినతర్వాత, అఞ్చి...క్ష్మా - అఞ్చిత = అందములయిన - అక్షి = కన్నులయొక్క - పక్ష్మా = ఱెప్పలుంగల యాయజమహారాజు, శాస్త్రదృష్టం - శాస్త్ర = శాస్త్రమునందు - దృష్టం = చూడఁబడిన, దివసముఖోచితం - దివసముఖ = ప్రాతఃకాలమునందు - ఉచితం = తగిన, విధిం = అనుష్ఠానమును, అవసాయ్య = ముగించి, కుశల...షః సన్ - కుశల = నేర్పరులచేత - విరచిత = చేయఁబడిన - అనుకూల=స్వయంవరమునకు తగిన - వేషః సన్ = అలంకారముగవాఁడై, స్వయంవరస్థం = స్వయంవరశాలయందున్న, క్షితిపసమాజం = రాజసమూహామునకు, అగాత్=పోయెను.

తా.—అటు తర్వాత అందపుఁగను ఱెప్పలవాఁడు ఆయజమహారాజు శాస్త్రోక్తమయిన ప్రాతరనుష్ఠానమును ముగించికొన్నవాఁడై, నేర్పరులు రచించిన స్వయంవరోచిత వేషముతో స్వయంవరమందలి రాజసమూహామునకుం బోయెను.

వ్యా.—అ థేతి.—అథ ఉత్థానానన్తరం, అఞ్చితాని రుచిరాణి - అక్షిపక్ష్మాణి యస్య సః అజః, శాస్త్రే - దృష్ట మవగతం, దివసముఖోచితం దివసముఖే ప్రాతఃకాలే - ఉచితం కరణీయం, విధి మనుష్ఠాన, మవసాయ్య సమాప్య * స్యతేర్ణ్యన్తా ల్ల్యప్, కుశలైః ప్రసాధనదక్షైః - విరచితః - అనుకూలః స్వయంవరోచితః, వేషః నైపథ్యం - యస్య స తథోక్తః సన్, స్వయంవరస్థం, క్షితిపసమాజం రాజసమూహం, మగాత్ * 'ఇణో గా లు జీ' తి గాదేశః.

పుష్పితాగ్రావృత్త మేతత్ - తదుక్తమ్ -
'అయుజి నయుగ రేఫతో యకారో
యుజి చ నజౌ జరగాశ్చ పుష్పితాగ్రా' ఇతి లక్షణాత్.

---

# రఘువంశే

## షష్ఠస్సర్గః

స తత్ర మఞ్చేషు మనోజ్ఞవేషాన్ సింహాసనస్థా నుపచారవత్సు
వైమానికానాం మరుతా మపశ్య దాకృష్టలీలాన్ నరలోకపాలాన్. 1

టీక.—సః = ఆయజమహారాజు, తత్ర = ఆస్వయంవరమంటపమునందు, ఉపచారవత్సు = రాజోపచారములు గలిగిన, మఞ్చేషు = మంచెలయందు, సిం... స్థాన్ - సింహాసన = గద్దియలయందు - స్థాన్ = ఉన్నవారును, మనోజ్ఞవేషాన్ - మనోజ్ఞ = మనోహరములైన - వేషాన్ = అలంకారములుగలవారును, వైమానికానాం = విమానములచేత సంచరించుచుండెను, మరుతాం = దేవతలయొక్క, ఆకృష్టలీలాన్ - ఆకృష్ట = గ్రహింపఁబడిన - లీలాన్ = విలాసములుగలవారును, (అయిన) నరలోకపాలాన్ = రాజులను, అపస్యత్ = చూచెను.

తా.—అజమహారాజు స్వయంవర మంటపమునకు పోవునప్పటికి అందు రాజోపచారములు గల మంచెలమీఁద గద్దియలలో మనోహరములయిన యలంకారములు దాల్చినవారై భూలోకరాజకుమారులు - ఆకాశమున విమానగతులయిన వేల్పులవిలాసమువంటి విలాసముతో - కూర్చుండి యుండిరి.

వా.—స ఇతి.—సః అజః తత్ర స్వయంవరస్థానే, ఉపచారవత్సు రాజోపచారయుక్తేషు, మఞ్చేషు సుఖవాసదర్శనార్థం కృతోన్నతస్థానవిశేషేషు, సింహాసనస్థాన్ భద్రాసనస్థితాన్, మనోజ్ఞవేషాన్ మనోహరనైపథ్యాన్, వైమానికానాం విమానైః సంచరతాం * 'చరతీ'తి ఠక్ప్రత్యయః, మరుతా మమరాణాం * 'మరుతౌ వనామరా వి'త్యమరః - ఆకృష్టలీలాన్ - ఆత్మసౌభాగ్యా దాకృష్టమరుల్లీలా నిత్యర్థః * సాపేక్షత్వేఽపి గమకత్వా త్సమాసః, నరలోకం భూలోకం - పాలయన్తీతి - నరలోకపాలాః * కర్మ ణ్యణ్ప్రత్యయః - తాన్ భూపాలాన్, అపశ్యత్. అస్మిన్సర్గే వృత్త ముపజాతిః - తల్లక్షణం తూక్తమ్,

---

రతే గృహీతానునయేన కామం
ప్రత్యర్పితస్వాఙ్గ మి వేశ్వరేణ

కాకుత్థ్స మాలోకయతాం నృపాణాం
మనో బభూ వేన్దుమతీనిరాశమ్. 2

టీక.—రతేః = రతీదేవియొక్క, గృహీ...న - గృహీత = అంగీకరింపఁబడి న - అనునయేన = వేఁడుకోలుగలవాఁడయిన, ఈశ్వరేణ = హరునిచేత, ప్రత్య... ఙ్గం - ప్రత్యర్పిత = మరలనీఁబడిన - స్వాఙ్గం = తనశరీరముగల, కామ మివ స్థితం = మన్మథుఁడో యనున ట్లున్నట్టి, కాకుత్థ్సమ్=అజమహారాజును, ఆలోకయతాం = చూచుచున్న, నృపాణాం = రాజులయొక్క, మనః = హృదయము, ఇన్దు...శమ్ - ఇన్దుమతీ = ఇందుమతీదేవియందు - నిరాశం = ఆశతొలఁగినది, బభూవ = ఆయెను.

తా.—శివుఁడు రతీదేవియొక్క మొఱ్ఱను ఆలకించి మరల దేహ మిచ్చిన కాముఁడో యనున ట్లున్నయజమహారాజును జూచి యారాజు లెల్ల 'ఇందుమతి యితనినే వరించును గాని మనలను వరింపదు' అని ఆమెయందు ఆశ వదలుకొనిరి.

వ్యా.—రతే రితి.—రతేః కామ ప్రియాయాః * రతిః స్మరప్రియాయాం చ రాగేఽపి సురతే స్మృతే'తి విశ్వః, గృహీతానునయేన స్వీకృతప్రార్థనేన గృహీతరత్యనునయే నే త్యర్థః * సాపేక్షత్వేఽపి గమకత్వా త్సమాసః, ఈశ్వరేణ హరేణ, ప్రత్యర్పితస్వాఙ్గం, కామ మివ స్థితం, కాకుత్థ్స మజమ్, ఆలోకయతాం, నృపాణాం మనః, ఇన్దుమతీనిరాశం ఇన్దుమత్యాం నిస్పృహం, బభూవ; ఇన్దుమతీ సత్పతి మేన మజం విహాయ నాస్మాన్ వరిష్య తీతి నిశ్చిక్యు రి త్యర్థః - సర్వాతిశాయి సౌన్దర్య మ స్యేతి భావః.

---

వైదర్భనిర్దిష్ట మసౌ కుమారః క్లృప్తేన సోపానపథేన మఞ్చమ్
శిలావిభఙ్గై ర్మృగరాజశాబ స్తుఙ్గం నగోత్సఙ్గ మి వారురోహ. 3

టీక.—అసౌ = ఈ, కుమారః = అజమహారాజు, వైదర్భనిర్దిష్టం - వైదర్భ = భోజరాజుచేత - నిర్దిష్టం = చూపఁబడిన, మఞ్చం = మంచెను, క్లృప్తేన = చేయఁబడిన, సోపానపథేన - సోపాన = మెట్లయొక్క - పథేన - దారిచేత, మృగ...బః - మృగరాజు = సింగముయొక్క - శాబః = పిల్ల, శిలావిభఙ్గైః - శిలా = రాలయొక్క - విభఙ్గైః = విధములచేత, తుఙ్గం = ఎత్తయిన, నగో...వ - నగ = కొండయొక్క - ఉత్సఙ్గ మివ = అగ్రప్రదేశమునుంబోలె, ఆరురోహ = ఎక్కెను.

తా.—అజమహారాజు భోజరాజుచేఁ జూపఁబడిన మంచెను దానికి రచింపఁబడిన మెట్లవరుస మీఁదుగా ఎక్కెను. ఆయెక్కిన తీరు రాలవరుసమీఁదుగా సింగపుం గొదమ కొండశిఖరమున కెక్కుటవలె రాజిల్లెను.

వ్యా.—వైదర్భేతి.—అసౌ, కుమారః అజః, వైదర్భేణ భోజేన - నిర్దిష్టం ప్రదర్శితం, మఞ్చం పర్యఙ్కం, క్లృప్తేన, సువిహితేన, సోపానపథేన సోపానమార్గేణ, మృగరాజశాబః సింహపోతః * 'పోతః పాకోఽర్భకో డిమ్భః పృథుకః శాబకః శిశుః' ఇత్యమరః, శిలానాం - విభఙ్గైః భఙ్గీభిః, తుఙ్గ మున్నతం, నగోత్సఙ్గం శైలాగ్ర మివ ఆరురోహ.

---

పరార్ధ్యవర్ణాస్తరణోపపన్న
మాసేదివా న్రత్నవ దాసనం సః
భూయిష్ఠ మాసీ దుపమేయకాన్తి
ర్మయూరపృష్ఠాశ్రయిణా గుహేన. 4

టీక.—పరా...న్నం = పరార్ధ్య = శ్రేష్ఠములైన - వర్ణ = రంగులుగల-ఆస్తరణ = కంబళాదులతో - ఉపపన్నం = కూడుకొన్న, రత్నవత్ = రత్నములుగల, ఆసనం = గద్దియను, ఆసేదివాన్ = ఎక్కిన, సః = అయజమహారాజు, మయూ...ణా - మయూర = నెమలియొక్క - పృష్ఠ = వీఁపును, ఆశ్రయిణా = ఎక్కియున్న, గుహేన = కుమారస్వామితో, భూయిష్ఠం = మిగుల, ఉప...న్తిః - ఉపమేయ = పోల్పఁదగిన - కాన్తిః = కాంతిగలవాఁడు, ఆసీత్ = ఆయెను.

తా.—శ్రేష్ఠములయిన రంగులుగల కంబళీములు పఱచిన రత్నాలగద్దియ నెక్కి అజమహారాజు నెమలివీఁపుమీఁద గూర్చున్న కుమారస్వామిని మిక్కిలి సరిపోలి వెలుఁగుచుండెను.

వ్యా.—పరార్ధ్యేతి.—పరార్ధ్యాః శ్రేష్ఠాః - వర్ణాః నీలపీతాదయో - యస్య తేన - ఆస్తరణేన కమ్బలాదినా - ఉపపన్నం సంగతం, రత్నవత్ రత్నఖచితమ్, ఆసనం సింహాసనమ్, ఆసేదివా నధిష్ఠితవాన్, సః అజః, మయూరపృష్ఠాశ్రయిణా, గుహేన సేనాన్యా సహ * 'సేనానీ రగ్నిభూర్గుహః' ఇత్యమరః, భూయిష్ఠం అత్యన్తమ్ ఉపమేయకాన్తిః సదృశప్రభః, ఆసీత్; మయూరస్య విచిత్రరూపత్వాత్ తత్సామ్యం రత్నాసనస్య - తద్ద్వారా తదారూఢయో రపీతి భావః.

---

తాసు శ్రియా రాజపరమ్పరాసు
ప్రభావిశేషోదయదుర్నిరీక్ష్యః
సహస్రధాఽఽత్మా వ్యరుచ ద్విభక్తః
పయోముచాం పఙ్క్తిషు విద్యుతేవ. 5

టీక.—తాసు = ఆ, రాజ...సు - రాజ = రాజులయొక్క - పరమ్పరాసు= వరుసలయందు, శ్రియా = కాంతిచేత, పయోముచాం = మేఘములయొక్క, పఙ్క్తిషు = వరుసలయందు, విద్యు త్తేవ = మెఱపుచేతనుంబోలె, సహస్రధా = వేయిప్రకారములుగ, విభక్తః = తగిలింపఁబడినట్టిది, ప్రభా...శ్యః - ప్రభావిశేష = కాంతివిశేషముల యొక్క - ఉదయ = పుట్టుకచేత - దుర్నిరీక్ష్యః = చూడనశక్యమైన, ఆత్మా = స్వరూపము, వ్యరుచత్ = ప్రకాశించెను.

తా.—లెక్కకు మిక్కుటముగా వరుసలు తీరియున్న యారాజులయందు, శోభ, మేఘముల పంక్తులయందు మెఱపుఁదీఁగవోలె, వేర్వేఱ సంక్రమించినదై ప్రకాశించుచుండెను.

వ్యా.—తా స్వితి.—తాసు రాజపరమ్పరాసు, శ్రియా కాన్త్యా కర్త్ర్యా - తేజోవిశేషేణేత్యర్థః, పయోముచాం మేఘానాం, పఙ్క్తిషు, విద్యు త్తేవ, సహస్రధా విభక్తః తరఙ్గేషు తరణి రివ స్వయ మేక ఏవ ప్రత్యేకం సంక్రాన్త ఇ త్యర్థః, ప్రభా విశేషస్య - ఉదయేన ఆవిర్భావేన - దుర్నిరీక్ష్యః దుదర్శనః, ఆత్మా శ్రియః స్వరూపం, వ్యరుచత్ వ్యద్యోతిష్ట * 'ద్యుద్భ్యో లు జీ'తి పరస్మైపదం * ద్యుతాదిత్వాత్ ఙ్లే రఙాదేశః; తస్మి న్ సమయే ప్రత్యేకం సంక్రాన్తలక్ష్మీకతయా తేషాం క మపి దురాసదం తేజః ప్రాదురాసీ ది త్యర్థః.

---

తేషాం మహార్హాసనసంస్థితానా
ముదారనైపథ్యభృతాం స మధ్యే
రరాజ ధామ్నా రఘుసూను రేవ
కల్పద్రుమాణా మివ పారిజాతః. 6

టీక.—మహా...నాం - మహార్హ = శ్రేష్ఠములైన - ఆసన = గద్దెలయందు - సంస్థితానాం = ఉన్నట్టియు, ఉదా...తామ్ - ఉదార = ఉజ్జ్వలమయిన-నైపథ్య= అలంకారములను - భృతాం = తాల్చియున్న, తేషాం మధ్యే = ఆరాజుల నడుమ, కల్పద్రుమాణాం = కల్పవృక్షములయొక్క, మధ్యే = నడుమను, పారిజాత ఇవ=పారి జాతవృక్షమువలె, సః రఘుసూను రేవ = ఆ యజమహారాజే, ధామ్నా = తేజస్సుచేత, రరాజ = ప్రకాశించెను.

తా.—ఉజ్జ్వలాలంకార భూషితులై శ్రేష్ఠములయిన గద్దెలయందు కూర్చున్న యారాజులనడుమ, కల్పవృక్షములనడుమ పారిజాతమువోలె, ఆయజమహారాజే తేజస్సు చేత ప్రకాశించుచుండెను.

వ్యా.—తేషా మితి.—మహార్హాసనసంస్థితానాం శ్రేష్ఠసింహాసనస్థానామ్, ఉదార్గనైపథ్యభృతామ్ ఉజ్జ్వలవేషధారిణాం, తేషాం రాజ్ఞాం, మధ్యే, కల్పద్రుమాణాం సురద్రుమాణాం మధ్యే, పారిజాత ఇవ సురద్రుమవిశేష ఇవ * 'పఞ్చైతే దేవతరవో మన్దారః పారిజాతక' ఇత్యమరః, స రఘుసూను రేవ, ధామ్నా తేజసా, రరాజ - 'భూమ్నే'తి పాఠే అతిశయే నే త్యర్థః;* అత్ర కల్పద్రుమశబ్దః పఞ్చాన్యతమ విశేష వచనోఽపి కల్పయన్తి మనోరథా నితి వ్యుత్పత్త్యా సురద్రుమమాత్రోపలక్షణతయా ప్రయుక్త ఇత్యనుసంధేయం - కల్పా ఇతి ద్రుమాః కల్పద్రుమా ఇతి విగ్రహః.

---

నేత్రవ్రజాః పౌరజనస్య తస్మి న్విహాయ సర్వా న్నృపతీ న్నిపేతుః
మదోత్కటే రేచితపుష్పవృక్షా గన్ధద్విపే వన్య ఇవ ద్విరేఫాః. 7

టీక.—పౌరజనస్య - పౌర=పురమందలి - జనస్య = ప్రజయొక్క, నేత్రవ్రజాః- నేత్ర = కన్నులయొక్క - వ్రజాః = సమూహములు, సర్వా న్నృపతీ న్=ఎల్లరాజులను, విహాయ = విడిచి, తస్మి న్ = ఆయజునందు, మదోత్కటే - మద = మదము చేత - ఉత్కటే = ఊరుచున్నగండస్థలము గల, వన్యే = వనమందలి, గన్ధద్విపే = గంధప్రధానగజమునందు, రేచి...క్షాః— రేచిత = రిక్తముచేయఁబడిన - పుష్ప = పువ్వులయొక్క - వృక్షాః = చెట్లుగలిగిన, ద్విరేఫా ఇవ = తుమ్మెదవలె, నిపేతుః = పడినవి.

తా.—ఏవిధముగా చెట్లయందు పూఁదేనియం గ్రోలుచున్న తుమ్మెదలు గంధప్రధానమై మదజలమును వర్షించుగండస్థలములతోడియడవియేనుఁగు రాఁగానే ఆచెట్లను పాడుపెట్టి ఆయేనుఁగుమీఁద వ్రాలునో ఆవిధముగానే రాజు లందఱిమీఁద నున్న పౌర నేత్ర సమూహములు అజమహారాజు రాఁగానే వారిని విడిచి అతనిమీఁదనే వ్రాలినవి.

వ్యా.—నేత్రేతి.— పౌరజనస్య నేత్రవ్రజాః నయనసమూహాః, సర్వా న్నృపతీ న్, విహాయ, తస్మి న్ అజే, నిపేతుః స ఏవ సర్వోత్తమో దదృశ ఇత్యర్థః; కథ మివ - మదోత్కటే మదోద్భిన్నగణ్డే - నిర్భరే వా, వన్యే, గన్ధద్విపే గన్ధప్రధానే గజే, రేచితాః రిక్తీకృతాః - పుష్పాణాం వృక్షాః యై స్తే - త్యక్తపుష్ప వృక్షా ఇత్యర్థః, ద్విరేఫాః భృఙ్గా ఇవ - వన్యవిశేషణం ద్విరేఫాణాం పుష్పవృక్షత్యాగ సంభవార్థం కృతమ్.

---

అథ స్తుతే వన్దిభి రన్వయజ్ఞైః సోమార్కవంశ్యే నరదేవలోకే
సంచారితే చాగరుసారయోనౌ ధూపే సముత్సర్పతి వైజయన్తీః. 8

టీక.—అథ = తర్వాత, అన్వయజ్ఞైః - అన్వయ = (రాజుల) వంశములను-జ్ఞైః= ఎఱిఁగినవారైన, వన్దిభిః=స్తుతిపాఠకులచేత, సోమార్కవంశ్యే=చంద్రసూర్యవంశములయం దుఁబుట్టిన, నరదేవ లోకే=రాజ జనము, స్తుతే సతి=పొగడఁబడినది అగుచుండఁగ, సంచారితే=అంతట ప్రసరించునట్లు చేయఁబడిన, అగ...నౌ-అగరుసార=శ్రేష్ఠమైన కృష్ణాగరువే-యోనౌ = కారణముగాఁగలిగిన, ధూపే చ = ధూపమును, వైజయన్తీః = పతాకలపై, సముత్సర్పతి సతి = వ్యాపించుచుండఁగ.

తా.—తర్వాత రాజవంశములను ఎఱిఁగిన వందులు సూర్యచంద్రవంశ్యులయిన రాజులను స్తుతింపందొడఁగిరి; మేలయిన కృష్ణాగురువుయొక్క ధూపము అంతటను ప్రసరించునట్లు చేయఁబడి పతాకలమీఁదికి వ్యాపించుచుండినది.

వ్యా.—అ థేతి.—అ థేతి పురేతి మనుష్యేతి చ త్రిభిః కులక మాహ - అథ, అన్వయజ్ఞైః రాజవంశాభిజ్ఞైః, వన్దిభిః స్తుతిపాఠకైః * వన్దినః స్తుతిపాఠకా ఇత్యమరః, సోమార్కవంశ్యే సోమసూర్యవంశభవే, నరదేవలోకే రాజలోకే స్తుతే సతి - విశేష్యోత్తరేణ సంబన్ధః - ఏవ ముత్తరత్రాపి యోజ్యం, సంచారితే సమన్తాత్ ప్రసారితే అగరుసారః యోనిః కారణం యస్య తస్మిన్, ధూపే చ, వైజయన్తీః పతాకాః, సముత్సర్పతి సతి.

---

పురోపకణ్ఠోపవనాశ్రయాణాం కలాపినా ముద్ధతనృత్తహేతౌ
ప్రాధ్మాతశఙ్ఖే పరితో దిగన్తాం స్తూర్యస్వనే మూర్ఛతి మఙ్గలార్థే. 9

టీక.—పురో...ణాం - పుర = పట్టణముయొక్క - ఉపకణ్ఠ = సమీపమునందలి-ఉపవన = ఉద్యానవనములే - ఆశ్రయాణాం = ఉనికిపట్లుగాఁగల, కపిలానాం = నెమళ్లకు, ఉద్ధ...తౌ - ఉద్ధత = మిక్కుటమైన - నృత్త = నాట్యమునకు - హేతౌ = కారణమైనదియు, ప్రా...ఙ్ఖే-ప్రాధ్మాత = ఊఁదఁబడిన - శంఖే = శంఖములుగలదియు, మఙ్గళార్థే - మఙ్గళ = శుభమే - అర్థే = ప్రయోజనముగాఁగలదియు, (అయిన), తూర్యస్వనే - తూర్య = వాద్యములయొక్క - స్వనే = ధ్వని, పరితః = అంతటను, దిగన్తాన్ - దిక్ = దిక్కులయొక్క - అన్తాన్ = తుదలకు, మూర్ఛతి సతి = వ్యాపించుచుండఁగా.

తా.—శంఖములను ఊఁదిరి, మంగళవాద్యములను మ్రోగించిరి. ఆ మ్రోఁతకు నగరము చెంగటి యుద్యానవనములందు వసించు నెమళ్లు ఉఱుముల నెడు భ్రమచే మిక్కుటముగా నాట్య మాడసాగినవి.

వ్యా.—పు రేతి.—కిం చ - పుర - స్యోపకణ్ఠే సమీపే - ఉపవనాని ఆశ్రయా యేషాం తేషాం, కలాపినాం బర్హిణామ్ ఉద్ధతనృత్తహేతౌ మేఘధ్వనిసాదృశ్యా

దుత్కృష్టతాణ్డవకారణే, ప్రాధ్మాతాః శఙ్ఖాః యస్మిన్, మఙ్గళార్థే మఙ్గళప్రయోజనే, తూర్యస్వనే వాద్యఘోషే, పరితో దిగన్తాన్, మూర్ఛతి వ్యాప్నువతి సతి.

---

మనుష్యవాహ్యం చతురస్రయాన మధ్యాస్య కన్యా పరివారశోభి
వివేశ మఞ్చాన్తరరాజమార్గం పతింవరా క్లృప్తవివాహవేషా. 10

టీక.—పతింవరా=పతినివరించునట్టిదై, క్లృప్తవివాహవేషా - క్లృప్త = గల్పింపఁబడిన - వివాహ = పెండ్లికిఁదగిన - వేషా = అలంకారముగలిగినదైన, కన్యా=కుమారి (ఇందుమతి), మనుష్యవాహ్యం - మనుష్య = మనుష్యులచేత - వాహ్యం = మోవఁబడినదియు, పరివారశోభి - పరివార = పరిజనముచేత - శోభి = ప్రకాశించుచున్నదియు, (అయిన), చతురస్రయానం = పల్లకిని, అధ్యాస్య = ఎక్కి, మఞ్చా...గం - మఞ్చ = మంచెలయొక్క - అన్తర=మధ్యయందలి - రాజమార్గం - రాజవీథిని, వివేశ=ప్రవేశించెను.

తా.—కన్యయైన యాయిందుమతి మగని వరించు నిమిత్తము పెండ్లికూఁతువేషమును దాల్చినదై, ఉజ్జ్వలవేషముగల పరివారజనులతో ప్రకాశించుచున్న పల్లకి యెక్కినదై, బోయీలు మోచుకొని రాఁగా, ఆమంచెలనడుమ నేర్పఱుపఁబడియున్న రాజమార్గముం జొచ్చెను.

వ్యా.—మను ష్యేతి.—పతిం వృణోతీతి పతింవరా స్వయంవరా * 'పతింవరా చ వర్యా చే' త్యమరః * 'సంజ్ఞాయాం భృతృవృజి' త్యాదినా ఖచ్ప్రత్యయః, క్లృప్తవివాహవేషా, కన్యా ఇన్దుమతీ, మనుష్యైః వాహ్యం, పరివారేణ పరిజనేన శోభి, చతురస్రయానం చతురశ్రవాహనం శిబికామ్, అధ్యాస్యాధిరుహ్య, మఞ్చాన్తరే మఞ్చమధ్యే - యో రాజమార్గః తం, వివేశ.

---

తస్మిన్విధానాతిశయే విధాతుః కన్యామయే నేత్రశతైకలక్ష్యే
నిపేతు రన్తఃకరణై ర్నరేన్ద్రా దేహైః స్థితాః కేవల మాసనేషు. 11

టీక.—నేత్ర—క్ష్యే - నేత్ర = కన్నులయొక్క - శత = నూర్లకు - ఏక = ముఖ్యముగ, లక్ష్యే = చూడఁదగినదై, కన్యామయే = పెండ్లిగానిపిల్లగానున్నదైన, విధాతుః = బ్రహ్మయొక్క, తస్మిన్ విధానాతిశయే = ఆసృష్టివిశేషమునందు, నరేన్ద్రాః = రాజులు, అన్తఃకరణైః = మనస్సులచేత, నిపేతుః = పడిరి, ఆసనేషు = గద్దియలయందు, దేహైః కేవలం = దేహములచేత మాత్రము, స్థితాః = ఉండిరి.

తా.—పెక్కుకన్నులతో చూడఁదగిన యొక్కవస్తువై అవివాహితారూపమున బ్రహ్మ నిర్మాణవిశేష మయిన యా యిందుమతీదేవియందు రాజు లందఱియొక్కయు మనస్సులు పడినవి, వారి దేహములుమాత్రము గద్దియలయందు ఉండినవి.

వ్యా.—తస్మి న్నితి.—నేత్రశతానా - మేకలక్ష్యే ఏకదృశ్యే, కన్యామయే కన్యారూపే, తస్మిన్, విధాతుః, విధానాతిశయే సృష్టివిశేషే, నరేన్ద్రాణాం, అన్తఃకరణైః, నిపేతుః, ఆసనేషు - దేహైః కేవలం దేహై రేవ - స్థితాః-దేహాన్ విస్మృత్య తత్రైవ దత్తచిత్తా బభూవు రి త్యర్థః ; అన్తఃకరణకర్తృకే నిపతనే నరేన్ద్రాణాం కర్తృత్వవ్యపదేశః ఆదరాతిశయార్థః.

---

తాం ప్రత్యభివ్యక్తమనోరథానాం మహీపతీనాం ప్రణయాగ్రదూత్యః
ప్రవాళశోభా ఇవ పాదపానాం శృఙ్గారచేష్టా వివిధా బభూవుః. 12

టీక.—తాం ప్రతి = ఆయిందుమతీదేవినిగూర్చి, అభి...నాం - అభివ్యక్త = స్ఫుటములైన, మనోరథానాం = కోరికలుగల, మహీపతీనాం = రాజులకు, ప్రణ... త్యః - ప్రణయ = ప్రార్థనలయందు - అగ్రదూత్యః = మొదటికుంటెనగత్తెలైన, వివిధాః = నానావిధములైన, శృఙ్గారచేష్టాః - శృఙ్గార = సింగారముయొక్క - చేష్టాః= చేతలు, పాదపానాం = చెట్లకు, ప్రవా...వ - ప్రవాళ = చిగుళ్లయొక్క - శోభా ఇవ = సంపదలవలె, బభూవుః = అయినవి.

తా.—ఆ యిందుమతియందు స్ఫుటమైన కోరికలుగల యారాజులకు వారి ప్రార్థనను దెలుపు తొలిదూతిక లయినట్టివి శృంగారచేష్టలు వసంతలక్ష్మిం గాంచిన చెట్లకు చిగుళ్ల సంపదలు వోలె ఉప్పతిల్లినవి. -

వ్యా.—తా మితి.—తామ్ ఇన్దుమతీం ప్రతి, అభివ్యక్త మనోరథానాం ప్రకటాభిలాషాణాం, మహీపతీనాం రాజ్ఞాం, ప్రణయాగ్రదూత్యః- ప్రణయః ప్రార్థనా ప్రేమ వా * 'ప్రణయాస్త్వమీ విస్రమ్భ యాచ్ఞా ప్రేమాణ' ఇత్యమరః - ప్రణయేషు - అగ్రదూత్యః ప్రథమదూతికాః - ప్రణయప్రకాశకత్వ సామ్యా ద్దూతీత్వవ్యపదేశః, వివిధాః నానావిధాః శృఙ్గారచేష్టాః శృఙ్గారవికారాః, పాదపానాం, ప్రవాళశోభాః పల్లవసంపద ఇవ, బభూవుః ఉత్పన్నాః. అత్ర శృఙ్గారలక్షణం రసార్ణవసుధాకరే -

'విభావై రనుభావై శ్చ సాత్త్వికై ర్వ్యభిచారిభిః
నీతా సదస్య రస్యత్వం రతిః శృఙ్గార ఉచ్యతే.'

రతి రిచ్ఛావిశేషః - తచ్చోక్తం తత్రైవ -

'యూనో రన్యోన్య విషయస్థాయి నీచ్ఛా రతిః స్మృతా' ఇతి.

చేష్టాశబ్దేన తదనుభావవిశేషా ఉచ్యన్తే, తేఽపి తత్రైవోక్తాః -

'భావం మనోగతం సాక్షాత్ స్వహేతుం వ్యఞ్జయన్తి యే
తేఽనుభావా ఇతి ఖ్యాతాః భ్రూవిక్షేప స్మితాదయః
తే చతుర్ధా చిత్త గాత్ర వా గ్బుద్ధ్యారమ్భ సంభవాః.' ఇతి,

తత్ర గాత్రారమ్భసంభవాన్ చేష్టాశబ్దోక్తాన్ అనుభావాన్ కశ్చిదిత్యాదిభిః సప్తభిః శ్లోకై ర్వక్ష్యతి ; శృఙ్గారాభాస శ్చాయ - మేక త్రైవ ప్రతిపాదనాత్ ; తదుక్తమ్-
'ఏకత్రైవానురాగ శ్చే త్తిర్యఙ్ మ్లేచ్ఛగతోఽపి వా
యోషితో బహుస క్తి శ్చే ద్రసాభాస స్త్రిధా మతః.' ఇతి.

---

కశ్చి త్కరాభ్యా ముపగూఢనాళ మాలోలపత్త్రాభిహతద్విరేఫం
రజోభి రన్తఃపరివేషబన్ధి లీలారవిన్దం భ్రమయాఞ్చకార. 13

టీక.—కశ్చిత్ = ఒకానొకరాజు, కరాభ్యాం = చేతులతో, ఉపగూఢనాళమ్ - ఉపగూఢ = పట్టుకొఁబడిన - నాళమ్ = తూఁడుకలదియు, ఆలో...ఫమ్ - ఆలోల = చంచలములైన - పత్త్ర = రేకులచేత - అభిహత = కొట్టఁబడిన - ద్విరేఫం = తేంట్లుగలదియు, రజోభిః = పుప్పొడులచేత, అన్త...న్ధి - అన్తః = లోపల - పరివేష = గుడిని - బన్ధి = కట్టుచున్నదియు, (నైన), లీలారవిన్దం - లీలా = విలాసార్థమైన - అరవిన్దం. తామరను, భ్రమయాఞ్చకార = త్రిప్పెను.

తా.—ఒకరాజు తామరపూవును రెండు చేతులతోను తూఁడుపట్టుకొని గిఱ్ఱునఁ ద్రిప్పెను. ఆత్రిప్పుటలో చలించుచున్న రేకులు తేంట్లను కొట్టుచుండినవి, లోపల పుప్పొడి చక్రము గట్టుచుండినది.—నన్ను పెండ్లియాడి చేతిలోని యీవిలాసకమలము నుంబోలె నన్ను నీవు త్రిప్పవలయు నని యతని యభిప్రాయము.—ఈతఁడు హస్తఘూర్ణకుఁడు అవలక్షణకుఁ డని యిందుమతి భావము.

వ్యా.—శృఙ్గారచేష్టా వివిధా బభూవు రి త్యుక్తం - తా ఏవ దర్శయతి కశ్చి దిత్యాదినా.—కశ్చి ద్రాజా, కరాభ్యాం పాణిభ్యామ్, ఉపగూఢనాళం గృహీతనాళమ్, ఆలోలై శ్చఞ్చలైః పత్త్రైః - అభిహతా స్తాడితాః - ద్విరేఫాః భ్రమరాః - యేన త త్తథోక్తం, రజోభిః పరాగైః, అన్తః - పరివేషం మణ్డలం - బధ్నా తీ త్యన్తః పరివేషబన్ధి, లీలారవిన్దం వినోదాత్మకం శృఙ్గారార్థం గృహీత మరవిన్దం, భ్రమయాఞ్చకార; కరస్థలీలారవిన్దవత్ త్వయాఽహం భ్రమయితవ్య ఇతి నృపాభి ప్రాయః, హస్తఘూర్ణకోఽయ మపలక్షణక ఇ తీన్దుమత్యభిప్రాయః,

---

విస్రస్తమంసా దపరో విలాసీ రత్నానువిద్ధాఙ్గదకోటిలగ్నమ్ [14
ప్రాలమ్బ ముత్కృష్య యథాప్రదేశం నినాయ సాచీకృతచారువక్త్రః.

టీక.—విలాసీ = విలసనశీలుఁడైన, అపరః = మఱియొకరాజు, అంసాత్ = బుజమునుండి, విస్రస్తం = జాఱినదై, రత్నా...గ్నం - రత్న = మణులతో - అను

విద్ధ = చెక్కఁబడిన - అఙ్గద=భుజకీర్తి-యొక్క - కోటి = కొనయందు-లగ్నం = తగిలి నట్టి, ప్రాలమ్బం = తిన్నగ వ్రేలెడిహారమును, ఉత్క్షిప్య=ఎత్తి, సాచీ... క్త్రః సః- సాచీకృత = అడ్డముగాఁజేయఁబడిన - చారు = అందమైన, వక్త్రః సః = ముఖము గలవాఁడై, యథాప్రదేశం = దానిస్థానమును, నినాయ = పొందించెను.

తా.—హారాయలుకాఁడు మఱియొకరాజు బుజమునుండి జాఱి రత్నాలభుజకీర్తికొనకు తగులుకొన్న బుజాలంబిహారమును ఎత్తి నెమ్మొగము అడ్డుగా త్రిప్పి మరల దాని యెప్పటిచోటం జేర్చెను.—నిన్ను నేను ఈవిధముగా కౌఁగిలించికొనెదను అని రాజు నభిప్రాయము.— ఇతని దేహమున - ఒరులనుండి డాఁగురించుకొవలసిన దేమో కల దని యిందుమతి భావము.

వ్యా.—విస్రస్త మితి.— విలసనశీలో విలాసీ * 'వౌ కష లస కత్థ స్రమ్భ' ఇతి ఘినుణ్ప్రత్యయః, అపరో రాజా, అంసా ద్భుజశిరసః * 'స్కన్ధో భుజశిరోఽంసోఽస్త్రీ'త్యమరః, విస్రస్తం రత్నానువిద్ధం రత్నఖచితం - య దఙ్గదం కేయూరం - తస్య కోటిలగ్నమ్ అగ్రలగ్నమ్ * 'అత్యుత్కర్షాశ్రయః కోట్య ఇ'త్యమరః, ప్రాలమ్బమ్ ఋజులమ్బినీం స్రజం * 'ప్రాలమ్బ మృజులమ్బి స్యా త్కణ్ఠా ద్వైకక్షికం చ త ది'త్యమరః. ప్రావార మితి పాఠే తూత్తరీయం వస్త్రమ్. ఉత్క్షిప్య ఉద్ధృత్య, సాచీకృతం తిర్యక్కృతం - చారువక్త్రం యస్య స తథోక్తః సః, యథాప్రదేశం స్వస్థానం నినాయ ; ప్రావారోత్క్షేపణ చ్ఛలేన అహం త్వా మేవం పరిరప్స్య ఇతి నృపాభిప్రాయః, గోపనీయం కిఞ్చిదఙ్గేఽస్తి తతోఽయం ప్రావృణుత ఇ తీన్దుమ త్యభిప్రాయః.

---

ఆకుఞ్చితాగ్రాఙ్గులినా తతోఽన్యః కించిత్సమావర్జితనేత్రశోభః
తిర్యగ్విసంసర్పినఖప్రభేణ పాదేన హైమం విలిలేఖ పీఠమ్. 51

టీక.—తతః అన్యః = అతనికంటె మఱి యొకరాజు, కించి...భః సః - కించిత్ = ఇంచుక - సమావర్జిత = వంపఁబడిన - నేత్రశోభః సః = నేత్రకాంతి గలవాఁడై, ఆకుఞ్చి...నా - ఆకుఞ్చిత = వంగిన - అగ్రాఙ్గులినా = కొనవ్రేళ్లుకలదియు, తిర్యగ్...భేణ - తిర్యక్ = అడ్డముగ - విసంసర్పి = వ్యాపించుచున్న - నఖ = గోళ్లయొక్క - ప్రభేణ = కాంతిగలదియు, (అయిన), పాదేన = పాదముచేత, హైమం = బంగారపు, పీఠం = పాదపీఠమును, విలిలేఖ = గీఁకెను.

తా.—మఱియొకరాజు నేత్రకాంతిని ఇంచుక దిగువకు వంచి కాలికొనవ్రేళ్లను వంచినవాఁడై వానిగోళ్లకాంతి అడ్డముగా ప్రసరించుచుండఁగా కాలితో బంగారుపాదపీఠమును గీఁకెను.— నాకడకు రమ్మని రాజు నభిప్రాయము.— నేల గీఁకువాఁడు అవలక్షణుఁ డని యిందుమతి మతి. నేల గీఁకుట లక్ష్మీవినాశహేతువు.

వ్యా.—ఆకుఞ్చితేతి.—తతః పూర్వోక్తా, దన్యః కశ్చిద్రాజా, కించిత్సమావర్జిత నేత్రశోభః ఈషదవాక్పాతిత నేత్రకాన్తిః, ఆకుఞ్చితాః ఆభుగ్నాః - అగ్రాఙ్గుళయో యస్య తేన, తిర్యగ్విసంసర్పిణీ నఖప్రభా యస్య తేన, పాదేన, హైమం హిరణ్మయం, పీఠం పాదపీఠం, విలిలేఖ లిఖితవాన్; పాదాఙ్గుళీనా మాకుఞ్చనేన త్వం మత్సమీప మాగచ్ఛేతి నృపాభిప్రాయః.—భూమివిలేఖకోఽయ మపలక్షణ ఇతి స్నుమత్యభిప్రాయః, భూమివిలేఖనం తు లక్ష్మీవినాశహేతుః.

---

నివేశ్య వామం భుజ మాసనార్ధే తత్సన్నివేశా దధికోన్నతాంసః
కశ్చిద్వివృత్తత్రికభిన్నహారః సుహృత్సమాభాషణతత్పరోఽభూత్. 16

టీక.—కశ్చిత్ = ఒకానొకరాజు, వామం = ఎడమ, భుజం = బాహువును, ఆసనార్ధే - ఆసన = గద్దెయొక్క - అర్ధే = ఒకభాగమందు, నివేశ్య = ఉంచి, తత్సన్నివేశాత్ - తత్ = ఆయెడమభుజముయొక్క - సన్నివేశాత్ = ఉంచుటవలన, అధి...సః సన్ =అధిక=మిక్కిలి - ఉన్నత = ఎగుడయిన - అంసః సన్ = ఎడమభుజముగలవాడై, వివృ...రః-వివృత్త=తిరిగిన - త్రిక=వెన్నెముకయొక్క క్రిందిప్రదేశమునందు - భిన్న = జీరాడుచున్న - హారః = ముత్తెములపేరుగలవాఁడై, సుహృ...రః - సుహృత్ = మిత్త్రునితోడ - సమాభాషణ = మాటలాడుటయందు - తత్పరః = ఆసక్తుఁడు, అభూత్ = ఆయెను.

తా.—ఒకరాజు గద్దియయందు ఒకప్రక్కను ఎడమ భుజమును ఊనుకొని అందువలన ఆబుజము ఎగుడై యుండఁగా, తిరిగియున్న వెన్నెముకయొక్క క్రిందిప్రదేశమున హారము జీరాడుచుండ, ఎడమప్రక్కనున్న మిత్త్రునితో ముచ్చటలాడుచుండెను.—నిన్ను ఎడమభాగమం దుంచుకొని నీతో ఇట్లు ముచ్చటించెదను, అని రాజునభిప్రాయము.—నన్నుఁ గని పెడమొగ మయినాఁ డీతఁడు, కార్యకారి కాఁడు, అని యిందుమతిభావము.

వ్యా.—నివేశ్యేతి.—కశ్చిద్రాజా వామం భుజమ్ ఆసనార్ధే సింహాసనైకదేశే, నివేశ్య సంస్థాప్య, తత్సన్నివేశాత్ - తస్య వామభుజస్య సన్నివేశాత్ నిక్షేపణాత్, అధికోన్నతో వామాంస ఏవ యస్య స తథోక్తః సన్, వివృత్తే పరావృత్తే - త్రికే త్రికప్రదేశే - భిన్నహారః లుణ్ఠితహారః సన్ *'పృష్ఠవంశాధరే త్రిక' మిత్యమరః, సుహృత్సమాభాషణతత్పరః అభూత్ వామపార్శ్వవర్తినైవ మిత్త్రేణ సంభాషితుం ప్రవృత్త ఇత్యర్థః - అత ఏవ వివృత్తత్రికత్వం ఘటతే;— త్వయా వామాఙ్కే నివేశితయా సహ ఏవం వార్తాం కరిష్య ఇతి నృపాభిప్రాయః; మాం దృష్ట్వా పరాఙ్ముఖోఽయం న కార్యకర్తా ఇతి స్నుమత్యాశయః.

---

విలాసినీవిభ్రమదన్తపత్త్ర మాపాణ్డురం కేతకబర్హ మన్యః [17
ప్రియానితమ్బోచితసన్నివేశై ర్విపాటయామాస యువా నఖాగ్రైః.

టీక.—అన్యః=మఱియొక, యువా = యౌవనవంతుఁడు, విలా...త్త్రం - విలాసినీ = విలసనశీలురాలికి - విభ్రమ = విలాసపు - దన్తపత్త్రమ్ = చెవికమ్మయైన, ఆపాణ్డురం = అంతటను తెల్లని, కేతకబర్హం = మొగలిరేకును, ప్రియా...నైః- ప్రియా= కాంతయొక్క - నితమ్బ = పిఱుందునందు - ఉచిత = అలవాటుపడిన - సన్నివేశైః= ఉంచుటలుగలిగిన, నఖాగ్రైః - నఖ = గోళ్లయొక్క - అగ్రైః = కొనలతో, విపాటయామాస = చీల్చెను.

తా.—మఱియొకరాజు విలసనశీలురాలు వీనులందు కమ్మగా ధరించునట్టిదైన మొగలిరేకును అంతటను తెల్లగా నున్నట్టిదానిని, కాంతయొక్క పిఱుందుపై అలవాటు పడిన కొనగోళ్లతో చీలెను.—ఈవిధముగా నీపిఱుందును నేను నఖక్షతము లొనర్చెదను అని యాతని యభిప్రాయము.—ఈతఁడు తృణచ్ఛేదకుఁడు కులక్షణుఁ డని ఇందుమతి భావము.

వ్యా.—విలాసి నీతి.—అన్యః అపరః, యువా, విలాసిన్యాః ప్రియాయాః భ్రమార్హం దన్తపత్త్రభూతమ్ ఆపాణ్డురం కేతకబర్హం కేతకదలం * 'దళేఽపిబర్హ మి'త్యమరః, ప్రియానితమ్బే - ఉచితసన్నివేశైః అభ్యస్తనిక్షేపణైః, నఖాగ్రైః, విపాటయామాస విదారయామాస; అహం తవ నితమ్బే ఏవం నఖవ్రణాదీన్ దాస్యా మీతి నృపాభిప్రాయః తృణచ్ఛేదకవత్ పత్త్రపాటకోఽయ మపలక్షణ ఇ తీన్దుమత్యా నాఙ్గీకృతమ్.

---

కుశేశయాతామ్రతలేన కశ్చిత్ కరేణ రేఖాధ్వజలాఞ్ఛనేన
రత్నాఙ్గులీయప్రభయాఽనువిద్ధా నుదీరయామాస సలీల మక్షాన్.18

టీక.—కశ్చిత్ = ఒకానొకరాజు, కుశే...న - కుశేశయ = నూఱురేకులతామరవలె - ఆ తామ్ర=నిండుగ నెఱ్ఱనైన - తలేన = అరచేయికలదియు, రేఖా...న - రేఖా = గీఱలుగానున్న - ధ్వజ = టెక్కెములే - లాఞ్ఛనేన = చిహ్నములుగాఁ గలదియు, (అయిన), కరేణ = చేతితో, రత్నా...యా-రత్న=మణులయొక్క - అఙ్గులీయ = ఉంగరములయొక్క - ప్రభయా = కాంతిచేత - అనువిద్ధాన్ =వ్యాప్తములైన అక్షాన్ = పాచికలను, సలీలం యథా తథా=విలాసయుక్తముగా, ఉదీరయామాస = ఎత్తివైచెను.

తా.—మఱియొకరాజు నూఱురేకుల తామరవంటిదైన ధ్వజరేఖగలదైన యఱచేతితో సవిలాసముగా రతనాలయుంగరాలకాంతి పొలసిన పాచికలను ఎత్తివైచెను.—

సీతో నే నిట్లు క్రీడించెద నని యాతనిభావము.—ఈతఁడు జూదగాఁడు కాన కా పురుషుఁ డని యామెతలంపు.

వ్యా.—కుశేశ యేతి.—కశ్చి ద్రాజా కుశేశయం శతపత్త్ర మివ - ఆతామ్రం తలం యస్య తేన * 'శతపత్త్రం కుశేశయ మి'త్యమరః, రేఖారూపాః-ధ్వజాః - లాఞ్ఛనాని యస్య తేన, కరేణ, అఙ్గుళీషు భవాని అఙ్గుళీయాని హోర్మికాః * 'అఙ్గుళీయక మూర్మి కే' త్యమరః * 'జిహ్వామూలాఙ్గుళే శ్ఛ' ఇతి ఛ ప్రత్యయః, రత్నానామ్ అఙ్గుళీయాని తేషాం ప్రభయా, అనువిద్ధాన్ వ్యాప్తాన్, అక్షాన్ పాశకాన్ * 'అక్షా స్తు దేవనాః పాశకా శ్చ త' ఇత్యమరః, సలీలం యథా తథా, ఉదీరయామాస ఉచ్చి క్షేప, 'అహం త్వయా సహ ఏవం రంస్య' ఇతి నృపాభిప్రాయః; అక్షచాతుర్యేణ కాపురుష ఇ తీన్దు మత్యభిప్రాయః * 'అక్షై ర్మా దీవ్య' ఇతి శ్రుతినిషేధాత్.

---

కశ్చి ద్యథాభాగ మవస్థితేఽపి స్వసన్ని వేశా ద్వ్యతిలఙ్ఘి నీవ
రత్నాంశుగర్భాఙ్గుళిరన్ధ్ర మేకం వ్యాపారయామాస కరం కిరీటే. 19

టీక.—కశ్చిత్ = ఒకానొకరాజు, యథాభాగం = సరియైనచోట, అవస్థితే అపి = ఉన్నదయినను, స్వసన్నివేశాత్ = తనతావునుండి, వ్యతిలఙ్ఘిని ఇవ = తొలఁగిన దానింబోలె, కిరీటే = కిరీటమునందు, రత్నా...న్ధ్రమ్ - రత్న = (కిరీట) రత్నముల యొక్క-అంశు=కాంతులే - గర్భ = లోపలఁగలిగిన - అఙ్గుళి = వ్రేళ్లయొక్క - రన్ధ్రం= సందులుగల, ఏకం కరం = ఒకచేతిని, వ్యాపారయామాస = ప్రవర్తింపఁజేసెను.

తా.—మఱియొకరాజు తనకిరీటము దానిచోటనే సరిగానే యున్నను అటనుండి జాఱినట్లుగా దానిని ఒకచేత సరుదుకొనెను. దాని రతనాలకాంతిచే ఆచేతివ్రేళ్లసందులు నిండిపోయినవి.—కిరీటమువలె నీవు నాశిరమున కూర్చున్నను నేను బరువుగా తలంపను - అని రాజభావము.—నెత్తిని చేయిపెట్టుకొన్నవాఁ డితఁడు అవలక్షణుఁడు.—అని యిందు మతిభావము.

వ్యా.— కశ్చి దితి.— కశ్చి ద్రాజా యథాభాగం యథాస్థానమ్, అవస్థితేఽపి, స్వసన్నివేశాత్ వ్యతిలఙ్ఘిని ఇవ స్వస్థానా చ్చలిత ఇవ, కిరీటే, రత్నానాం కిరీటగతానామ్ అంశవః గర్భే యేషాం తాని అఙ్గుళీరన్ధ్రాణి యస్య తమ్, ఏకం కరం వ్యాపారయామాస; కిరీటవ న్మమ శిరసి స్థితా మపి త్వాం భారం న మన్య ఇతి నృపాభిప్రాయః, శిరసి న్యస్తహస్తః అయ మపలక్షణ ఇ తీన్దుమత్యభిప్రాయః.

---

తతో నృపాణాం శ్రుతవృత్తవంశా పుంవత్ ప్రగల్భా ప్రతిహారరక్షీ
ప్రాక్సన్నికర్షం మగధేశ్వరస్య నీత్వా కుమారీ మవదత్ సునన్దా. 20

టీక.—తతః = తర్వాత, నృపాణాం = రాజులయొక్క, శ్రుతవృత్తవంశా - శ్రుత = వినఁబడిన - వృత్త = చరిత్రములును - వంశ = కులములునుగలదియు, ప్రగల్భా = వాగ్మినియు. (అయిన), సునన్దా = సునందయనెడి, ప్రతిహారరక్షీ = ద్వారపాలకురాలు, ప్రాక్ = మొదట, కుమారీం = ఇందుమతిని, మగధేశ్వరస్య = మగధరాజుయొక్క, సన్నికర్షం = సమీపమునకు, నీత్వా = కొనిపోయి, పుంవత్ = పురుషునివలె - అనఁగా - దిట్టతనముతో, అవదత్ = వాక్రుచ్చెను.

తా.—అంతట రాజుల చరిత్రములను వంశావళులను ఎఱింగినట్టిది వాగ్మిని సునందయను ద్వారపాలకురాలు మొదట ఇందుమతిని మగధరాజుకడకుం దెచ్చి మగవానివలె దిట్టతనము మెఱయ నిట్లు వక్కాణించెను.

వ్యా.—తత ఇతి.—తతః అనన్తరం, నృపాణాం శ్రుత వృత్త వంశా శ్రుత నృప చరిత్రకు లే త్యర్థః * సాపేక్షత్వేఽపి గమకత్వా త్సమాసః, ప్రగల్భా వాగ్మినీ, సునన్దాఖ్యా, ప్రతిహారం ద్వారం - రక్షతీతి ప్రతిహారరక్షీ ద్వారపాలికా * కర్మణ్యణ్ప్రత్యయః * టిడ్ఢాణఞిత్యాదినా ఙీప్, ప్రాక్ ప్రథమం, కుమారీమ్ ఇన్దుమతీం, మగధేశ్వరస్య, సన్నికర్షం సమీపం, నీత్వా, పుంవ త్పుంసా తుల్యం, * 'తేన తుల్యం క్రియా చే ద్వతి రి' తి వతిప్రత్యయః, అవదత్ అవాదీత్.

---

అసౌ శరణ్యః శరణోన్ముఖానా మగాధసత్త్వో మగధప్రతిష్ఠః
రాజా ప్రజారఞ్జనలబ్ధవర్ణః పరన్తపో నామ యథార్థనామా. 21

టీక.—శరణోన్ముఖానాం = శరణార్థులకు, శరణ్యః = రక్షణసమర్థుఁడును, అగాధసత్త్వః - అగాధ = గంభీరమైన - సత్త్వః = స్వభావముకలవాఁడును, మగధప్రతిష్ఠః - మగధ = మగధదేశమునందు - ప్రతిష్ఠః = స్థితికలవాఁడును, ప్రజా...ర్ణః— ప్రజా = జనులయొక్క - రఞ్జన = సంతోషపెట్టుటయందు - లబ్ధవర్ణః = విచక్షణుఁడును, (అయిన), అసౌ రాజా = ఈ రాజు, పరన్తపో నామ = పరంతపుఁడు అని యథార్థనామా - యథార్థ = అన్వర్థమైన - నామా = పేరుకలవాఁడు.

తా.— ఈరాజు శరణార్థులను రక్షింపసమర్థుఁడు, మగధదేశము నేలువాఁడు, జనులను రంజించుటచేత కీర్తిఁజెందినవాఁడు, శత్రువులను తపింప జేయుటచేత పరంతపుఁడనుసార్థకనామము కలవాఁడు.

వ్యా.—అసా వితి.— అసౌ రాజా - అసా వితి పురోవర్తినో నిర్దేశః - ఏవ ముత్తరత్రాపి ద్రష్టవ్యం, శరణోన్ముఖానాం శరణార్థినాం శరణ్యః * శరణే రక్షణే సాధుః సమర్థః * 'తత్ర సాధు రి' తి యత్ప్రత్యయః - 'శరణం భవితు మర్హః శరణ్య' ఇతి నాథనిరుక్తి ర్విరుద్ధా లైవ, అగాధసత్త్వః గమ్భీరస్వభావః

* 'సత్త్వం గుణే పిశాచాదౌ బలే ద్రవ్యస్వభావయో రి' తి విశ్వః, మగధాః జనపదాః- తేషు- ప్రతిష్ఠా ఆస్పదం - యస్య సః మగధప్రతిష్ఠః * 'ప్రతిష్ఠా కృత్య మాస్పద మి' త్యమరః, ప్రజారఞ్జనే - లబ్ధవర్ణః విచక్షణః - య ద్వా - ప్రజారఞ్జనేన-లబ్ధవర్ణః లబ్ధోత్కర్షః, పరాన్ శత్రూన్ - తాపయ తీతి పరన్తపః పరన్తపాఖ్యః * 'ద్విషత్పరయో స్తాపే రి'తి ఖచ్ప్రత్యయః * 'ఖచి హ్రస్వ' ఇతి హ్రస్వః * 'అరుర్ద్విషద' త్యాదినా ముమాగమః, నా మేతి ప్రసిద్ధౌ - యథార్థం నామ యస్య సః యథార్థ నామా - శత్రుసంతాపనా దితి భావః.

---

కామం నృపాః సన్తు సహస్రశోఽన్యే
రాజన్వతీ మాహు రనేన భూమిం,
నక్షత్రతారాగ్రహసంకులాఽపి
జ్యోతిష్మతీ చన్ద్రమ సైవ రాత్రిః. 22

టీక.—అన్యే=కడమ, నృపాః = రాజులు, కామం = మిక్కిలి, సహస్రశః = వేలకొలంది, సన్తు = ఉందురుగాక, భూమిం = భువిని, అనేన = ఈపరంతపునిచేత, రాజన్వతీం = మంచిరాజుకలదానినిగా, ఆహుః = చెప్పుదురు, తథాహి = అదేసరి, నక్ష...పి - నక్షత్ర = అశ్విన్యాదినక్షత్రములచేతను - తారా = సాధారణనక్షత్రములచేతను - గ్రహ = అంగారకాదిగ్రహములచేతను - సంకులా అపి = క్రిక్కిఱిసినదైనను, రాత్రిః = రేయి, చన్ద్రమసైవ = చందమామచేతనే, జ్యోతిష్మతీ = వెలుతురు కలది.

తా.—నక్షత్రతారాగ్రహములు వేనవేలుగా ఎన్ని క్రిక్కిఱిసియున్నను చంద్రుఁడు మాత్రమే రాత్రికి వెలుతురు ఇచ్చువాఁడయినట్లు, కడమరాజులు వేనవేలుగా ఉన్నను పరంతపుఁడొకఁడే భూమికి మంచిరాజు.

వ్యా.—కామ మితి.—అన్యే నృపాః, కామం, సహస్రశః సన్తు, భూమిమ్, అనేన, రాజన్వతిం శోభనరాజవతీ - మాహుః - నైతాదృశః కశ్చి దస్తీ త్యర్థః *'సురాజ్ఞి దేశే రాజన్వాన్ స్యా త్తతోఽన్యత్ర రాజవా ని'త్యమరః, * 'రాజన్వాన్ సౌరాజ్య' ఇతి నిపాతనా త్సాధుః, తథాహి - నక్షత్రై రశ్విన్యాదభిః - తారకాభిః సాధారణై ర్జ్యోతిర్భిః - గ్రహై ర్భౌమాదిభిశ్చ - సంకులాఽపి, రాత్రిః చన్ద్రమ సైవ, జ్యోతి రస్యా అ స్తీతి జ్యోతిష్మతీ - నాన్యేవ జ్యోతిష్మ తీ త్యర్థః.

---

క్రియాప్రబన్ధా దయ మధ్వరాణా మజస్ర మాహూతసహస్రనేత్రః
శచ్యా శ్చిరం పాణ్డుకపోలలమ్బాన్ మన్దారశూన్యా నలకాం శ్చకార. 23

టీక.—అయమ్ = ఈతఁడు, అధ్వరాణాం = జన్నములయొక్క, క్రియాప్రబన్ధాత్ = అనుష్ఠాన నిత్యత్వమువలన, అజస్రం = సంతతముగా, ఆహూ...సన్ - ఆహూత = పిలువఁబడిన - సహస్రనేత్రః సన్ = ఇంద్రుఁడుకలవాఁడై, చిరం = బహుకాలము, శచ్యాః = శచీదేవియొక్క, అలకాన్ = ముంగురులను, పాణ్డు...మ్బాన్ - పాణ్డు = తెల్లనైన - కపోల = చెక్కిళ్లయందు - లమ్బాన్ = వ్రేలుచుండువానినిగాను, మన్దారశూన్యాన్ - మన్దార = కల్పవృక్షకుసుమములచేత - శూన్యాన్ = కొఱవడినవానినిగాను, చకార = చేసెను.

తా.—ఈమహారాజు ఎడతెంపు లేకుండ యజ్ఞములు గావించుచు అందులకై యింద్రుని నిరంతరమును పిలుచుచుండుటచేత శచీదేవికి ప్రోషితభర్తృక యగు పతివ్రత యొక్క ధర్మముచేత కేశసంస్కారము లేనందున చిరకాలము మందారపుష్పరహితము లయిన ముంగురులు పాలిన చెక్కిళ్లమీఁద వ్రేలాడుచుండినవి.

వ్యా.—క్రియేతి.—అయం పరన్తపః, అధ్వరాణాం క్రతూనాం, క్రియాప్రబన్ధాత్ అనుష్ఠానసాంతత్యాత్ - అవిచ్ఛిన్నానుష్ఠానా దిత్యర్థః, అజస్రం నిత్యమ్, ఆహూతసహస్రనేత్రః సన్, చిరం, శచ్యాః, అలకాన్, పాణ్డుకపోలయోః - లమ్బాన్ స్రస్తాన్ * పచాద్యచ్, మన్దారైః కల్పద్రుమకుసుమైః - శూన్యాన్, చకార; ప్రోషితభర్తృకా హి కేశసంస్కారం న కుర్వన్తీతి భావః * 'ప్రోషితే మలినా కృశే' తి స్మరణాత్.

---

అనేన చే దిచ్ఛసి గృహ్యమాణం పాణిం వరేణ్యేన కురు ప్రవేశే
ప్రాసాదవాతాయనసంస్థితానాం నేత్రోత్సవం పుష్పపురాఙ్గనానామ్.

టీక.—వరేణ్యేన = వరింపఁదగినవాఁడయిన, అనేన = ఈపరంతపమహారాజు చేత, గృహ్యమాణం = పట్టఁబడుదానినిగా, పాణిం = చేతిని, ఇచ్ఛసి చేత్ = కోరుదువేని, ప్రవేశే = పురప్రవేశమునందు, ప్రాసా...నాం - ప్రాసాద = రాచనగరుల యొక్క - వాతాయన = కిటికీలయందు - సంస్థితానాం = ఉండెడు, పుష్ప...నాం - పుష్పపుర = పాటలీపుత్త్రనగరమునందలి - అఙ్గనానాం = చెలువలకు, నేత్రోత్సవం = కన్నులపండువును, కురు = చేయుము.

తా.—ఈరాజు వరింపఁదగినవాఁడు. ఇతనిం బెండ్లియాడుదువేని నిన్ను పురప్రవేశమహోత్సవమందు పాటలీపురముయొక్క రాచమేడల కిటికీలనుండి సుందరీమణులు కన్నులపండువుగా దర్శింతురు.

వ్యా.—అనే నేతి.—వరేణ్యేన వరణీయేన - వృణోతే రౌణాదికః * 'వృఞ్ఏణ్య' ఇతి ఏణ్యప్రత్యయః, అనేన రాజ్ఞా, గృహ్యమాణం పాణిమ్ ఇచ్ఛసి చేత్ పాణిగ్రహణ మిచ్ఛసి చే దిత్యర్థః, ప్రవేశే పురప్రవేశకాలే, ప్రాసాదవాతాయనసంస్థితానాం

రాజభవనగవాక్షస్థితానాం, పుష్పపురాఙ్గనానాం పాటలీ పురాఙ్గనానాం, నేత్రోత్సవం కురు - సర్వోత్తమానాం తాసా మపి దర్శనీయా భవిష్య సీతి భావః.

---

ఏవం త యోక్తేత మవేక్ష్య కించి
ద్విస్రంసి దూర్వాఙ్కమధూకమాలా
ఋజుప్రణామక్రియ యైవ తన్వీ
ప్రత్యాదిదే శైన మభాషమాణా. 25

టీక.—ఏవం = ఈప్రకారము, తయా = అసునంద చేత, ఉక్తే సతి = చెప్పఁబడఁగా, తం=అపరంతపుని, అవేక్ష్య = చూచి, కించి...లా - కించిత్ విస్రంసి = కొంచెము జాఱుచున్న - దూర్వా = గఱికలే - అఙ్క = గుర్తులుగాఁగల - మధూక = ఇప్పపువ్వులయొక్క - మాలా = సరముగలదయిన, తన్వీ = ఇందుమతీదేవి, ఏనమ్ = ఈపరంతపుని, అభాషమాణా=పలుకక, ఋజు...వ - ఋజు = మాటలులేని - ప్రణామ= నమస్కారముయొక్క - క్రియ యైవ = చేఁతచేత నే, ప్రత్యాదిదేశ = పరిహరించెను.

తా.—సునంద చెప్పఁగా ఇందుమతి అపరంతపమహారాజును చూచి తన చేతినుండి గఱిక గుర్తుగల యిప్పపూదండ కొంచెము జాఱుచుండఁగా ఏమియు పలుకక మాటలేని పట్టి నమస్కారము చేసి అయనను పరిహరించెను.

వ్యా.— ఏవ మితి.— ఏవం, తయా సునన్దయా, ఉక్తే సతి, తం పరన్తపమ్, అవేక్ష్య, కించిద్విస్రంసినీ - దూర్వాచిహ్నా - మధూకమాలా గుడపుష్పమాలా,- యస్యాః సా * 'మధూకే తు గుడపుష్ప మధుద్రుమా వి'త్యమరః - వరణే శిథిలప్రయ త్నేతి భావః, తన్వీ ఇన్దుమతీ, ఏనం నృపమ్, అభాషమాణా, ఋజ్వ్యా భాషణశూన్యయా, ప్రణామక్రియ యైవ, ప్రత్యాదిదేశ పరిజహార.

---

తాం సైన వేత్రగ్రహణే నియుక్తా
రాజాన్తరం రాజసుతాం నినాయ
సమీరణో త్థేవ తరఙ్గరేఖా
పద్మాన్తరం మానసరాజహంసీమ్. 26

టీక.—వేత్రగ్రహణే-వేత్ర = బెత్తముయొక్క - గ్రహణే - పట్టుకొనుటయందు, నియుక్తా = నియమింపఁబడిన - అనఁగా - ద్వారమును గాచునదయిన, సైవ = ఆసునందయే, తాం = ఆ, రాజసుతాం = ఇందుమతీదేవిని, రాజాన్తరం = మఱియొక

రాజును, సమీరణోత్థా - సమీరణ = గాలికి - ఉత్థా = లేచిన, తరఙ్గ రేఖా - తరఙ్గ = అలలయొక్క - రేఖా = వరుస, మాన...సీం - మానస = మానససరస్సునందలి - రాజ హంసీం = రాయంచ కోమలిని, పద్మాన్తర మివ = మఱియొకకమలమునుంబోలె, నినాయ = చేర్చెను.

తా.—అంత నాదౌవారికి సునంద ఇందుమతీదేవియొక్క చిత్తమెఱిఁగి ఆమెను గాలికి తెరలిన యలలవరుస మానససరోవరమునందలి రాజహంసిని మఱియొక తామరం జేరునట్లు, మఱియొకరాజు కడకుం జేర్చెను.

వ్యా.—తా మితి —సైవ నాన్యా - చిత్తజ్ఞత్వా దితి భావః, వేత్రగ్రహణే నియుక్తా, దౌవారికీ సునన్దా, తాం రాజసుతాం, రాజాన్తరమ్ అన్యరాజానం, నినాయ * నయతి ద్వికర్మకః ; కథ మివ - సమీరణోత్థా వాతోత్పన్నా, తరఙ్గరేఖా ఊర్మి పఙ్క్తిః, మానసే సరసి - యా రాజహంసీ తాం, పద్మాన్తర మివ.

---

జగాద చైనా మయ మఙ్గనాథః
సురాఙ్గనాప్రార్థితయౌవనశ్రీః
వినీతనాగః కిల సూత్రకారై
రైన్ద్రం పదం భూమిగతోఽపి భుఙ్క్తే. 27

టీక.—ఏనాం = ఈయిందుమతితో, జగాద చ = పలికెనుగూడ.—అయమ్ = ఇతఁడు, అఙ్గరాజః = అంగదేశరాజు, సురా...శ్రీః - సురాఙ్గనా = అచ్చరలచేత - ప్రార్థిత = కోరఁబడిన - యౌవనశ్రీః = జవ్వనంపుసొంపుగలవాఁడు, సూత్రకారైః = గజశాస్త్రకారు లైనపాలకాదులచేత, వినీ...ల - వినీత = నేర్పఁబడిన - నాగాః కిల = ఏనుఁగులుంకలవాఁడు గనుకనే, భూమిగతోఽపి - భూమి = భూమిని - గతోఽపి = పొందినవాఁడైనను, ఐన్ద్రం = ఇంద్రునిదైన, పదం = ఐశ్వర్యమును, భుఙ్క్తే = అనుభవించుచున్నాఁడు.

తా.— సునంద యిందుమతితో నిట్లు పలికెను.— ఈయన అంగదేశరాజు, పూర్వము ఈయన ఇంద్రునికిం దోడ్పడుటకై యింద్రలోకమున కేఁగినప్పుడు అచ్చరలు ఈతనిజవ్వనంపుసొంపుకై మరులు వహించిరి. గజశాస్త్రకారులయిన సురమహర్షులే ఇతని యేనుఁగులను పనుపఱచువారు. ఇట్లీయన భూలోకమందే యుండియుం ఇంద్రైశ్వర్యము ననుభవించుచున్నాఁడు.

వ్యా.—జగా దేతి.—ఏనా మిన్దుమతీం, జగాద చ, కి మితి? అయమ్ అఙ్గనాథః అఙ్గదేశాధీశ్వరః, సురాఙ్గనాభిః, ప్రార్థితా కామితా - యౌవనశ్రీ ర్యస్య స తథోక్తః -

పురా కిల ఏన మిన్ద్రసాహాయ్యార్థ మిన్ద్రపురగామిన మహామయ స్తాప్సరస ఇతి ప్రసిద్ధిః, కించ, సూత్రకారైః గజశాస్త్రకృద్భిః పాలకాదిభిః మహర్షిభిః, వినీతనాగః శిక్షితగజః, కిలే త్యైతిహ్యే, అత ఏవ భూమిగతోఽపి, ఐన్ద్రం పద మిన్ద్రైశ్వర్యం, భుఙ్క్తే, భూలోకగత ఏవ స్వర్గసుఖ మనుభవ తీ త్యర్థః; దిగ్గజాప్సరో దేవర్షి సేవ్యత్వ మైన్ద్ర పదశబ్దార్థః; పురా కిల మహర్షి చ్ఛాపకారణాత్ భువ మవతీర్ణం దిగ్గజవర్గ మాలోక్య స్వయ మశక్తః ఇన్ద్రాభ్యనుజ్ఞయా ఆనీతైః దేవర్షిభిః ప్రణీతేన శాస్త్రేణ గజాన్ వశీ కృత్య భువి సంప్రదాయం ప్రావర్తయ దితి కథా గీయతే.

---

అనేన పర్యాసయతాఽస్రబిన్దూన్
ముక్తాఫలస్థూలతమాన్ స్తనేషు
ప్రత్యర్పితాః శత్రువిలాసినీనా
మున్ముచ్య సూత్రేణ వినైవ హారాః. 28

టీక.—శత్రువిలాసినీనాం = శత్రుస్త్రీలయొక్క, స్తనేషు = పాలిండ్లయందు, ముక్తా...మాన్ - ముక్తాఫల = ముత్తెపుఁబూసలవలె - స్థూలతమాన్ = మిక్కిలిపెద్ద వయిన, అస్రబిన్దూన్ = కన్నీటిబొట్టులను, పర్యాసయతా = ప్రవర్తింపఁజేయుచుం డెడి, అనేన = ఈయంగరాజుచేత, ఉన్ముచ్య = ఎత్తి, సూత్రేణ వినా - సూత్రము దప్ప, హారా ఏవ = ముత్తెపుఁజేరులే, ప్రత్యర్పితాః = ఉంపఁబడినవి.

తా.—ఈతఁడు శత్రురాజులను పరిమార్పఁగా వారిస్త్రీలు దుఃఖాతిశయముచే ఏడ్చినప్పుడు కురిసిన పెద్దపెద్దకన్నీటిబొట్టులు వారిపాలిండ్లపయిం బడుచు దారములు లేని హారములో యన నొప్పుచుండినవి.

వ్యా.— అనే నేతి.— శత్రువిలాసినీనాం రిపుస్త్రీణాం, స్తనేషు కుచేషు, ముక్తాఫలస్థూలతమాన్, అస్రబిన్దూ నశ్రుబిన్దూన్ * 'అస్ర మశ్రుణి శోణిత' ఇతి విశ్వః- భర్తృవధా దితి భావః, అనేన అఙ్గనాథేన ఉన్ముచ్య ఉత్క్షిప్య, సూత్రేణ వినా హారా ఏవ ప్రత్యర్పితాః; అవిచ్ఛిన్నాశ్రుబిన్దుప్రవర్తనాత్ ఉత్సూత్రహారార్పణ మేవ కృత మి త్యుత్ప్రేక్షా గమ్యతే.

---

నిసర్గభిన్నాస్పద మేకసంస్థ
మస్మిన్ ద్వయం శ్రీశ్చ సరస్వతీ చ;
కాన్త్యా గిరా సూనృతయా చ యోగ్యా
త్వ మేవ కల్యాణి తయో స్తృతీయా. 29

టీక.—నిసర్గ— నిసర్గ = స్వభావమువలన - భిన్న = వేర్వేరైన - ఆస్పదం = స్థానముగల, శ్రీ శ్చ = లక్ష్మియు, సరస్వతీ చ = సరస్వతియు, ద్వయం = ఈయిరువురును, అస్మిన్ = ఈయంగరాజునందు, ఏకసంస్థం - ఏక = ఒకనియందే-సంస్థం= ఉనికికలవారు, హే కల్యాణి = ఓ మంగళాంగీ, కాన్త్యా=లావణ్యముచేతను, సూనృతయా = సత్యప్రియమయిన, గిరా చ = వాక్కుచేతను, యోగ్యా = తగినదానవైన, త్వ మేవ = నీవే, తయోః = ఆయిరువురకు, తృతీయా = మూఁడవదానవు.

తా.—స్వాభావికముగా నొక రున్నచోట నొక రుండనివా రయిన లక్ష్మీసరస్వతులు ఇరువురును ఈయనయందు ఉన్నారు. ఓమంగళాంగీ, లావణ్యముచేత లక్ష్మికిని సత్యప్రియ వాక్కుచేత సరస్వతికిని తగిన సావాసకత్తెవు మూఁడవదానవు నీవే.—శ్రీమంతుఁడును విద్యావంతుఁడును అయిన యీయంగరాజు నీకు మిక్కిలి వరణీయుఁడు, ఇతనిని వరింపుము, అనుట.

వ్యా.—నిస ర్గేతి.—నిసర్గతః స్వభావతః - భిన్నాస్పదం భిన్నాశ్రయం - సహావస్థానవిరో ధీ త్యర్థః, శ్రీ శ్చ, సరస్వతీ చేతి, ద్వయమ్, అస్మిన్ అఙ్గనాథే, ఏకత్ర - సంస్థా స్థితి - ర్యస్య త దేకసంస్థమ్ ఉభయ మిహ సంగత మి త్యర్థః, హే కల్యాణి * 'బహ్వాదిభ్య శ్చే' తి జీష్, కాన్త్యా, సూనృతాయా సత్యప్రియయా, గిరా చ, యోగ్యా సంసర్గార్హా, త్వ మేవ, తయోః శ్రీసరస్వత్యో స్తృతీయా, సమానగుణయో ర్యువయో ర్దాంపత్యం యుజ్యే తేతి భావః; దక్షిణనాయకత్వం చాస్య ధ్వన్యతే - తదుక్తం * 'తుల్యోఽనేకత్ర దక్షిణ' ఇతి.

---

> అ థాఙ్గరాజా దవతార్య చక్షు
> ర్యాహీతి జన్యా మవద త్కుమారీ
> నాసౌ న కామ్యో న చ వేద సమ్య
> గ్ద్రష్టుం నసా భిన్నరుచి ర్హి లోకః. 30

టీక.—అథ = తర్వాత, కుమారీ = ఇందుమతీదేవి, అఙ్గరాజాత్ = అంగరాజునుండి, చక్షుః = చూపును, అవతార్య = దింపి, జన్యాం = మాతృసఖి యైనసునందను, యాహి = పొమ్ము, ఇతి = అని, అవదత్ = పలికెను, అసౌ = ఈయంగరాజు, కామ్యః = కోరఁదగినవాఁడు, నేతి న = కాఁడు అనుట కాదు, సా = ఆయిందుమతి, సమ్యక్ = చక్కఁగ, ద్రష్టుం = విమర్శించుటకు, న వేద ఇతి న = ఎఱుఁగదు అనుట కాదు, కిం తు = మతేమనిన, లోకః=జనము, భిన్నరుచిః హి - భిన్న = వేరైన రుచిః హి = కోరికగలది గద.

తా.—అంతట ఇందుమతి అంగరాజుమీఁదికి చూపును తివిచి సునందను అవలికి తరలుమని హెచ్చరించెను. ఇతఁడు కామింపఁదగినవాఁడు కాకపోలేదు, ఆమెయు గుణ విశేషమును చక్కఁగా నెఱింగినది కాకపోలేదు. మఱి యట్లయిన ఏల యాతని వదలిన దనఁగా, లోకుల కోరికలు భిన్నములుగదా.

వ్యా.—అథేతి.—అథ కుమారీ, అఙ్గరాజాత్, చక్షుః, అవతార్య అపనీయే త్యర్థః, జన్యాం మాతృసఖీం సునన్దాం, యాహి గచ్ఛే, త్యవదత్ 'యాతేతి జన్యా నవ దదీ'తి పాఠే జనీం వధూం వహ న్తీతి జన్యా వధూబన్ధవః - తాన్ యాత గచ్ఛతేత్య వదత్ * 'జన్యా మాతృసఖీముదోః'- 'జన్యో వరవధూజ్ఞాతి ప్రియ తుల్య హితేషు చే'తి పక్షద్వయేఽపి విశ్వః - అథవా జన్యా వధూభృత్యా * 'భృత్యా శ్చాపి నవోఢాయా' ఇతి కేశవః * 'సంజ్ఞాయాం జన్యా' ఇతి యత్ప్రత్యయాన్తో నిపాతః-యదత్రాహ వృత్తికారః 'జనీం వధూం వహ న్తీతి జన్యాః జామాతు ర్వయస్యా' ఇతి - య చ్చామరః * 'జన్యాః స్నిగ్ధా వరస్య య' ఇతి త త్సర్వ ముపలక్షణార్థ మి త్యవిరోధః; న చాయ మఙ్గరాజే నిషేధః దృశ్యదోషా న్నాపి ద్రష్టృదోషా ద్వే త్యాహ - నేత్యాదినా - అసౌ అఙ్గరాజః, కామ్యః కమనీయః, నే తి న కిం తు కామ్య ఏ వే త్యర్థః, సా కుమారీ చ సమ్యక్, ద్రష్టుం వివేక్తుం, న వే దేతి న కిం తు వే త్త్యే వే త్యర్థః, కింతు, లోకః జనః, భిన్నరుచి ర్హి - రుచిర మపి కించి త్కస్మైచి న్న రోచతే - కిం కుర్మః - న హి ఇచ్ఛా నియన్తుం శక్యత ఇతి భావః.

---

తతః పరం దుష్ప్రసహం ద్విషద్భి ర్నృపం నియుక్తా ప్రతిహారభూమౌ
నిదర్శయామాస విశేషదృశ్య మిన్దుం నవోత్థాన మివేన్దుమత్యై. 31.

టీక.—తతః = తర్వాత, ప్రతిహారభూమౌ = ద్వారప్రదేశమునందు, నియుక్తా = నియోగింపఁబడినసునంద, ద్విషద్భిః = శత్రువులచేత, దుష్ప్రసహం = సహింపశక్యము గానివాఁడును, విశేషదృశ్యం - విశేష = అతిశయముగా - దృశ్యం = చూడఁదగిన వాఁడును, (అయిన), పరం నృపం = మఱియొకరాజును, నవోత్థానం - నవ = క్రొత్తదైన - ఉత్థానమ్ = ఉదయముకలిగిన, ఇన్దుమివ = చంద్రునింబోలె, ఇన్దుమత్యై = ఇందుమతికి, నిదర్శయామాస = చూపెను.

తా.—తర్వాత ఆ ద్వారపాలకురాలు సునంద శత్రువులకు ఓర్వ శక్యముగాని వాఁడును మిక్కిలి దర్శనీయుఁడును అయిన మఱియొక రాజును అప్పు డుదయించిన చంద్రునింబోలె ఇందుమతికి చూపెను.

వ్యా.—తత ఇతి.—తతః అనన్తరం, ప్రతిహారభూమౌ ద్వారదేశే - నియుక్తా దౌవారికీ * 'స్త్రీ ద్వా ర్ద్వారం ప్రతిహార' ఇ త్యమరః, ద్విషద్భిః, శత్రుభిః దుష్ప్రసహం దుస్సహం శూర మి త్యర్థః, విశేషేణ దృశ్యం దర్శనీయం రూపవన్త మి త్య

ర్థః, పరమ్ అన్యం, నృపం రాజానం, నవోత్థానం నవోదయ మిన్దుమివ, ఇన్దుమత్యై, నిదర్శయామాస ప్రదర్శయామాస.

---

అవన్తినాథోఽయ ముదగ్రబాహు ర్విశాలవక్షా స్తనువృత్తమధ్యః
ఆరోప్య చక్రభ్రమ ముష్ణతేజా స్త్వష్ట్రేవ యత్నోల్లిఖితో విభాతి.

టీక.—ఉదగ్రబాహుః - ఉదగ్ర = పొడవులైన - బాహుః = భుజములుకలవాఁడును, విశాలవక్షాః - విశాల = వెడల్పైన - వక్షాః = ఱొమ్ముకలవాఁడును, తను...ధ్యః - తను=సన్నపాటి - వృత్త = గుండ్రని, మధ్యః = నడుముగలవాఁడును, (అయినట్టి), అయం = ఇతఁడు, అవన్తినాథః = అవంతిదేశరాజు, త్వష్ట్రా = విశ్వకర్మచేత, చక్రభ్రమం - చక్ర = చక్రాకారమైన - భ్రమం = సానయందు, ఆరోప్య - ఎక్కింపఁబడి, యత్నోల్లిఖితః - యత్న=ప్రయత్నముచేత - ఉల్లిఖితః = ఉత్తేజితుఁడయిన, ఉష్ణతేజాఇవ = సూర్యునివలె, విభాతి = వెలుఁగుచున్నాఁడు.

తా.—పొడవులగు బాహువులును వెడందఱొమ్మును సన్నపాటిగుండ్రనినడుమును గలయీతఁడు అవంతిరాజు ; విశ్వకర్మచే సానఁబెట్టఁబడిన సూర్యునివలె వెలుంగుచున్నాఁడు.

వ్యా.—అవన్తినాథ ఇతి.—ఉదగ్రబాహుః దీర్ఘబాహుః, విశాలం వక్షో యస్య సః విశాలవక్షాః, తనువృత్తమధ్యః కృశవర్తులమధ్యః, అయం రాజా అవన్తినాథః అవన్తిదేశానామ్ ఈశ్వరః, త్వష్ట్రా విశ్వకర్మణా, భర్తుః తేజోవేగ మసహమానయా దుహిత్రా సంజ్ఞాదేవ్యా ప్రార్థితే నేతి శేషః, చక్రభ్రమం చక్రారం శస్త్రోత్తేజనయన్త్రం * 'భ్రమోఽమ్బునిర్గమే భ్రాన్తౌ కున్దాఖ్యే శిల్పియన్త్రక' ఇతి విశ్వః, ఆరోప్య, యత్నేన - ఉల్లిఖితః నిశాతిత ఇత్యర్థః, ఉష్ణతేజాః సూర్యఇవ, విభాతి; అత్ర మార్కణ్డేయః -

'విశ్వకర్మా త్వనుజ్ఞాతః శాకద్వీపే వివస్వతా
భ్రమ మారోప్య తత్తేజ శ్శాతనా యోపచక్రమే.' ఇతి.

---

అస్య ప్రయాణేషు సమగ్రశక్తే రగ్రేసరై ర్వాజిభి రుత్థితాని
కుర్వన్తిసామన్తశిఖామణీనాం ప్రభాప్రరోహా స్తమయం రజాంసి. 33

టీక.—సమగ్రశక్తేః - సమగ్ర = సంపూర్ణములైన - శక్తేః - ప్రభుమంత్రోత్సాహశక్తులుగలవాఁడయిన, అస్య = ఈ యవంతిరాజుయొక్క, ప్రయాణేషు - గెలుపుయాత్రలయందు, అగ్రేసరైః = ముందఱ నేఁగుచుండు, వాజిభిః = గుఱ్ఱముల

చేత, ఉత్థితాని = లేచిన, రజాంసి = దుమారములు, సామ...నాం - సామన్త = శత్రురాజులయొక్క - శిఖా = సిగయందలి - మణీనాం = మాణిక్యములయొక్క, ప్రభా...యం - ప్రభా = వెలుఁగులయొక్క - ప్రరోహ = మొలకలయొక్క - అస్త మయం = నాశమును, కుర్వన్తి=చేయుచున్నవి.

తా.—శక్తిత్రయసంపన్నుఁ డయిన యీ యవంతిరాజు విజయయాత్ర సేయు నప్పుడు సేనాముఖమందలి గుఱ్ఱములు లేపినధూళియే శత్రురాజులు సిగల మాణిక్యముల వెలుంగులను నాశముచేయును. శత్రువుల నితఁడు జయించువాఁ డని భా.

వ్యా.—అస్యేతి.—సమగ్రశక్తేః శక్తిత్రయసంపన్నస్య, అస్య అవన్తినాథస్య, ప్రయాణేషు జైత్రయాత్రాసు, అగ్రేసరైః పురోగమైః, వాజిభి, రశ్వైః, ఉత్థితాని, రజాంసి, సామన్తానాం సమన్తా ద్భవానాం రాజ్ఞాం - యే శిఖామణయః తేషాం, ప్రభాప్రరోహాస్తమయం తేజోఽఙ్కురనాశం, కుర్వన్తి; నాస్యేరే వాస్య శత్రవః పరాజీయన్త ఇతి భావః.

---

అసౌ మహాకాళనికేతనస్య వస న్నదూరే కిల చన్ద్రమౌళేః [34
తమిస్రపక్షేఽపి సహ ప్రియాభి ర్జ్యోత్స్నావతో నిర్విశతి ప్రదోషాన్.

టీక.—అసౌ = ఈతఁడు, మహా...స్య - మహాకాళ = మహాకాళమనెడి క్షేత్రమే - నికేతనస్య = స్థానముగాఁగలిగిన, చన్ద్రమౌళేః = సిగయందు చంద్రుఁడు గలశివునికి, అదూరే = సమీపమునందు, వసన్ = వసించువాఁడుగనుకనే, తమిస్రపక్షేపి = చీఁకటిపక్షమందు సయితము, ప్రియాభిః సహ = కాంతలతోఁగూడ, జ్యోత్స్నావతః = వెన్నెలగలిగిన, ప్రదోషాన్ = రాత్రులను, నిర్విశతి కిల = అనుభవించుచున్నాఁడుగద.

తా.—ఈయవంతిరాజు మహాకాళ మనెడు క్షేత్రమునందుండు శివునికి సమీపమున వసించువాఁ డగుటచే కృష్ణపక్షమునందుఁగూడ శివశిరమునందలి చంద్రుని వెన్నెల గలరాత్రులను కాంతలతోఁగూడ అనుభవించును.

వ్యా.—అసావితి.—అసౌ అవన్తినాథః, మహాకాళం నామ క్షేత్రవిశేషః - త దేవ నికేతనం స్థానం - యస్య తస్య; చన్ద్రమౌళే రీశ్వరస్య, అదూరే సమీపే, వసన్ తిష్ఠన్, అత ఏవ హేతోః, తమిస్రపక్షేఽపి కృష్ణపక్షేఽపి, ప్రియాభిః సహ, జ్యోత్స్నావతః, చన్ద్రికావతః, ప్రదోషాన్ రాత్రీః, నిర్విశతి, అనుభవతి కిల; నిత్య జ్యోత్స్నావిహారిత్వ మేత స్యైవ నాన్య స్యేతి భావః.

---

అనేన యూనా సహ పార్థివేన రమ్భోరు కచ్చిన్మనసో రుచిస్తే
శిప్రాతరఙ్గానిలకమ్పితాసు విహర్తు ముద్యానపరమ్పరాసు? 35

టీక.—హే రమ్భోరు = అరఁటికంబములవంటి తొడలుగలదానా, యూనా = యౌవనవంతుఁడైన, అనేన పార్థివేన సహ = ఈరాజుతోఁగూడ, శిప్రా...సు - శిప్రా = శిప్రానదియొక్క - తరఙ్గ = అలలయొక్క - అనిల = గాలిచేత - కమ్పితాసు = కదలింపఁబడిన, ఉద్యా...సు - ఉద్యాన = ఆరామములయొక్క - పరమ్పరాసు = వరుసలయందు, విహర్తుం = విహరించుటకు, తే = నీయొక్క, మనసః = మనసునకు, రుచిః కచ్చిత్ = కోర్కి కలదా!

తా.— అరఁటికంబములవంటి తొడలుగల యోసుందరీ అవంతిదేశము నేలెడి యీవయసువానితోఁడుత శిప్రానదియలల గాలికి కదలెడి యుద్యానరాజులలో విహరింప నీ కిచ్ఛ గలదా?

వ్యా.—అనే నేతి—రమ్భే కదలీస్తమ్భా వివ ఊరూ యస్యాః సా రమ్భోరుః- తస్యాః సంబోధనం హేరమ్భోరు * 'ఊరూత్తరపదా దౌపమ్యే' ఇ త్యూఙ్ ప్రత్యయః *నదీత్వాత్ హ్రస్వః, యూనా, అనేన, పార్థివేన రాజ్ఞా, సహ, శిప్రా నామ తత్రత్యా నదీ - తస్యాః తరఙ్గాణామ్ అనిలేన - కమ్పితాసు, ఉద్యానానాం - పరమ్పరాసు పఙ్క్తిషు, విహర్తుం, తే తవ, మనసః, రుచిః కచ్చిత్ స్పృహాఽస్తి కి మి త్యర్థః * 'అభిషఙ్గే స్పృహాయాం చ గభస్తౌ చ రుచిః స్త్రియా మి' త్యమరః.

---

తస్మిన్నభిద్యోతితబన్ధుపద్మే ప్రతాపసంశోషితశత్రుపఙ్కే [36
బబన్ధ సా నోత్తమసౌకుమార్యా కుముద్వతీ భానుమతీవ భావమ్.

టీక.—ఉత్త...ర్యా - ఉత్తమ = శ్రేష్ఠమయిన - సౌకుమార్యా = అఙ్గమార్దవముగల, సా = ఆయిందుమతి, అభి...ద్మే - అభిద్యోతిత = వికసింపఁజేయఁబడిన - బన్ధు = బంధువులనెడి - పద్మే = కమలములుగలవాఁడును, ప్రతా...ఙ్కే - ప్రతాప = తేజస్సుచేత - సంశోషిత = ఇగిరింపఁబడిన - శత్రు = శత్రువులనెడి - పఙ్కే = బురదలు గలవాఁడును, (అయిన), తస్మిన్ = ఆయవంతిరాజునందు, కుముద్వతీ = తెల్లగలువ తీఁగ, భానుమతి ఇవ = సూర్యునియందుంబోలె, భావం = మనస్సును, న బబన్ధ = కట్ట దాయెను.

తా.—తామరలకు వికాసహేతువును బురదలకు శోషణహేతువును అయిన సూర్యునిపయి తెల్లగలువతీఁగ యెట్లు రంజిల్లదో అట్లే మిత్త్రులకు వికాసహేతువును శత్రువులకు నాశహేతువును అయిన యాయవంతిరాజు పయిని అత్యంతకోమలాంగి యగు నాయిందుమతి మనస్సుంపదాయెను.

వ్యా.—తస్మిన్నితి.— ఉత్తమసౌకుమార్యా ఉత్కృష్టాఙ్గమార్దవా, సా ఇన్దుమతీ, అభిద్యోతితాః ఉల్లసితాః - బన్ధవ ఏవ పద్మాని యేన తస్మిన్, ప్రతాపేన తేజసా- సంశోషితాః శత్రవ ఏవ - పఙ్కాః కర్దమాః యేన తస్మిన్, అవన్తినాథే, కుముద్వతీ కుముదినీ * 'కుముద నడ వేతసేభ్యో డ్మతు' బిత్యుక్మతుప్ ప్రత్యయః, భానుమతి అంశుమతీవ, భావం చిత్తం, న బబన్ధ -న తత్రానురాగం చకారేత్యర్థః; బన్ధూనాం పద్మత్వేన శత్రూణాం పఙ్కత్వేన చ నిరూపణాత్ రాజ్ఞః సూర్యసామ్యం వ్యజ్యతే.

---

తామగ్రతస్తామరసాన్తరాభా
మనూపరాజస్య గుణై రనూనాం
నిధాయ సృష్టిం లలితాం విధాతు
ర్జగాద భూయః సుదతీం సునన్దా. 37

టీక.—సునన్దా = సునంద, తామ...భాం - తామరస = కమలముయొక్క- అన్తర = లోపలివైపుయొక్క - అభాం = కాంతివంటికాంతిగలదియు, గుణైః = రూపశీలాదిగుణములచేత - అనూనాం = తక్కువకానిదియు, సుదతీం = శోభనదంతములుగలదియు, విధాతుః = బ్రహ్మయొక్క, లలితాం సృష్టిం = మనోహరనిర్మాణమును, (అయిన) తామ్ = ఆయిందుమతీదేవిని, అనూపరాజస్య = అనూపదేశరాజుయొక్క, అగ్రతః = ముందఱను, నిధాయ = ఉంచి, భూయః = మరల, జగాద = పలికెను.

తా.—కమలోదరకాంతివంటి కాంతి కలదియు రూపశీలాదిగుణములచేత తక్కువపడనిదియు శోభనదంతములు కలదియు నయిన యాయిందుమతిని అనూపరాజు మ్రోల ఆఁపి సునంద యిట్లు వెండియు వర్ణింపఁ దొడంగెను.

వ్యా.— మితి.—తామరసాన్తరాభాం పద్మోదరసమానకాన్తిం - కనకగౌరీమిత్యర్థః, గుణైః రూపశీలాదిభిః, అనూనా మధికా మిత్యర్థః, శోభనాః దన్తాః యస్యాస్తాం సుదతీం * 'వయసి దన్తస్య దతృ'ఇతి దత్రాదేశః * 'ఉగితశ్చే'తి ఙీప్, తాం ప్రకృతాం ప్రసిద్ధాం వా, విధాతుః, లలితాం సృష్టిం మధురనిర్మాణం స్త్రియ మిత్యర్థః, అనుగతాః ఆపః యేషు తే అనూపా నామ దేశాః * ఋక్పూరబ్ధూః పథా మానక్షే' ఇతి అప్రత్యయః సమాసాన్తః * 'ఊదనో ర్దేశే' ఇత్యూకారాదేశః - తేషాం రాజ్ఞః అనూపరాజస్య, అగ్రతః, నిధాయ వ్యవస్థాప్య, భూయః పునః, జగాద ఉవాచ.

---

సంగ్రామనిర్విష్టసహస్రబాహు రష్టాదశద్వీపనిఖాతయూపః
అనన్యసాధారణరాజశబ్దో బభూవ యోగీ కిల కార్తవీర్యః. 38

టీక.——సంగ్రా...హుః - సంగ్రామ = యుద్ధములయందు - నిర్విష్ట = అనుభవింపఁబడిన - సహస్ర = వేయి - బాహుః = భుజములుఁగలవాఁడును, అష్టా...పః - అష్టాదశ = పదునెనిమిది - ద్వీప = దీవులయందు - నిఖాత = నాటఁబడిన - యూపః= యూపస్తంభములుఁగలవాఁడును, అనన్య...బ్దః - అనన్యసాధారణ = ఒరులకు సాధారణముగానట్టి - రాజశబ్దః = రాజు అనెడిశబ్దముగలవాఁడును, యోగీ = బ్రహ్మవిద్యావంతుఁడును, (అయిన), కార్తవీర్యః = కార్తవీర్యుఁడనురాజు, బభూవ కిల = ఉండెనుగద.

తా.——ఈతఁ డెప్పుడు రెండే బాహువు లయినను యుద్ధములో వేయి బాహువులు అగువాఁడును, సకలభూమికిని ఈశ్వరుఁడై పదునెనిమిది దీవులయందును సకల యాగములును కావించినవాఁడును, జరాయుజాది సర్వభూతములను రంజించుటచేత ఒరులకు చెందని రాజశబ్దమును పొందినవాఁడును, బ్రహ్మవిద్యావంతుఁడును, అయిన కార్తవీర్యుఁడు ఉండెను గదా.

వ్యా.——సంగ్రామేతి —— సంగ్రామేషు యుద్ధేషు - నిర్విష్టాః అనుభూతాః సహస్రం బాహవో యస్య స తథోక్తః, యుద్ధా దన్యత్ర ద్విభుజ ఏవ దృశ్యత ఇ త్యర్థః, అష్టాదశసు ద్వీపేషు - నిఖాతాః స్థాపితాః - యూపాః యేన స తథోక్తః సర్వక్రతుయాజీ సార్వభౌమ శ్చేతి భావః, జరాయుజాది సర్వభూతరఞ్జనాత్ అన్యసాధారణో న భవ తీ త్యనన్యసాధారణః రాజశబ్దో యస్య స తథోక్తః, యోగీ బ్రహ్మవిద్యావా ని త్యర్థః, స కిల భగవతో దత్తాత్రేయా ల్లబ్ధయోగ ఇతి ప్రసిద్ధిః, కృతవీర్య స్యాపత్యం పుమాన్ కార్తవీర్యో నామ రాజా బభూవ కిల ; అయం చాస్య మహిమా దత్తాత్రేయలబ్ధవరప్రసాద ఇతి భారతే దృశ్యతే.

---

అకార్యచిన్తాసమకాల మేవ ప్రాదుర్భవం శ్చాపధరః పురస్తాత్
అన్తశ్శరీరే ష్వపి యః ప్రజానాం ప్రత్యాదిదేశ వినయం వినేతా. 39

టీక.—— వినేతా = శిక్షకుఁడైన, యః = ఏకార్తవీర్యార్జునుఁడు, అకా...వ- అకార్య=తప్పుపనియొక్క-చిన్తా = ఆలోచనతోడను-సమ = ఒక్కటియే-కాల మేవ = కాలము అగునట్లుగా, పురస్తాత్ = ఎదుట, చాపధరః = విలుదాలుపై, ప్రాదుర్భవన్ = తోఁచుచు, ప్రజానాం = జనులయొక్క, అన్తశ్శరీరేషు = మనస్సులయందలి, అవినయమపి = తప్పిదమును కూడ, ప్రత్యాదిదేశ = నివారించెనో.

తా.——ఆకార్తవీర్యుఁడు ప్రజలలో ఎవఁడేని తప్పుపని చేయుటకు తలంచినంతనే వాని మ్రోల ధనుర్ధరుఁడై తోఁచి మనస్సులో సయితము అపరాధమును తొలఁగించుచుండెను.

వ్యా.—అకా ర్యేతి.— వినేతా శిక్షకః, యః కార్తవీర్యః, అకార్యస్య అస త్కార్య - చిన్తయా కరిష్యా మీతి బుద్ధ్యా - సమకాల మేకకాల మేవ యథా తథా, పురస్తాదగ్రే, చాపధరః ప్రాదుర్భవన్ సన్ ప్రజానాం * 'ప్రజా స్యాత్సంతతౌ జనే' ఇత్యమరః, అన్తశ్శరీరేషు అన్తఃకరణేషు - శరీరశబ్దేన ఇన్ద్రియం లక్ష్యతే, అవినయ మపరాధ మపి, ప్రత్యాదిదేశ మానసాపరాధ మపి నివారయామా సే త్యర్థః; అన్యే తు వాక్కాయాపరాధమాత్ర ప్రతికర్తార ఇతి భావః.

---

జ్యాబన్ధనిష్పన్దభుజేన యస్య వినిశ్శ్వస ద్వక్త్రపరమ్పరేణ
కారాగృహేనిర్జితవాసవేన లఙ్కేశ్వరే ణోషిత మాప్రసాదాత్. 40

టీక.—జ్యా...న - జ్యా = అల్లెత్రాటిచేతనైన - బన్ధ = కట్టుటచేత - నిష్పన్ద= నిశ్చలములైన - భుజేన = బాహువులుగలవాఁడును, వినిశ్శ్వ...ణ-వినిశ్శ్వసత్=నిట్టూర్పు పుచ్చుచున్న - వక్త్ర = ముఖములయొక్క - పరమ్పరేణ = వరుసగలవాఁడును, అయిన, నిర్జి...న - నిర్జిత = జయింపఁబడిన = వాసవేన = దేవేంద్రుఁడుగల, లఙ్కేశ్వరేణ = రావణాసురునిచే, యస్య = ఏకార్తవీర్యునియొక్క, కారాగృహే = చెఱసాలయందు, ఆప్రసాదాత్ = అనుగ్రహపర్యంతము, ఉషితమ్ = ఉండుటయో.

తా.—ఇంద్రునిసయితము జయించి రావణాసురుని ఆకార్తవీర్యార్జునచక్రవర్తి అల్లెత్రాటితో కదల మెదల నీయకుండ పెడకెక్కలు విఱిచి కట్టి పదిమోములతోను బుసకొట్టుచుండ చెఱసాలలో పైచెను. రావణుఁడు అటనుండి తప్పించుకొనిపోవుటకు శక్తుఁడు గాక ఆచక్రవర్తికి అనుగ్రహము కలుగువఱకు అందే పడియుండెను.

వ్యా.—జ్యాబన్ధేతి.—జ్యయా మౌర్వ్యా - బన్ధే నబన్ధనేన- నిష్పన్దాః నిశ్చేష్టా భుజాః యస్య తేన, వినిశ్శ్వసతీ జ్యాబన్ధోపరోధా ద్దీర్ఘం నిశ్శ్వసతీ - వక్త్రాణాం ముఖా నాం - పరమ్పరా దశముఖీ యస్య తేన, నిర్జితః వాసవో యేన తేన ఇన్ద్రవిజయినా - ఇన్ద్రాదయోఽప్యనేన జితప్రాయా ఏ వేతి భావః, లఙ్కేశ్వరేణ దశాస్యేన, యస్య కార్తవీర్యస్య కారాగృహే బన్ధనాగారే * 'కారా స్యా ద్బన్ధనాలయే' ఇత్యమరః, ఆప్రసాదా దనుగ్రహపర్యన్తమ్, ఉషితం స్థితం * నపుంసకే భావే క్తః, ఏతత్ప్రసాద ఏవ తస్య మోక్షోపాయః న చ శస్త్ర మితి భావః.

---

తస్యాన్వయే భూపతి రేష జాతః
ప్రతీప ఇ త్యాగమవృద్ధసేవీ,
యేన శ్రియః సంశ్రయదోషరూఢం
స్వభావలోలే త్యయశః ప్రమృష్టమ్. 41

టీక.—ఆగ...వీ - ఆగమ = శాస్త్రముచేత - వృద్ధ = పెద్దలయినవారిని - సేవీ = కొలుచువాఁడు, ప్రతీప ఇతి = ప్రతీపుఁడనెడి, ఏషః భూపతిః = ఈరాజు, తస్య = ఆకార్తవీర్యునియొక్క, అన్వయే = వంశమందు, జాతః = పుట్టెను, యేన - ఏప్రతీపరాజుచేత, సంశ్ర...ఢం-సంశ్రయ = ఆశ్రయింపఁబడినవానియొక్క - దోష = వ్యసనాదులగు తప్పిదములచేత - రూఢాం = పుట్టినట్టి, శ్రియః=లక్ష్మియొక్క, స్వభావ లోలా - స్వభావ = ప్రకృతిచేత - లోలా = చంచలురాలు, ఇతి = అనెడి, అయశః= అపకీర్తి, ప్రమృష్టమ్ = తుడిచిపెట్టఁబడినదో.

తా.—ఈరాజు ఆకార్తవీర్యుని వంశమున జనించినవాఁడు; ఈయనపేరు ప్రతీపుఁడు; ఈయన శాస్త్రజ్ఞానముగల పెద్దలను సేవించువాఁడు, దుర్వ్యసనములు లేనివాఁడు; దానంజేసి సిరి ఈయనను ఎప్పుడును బాయకయున్నదై, చపలస్వభావురాలను నపకీర్తిని పోఁగొట్టుకొన్నది.

వ్యా.—త స్యేతి.— ఆగమ వృద్ధ సేవీ శ్రుత వృద్ధ సేవీ, ప్రతీప ఇతి ఖ్యాత ఇతి శేషః, ఏష భూపతిః, తస్య కార్తవీర్యస్య, అన్వయే వంశే, జాతః, యేన ప్రతీపేన సంశ్రయస్య పుంసః- దోషైః వ్యసనాదిభిః - రూఢమ్ ఉత్పన్నం, శ్రియః సంబద్ధి స్వభావ లోలా ప్రకృతిచఞ్చలా, ఇత్యేవం రూఢమ్, అయశః దుష్కీర్తిః, ప్రమృష్టం నిరస్తమ్; దుష్టాశ్రయత్యాగ శీలాయాః ప్రకృతిచాపలప్రవాదః మూఢజనపరికల్పిత ఇత్యర్థః, అయం తు దోషరాహిత్యాన్న కదాచి దపి శ్రియా త్యజ్యత ఇతి భావః.

---

ఆయోధనే కృష్ణగతిం సహాయ
మవాప్య యః క్షత్త్రియ కాళరాత్రిం
ధారాం శితాం రామపరశ్వధస్య
సంభావయ త్యుత్పలపత్త్రసారామ్. 42

టీక.—యః = ఏప్రతీపమహారాజు, ఆయోధనే = యుద్ధమునందు, కృష్ణగతిం= అగ్నిని, సహాయం = తోడుగా, అవాప్య = పొంది, క్షత్త్రి...త్రిం - క్షత్త్రియ = క్షత్త్రియులకు - కాళరాత్రిం = సంహారనిశయైనదానిని, రామ...స్య - రామ = పరశురామునియొక్క - పరశ్వధస్య = గండ్రగొడ్డటియొక్క, శితాం = వాఁడియైన, ధారాం = వాదరను, ఉత్ప...రాం - ఉత్పల = కలువయొక్క - పత్త్ర = రేకుయొక్క - సారాం = పటిమ గలదానినిగ, సంభావయతి = తలంచునో.

తా.—ఈ ప్రతీప మహారాజునకు యుద్ధములో అగ్నిదేవుఁడు తోడ్పడి యాతని శత్రువులను దహించును. దానంజేసి యాతఁడు సర్వక్షత్త్రియులకును సంఘాతమారిణి యగు జామదగ్న్యకుఠార ధారను కలువరేకునుంబోలె పేలవముగాఁ దలంచును.

వ్యా.—ఆయోధన ఇతి.—యః ప్రతీపః, ఆయోధనే యుద్ధే,* 'యుద్ధ మాయోధనం జన్య మి' త్యమరః, కృష్ణగతింకృష్ణవర్త్మాన మగ్నిం, సహాయ, ము వాప్య, క్షత్త్రియాణాం-కాళరాత్రిం సంహారరాత్రి మి త్యర్థః, రామపరశ్వధస్య జామదగ్న్యపరశోః * 'ద్వయోః కుఠారః స్వధితిః పరశు శ్చ పరశ్వధ' ఇ త్యమరః, శితాం తీక్ష్ణాం, ధారాం ముఖం * 'ఖడ్గాదీనాం చ నిశితముఖే ధారా ప్రకీర్తితే'తి విశ్వః, ఉత్పలపత్త్రస్య సార ఇవ సారో యస్యా స్తాం తథాభూతాం, సంభావయతి మన్యతే; ఏతన్నగరజిగీషయా ఆగతాన్ రిపూన్ స్వయ మేవ ధక్ష్యే మీతి భగవతా వైశ్వానరేణ దత్తవరోఽయం రాజా, దహ్యన్తే తథాగతాః శత్త్రవ ఇతి భారతీ కథాఽత్రానుసంధేయా.

---

అ స్యాఙ్కలక్ష్మీ ర్భవ దీర్ఘబాహో
ర్మాహిష్మతీవప్రనితమ్బకాఞ్చీం
ప్రాసాదజాలై ర్జలవేణిరమ్యాం
రేవాం యది ప్రేక్షితు మస్తి కామః. 43

టీక.—మాహి...ఞ్చీం - మాహిష్మతీ = మాహిష్మతీపురియొక్క - వప్ర = ప్రాకారమనెడి - నితమ్బ = పిఱుఁదునకు - కాఞ్చీం = ఒడ్డాణమైన, జల...మ్యాం - జల = నీటియొక్క - వేణి = జాలుచేత - రమ్యాం = మనోహరమయిన, రేవాం = నర్మదను, ప్రా...లైః - ప్రాసాద = మేడలయొక్క - జాలైః = కిటికీలనుండి, ప్రేక్షితుం = చూచుటకు, కామః = కుతూహలము, అస్తి యది = కలదేని, దీర్ఘబాహోః - దీర్ఘ = నిడుదలైన - బాహోః = భుజములుకలవాఁడైన, అస్య = ఈ ప్రతీప మహారాజునకు, అఙ్కలక్ష్మీః - అఙ్క = తొడయందలి - లక్ష్మీః = శ్రీదేవివి, భవ = కమ్ము.

తా.—ఈయనకు రాజధాని యైనమాహిష్మతీపురియొక్క ప్రాకారమనెడు పిఱుందునకు ఒడ్డాణముంబోని నర్మదానదియొక్క మనోహరమైననీటిజాలును మేడలకిటికీలనుండి కాంచుటకు నీకు కుతూహలము కలదేని, విష్ణుమూర్తివంటివాఁ డగు నీ యాజానుబాహునియొక్క తొడను మహాలక్ష్మివంటిదానవు నీవు అలంకరింపుము.

వ్యా.—అ స్యేతి.— దీర్ఘబాహోః, అస్య ప్రతీపస్య - అఙ్కే లక్ష్మీః భవ ఏనం వృణీ ష్వే త్యర్థః - అనేన అయం విష్ణుతుల్య ఇతి ధ్వన్యతే, మాహిష్మతీ నామ అస్య నగరీ - తస్యాః - వప్రః ప్రాకార - ఏవ నితమ్బః - తస్య - కాఞ్చీం రశనాభూతాం, జలానాం - వేణ్యా ప్రవాహేణ - రమ్యాం * 'ఓఘః ప్రవాహో వేణీ చే'తి హలాయుధః, రేవాం నర్మదాం, ప్రాసాదస్య - జాలైః గవాక్షైః * 'జాలం సమూ

హా ఆనాయో గవాక్ష ఇత్యాది కావ పీ త్యమరః, ప్రేక్షితుం ద్రష్టుం, కామః ఇచ్ఛా, అస్తి యది, ఏనం వృణీ ష్వేతి పూర్వే ణాన్వయః.

---

తస్యాః ప్రకామం ప్రియదర్శనోఽపి న స క్షితీశో రుచయే బభూవ
శరత్ప్రమృష్టామ్బుధరోపరోధః శశీవ పర్యాప్తకళో నళిన్యాః. 44

టీక.—ప్రకామం = మిక్కిలి, ప్రియదర్శనోఽపి - ప్రియ = ప్రీతికరమైన - దర్శనోఽపి = ఆకారముకలవాఁడైనను, సః క్షితీశః = ఆరాజు, శరత్ ...ధః - శరత్ = శరదృతువుచేత - ప్రమృష్ట = తోసివేయఁబడిన - అమ్బుధర = మేఘములచేతనైన - ఉపరోధః = కమ్ముదలగలవాఁడును, పర్యాప్తకళః - పర్యాప్త = సంపూర్ణములైన - కళః = కళలుఁగలవాఁడును, (అయిన), శశీ = చంద్రుఁడు, నళిన్యా ఇవ = తామరతీఁగ యొక్కయుంబోలె, తస్యాః = ఆయిందుమతీ దేవియొక్క - రుచయే = కోరికకొఱకు, న బభూవ = కాఁడాయెను.

తా.—మిక్కిలి అందగాఁడే అయినను, ఆరాజు, మేఘావరణము తొలఁగి సమస్తకళలతోను వెలుఁగుచున్న శరత్కాలచంద్రుఁడు తామరతీఁగకు ఎట్లో అట్లే ఆ యిందుమతికి అభిలషణీయుఁడు కాఁడాయెను.

వ్యా.—తస్యా ఇతి.—ప్రకామం, ప్రియం ప్రీతికరం - దర్శనం యస్య సోఽపి దర్శనీయోఽపీ త్యర్థః, సః క్షితీశః, శరదా - ప్రమృష్టామ్బుధరోపరోధః నిరస్తమేఘావరణః పర్యాప్తకళః, శశీ, నళిన్యా ఇవ, తస్యాః ఇన్దుమత్యాః, రుచయే న బభూవ రుచిం నాజీజన దిత్యర్థః, లోకో భిన్నరుచి రితి భావః.

---

సా శూరసేనాధిపతిం సుషేణ ముద్దిశ్య లోకాన్తరగీతకీర్తిమ్
ఆచారపూతోభయవంశదీపం శుద్ధాన్తరక్ష్యా జగదే కుమారీ. 45

టీ.—లోకా...ర్తిం - లోకాన్తర = ఇతరలోకములందు - గీత - పాడఁబడిన - కీర్తిం = యశస్సుగలవాఁడును, ఆచా...పం - ఆచార = మంచినడవడిచేత - పూత = పరిశుద్ధములైన - ఉభ = రెండైన - అనఁగా - తల్లిదండ్రుల - వంశ = వంశములకు - దీపం = ప్రకాశకుఁడును, (అయిన), శూరసేనాధిపతిం = శూరసేనదేశరాజును, సుషేణం = సుషేణుఁ డను వానిని, ఉద్దిశ్య = గురించి, శుద్ధా...క్ష్యా - శుద్ధాన్త = అంతఃపురమును - రక్ష్యా = పాలించునదైన సునందచేత, సా = ఆ, కుమారీ = ఇందుమతి, జగదే = చెప్పఁబడెను.

తా.—అంతట సునంద ఎల్లలోకములందును పాడఁబడిన కీర్తిగలవాఁడును సదాచారముచే పవిత్రములయిన తల్లిదండ్రుల వంశములకు రెంటికిని మఱియు ప్రకాశమొసంగ దెచ్చినవాఁడును అగు శూరసేనరాజును సుషేణుఁ డనువానిని ఇందుమతికి చూపి యిట్లు చెప్పెను.

వ్యా.—సేతి.—లోకాన్తరే స్వర్గాదావపి - గీతా కీర్తిర్యస్య తమ్, ఆచారేణ - పూతయోః శుద్ధయోః - ఉభయోః వంశయోః మాతాపితృకులయోః - దీపం ప్రకాశకమ్ * ఉభయవంశేత్యత్ర ఉభయపక్షవన్నిర్వాహః, శూరసేనానాం దేశానామధిపతిం సుషేణం నామ నృపమ్, ఉద్దిశ్య అభిసంధాయ, శుద్ధాన్తరక్ష్యా అన్తఃపురపాలికయా * కర్మణ్యణ్ - టిడ్ఢేతి ఙీప్ * 'శుద్ధాన్త శ్చావరోధ శ్చ' త్యమరః. సా కుమారీ, జగదే ఉక్తా.

---

నీపాన్వయః పార్థివ ఏష యజ్వా,
గుణై ర్య మాశ్రిత్య పరస్పరేణ
సిద్ధాశ్రమం శాన్త మి వైత్య సత్త్వై
ర్నైసర్గికోఽప్యుత్ససృజే విరోధః. 46

టీక.—యమ్ = ఎవనిని, ఆశ్రిత్య = అండఁగొని, గుణైః = జ్ఞానమానాదిగుణములచేత, శాన్తం = నెమ్మదిగలిగిన, సిద్ధాశ్రమమ్ = మునిపల్లెను, ఏత్య = పొంది, సత్త్వైః ఇవ = గజసింహాదిజంతువులచేతనుంబోలె, నైసర్గికోఽపి = సహజ మయినను, పరస్పరేణ = ఒండొకటితోడి, విరోధః = వైరము, ఉత్ససృజే = వదలఁబడినదో, అట్టి, యజ్వా = విధిప్రకారము యాగము చేసిన, ఏషః పార్థివః = ఈరాజు, నీపాన్వయః- నీప = నీపులనెడు - అన్వయః - వంశము కలవాఁడు.

తా.—ఈరాజు నీపవంశస్థుఁడు, యథావిధిగా యజ్ఞములు చేసినవాఁడు ; నెమ్మదిగలవైన తపస్విద్ధుల యాశ్రమములందు సింహగజాది జంతువులు ఎట్లు స్వాభావికమ నయినను అన్యోన్యవైరమును మాని ఒద్దికగా నుండునో, అట్లే, ఈయనయందు, లక్ష్మీసరస్వతులు, జ్ఞానమానములు, ఐశ్వర్యౌదార్యములు - ఇత్యాది సహజ విరోధ గుణములు, అనఁగా స్వాభావికముగా ఒకటియున్నచోట ఇంకొకటి యుండనిసుగుణములు, అవిరోధముగా నివసించి యున్నవి.—ఈప్రభువు శీలగుణభూషితుఁ డనుట.

వ్యా.—నీ పేతి.—యజ్వా విధివదిష్టవాన్ * 'సుయజో ర్ఙ్వని' బితి ఙ్వనిప్ ప్రత్యయః * 'యజ్వా తు విధి నేష్టవా ని' త్యమరః, ఏష పార్థివః, నీపా నామాన్వయో యస్యేతి నీపాన్వయః నీపవంశజః, యం సుషేణమ్, ఆశ్రిత్య గుణైః జ్ఞానమానాది

